# సిద్ధ మహాయోగము



రచన :

ఈదర నాగేశ్వరరావు

# సిద్ధమహాయోగము

రచన :

ఈదర నాగేశ్వరరావు

ప్రకాశకులు :

సిద్ధయోగ పీఠము (రిజిష్టర్డు)

C/o ఆశీర్వాద ట్రస్ట్, వృద్ధాశ్రమ భవనము,

నాగసాయి గుడివద్ద, రామరాజనగర్, విజయవాడ - 520 012

సిద్ధమహాయోగము

రచన : ఈదర నాగేశ్వరరావు

ముద్రణ : శ్రీ సర్వధారినామ సంవత్సర శ్రావణ బహుళ నవమి, 24-8-2008

ప్రతులు : 1000

హక్కులు : ప్రకాశకులవి

**వెల : రూ. 100-00**

ప్రాప్తి స్థానము :

1) శ్రీమత్ స్వామి సహజానందతీర్థ మహరాజ్
సిద్ధయోగపీఠము, C/o ఆశీర్వాద ట్రస్ట్ వృద్ధాశ్రమము,
నాగసాయి మందిరము వద్ద, రామరాజనగర్,
విజయవాడ-520 012. సెల్ : 9848219240

2) శ్రీమత్ స్వామి గజానన్ తీర్థ మహరాజ్
శ్రీ శివోం కృపాశ్రమ ట్రస్ట్, తేనెబండ,
చిత్తూరు-517001, ఫోన్ : 249048

3) శివకామేశ్వరి గ్రంథమాల
41-22/4-36, భ్రమరాంబాపురం
కృష్ణలంక, విజయవాడ - 520 013
ఫోన్ : 0866-2522824

4) సి. నరేంద్రబాబువర్మ
8-5-10/సి/2, టీచర్స్ కాలనీ,
మహబూబ్‌నగర్ - 2. ఫోన్ : 270815

5) ఈదర నాగేశ్వరరావు
C/o హనుమంతరావు
డోర్.నెం. 5-62-47, 4/19 బ్రాడీపేట,
గుంటూరు. ఫోన్ : 0863 - 6531642

ముద్రణ :
లక్ష్మీ వైభవ్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.


శ్రీ వేంకటేశాయ నమః



శ్లో॥ కల్యాణద్భుతగాత్రాయ కామితార్థ ప్రదాయినే ।
శ్రీమద్వేంకట నాథాయ శ్రీనివాసాయ మంగళం ॥


శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయముతో ఈ గ్రంథము ముద్రించబడినది.

## ఆశీస్సులు

యోగమనగా జీవుడు పరమాత్మలో ఐక్యమగుట. ఈ అభిలాషతో చేయు అభ్యాసములను కూడా యోగమనే అంటారు. కర్మ సిద్ధాంతానుసారము అనేక జన్మల నుండి జీవుని ఆవరించి వున్న పాప, పుణ్యములు ప్రక్షాళన కానిదే జీవాత్మ, పరమాత్మలయొక్క ఐక్యము సిద్ధించదు. ప్రారబ్ధ కర్మలను భోగించనిదే అవి క్షయము కావు. పరమేశ్వరుని మరియు గురు కృపచే ఆ ప్రారబ్ధ కర్మలు అనాయాసముగా శీఘ్రముగా ప్రక్షాళనము కాగలవు. సాధనతో ప్రక్షాళనా సమయమునందు సాక్షీభావ స్థితి యందుండిన మరల కర్మలు సంచితము కావు. ఆ స్థితిని బడయుటకు అనేక విధానములున్ననూ సిద్ధమహాయోగ విధానము శ్రేష్ఠము మరియు సులభముతరము అయివున్నది. ఈ విజ్ఞానము విశదీకరించు ప్రయత్నమే ఈ గ్రంథము. సిద్ధమహాయోగ సాధకులకు ఈ గ్రంథము కరదీపిక వంటిది. సిద్ధమహాయోగ గురుపరంపరానుగ్రహముతో శక్తిపాత దీక్షాగ్రహీతులు చి॥ ఈదర నాగేశ్వరరావు, సత్సంగముల వలనను, గ్రంథములను సంకలనముచేసి గురు ప్రబోధములతో స్వానుభవములతో ఈ గ్రంథమును రూపొందించెను. సిద్ధమహాయోగ సాధకులు ఈ గ్రంథమునందున్న సూచనలు తెలుసుకొని ఆచరించి కృతార్థులు కాగలరని ఆశించుచున్నాను.

ఇట్లే అనేక గ్రంథములు గురుపరంపరానుగ్రహముతో వెలువడుగలవని ఆశించుచున్నాను.

ఇట్లు
మీ యోగాభిలాషి
స్వామి సహజానందతీర్థ
సెల్ : 9848219240

సిద్ధయోగ పీఠం (రిజిష్టర్డు)
C/o ఆశీర్వాదట్రస్ట్ వృద్ధాశ్రమము,
నాగసాయి మందిరమువద్ద
రామరాజునగర్, విజయవాడ-520 012

## తొలిపలుకులు

భారతదేశములో చిరకాలము నుండి యోగసాధన వివిధరీతులలో అనుష్ఠింపబడుతూ వస్తూ వుంది. మన పూర్వీకులైన ఋషులు, మునులు, యోగులు ఈ విషయముపై తమస్వానుభవముతో వివిధ గ్రంథములనుకూడా రచించి వున్నారు. అవి దేశకాల పరిస్థితులననుసరించి విరివిగా ప్రచారములోనికి కూడా వచ్చి సాధకులకు తగువిధముగా మార్గదర్శనము చేస్తూ వున్నాయి. యోగవిషయము కడుజటిలము. కావున భిన్న, భిన్న ఆచార్యుల ద్వారా విభిన్న రీతులలో సాధకుల సౌలభ్యము కొరకు ఇప్పటికే అనేక గ్రంథములు జనబాహుళ్యమునందు ప్రచలితమై యున్నవి. అనుభవజ్ఞులైన యోగుల సహకారముతో మాత్రమే సాధారణ జనులు వాటిని అర్థము చేసుకొనగలరు. యోగమార్గము అన్నింటికంటె శ్రేష్ఠము మరియు పరమకల్యాణ కారకమని శ్రీమద్భగవద్గీత యందు భగవానుడు ఉపదేశించి యున్నాడు. ఈ యోగమార్గము అన్నింటియందు శ్రేష్ఠతమైనప్పటికి దాని యదార్థ రహస్య జ్ఞానమును గురించి జన బాహుళ్యమునకు సరి అయిన అవగాహనలేదు. అందువలన యోగ అనుష్ఠానము, దాని ఫలితము, యోగ అనుష్ఠానమువల్ల ఉత్పన్నమయ్యే సమస్యలకు పరిష్కారములను సాధకులకు తెలియచేయాలి అను అభిలాషతో కరుణాసముద్రులు, పూజ్యపాదులు మా గురుదేవులైన శ్రీమత్‌స్వామి **సహజానంద తీర్థ మహరాజ్‌**వారు యోగవిజ్ఞానము గ్రంథరూపములో రచించమని ఆదేశించగా సిద్ధమహాయోగ గురువులు రచించిన గ్రంథములు, బోధనలు ఆధారముగా చేసుకొని ఈ గ్రంథమును రూపొందించినాను. పరమగురువుల మరియు గురుదేవుల ప్రబోధములను రచనలను క్రోడీకరించి రూపొందించినదే ఈ గ్రంథము. "సిద్ధమహాయోగము" అను ఈ గ్రంథమునందు అన్ని యోగమార్గముల గురించి సంక్షిప్తముగా వివరించుట జరిగినది.

ఈ గ్రంథము నందు యోగ, ధ్యాన, జ్ఞాన, జప, తప, పూజ, మంత్ర చైతన్యము, కుండలినీ జాగరణ, ధర్మకర్మల సత్వర సిద్ధికి మార్గము, అంతర జగత్తు యొక్క అలౌకిక విషయ వర్ణనము, దివ్యమైన బ్రహ్మజ్ఞానమును దర్శింపచేయగల అధ్యాత్మ విజ్ఞానమును సరళమైన తెలుగు భాషలో వివరించుట జరిగినది.

కేవలము పూజ్యపాదులైన గురుదేవుల కృపాదృష్టితో మాత్రమే ఈ విశేష రచన చేయగల సామర్థ్యము ప్రాప్తించినది. ఇది నా పూర్వజన్మ సుకృతము. పాఠక మహాశయులు ఈ పుస్తక పఠనము ద్వారా ఏ కొంచెము లాభమును పొందినను నేను చేసిన ఈ ప్రయత్నము సఫలీకృతమైనట్లుగా భావిస్తాను.

ఇట్లు
సుజన విధేయుడు
ఈదర నాగేశ్వరరావు
4/19, బ్రాడీపేట, గుంటూరు.

# కృతజ్ఞతలు

నా చిన్ననాటి నుండి అనుక్షణము కంటికి రెప్పలా కాపాడుతూ నా పురోభివృద్ధికి బాటలు వేసిన మా పితృదేవులైన పూజ్యశ్రీ ఈదర లక్ష్మీవరప్రసాదరావు గారికి, ఈ గ్రంథరచనలో అనేక విధములు సహకరించిన నా ప్రియమిత్రులు, శ్రీరామకృష్ణ భక్తులు, శ్రీ పిల్లలమర్రి రామకృష్ణ గుంటూరువారికి, ఈ పుస్తక ప్రూఫ్ రీడింగు నందు సహకరించిన బ్రహ్మశ్రీ ఎస్.ఎల్.ఎన్ మూర్తిగారు రిటైర్డు లెక్చరర్, టి.జె.పి.యస్. కాలేజి గుంటూరువారికి, వారి సతీమణి శ్రీమతి గౌరీ సావిత్రిగారికి మరియు సోదరతుల్యులు శ్రీయుత వై. రామభద్రచైయునులు, హైద్రాబాద్ వారికి కృతజ్ఞతలు తెలుపుకొనుట నా విద్యుక్త ధర్మముగా భావిస్తున్నాను. కీర్తిశేషురాలైన నామాతృమూర్తి శ్రీమతి (స్వర్గీయ) ఈదర అనంతలక్ష్మిగారి ఆరాధనా దినోత్సవము అనగా చైత్రపౌర్ణమి నాడు ఈ పుస్తక రచన పూర్తియగుట మరొక విశేషముగా కూడా భావిస్తున్నాను.

ప్రాథమిక స్థాయినుండి యోగ సంబంధ విషయములలో సరిఅయిన అవగాహన కలిగించిన మాతృతుల్యులు స్వర్గీయ కొండెపూడి వసంతకుమారిగారు, రిటైర్డు ప్రిన్సిపాల్, ఓరియంటల్ కాలేజి, గుంటూరు వారిని మరియు నా సాధనా ప్రగతికొరకు అనుక్షణము తపించిన నిత్యసాధనాపరురాలు, అరుణాచల నివాసి, ఆత్మీయ సోదరి కాలకూరి వీరలక్ష్మిగారు రిటైర్డు లెక్చరరు, విజయనగరం వారిని ఈ సందర్భములో జ్ఞప్తికి తెచ్చుకొనుట కూడా సముచితమని భావిస్తున్నాను.

25 సం॥ నా వైవాహిక జీవితములో నిరంతరము తోడ్పాటు నందించిన నా సహధర్మచారిణి యోగసాధకురాలు శ్రీమతి హనుమజ్యోతి మరియు నా కుటుంబ సభ్యుల సహకారం కూడా ఈ పుస్తక రచనయందు నాకు ఉపయోగపడింది.

అనుక్షణము నా శ్రేయస్సును కాంక్షిస్తూ నన్ను వెన్నంటి యున్న మా గురుదేవులైన శ్రీశ్రీశ్రీ స్వామి సహజానందతీర్థ మహరాజ్ వారి దివ్యచరణములకు ఈ అక్షర సుమహారమును సవినయముగా సమర్పణ చేయుచున్నాను.

ఇట్లు
భవదీయుడు
ఈదర నాగేశ్వరరావు

గుంటూరు
24-8-2008

# విషయసూచిక

# సిద్ధమహాయోగము

## ఒకటవ ప్రకరణము

**మానవజన్మ యొక్క వైభవము :** భగవానుడు ఈ విశాల విశ్వములో ఏకపాద, ద్విపాద, త్రిపాద, చతుష్పాద, బహుపాద, అపాదరూప ప్రాణుల శరీరాలను అనేకం సృష్టించాడు. వాటన్నిటి మానవశరీరము అనేక ప్రత్యేకతలతో సృష్టించబడినది. భగవానుడు తన అమేయమైన మాయాశక్తి సహాయముతో వృక్షములను, సర్పముల వంటి ప్రాకెడు జీవజాలములను, క్రిమి కీటకాదులను, పశు పక్ష్యాదులను, జీవ జంతువులను, జలచరముల వంటి అనేక ప్రాణులను సృష్టించాడు. వీటితో సంతృప్తి కలుగక పోవుటచే బ్రహ్మ దర్శనయోగ్యత కలిగిన మానవ దేహమును సృష్టించాడు. ధర్మ, అర్థ, కామ, మోక్షములను ప్రాప్తించుకొనే సామర్థ్యముగల మానవ దేహమును సృష్టించి భగవానుడు అత్యంత ప్రసన్నతను పొందాడు. ప్రపంచములోని సమస్తము మానవుల కొరకే సృష్టించబడినది. పశు - పక్ష్యాదులకు జీవ-జంతువులకు చరాచరములకు మానవుడు యజమాని అయివున్నాడు. జగన్నియంత అయిన భగవానుడు మానవుడు దివ్యజ్ఞానమును పొందుటకు బలము, బుద్ధి, తేజముతో కూడిన సుందర దేహమును ప్రదానము చేసాడు. తన బుద్ధి బలముతో తెలియని విషయములను తెలుసుకొనగలిగిన యోగ్యతను మానవదేహమునకు కలిగించాడు. ఈ చరాచర జగత్తంతయూ తన క్రీడాస్థలి అయినప్పటికి ఈ మనుష్య దేహము ద్వారానే భగవానుని భావ వ్యక్తీకరణ జరుగుతుంది.

**భగవత్ జ్ఞానముయొక్క ఆవశ్యకత :** ఈ సృష్టిపై ఏ ఒక్కనికీ సంపూర్ణ ఆధిపత్యము లేదు. ఇది జీవుల కర్మఫలభోగార్థము సృష్టించబడినది. ఎవరి ఆజ్ఞను ఈ బ్రహ్మాండ మంతయూ శిరసావహిస్తుందో, ఎవరి నిర్ణయమును జనులందరూ విధిగా పాటించవలసి వుంటుందో, ఆబ్రహ్మాండాధిపతి అయిన పరమేశ్వరుని గొప్పదనమును అందరూ తెలుసుకోవలసి వుంటుంది. ఆయన అనుగ్రహము లేనిదే మనము ఏమీ చేయలేము. జనన, మరణ, రూప, దుఃఖములను అనుభవించి జీవులు తమ వాస్తవిక జ్ఞానమును మరచిపోయారు. సంశయంతో కూడిన విపరీత

జ్ఞానము వలన జనులు తమ అభీష్ట ధర్మములైన ధర్మార్థ, కామ, మోక్షములను పొందలేరు. సాధకులు నిత్యానిత్యములను వివేచన చేసి నిత్యమైన సద్వస్తువును గ్రహించి అసత్ వస్తువులను వదలివేయాలి.

**జీవులకు కోట్లాది జన్మలు గతించినవి :** సృష్ట్యాది నుండి నేటి వరకు జనులు ఈశ్వరుని కలుసుకొనలేకపోయారు. ప్రళయములో అందరమూ ఈశ్వరుని కలిసినప్పటికి, అజ్ఞానరూపములోనే కలుస్తారు. ఆవిధముగా కలిసినందువలన లాభమేమి ఉండదు. క్లోరోఫారము అనుమత్తుమందు ప్రభావములో నున్న వ్యక్తిని ఎక్కడకు తీసుకొని వెళ్ళిన, ఏమిచేసిన ఏవిధముగా అతడు గుర్తించలేడో, అదేవిధముగా ప్రళయకాలములో ప్రకృతి అందరనూ ఈశ్వరునిలో లీనము చేయగా ఆ స్థితిలో జీవులు అంధకారములో వుండి ఎటువంటి జ్ఞానమును కలిగి వుండరు. తిరిగి కల్పారంభములో మరల సుఖ, దుఃఖములు అనుభవించుటకు జీవులు జన్మిస్తు వుంటారు. ఈ విధముగా జనన మరణ చక్రములో పరిభ్రమిస్తున్న జీవునికి కోట్లకొలది జన్మలు గతించాయి. ఇప్పటివరకు ప్రతిజీవుడు ఎత్తిన జన్మలు లెక్కలు వేసి చూచినట్లయితే మనమందరము ఆశ్చర్య చకితులం కావలసి వుంటుంది.

**కల్పముల యొక్క గణన :** కనురెప్ప ఒకసారి కొట్టుకొనుటకు పట్టుకాలమును నిమేషము అందురు. ఇటువంటి 15 నిమేషముల కాలమును ఒక కాష్ఠముగా, 30 కాష్ఠముల సమయమును ఒక కళగా, అటువంటి 30 కళల కాలమును ఒక ముహూర్తముగా, 30 ముహూర్తముల సమయమును ఒక రాత్రి పగలుగా పండితులు కాల నిర్ణయము చేసారు. 15 రాత్రింబగళ్ళను ఒక పక్షముగా, రెండు పక్షములను ఒక మాసముగా, అటువంటి ఒకమాసమును పితృదేవతలకు ఒక రోజుగా అనగా వారికి శుక్లపక్షము పగలుగా, కృష్ణ పక్షము రాత్రిగా పరిగణించబడుతుంది. ఆరు నెలలను ఒక ఆయనముగా, అటువంటి రెండు ఆయనములను కలిపి ఒక సంవత్సరముగా చెపుతారు. మనుష్యుల యొక్క ఒక్క సంవత్సరపు గణన దేవతలకు ఒకరాత్రిపగలు అవుతుంది. ఉత్తరాయణము దేవతలకు పగలుగాను, దక్షిణాయనమును రాత్రిగాను పరిగణిస్తారు. మనుష్యులకు 30 సం॥ కాల వ్యవధి దేవతలకు ఒక మాసముగా చెప్పబడినది. అటువంటి మానవుల 360 సంవత్సరముల కాలము దేవతలకు 12 నెలలతో కూడిన దివ్యవత్సరముగా చెప్పబడినది. ఈ దివ్య సంవత్సరముల ప్రమాణముతో శాస్త్రములలో యుగముల యొక్క కాలవ్యవధిని నిర్ణయించారు.



శాస్త్రములలో సత్యయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, కలియుగము అను నాలుగు యుగముల వర్ణన చేయబడినది. దీనిలో 4000 దివ్య సంవత్సరాలను సత్యయుగముగాను, 400 దివ్య సంవత్సరాలు ఆ యుగముయొక్క సంధ్యాకాలము గాను మరియొక 400 దివ్యసంవత్సరములను ఆయుగముయొక్క సంధ్యాంశ కాలముగాను నిర్ణయించారు. ఈ విధముగా సత్యయుగము నుండి కలియుగము వరకు సంధ్యాంశ కాలము ఒక్కొక్క పాదము తగ్గుతూ పోతూ వుంటుంది. అనగా త్రేతాయుగములో 300 దివ్య సంవత్సరాలుగా, ద్వాపర యుగములో 200 దివ్య సంవత్సరములుగా, కలియుగములో 100 దివ్య సంవత్సరాలుగా సంధ్యాంశను గణిస్తారు. యుగప్రారంభములోని కాలమును యుగసంధ్యగా, యుగ అంత్యములోని కాలమును సంధ్యాంశముగా పరిగణిస్తారు. ఈ విధముగా త్రేతాయుగము 3000 దివ్య సంవత్సరాలను కలిగి యుండి 300 దివ్య సంవత్సరాల యుగ సంధ్యను, 300 దివ్య సంవత్సరాలను సంధ్యాంశను కలిగి యుంటుంది. అదే విధముగా ద్వాపరము 2000 దివ్య సంవత్సరాలను కలిగి వుండి 200 దివ్య సంవత్సరాల చొప్పున యుగసంధ్యను, సంధ్యాశను కలిగి వుంటుంది. కలియుగము 1000 దివ్యసంవత్సరాలను కలిగియుండి 100 దివ్యసంవత్సరములు సంధ్య మరియు సంధ్యాంశను కలిగి వుంటుంది. ఈ విధముగా నాల్గు యుగముల కాలపరిమితి సంధ్యా మరియు సంధ్యాంశ కాలముతో కలిపి 12000 దివ్యసంవత్సరములుగా చెప్పబడినది. 12 వేల దివ్య సంవత్సరములను ఒక చతుర్యుగ కాలముగా పరిగణిస్తారు. 1000 చాతుర్యుగములను కలిపి ఒక కల్పముగా గణన చేస్తారు.

పైన చెప్పిన లెక్కల ప్రకారము ఒక చతుర్యుగ కాలమును దేవతలకు 12000 దివ్య సంవత్సరముగా పరిగణించవచ్చును. మానవులకు ఆకాలము 43,20,000 సంవత్సరములుగా పరిగణించబడుతుంది. ఇటువంటి 71 చాతుర్యుగములను కలిపి ఒక మన్వంతరముగా పరిగణిస్తారు. ఒక కల్పములో 14 మన్వంతరములు లేక మనువులు ఉంటారు. ఈవిధముగా ఇప్పటికి వేలకొలది మన్వంతరములు గతించిపోయినవి. వాటిని గురించి ఎవరికి తెలియదు. వాటిని ఎవ్వరూ లెక్కించలేరు కూడా. ఒక కల్పము బ్రహ్మదేవునికి పగలుగాను, ఇంకొక కల్పకాలము రాత్రిగాను చెప్పబడినది. ఈ విధముగా బ్రహ్మదేవుని జీవితకాలము నూరుసంవత్సరములుగా చెప్పబడినది. ఈ ప్రకారముగా ఇప్పటివరకు బ్రహ్మదేవుని ఆయువు 50 సంవత్సరాలు గడిచిపోయినది. 51వ సంవత్సరము ప్రస్తుతము ప్రారంభమయి వున్నది. ఈ

కల్పములో సృష్టి ప్రారంభమయి 28వ కలియుగము ప్రస్తుతము జరుగుతున్నది. వీటన్నింటిని లెక్కించి చూచినట్లయితే జీవులు అవిశ్రాంతముగా ఇప్పటికే అనేక లక్షల లక్షల సార్లు జన్మించి, మరణించినట్లుగా తేటతెల్లమవుతుంది. మరి ఈ జన్మలోకూడా జీవులు కల్యాణకారకమైన మార్గమును ఎంచుకొనలేకపోతే వారి జీవితము వ్యర్థమవుతుంది.

**బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్క కాలపరిమితులు :** ఈ విధముగా సత్య త్రేతా, ద్వాపర, కలియుగములను నాలుగు యుగములు ఒక చతుర్యుగమవుతుంది. ఇటువంటి వెయ్యి చతుర్యుగములు కలిసి బ్రహ్మ దేవునియొక్క ఒకరోజుగా పరిగణించబడుతుంది. బ్రహ్మయొక్క పగటి కాలములో సృష్టి ఉత్పన్నమయి రాత్రి కాలములో తిరిగి లయమవుతుంది. ఈ విధముగా బ్రహ్మదేవుని ఒకరోజు కాలమును మానవుల రోజులు, పక్షములు, మాసములు, సంవత్సరములలో లెక్కించి చూచినట్లయితే మనకు వేయటానికి అంకెలు దొరకవు. ఇటువంటి వంద సంవత్సరములు బ్రహ్మయొక్క ఆయువుగా చెప్పబడినది. బ్రహ్మదేవుని ఆయువు పూర్తికాగానే సమస్త చరాచర జగత్తు నశించిపోతుంది. ఇటువంటి వెయ్యి బ్రహ్మలకాలపరిమితి విష్ణువునకు ఒక గడియకాలముతో సమానము. ఇటువంటి వెయ్యి విష్ణువుల జీవితకాలపరిమితి మహేశ్వరునికి ఒక క్షణముతో సమానము. అటువంటి వెయ్యి మహేశ్వరుల జీవిత కాలము పరాశక్తికి అరక్షణముతో సమానము అవుతుంది. పైన చెప్పిన కాలపరిమితులలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులందరు వెళ్ళిపోతారు. ఈ మృత్యుభయము కేవలము మానవునికే కాకుండా అన్ని లోకములకు, లోకపాలకులకు, ఎంతో గొప్ప ఆయుషు గల బ్రహ్మదేవునికూడా పట్టి పీడిస్తుంది. బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, మహాశక్తి యొక్క ఆయుః ప్రమాణములతో పోల్చిచూస్తే మానవుల ఆయుః ప్రమాణమును నామమాత్రముగా కూడా లెక్కించలేము. దీనిద్వారా మానవులు తమ నిజస్థితిని బేరీజు వేసుకొనవచ్చును.

**దేవతల ఆయుః ప్రమాణము :** బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కాలపరిమితిని నిర్ణయించిన పురాణములు వారికంటే దిగువ స్థాయిలో ఉన్న దేవతల ఆయుః ప్రమాణమును కూడా నిర్ధారించాయి. ఏ లోకములో మనము నివాస ముంటున్నామో దానిని భూలోకమంటారు. ఈ లోకములోని మనుష్యులను మర్త్యలోక వాసులుగా చెపుతారు. ఎందుకంటే ఇక్కడ మరణించుట కొరకే మనుష్యులు జన్మిస్తారు. ఇక్కడ



మానవుల కట్టుబాట్లు, జనన మరణముల గురించి అందరకూ అవగాహన ఉండి ఉంటుంది. కాని ఈ లోకముపైనగల లోకముల గురించిన జ్ఞానమును మనము శాస్త్రములద్వారా ఊహించి మాత్రమే తెలుసుకొనగలము. లేక తపస్సు చేసి అనుభవమును పొంది తెలుసుకొనగలము. వారి ప్రకృతి మానవుల ప్రకృతికంటే భిన్నముగా వున్నప్పటికి మానవుల ఆయుః ప్రమాణమువలె వారి ఆయువు కూడా నిర్దిష్ట పరిమితికి లోబడి వుంటుంది.

**అసంఖ్యాక లోకములలో సప్తలోకములు ప్రధానమైనవి :** ఈ దృశ్యమాన బ్రహ్మాండములో కోట్ల కొలది లోకములున్నాయి. ఆకాశములో గల నక్షత్రములన్నియు లోకములే. ఆ లోకములన్నింటిలో దేవాది ప్రాణులు నివాసముంటారు. బ్రహ్మాండములోనున్న లోకములన్నింటిలోనికి సప్తలోకములైన భూః, భువః, స్వః, మహః, జనః, తపః మరియు సత్యలోకము ప్రముఖమైనవిగా చెప్పవచ్చు. సృష్టి ప్రారంభములో విశ్వాత్మ అయిన బ్రహ్మదేవుడు తపస్సుచేసి భగవానుని అనుగ్రహముతో రజోగుణము ద్వారా లోకపాలకులతో పాటుగా భూః, భువః, స్వః అను మూడు లోకములను సృష్టించి, ప్రతి ఒక్క ప్రాణికి తన కర్మానుసారము వాటియందు నివాస యోగ్యతను కల్పించాడు. స్వర్గలోకము దేవతల నివాసస్థానముగా, భువర్లోకము భూత గణముల నివాస స్థానముగా, భూలోకము మనుష్యాది ప్రాణులయొక్క నివాసస్థానముగా బ్రహ్మదేవుడు నిర్మించాడు. సిద్ధులు ఈ మూడు లోకములకు అవల వున్న మహర్లోకము, జనోలోకము, తపోలోకములలో నివాస ముంటారు.

బ్రహ్మదేవుడు అసురుల కొరకు, నాగుల కొరకు భూలోకము దిగువగా లోకములను నిర్మించాడు. మూడులోకములలో త్రిగుణాత్మక కర్మ విధానము ననుసరించి ప్రాణుల రాకపోకలు వుంటాయి. అందువలన ప్రతి ఒక్కప్రాణి తమతమ సాత్విక, రాజసిక, తామసిక కర్మానుసారము పైన, మధ్యన, క్రిందనున్న లోకములకు వస్తూ పోతూవుంటారు. యోగము, తపస్సు, త్యాగముల ద్వారా సాధకులకు మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము వంటి ఉత్తమ లోకములు ప్రాప్తిస్తాయి. భక్తియోగముద్వారా భగవానుని పరంధామము లభిస్తుంది. ఈ విధముగా కాలరూపములోనున్న బ్రహ్మదేవుని ప్రేరణతో ఈ జగత్తునందు కర్మకలాపములు నడుపబడుతాయి. సత్వగుణ ప్రధానముగా కలిగి శుద్ధ సాత్వికులైన

దేవాది ప్రాణులు ఊర్ధ్వలోకములలో నివాసముంటారు. వారిని వారిలోకములను మనము స్థూలదృష్టితో చూడలేము. అదేవిధముగా క్రిందనున్న పాతాళాది లోకములలో ఉండే అసురులను, నాగులను తమోగుణము మరియు ఘోరతమోగుణము గల ప్రాణులను, వారిలోకములను మనము దర్శించలేము. వాటిని దర్శించుటకు జ్ఞానమయ దివ్యదృష్టి కావలసి వుంటుంది.

**పుణ్యకర్మలద్వారా దైవత్వ సిద్ధి కలుగుతుంది :** ఈ లోకములో జనులు పుణ్యకర్మలుచేసి దేవతలుగా మారవచ్చును. ఈ మర్త్యలోకములో సుఖాలను అనుభవించాలనే కోరికతో యజ్ఞములు, దానములు, జప, తప, యోగసాధనల వంటి సత్కర్మలు చేసినవారు మరణించిన తరువాత స్వర్గాది లోకములకు వెళతారు. అక్కడ అనుగుణమైన శరీరాన్ని ధారణచేసి దివ్య భోగములను అనుభవించుతారు. అక్కడనున్న వారి ఆయువు ఈ లోకములోని జనుల నిర్దిష్ట ఆయుః ప్రమాణముతో నుండక తమ పుణ్య కర్మానుసారము వంద, వెయ్యి, లక్ష, కోటి రెట్లు అధికముగా ఉంటుంది. తమ పుణ్య కర్మానుసారముగా వారికి స్వర్గలోకము, మహర్లోకము, జనోలోకము, తపోలోకము ప్రాప్తిస్తాయి. ఆలోకముల యొక్క విధి విధానముల ననుసరించి వారికి అధికాధిక సుఖము, ఆయువు ప్రాప్తిస్తాయి. అది ఎంతవరకంటే, బ్రహ్మయొక్క ఆయుః ప్రమాణము పర్యంతము బ్రహ్మలోకములో భోగములను అనుభవించి, పుణ్యము క్షీణించగానే మర్త్యలోకమునకు వస్తారు. ఈ విధముగా దేవత్వమును పొంది కూడా పునరాగమన స్థితి నుండి మానవులు తప్పించుకోలేరు.

**జ్ఞానము లేకుండా శాంతి లభించదు :** అందువలన పూర్ణబ్రహ్మము ఐన పరమాత్మయొక్క జ్ఞానమును పొందకుండా ఎవ్వరూ శాశ్వత సుఖమును పొందలేరు. శాస్త్రకథనానుసారము మానవుడు తన ఆయువు, బలము, బుద్ధిని ఊహించగలడు మరియు తన పురుషార్థముతో పునరాగమనరూప భవసాగరమును దాటి పరమ సుఖములను అనుభవించగలడు. కల్పములయొక్క గణనద్వారా జ్ఞానమును పొందిన జనులు నిశ్చింతగా జీవితమును గడపక జ్ఞానముకొరకు ప్రయత్నించవలసి యుంటుంది. ఎందుకంటే జ్ఞానమును ప్రాప్తించుకొనుట మానవుల పరమ ధర్మము అయివున్నది.

**పరమాత్మ యొక్క పదహారు కళల వివరణ :** పరమాత్మ పరిపూర్ణుడు, అవ్యక్తుడు, అతీంద్రియుడు, అతడు సూక్ష్మముకంటే సూక్ష్మమయినవాడు,



బ్రహ్మాండమంతయు పరమాత్ముని అంశ మరియు కళల రూపములో ప్రకాశిస్తూ వున్నది. విష్ణ్వాంశ ఐన సూర్యునిగా, ఆదిత్యమండ లాంతర్గతుడైన పురుషునిగా పరమాత్మ జీవులకు బలమును, బుద్ధిని, తేజమును ప్రసాదిస్తున్నాడు. సూర్యభగవానుడే ప్రాణులకు జీవనాధారము. భగవానుని ప్రత్యక్ష విభూతి అయిన సూర్యుని మనము నిత్యము దర్శిస్తూ వుంటాము. కాని జగత్తునంతా వ్యాపించి 16 కళలతో వెలుగొందు పూర్ణబ్రహ్మమును అందరూ దర్శించలేరు. ఆయనను దర్శించుటకు దివ్య చక్షువులు కావాలి.

పరబ్రహ్మముయొక్క స్థూల కళలను ఆధారము చేసుకొని, సూక్ష్మమును దర్శించగల సమదర్శులయిన మహాత్ముల ప్రకారము పరబ్రహ్మము 16 కళలను కలిగి వుంటాడు. ఒకరూపాయిని 16 అణాలుగా మార్చి అవసరానుగుణముగా వాడవచ్చును. ఒక అణాకంటె రెండు అణాలు ఎక్కువ విలువను కలిగి ఉంటాయి. అదేవిధముగా భగవానుని 16 కళల శక్తి అంశ రూపములో వ్యాపించి ఎక్కువ, తక్కువలను కలిగి వుంటుంది.

పూర్ణ నిరాకార బ్రహ్మముయొక్కశక్తి అంశ మరియు కళల రూపములో చరాచర జీవజాలములో ప్రకాశిస్తూ వుంటుంది. భగవానుని దివ్యప్రకాశము ఏప్రాణియందు ఎంతపరిమాణములో, ఏ విధముగా ప్రకాశిస్తుంది అని నిర్ణయించుట మానవుల స్థూల బుద్ధికి అతీతమైన విషయము. కాని మానవుడు తన యోగ్యతానుసారముగా తన బుద్ధితో లేక యుక్తితో అంచనా వేయగలడు.

జగత్తులో కనిపించే స్థావరములన్నియు పరమాత్ముని ఒక కళతో కూడిన శక్తిని కలిగి వుంటాయి. జంగమములయిన కీటకములు మొదలగునవి పరమాత్ముని నాల్గుకళల శక్తిని కలిగి వున్నాయి. పశుపక్ష్యాదులు పరమాత్ముని 6 కళల సామర్థ్యమును కలిగి వుంటాయి. ఆరుకంటే పైన అనగా 7 లేక 8 కళల శక్తిని కలిగిన మానవుడు పరమాత్ముని యొక్క సగము శక్తిని కలిగివున్నాడు. ఈశ్వరుని యొక్క సగము సామర్థ్యమును కలిగియున్న మానవుడు ప్రాణులన్నింటియందు శ్రేష్ఠునిగా పరిగణింపబడ్డాడు. ఈ ప్రపంచము మానవుని భోగార్థము సృష్టించబడినది. తన వాస్తవిక శక్తిని గ్రహించిన మానవునికి ఈ సృష్టిలో అసాధ్యమయినదేదీ లేదు. మానవుని కంటె పైన ఈశ్వరుని యొక్క 8 లేక 10 కళల సామర్థ్యముతో, వెలుగొందుతూ అలౌకిక సామర్థ్యముగల దేవతలున్నారు. ఆ దేవతల శ్రేణిలో

పరమాత్మునియొక్క 10 నుండి 12 కళల శక్తిని కలిగి అణిమాది ఐశ్వర్యము ప్రాప్తించిన సిద్ధ పురుషులున్నారు. 12 నుండి 16 కళలతో మానవులను ఉద్ధరించుటకు భగవానుని అవతారములు ప్రభవిస్తాయి. ఈ విధముగా పరబ్రహ్మముయొక్క శక్తి కళల రూపములో అంశ రూపములో ఈ లోకమునందు ప్రకాశిస్తు వుంటుంది.

**మనుష్యుల, దేవతల, సిద్ధుల, అవతార పురుషులయొక్క సామర్థ్యము :** మనుష్యులు తమ గుణకర్మల ద్వారా దేవతలుగా, సిద్ధులుగా, అవతార పురుషులుగా కాగలరు. మానవునిలో శాస్త్రములలో చెప్పిన దివ్యగుణములు ఆవిర్భవించినపుడు అతడు ఈ శరీరముతోనే దేవునిగా పిలువబడుతాడు. దివ్యగుణముల ఫలితముగా దైవీశక్తి యొక్క వికాసరూప ఐశ్వర్యము ప్రాప్తిస్తుంది. మానవులు దేవతలుగా, సిద్ధులుగా వికాసము చెందినపుడు వారిలో అలౌకిక, అద్భుత సామర్థ్యము వస్తుంది. వారికి ఈ సృష్టిలోని వైషమ్యములు తగ్గించే సామర్థ్యముకూడా ప్రాప్తిస్తుంది. అప్పుడు వారు పరమాత్మని 10 కళలలో కూడిన దేవతలుగా, 12 కళల సామర్థ్యముగల సిద్ధులుగా పిలువబడతారు. అధర్మమును ఎదిరించి ధర్మస్థాపన చేయగల సామర్థ్యము మరియు దుష్టుల నణచి శిష్టులను రక్షించగల సామర్థ్యమును సంపాదించిన మానవుడు 12 కళలకన్నా ఎక్కువ శక్తిని కలిగి ఉన్న ఈశ్వరుని అవతారముగా పరిగణింపబడుతాడు.

దేవతలనగానే మనము ఆకాశములోనికి చూచినట్లుగా, అవతారములనగానే రామ, కృష్ణ, బుద్ధ, శంకరాచార్యులు మొదలగువారు జ్ఞప్తికి వస్తారు. అవతార పురుషులలో శ్రీరాముడిని, శ్రీకృష్ణుని ప్రముఖముగా చెప్తారు. దివ్యగుణములు కలిగియున్న వానిని దేవతగా, అణిమాది ఐశ్వర్యములతో సంకల్పసిద్ధిని కలిగియున్న వానిని సిద్ధునిగా పిలుస్తారు. ఈ దేవతలు, సిద్ధులు ఆకాశములో నున్నా, భూలోకములో నున్నా దానివల్ల వారి స్థితియందు ఎటువంటి మార్పు వుండదు. కాని మానవులు మాత్రము మంచి కర్మలతో దేవతలుగా, చెడుకర్మలతో జంతువులుగా, గొప్పకార్యములతో అవతార పురుషులుగా మారగలరు. మానవులకు అసాధ్యమయిన పనిని, అవసరము అనుకుంటే భగవానుడే స్వయముగా చేస్తాడు. అది కూడా ఈ మనుష్య శరీరముతోనే చేయబడుతుంది. అంటే మానవులు దైత్యులుగా, దానవులుగా, దేవతలుగా, సిద్ధులుగా, అవతార పురుషులుగా మారగలరు. మానవుల కొరకే ఈ



భూప్రపంచములో పెద్ద, పెద్ద ఉత్పాతములు, కష్టములు కలుగుతాయి. మానవుల కొరకే ఈ ప్రపంచము సృష్టించబడినది. ఎందుకంటే ఈ ప్రపంచము ఎటువంటి ఉత్పాతములు, కష్టములు లేకుండా మామూలుగా వుంటే మనుష్యులు సత్కర్మానుష్ఠానము చేయలేరు. సత్కర్మలు చేయటానికి అవసరమైన వాతావరణము మానవులకు భూమిపైన ఏర్పాటు చేయబడినది.

పురాణకర్తలు మనుష్యునిలోగల పరమాత్మునియొక్క సామాన్య మరియు విశేష శక్తిని చూచి శక్తివంతులైన వారిని అవతారపురుషులుగా చిత్రీకరించారు. పురాణములలో 24 అవతారములు ప్రముఖముగా చెప్పబడ్డాయి. వాటిలో కూడా దశావతారములను ముఖ్యమైనవిగా పరిగణించారు. ఈ దశావతారములలో కూడా రామ, కృష్ణలను ప్రముఖముగా చెప్పారు. మాతృగర్భమునుండి జన్మించిన వారందరూ అవతార శబ్ద పరిధిలోనికి వస్తారు. కాని పురాణ మతానుసారము వారిశక్తి వికాసములో తారతమ్యముంటుంది. ఎవరిలో సామర్థ్యము ఉంటుందో వారే అవతార పరిధిలోనికి వస్తారు. కాని ఈ అవతారములు దేనికొరకు ఏర్పడుతాయి అనే విషయమును గురించి మనము వివేచన చేయవలసి వుంటుంది.

రామ, కృష్ణ, బుద్ధ, శంకరుల గురించి అందరికీ తెలుసును. ఈ నలుగురు మహాపురుషులు ధర్మరక్షణ చేశారు. తమ ఆత్మబలముతో అందరిని సంకల్పానుసారము నడిపించారు. అందువలన అవతార పురుషులుగా పిలువబడ్డారు. కాని జగత్తులో ధర్మాధర్మములు తిరిగి వృద్ధి అగుటకు ఎక్కువ సమయము పట్టదు. వర్షపు నీరు నదులలోనికి వచ్చి చేరుతుంది. ఆ నదులలోని మురికినీరు సముద్రమునకు చేరుతుంది. ప్రతి సంవత్సరము ఈ విధముగానే జరుగుతూ వుంటుంది. అదేవిధముగా అవతారములు కూడా నియమిత సమయములలో ఏర్పడుతాయి. అవతరణ ఏదో ఆకాశమునుండి ఊడిపడ్డట్లు జరుగదు. అవతారపురుషుల సామర్థ్యమును అనగా కళలయొక్క శక్తినిచూచి అవతార నిర్ణయము చేయవలెనని జనులు తమలో తామ కలహించుకొంటారు. ఇంతవరకు ఎన్ని అవతారములు ఏర్పడ్డాయో, అవి అన్నీ కూడా భగవానుని అంశరూప కళలతో కూడిన రూపములే. కాని పురాణములలో శ్రీకృష్ణుని పూర్ణబ్రహ్మముగా చెప్పారు. ఆయనచే చెప్పబడిన గీతాశాస్త్రము అందరికీ కల్యాణమును కలిగించినది. భగవానుడు స్వయముగా మాయను ఆధీనములో నుంచుకొని జన్మిస్తాడని గీతలో చెప్పబడినది.

జీవులు మాత్రము మాయ యొక్క ఆధీనములో జన్మిస్తారు. అనగా బద్ధజీవులకు అవతార పురుషులకు ఆకాశ, పాతాళముల అంతరమున్నది. మాయ అవతార పురుషుల ఆధీనములో వుంటే జీవులు మాయ ఆధీనములో ఉంటారు. మానవులు ప్రయత్నించి దివ్యగుణములతో అవతార పురుషుల స్థాయికి ఎదిగిననూ అవతార పురుషులయొక్క కార్యదక్షతను పొందలేరు.

శ్రీరాముడు, పరశురాముడు భగవానుని అవతారములే. ఒకరినొకరు గుర్తించుకొనక పోవుటచే వారి మధ్య యుద్ధము జరుగుతుంది. పరశురాముడు క్షత్రియులను నాశనము చేసాడు. శ్రీరాముడు క్షత్రియుడు. ఆయన రాక్షసులను నాశనం చేసాడు. అందువలన ఈ అవతారముల గురించిన చర్చ సాధకులకు కొంచెము వివాదాస్పదమయిన అంశము. కాని భగవంతునికి అసాధ్యము అసంభవము అయినదేమీ లేదు అని అందరూ తెలుసుకొనవలసి వుంటుంది. పారమార్థిక దృష్టితో చూచినట్లయితే పరబ్రహ్మముయొక్క శక్తి సామర్థ్యములకు ఎటువంటి పరిమితులు లేవు.

**అవతార పురుషులు సర్వకాలసర్వావస్థల యందు బ్రహ్మీస్థితిలో వుంటారు:** భగవానుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి తనను పూర్ణబ్రహ్మముగా తెలియజేస్తూ శరీరధారణ చేసిన తరువాత అవతార పురుషులు సర్వకాల సర్వావస్థలయందు బ్రహ్మీస్థితిలో వుండరని చెప్పాడు. మహాభారత యుద్ధము పరిసమాప్తము అయిన తరువాత మహారాజు ధర్మజునికి రాజ్యాభిషేకము జరిగినది. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునునితో ఇంకా ఏమైనా అడగవలసి వుంటే అడగమన్నాడు. అర్జునుడు యుద్ధ క్షేత్రములో ఉపదేశించిన గీతా జ్ఞానము మరచిపోయినట్లుగా చెప్పి తిరిగి బోధించమని ప్రార్థించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తన అశక్తతను తెలియజేస్తూ, యుద్ధక్షేత్రములో బోధించిన దివ్య బ్రహ్మ జ్ఞానమును యోగస్థితిలో అర్జునునికి బోధించినట్లుగా చెప్పాడు. దానిని సమగ్రముగా తిరిగి చెప్పలేనని తెలియజేసి తరువాత అందులో తనకుగుర్తున్న కొంత భాగమును అర్జునునికి అనుగీతగా బోధించాడు. దీనివలన మనకు తెలిసేదేమంటే అవతార పురుషులు సర్వకాలములందు బ్రహ్మీస్థితిని కలిగివుండరు. శరీరముతో సంబంధ మున్నంతవరకు మనుష్యులుగా జన్మించిన వారు ఆవశ్యకతానుసారము అన్ని కర్మలు చేయవలసి వుంటుంది.

మానవులు పైస్థాయికి క్రింది స్థాయికి మధ్యన ఉన్నారు. వారు తమ కర్తవ్యమును వివేచన చేసుకోవాలి. బ్రాహ్మీస్థితి అన్ని కర్మలకు అతీతమైనది. మానవులు పరబ్రహ్మముయొక్క సగముశక్తిని కలిగి యుండి తనకు కావాలనుకుంటే తనను క్రిందనున్న పశు, పక్ష్యాదులు, కీటకముల స్థాయికి వెళ్ళవచ్చును లేక తన సత్కర్మాచరణముచే దేవతలు, సిద్ధులు, అవతార పురుషుల స్థాయికి ఎదుగవచ్చును. తనకు పైనున్న దేవతలు మొదలైనవారు కేవలము సుఖములను అనుభవిస్తూ వుంటే తనకంటే దిగువస్థాయి ప్రాణులు కేవలము దుఃఖములను అనుభవిస్తూ వుంటారు. ఒక్క మనుష్యుడు మాత్రమే సుఖ, దుఃఖములను రెండింటినీ కలిపి అనుభవిస్తూ వుంటాడు. తనకంటే పై స్థాయిలో నున్న దేవతలు సిద్ధులు సుఖములను అనుభవించుటవలన లాభమేమీ ఉండదు. వారికి కర్మలు చేసే అధికారములేదు. ఇక్కడ సంపాదించిన పుణ్యమును అక్కడ ఖర్చుచేస్తుంటారు. సత్కర్మల ద్వారా లభించిన పుణ్య ఫలము సమాప్తముకాగానే వారు తిరిగి భూలోకమునకు వస్తారు. అదేవిధముగా తనకంటే క్రింది స్థాయిలోని జీవులు కర్మఫలము ననుభవించి క్రమానుసారముగా తిరిగి మానవజన్మను పొందుతాయి. మధ్యలో నిలబడుటకు పైనున్నవారు క్రిందకు, క్రిందనున్నవారు పైకి రావలసి వుంటుంది. అందువలన సాధకులు బాగుగా యోచించి తమ కర్తవ్యమును గ్రహించాలి.

జనులు క్రింది స్థాయికి వెళ్ళాలనుకుంటే హాయిగా తిని, త్రాగుతూ భోగములను అనుభవించవచ్చును. న్యాయాన్యాయములను పాటింపక ధనార్జన కూడా చేయవచ్చును. క్రిందకు దిగాలంటే ఎటువంటి కష్టము ఉండదు. కొండపై నుండి క్రిందకు దిగాలంటే ఎక్కువ సమయము పట్టదు. జనులు తమ అదృష్టమును కాలదన్నుకొంటే అది వారి ఇష్టము. కాని తరువాత వారు బాధపడవలసి వుంటుంది. పైస్థాయికి పోదలుచుకొంటే న్యాయాన్యాయములు, ధర్మాధర్మములను నిత్యానిత్య విచారణ చేయవలసి వుంటుంది. పర్వతము పైకి ఎక్కాలంటే కష్టములు తప్పవు. కాని కష్టమునకు తగ్గ ప్రతిఫలము తప్పక లభిస్తుంది.

ఈ పైనచెప్పిన విషయముల గురించి మనము ఇక్కడనే ఆలోచించవలసి వుంటుంది. మధ్యలోనున్న వాడు తనముందున్న వాడిని, వెనుకనున్న వాడిని చూడగలడు. మనుష్య జన్మముతో నున్న ఈ సమయము జనులకు అత్యంత ఉపయుక్తమైనది, అనుకూలమైనది కూడా. సమయము మించిపోతే మనము

అనుకున్నది సాధించలేము. అనగా ఈ మనుష్య శరీరము నశించిన తరువాత ఎంతో దుఃఖించాల్సి వుంటుంది.

పరిపూర్ణ శాంతిని పొందాలనుకొంటే యోగము, తపము, జపము, వ్రతము ప్రాయశ్చిత్తము, యజ్ఞము, దానము మొదలగు సమస్త కర్మలు చేయవలసి వుంటుంది.

# సిద్ధమహాయోగము

## రెండవ ప్రకరణము

**మనుషత్వపు వైభవము :** ఆత్మజ్ఞానము లేకుండా ఏమనుష్యుడు పరమశాంతి పొందలేడు. అందువలన మానవజన్మయొక్క ముఖ్య ఉద్దేశ్యము పరమార్థ లాభము పొందుట అయివున్నది. కాని ఈ కర్తవ్యమును నెరవేర్చుటకు మానవులు బాహ్యముగా ఎక్కడకూ వెళ్ళవలసిన అవసరము లేదు. ఎందుకంటే సాధకులు ఏ సత్య స్వరూపమైన ఈశ్వరుని ప్రాప్తించుకోవలె ననుకుంటున్నారో ఆయన వారియందే విరాజమానమై వున్నాడు.

అజ్ఞానులైన మనుష్యులు రాబోయే జనన మరణములను గురించి ఆలోచించరు. జ్ఞానము మరియు జ్ఞానులను బయటనున్న తీర్థములకు వెళ్ళి పొందవచ్చునని వారు తలుస్తారు. అందువల్ల వీరు తీర్థక్షేత్రాలను దర్శిస్తూ వుంటారు. వారిలో చాలామంది స్వర్గ సుఖాలను పొందుటకు దానములను, పుణ్యకార్యములను, యజ్ఞయాగాదులను జప, తప, వ్రతములనెడి పుణ్యకర్మలను చేస్తారు. ఈ స్వర్గ సుఖములపై వ్యామోహమున్న లోభులయిన అవివేకులు మనుష్య జన్మము యొక్క ముఖ్య ఉద్దేశ్యమైన ఆత్మజ్ఞానమును పొందలేరు. అదేవిధముగా ముముక్షువులు తన లోపల వున్న భగవంతుని వెతుకక బాహ్యముగా వున్న తీర్థక్షేత్రములలో వెతుకుతూ వుంటారు. వారు కూడా జ్ఞానాన్ని పొందలేరు. మానవుని శరీరము లోపలనే మంగళకరుడైన విధాత అన్ని తీర్థాలను ఏర్పరచి వుంచాడు. వాటి గురించిన జ్ఞానము చాలామంది సాధకులకు తెలియదు.

ఈశ్వరుడు బ్రహ్మాండమును సృష్టించి మనుష్య శరీరాన్ని బ్రహ్మాండముయొక్క నమూనాగా ఆవిష్కరించాడు. దానిలో తన సమస్త జ్ఞానాన్ని ప్రోదిచేసాడు. ఆ విధంగా



మానవుడు తనలోనే విశ్వవ్యాప్తమై యున్న పదార్థజ్ఞానాన్ని సహజముగా తెలుసుకొనగలడు, అనుభవాన్ని పొందగలడు. అతడు దీనికొరకు బాహ్యముగా వెళ్లవలసిన పనిలేదు.

**పిండ, బ్రహ్మాండముల సారూప్యత :** లోకములో వున్న అన్ని తీర్థములు మనలోనే వున్నాయి. ఈ బ్రహ్మాండమున కనిపించే లోకాలన్నీ కూడా మనలోనే వున్నాయి. బాహ్యంగావున్న ఈ బ్రహ్మాండములో ఏదైతే వున్నదో అది అంతా ఈ పిండరూప శరీరంలో వ్యవస్థితమై వున్నది. ఈ విషయాలనన్నింటిని ఎవరైతే తెలుసుకుంటారో వారు నిస్సందేహముగా జ్ఞానులు, మహాత్ములు, యోగులు అయివుంటారు.

**శరీరంలో పదునాల్గు భువనాలు, వాటి స్థానములు :** భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, మహర్లోకము, జనోలోకము, తపోలోకము, సత్యలోకము – వీటిని సప్త ఊర్ధ్వ లోకములు అంటారు. అతల, తలాతల, మహాతల, రసాతల, సుతల, వితల, పాతాళ మొదలైన వాటిని పాతాళ లోకములని అంటారు. సప్త ఊర్ధ్వలోకములు, సప్తపాతాళలోకములు కలిసి పదునాల్గు భువనములుగా చెప్పబడ్డాయి.

మూలాధారములో భూలోకము, స్వాధిష్ఠానములో భువర్లోకము, నాభివద్ద స్వర్గలోకము, హృదయములో మహర్లోకము, కంఠంలో జనోలోకము, లలాటములో తపోలోకము, బ్రహ్మరంధ్రము వద్ద సత్యలోకము వున్నాయి. ఈ విధంగా కటి (ఇచట కటి అనగా మూలాధార స్థానముగనే గణింపవలయును) ప్రదేశమునకు పైన ఏడు ఊర్ధ్వలోకాలు, దిగువన పాదాల వరకు సప్తపాతాళ లోకాలు వున్నాయి. పాదాల అడుగున అతలలోకము, పాదాల ఉపరిభాగమున తలాతల లోకము, చీల మండల మధ్య మహాతల లోకము, చీల మండలపైన రసాతలలోకము వున్నాయి. రెండు చీల మండల పైన మోకాలి క్రింద వున్న పాదముల మధ్యలో సుతల లోకము, మోకాలిలో వితలము, ఊరువుల మధ్యలో పాతాళ లోకము వున్నవి. ఈ విధంగా వీటిని సప్త పాతాళలోకములు అందురు. క్రిందిగా వున్న సప్తపాతాళ లోకములు, పైన వున్న సప్త ఊర్ధ్వలోకములను కలిపి పదునాల్గు బ్రహ్మాండములు అని పిలుస్తారు. జనులు తానుచేసిన కర్మానుసారంగా బాహ్యముగా వున్న ఈ పదునాల్గు లోకములలో కర్మఫలము, సుఖదుఃఖాలను అనుభవించటానికి వస్తూ పోతూ వుంటారు. కాని

మానవులకు వీటి ఉనికి తన శరీరములోనే కలిగినప్పుడు ఈ విధమైన రాకపోకలతో కలిగిన దుఃఖము ముగిసిపోతుంది. వారు పరమశ్రేయమును పొందుతారు.

**శరీరంలోని సప్త ద్వీపములు, సప్తసాగరములు** : జంబూద్వీపం, శాకద్వీపం, శాల్మలీద్వీపం, కుశద్వీపం, క్రౌంచద్వీపం, గోమయద్వీపం, శ్వేతద్వీపం అనే ఈ ఏడు ద్వీపాలతో భూభాగము ఏర్పడివున్నది. భూమిపైన ప్రక్కప్రక్కనే లవణ, ఇక్షురస, మదిర, ఘృత, దధి, క్షీర మరియు జలముతో కూడిన సముద్రాలువున్నాయి. ఈ ఏడు సముద్రాలు భూమిపైన వున్న ఏడు ద్వీపాలలో వున్నాయి.

ఎముకల స్థానములో జంబూద్వీపం వున్నది. మాంస కండరములలో కుశద్వీపమున్నది. సిరలలో క్రౌంచద్వీపము, ప్రాణుల దేహాలలో వున్న అన్ని సంధిస్థానములలో మరియు రక్తములో శాక ద్వీపము దానిపైన వున్న చర్మములో శాల్మలీద్వీపము వున్నాయి. కేశసముదాయములో గోమయ ద్వీపం, నాభి భాగములో శ్వేతపుష్కర ద్వీపము వున్నాయి. ఇవి కాకుండా శరీరంలో ఏడు సముద్రములు వున్నాయి. శ్వేదము లేక మూత్రములో లవణ సముద్రము, రేతస్సులో పాలతోనిండిన క్షీర సముద్రము, ఎముకల మజ్జలో దధి సముద్రము, దానిపైనున్న క్రొవ్వులో ఘృత సముద్రము వున్నాయి. నాభిభాగమునందుగల రక్తములో ఇక్షురస సముద్రము, రక్తమందు సురాసముద్రమున్నది. ఈ ప్రకారంగా శరీరంలో పైన చెప్పిన ఏడు సముద్రాలువున్నాయి.

**శరీరంలో ఉన్న ఎనిమిది కులాచల పర్వతములు** : సుమేరు, హిమవంతము, వింధ్యాచలము, మలయ పర్వతము, మందరాచలము, శ్రీశైలపర్వతము, మైనాక పర్వతము, చివరగా కైలాసపర్వతము, అను ఎనిమిది పర్వతములు శరీరములో కలవు. ఈ శరీరంలో మేరుదండములో సుమేరుపర్వతము, పృష్ఠ భాగములో హిమాలయములు, ఎడమ భుజములో మలయాచలము, కుడి భుజములో మందరాచలము, కుడివైపు చెవిలో వింధ్యాచలము, ఎడమ చెవిలో మైనాక పర్వతము వున్నాయి. లలాటములో శ్రీశైలపర్వతము, బ్రహ్మకపాలములో ఎనిమిదవది అయిన కైలాస పర్వతము వున్నది.

**శరీరములో వున్న సర్వతీర్థములు దేవతల నివాసస్థానము అయివున్నవి** : ఇదే ప్రకారముగా శరీరంలో గంగా, యమునా, సరస్వతీ, గోదావరి, నర్మదా. సింధు, కావేరి, చంద్రభాగ, వితస్తా మరియు ఐరావతి మొదలుగాగల నదులు వున్నాయి.



శరీరంలో 72 వేల నాడులు వున్నాయి. ఇవి అన్నీ కూడా శరీరంలో నదీ నదముల మాదిరి ప్రవహిస్తూ వుంటాయి. ఇదే విధముగా శరీరములో 15 తిథులు, 7 వారములు, 27 నక్షత్రములు, 12 రాసులు, 28 యోగములు, 7 కరణములు, గ్రహ, ఉపగ్రహములతో కూడిన సమస్త నక్షత్ర మండలము, 33 కోట్ల దేవతలు ప్రతి అంగములో తమ తమ స్థానములలో నివాసముంటున్నారు.

పంచప్రాణములు, మనస్సు, నాదము, బిందు, కళ, జ్యోతి ఇంకా షట్‌చక్రములు, మేరుదండం మరియు ఉద్యాన, జాలంధర, పూర్ణగిరి మరియు శ్రీహట్టక మహాపీఠం మొదలైనవన్ని దేహాంతర్గతముగా వున్నవి. శరీరములో వున్న హృదయాకాశములో అసంఖ్యాకములై గంధర్వులు, కిన్నెరులు, యక్షులు, విద్యాధరులు, అప్సరలు మొదలగు దేవతా గణములు మరియు అనేక తీర్థములు కూడా వున్నాయి. ఎందుకంటే ప్రకృతి, పురుషరూపమైన ఈ మనుష్య దేహంలోని మహాకాశంలో మహాదేవతలైన బ్రహ్మ, విష్ణు, శివుడు కొలువై యున్నారు మరియు వారి అనంత సామర్థ్యం యొక్క జ్ఞాన సిద్ధిని ఇచ్చే ప్రకాశం కూడా ఈ హృదయంలోనే వున్నది. అందువలన బయట నున్న బ్రహ్మాండములో ఏమివున్నాయో అవన్నీ ఈ శరీరంలోనే వున్నాయి.

ఈశ్వరుని పొందాలనే కోరికగల సాధకులు నిశ్చయంగా తెలుసుకోవలసిన దేమంటే ఏదైతే ఈ దృశ్యమాన ప్రపంచములో బాహ్యంగా ఉన్నదో అది ఈ పిండరూప శరీరములో కూడా వున్నది. ఇవి అన్నియు ప్రాణముతో ముడిపడి వున్నాయి. అందువలన ప్రాణము యొక్క సహకారముతోనే సాధకులు వాటిని దర్శించవచ్చును మరియు తెలుసుకొనవచ్చును. ఎందుకంటే అవి అన్ని ప్రాణాంతర్గతమైనవి. కాని నిర్వికారమైన పరమాత్మ ప్రాణం కంటె భిన్నమైనవాడు.

తన అంతరంలోనే అన్నీ వున్నప్పటికి తమ ఇష్టానుసారం ప్రవర్తించే తామసిక జనులు అంతరంలో వున్న తీర్థాలను వదిలి బాహ్యంగా వున్న ప్రయాగాది తీర్థస్థానాలలో తిరుగాడుతుంటారు. వారు ముక్తులు కాలేరు. ఎందుకంటే తనలోనే వున్న ప్రయాగాది తీర్థాలను దర్శించకపోతే ఎవరూ ముక్తులు కాలేరు. దివ్యలోకాల్ని ప్రాప్తించుకోవాలనే కోరికవుంటే లేక మోక్షాన్ని పొందాలనుకుంటే ఆ రెండింటిని మనలోనే పొందగలము. జగత్తులో జీవుడు, శివుడు అను ఈ రెండు వున్నాయి. మానవుడు జీవుడిగా బాహ్యంలో వున్నాడు. భగవానుడు శివుడుగా అంతరంలో వున్నాడు. జీవులు భగవానుని దర్శించాలంటే అంతరంలోనికి రావలసి వుంటుంది.

వారు ఎక్కడకూ వెళ్ళవలసిన పనిలేదు. వారు భగవానుని బాహ్యంగా దర్శించుకొంటే ప్రయోజనము కలుగదు.

ఇడానాడి భాగీరథి నదిగా, పింగళనాడి యమునానదిగా చెప్పబడినది. ఇడ, పింగళ మధ్యలో వున్న సుషుమ్నానాడి సరస్వతి నదిగా చెప్పబడినది. ఎక్కడ ఈ మూడునాడులు కలుస్తాయో ఆ స్థానమును తీర్థరాజమైన ప్రయాగగా చెపుతారు. ఈ శరీరంలో ఈ మూడు నాడుల ఉత్పత్తి స్థానము మూలాధార కమలమై యున్నది. మూలాధారము నుండి బయలుదేరి భ్రూమధ్యమంలో వున్న ఆజ్ఞా చక్రంలో ఇడ, పింగళ, సుషుమ్న నాడుల సంగమం జరుగుతుంది. అక్కడే సోమేశ్వరుడున్నాడు. ఇక్కడ నుండి ఇడ, పింగళలు ఉఛ్వాస, నిశ్వాసములుగా బయటకు ప్రవహిస్తాయి. సుషుమ్న వెన్నుపూస లోపలనే గుప్తంగా ప్రవహించి సహస్రారంలో కలుస్తుంది. ఈ మూడు నాడుల సంగమమే త్రివేణి సంగమం అయిన ప్రయాగగా చెప్పబడినది. ఇక్కడ మనస్సును, ప్రాణమును చేర్చిన వారికి దివ్యలోకములు లభిస్తాయి. అక్కడ వుండగానే ప్రాణత్యాగము చేసినవారికి మోక్షం లభిస్తుంది. జనులు బాహ్యంగా ఈ తీర్థాలను కల్పనచేసి ఈశ్వరుని ఆజ్ఞను ఉల్లంఘిస్తున్నారు. భగవానుని నుండి వేరుపడుతున్నారు. అన్ని కర్మ బంధముల నుండి ముక్తి పొందాలనుకుంటే మనము అంతరములోనున్న ప్రయాగతీర్థము ద్వారానే పొందగలము.

**ప్రయాగతీర్థ మాహాత్మ్యము :** గంగా, యమునల మధ్యగా సరస్వతి నది ప్రవహిస్తుంది. వాటి సంగమస్థానములో స్నానముచేసినవారు కృతార్థులవుతారు. అందువలన ఏజనులు గంగా, యమునల సంగమ స్నానమైన ప్రయాగనందు స్నానము చేస్తారో వారు అన్ని పాపముల నుండి విముక్తులవుతారు. అనగా ఇడ, పింగళ, సుషుమ్నానాడుల సంగమ ప్రదేశమైన భ్రూమధ్యమందు మనః ప్రాణములను నిలుపువారు ముక్తిని పొందగలరు. ఇడ, పింగళ మరియు సుషుమ్న నాడులు శరీరములోవున్న జ్ఞానతీర్థములు, అవి జ్ఞానరూప జలముతో నిండి ఈ శరీరంలోనే ప్రవహిస్తుంటాయి. ఆ బ్రహ్మజలమునందు ఎవరు స్నానం చేస్తారో వారికి బాహ్యంగా వున్న గంగాది నదులకు మరియు పుష్కరాది తీర్థములకు వెళ్ళవలసిన పనిలేదు.

**శరీరంలో గల షట్చక్రాలే మహాతీర్థాలు :** మూలాధారంలోని చంద్రనాడి లేక ఇడానాడిని గంగాప్రవాహము గాను, సూర్యనాడి లేక పింగళ నాడిని యమునా ప్రవాహములుగాను చెప్పవచ్చును. అదేవిధముగా మూలాధారం నుండి సుషుమ్న



నాడి కూడా సరస్వతీ రూపములో ప్రవహిస్తుంది. అందువలన మంత్రము, క్రియలలోని విశేషతత్వము తెలిసినవారు ఈ అవనిలోని పవిత్ర తీర్థములను తనలోనే అనుభవానికి తెచ్చుకుంటారు. అటువంటి మనుజులు మనస్సును నిలిపి మూలాధార కమలంలో స్నానంచేస్తారు. ఆ మనుజులు అత్యంత ఆనంద పూర్వకముగా ముక్తిని పొందుతారు. స్వర్గములో వున్న మందాకిని మొదలుగాగల తీర్థములన్నియు శరీరములో గల స్వాధిష్ఠాన చక్రములో వున్నవి. అందువలన యోగులు అక్కడ మనస్సును కేంద్రీకరించి దేవతీర్థమైన మందాకినీ నదిలో స్నానముచేస్తారు. ఎవరైతే ముక్తిని కోరుకుంటారో వారు మూడవస్థానమైన నాభిస్థానములోగల మణిపూరక చక్రములో అనగా దేవతీర్థము పంచకుండ సరోవరము మరియు కామనా తీర్థములో స్నానము చేస్తారు. అదేవిధముగా సూర్యమండలాంతర్గతమైన అనాహతచక్రములో సర్వతీర్థములను భావనచేసి ముక్తిని కాంక్షించేవారు స్నానము చేస్తారు. కంఠములో ఐదవదయిన విశుద్ధమనే మరో చక్రము వున్నది. అక్కడ అష్టతీర్థములు ఉన్నాయి. ఆ తీర్థాలే కైవల్యముక్తినిచ్చేవి. ఆ తీర్థాలను ధ్యానించి యోగిపుంగవులు ముక్తికొరకు అక్కడ మనస్సును నిలిపి స్నానముచేస్తారు. ఆరవదయిన ఆజ్ఞాచక్రములో మానస సరోవరము, బిందు సరోవరము, పంపా సరోవరము అనగా నారాయణ సరోవరము ఉన్నాయి. అక్కడనే వున్న కాళీకుండ తీర్థమునందు కళాధరుడు సోమేశ్వరుడు కొలువైవున్నాడు. ఆయనను ధ్యానించి నిర్వాణ సిద్ధి నొందుటకు యోగి జనులందరు అక్కడ దివ్యస్నానములు ఆచరించి జీవన్ముక్తులు అవుతారు.

పైన చెప్పబడిన శివతీర్థములలో మానసికమైన దివ్యస్నానము యోగమార్గము ద్వారా కుండలినీ జాగరణతోనే సాధ్యపడుతుంది. యోగసాధనా బలమువల్ల ఏ యోగిపుంగవుడు సుషుమ్నలో ప్రాణవాయువును నిలపగలగుతాడో అతడు అంతరంలో వున్న తీర్థములలో మానసిక దివ్యస్నానము చేసి పాపవిముక్త డవుతాడు. ఆ పాప విముక్తులయిన యోగిజనులు తనలోని శివతీర్థ దర్శన మాత్రము చేత నిశ్చయముగా ముక్తులవుతారు. నిరంతరం అనేక రకాలయిన పాపాలను చేసేవారు లేక చేసినవారుకూడా బ్రహ్మ హత్యాది మహాపాపములను చేసినా తమ అంతరములో వున్న మహా తీర్థములో స్నానము చేసినట్లయితే సర్వపాప విముక్తులై అణిమాది సిద్ధులను ప్రాప్తించుకొంటారు.

భగవంతుని కలుసుకోవాలని వాస్తవంగా కోరిక వున్న సాధకులు పైన ఉదహరించిన తీర్థరాజములలో అవశ్యము స్నానము చేయవలసి వుంటుంది.

**మోక్షమార్గములో కుండలినీశక్తి :** మానవుని శరీరములో వున్న 72 వేల నాడుల నన్నింటిని తీర్థములని చెప్పవచ్చు. వాటిలో ఇడా, పింగళ, సుషుమ్న (గంగా, యమున, సరస్వతి) ప్రధానమైన తీర్థములు. అందులోని సరస్వతి (సుషుమ్న) మహాతీర్థము అయివున్నది. ఎందుకంటే సుషుమ్నయే భగవానుని నివాసస్థానము. అందువలన సుషుమ్న కాకుండా మిగిలిన నాడులవల్ల సాధకుడు కోరుకున్న ఫలితాన్ని పొందలేడు.

సరస్వతి తీర్థము లేకుండా మిగిలిన తీర్థములవల్ల ఏ మాత్రము ఉపయోగము లేదు. ఈ సుషుమ్న ద్వారానే శాంభవీశక్తి మానవులను భగవంతునితో కలుపుతుంది. కాని ఏ సుషుమ్న మార్గము ద్వారా నిరామయమైన బ్రహ్మ లోకమునకు జనులు చేరగలరో ఆ సుషుమ్న ద్వారములో కుండలినీశక్తి నిద్రించి వున్నది. పాప పుణ్యాలనే కర్మలవల్ల ఆ శక్తి ఎప్పుడూ నిద్రిస్తూనే వుంటుంది. ఆ శక్తిని మేల్కొలుపుటకు ఏకైక ఉపాయము ప్రాణాయామము. ప్రాణాయామము ద్వారా ఆశక్తిని మేల్కొలిపితే ఆ శక్తి సాధకుని భగవానుని వద్దకు చక్కగా చేరుస్తుంది. ఆశక్తి అనుగ్రహము లేకుండా ఎవరూ ప్రయాగ తీర్థములో స్నానము చేయలేరు. భగవానుడు సుషుమ్న మార్గమధ్యములో వున్నాడు. ప్రాణాయామముతో కుండలినీ జాగరణ తదుపరి, భగవానుడి సాక్షాత్కారము లభిస్తుంది. కుండలినీ శక్తి జాగృతమవకపోతే సాధకులు జన్మాంతరాలలో కూడా భగవానుని కలుసుకోలేరు. ప్రాణాయామము ద్వారానే కుండలినీ శక్తి జాగృతమవుతుంది.

**కుండలినీ జాగరణతో మోక్షమార్గము ప్రశస్తమవుతుంది :** కుండలి శక్తి జాగృతమైనప్పుడు మోక్షమార్గము సరళతరమవుతుంది. ఈ మార్గము చాలా సులువైన సరళమైన మార్గము.

ఈ మార్గములోనికి వచ్చినవారు తిరిగి వెళ్ళాలనుకోరు. యోగాభ్యాసి కానివానికి ఈ మార్గము నిరుపయోగము. యోగసాధన చేసే ఇంద్రియ నిగ్రహము గల పురుషుడు మాత్రమే భగవానుని కలుసుకోగలడు. అంటే భగవానుని కలుసుకొనే మార్గము మూలాధారము, అది మేరుదండములోని కందమునకు పైన వున్నది. అక్కడ నుండి సుషుమ్నలో భగవానుని కలుసుకొనే మార్గము ప్రారంభమవుతుంది. ఆ మార్గము సహస్రారము వరకు నేరుగా వెళుతుంది. సుషుమ్న మధ్యగా వజ్రనాడి, వజ్రనాడి మధ్యలో చిత్రనాడి వున్నాయి. సుషుమ్న బ్రహ్మ మార్గముగా చెప్పబడుతుంది.



ప్రాణాయామము ద్వారా ప్రాణాన్ని సహస్రారము వరకు చేర్చినట్లయితే అక్కడ సాధకులు భగవానుని కలుసుకోగలరు.

**తెలుసుకోవలసిన తత్వమంత శరీరములోనే వున్నది :** జనులు ఈ ప్రపంచమునకు వచ్చేటప్పుడు ఏమీ తీసుకొని రాలేదు. వెళ్ళేటపుడు ఏమీ తీసుకొనిపోరు. జనులు ఈ జన్మలోనే జ్ఞానలాభాన్ని పొందలేకపోతే ఇంక ఎప్పటికిని పొందలేరు. రోగ, శోక, దైన్య, దుఃఖముల కారణంగా కాలము వృధాగా గడిచిపోతున్నదనే విషయము మానవులు గుర్తించుటలేదు. పుణ్యకర్మల ద్వారా కాని, పాపకర్మల ద్వారాగాని ముక్తి లభించదు.

**ధ్యానమంటే మనస్సును విషయచింతల నుండి దూరం చేయటం :** "ధ్యానం నిర్విషయం మనః" అనుశాస్త్ర వాక్యానుసారము మనస్సును నిర్విషయముగా చేయటమే ధ్యానము అయివున్నది. ధ్యానంచేసేవారు, తాము సర్వశక్తివంతులమని, ధ్యానం చేస్తున్నామని, తమలోనే అంతా వుందని, తాము ఈశ్వరుని ప్రతిరూపమని, తాము ఏదికావాలంటే అది చేయగలమను వృధా కల్పనలు అనేకం చేస్తారు. ధ్యానం సరిగ్గా చేయగలిగితే సమాధి స్థితిని పొందటానికి పెద్ద కష్టమేమీలేదు. ధ్యానంతో ఉన్న 12 నిమిషాల కాలంలో సమాధిస్థితి ఒక్క నిమిషము మాత్రమే లభిస్తుంది. ధ్యానం సహజంగా చేయగలిగితే ధ్యానించే వారంతా జీవన్ముక్తులు అయివుండేవారు.

ధ్యానమునకు అర్థం ఇప్పుడు అందరూ అనుకుంటున్నట్లుగా కాదు. ఇప్పుడు అందరూ చేసే ధ్యానం ధ్యానముకాదు. తన కల్పనకు అనుగుణంగా చేసే ధ్యానం యదార్థంగా ధ్యానం అని చెప్పబడదు. నిర్విషయ ఆధారంలో శూన్యస్థితిలో మనస్సును ఏకాగ్ర పరచటమే ధ్యానము అని చెప్పవచ్చు. వాస్తవికమైన ఈ ధ్యాన పద్ధతిలో నిస్సందేహముగా పరమానంద సుఖము మరియు మోక్షప్రాప్తి జరుగుతుంది. మనస్సును నిర్విషయము చేయకుండా ఎవరూ ధ్యానము చేయలేరు. జనులు పర్వతాలు, నదులు, సరోవరాలు, రకరకాల తీర్థాలను, మట్టి లేక రాతితో చేసిన దేవీ దేవతలను ధ్యానం చేయగలరు. కాని మనుష్యులచే కల్పన చేయబడిన దేవీదేవతల మూర్తులు మోక్షమును ఇవ్వలేవు. జనులు కల్పన చేసే దేవీదేవతలు చైతన్యము లేని చెక్క, మట్టి రాయితో నిర్మితమైన మూర్తులు. అవి మనస్సు కల్పించిన రూపాలు. ధ్యానం చేసేటప్పుడు కూడా సాధకుడు వీటిని పూజిస్తూవుంటే మేలు జరుగదు. అందువలన యోగసాధకులు వీటి యందు ఆసక్తి చూపరు. వారు

ప్రాణాయామము ద్వారా మనస్సును నిర్విషయము చేసి తనలోని చైతన్యరూపము, స్వయం ప్రకాశి అయిన ఆత్మను ప్రత్యక్షముగా దర్శించి ధ్యానం చేస్తారు.

జనులు కళ్ళుమూసుకొని ధ్యానమునకు కూర్చొంటే అంతరంలో అంధకారము మాత్రమే కనపడుతుంది. లేకపోతే వారు కల్పనారూపములను మాత్రమే చూడగలరు. ధ్యానము యొక్క అర్థము మనస్సును నిర్విషయంగా చేయడం, కల్పన చేయటంకాదు. అంటే కల్పనలు చేయటం ద్వారా మనము ధ్యానస్థితికి దూరంగా వెళుతున్నాము. మనస్సునకు శక్తినిచ్చే ప్రాణమును నిలుపుదల చేయకుండా ధ్యానంలో కూర్చుంటే మనస్సు స్థిరంగా వుండలేదు. ధ్యానంలో కూర్చొని కూడా మనము కల్పనలకు అతీతుడైన ఈశ్వరుని ధ్యానించలేము. కాని ప్రాణాయామం ద్వారా ప్రాణములను స్థిరం చేసినట్లయితే బలవంతముగానైనా మనస్సు నిర్విషయమౌతుంది. ఆ సమయంలో మనము అతీంద్రియ విషయాలని గ్రహించగలము. అప్పుడు మన కల్పనలన్నీ సఫలమౌతాయి. ఆ స్థితిలో మన మనస్సులో వచ్చే సంకల్పాలన్నీ నిజమౌతాయి. విక్షేపం ఆవరణ దోషాలవల్ల బుద్ధిలో వచ్చిన మాలిన్యం మరియు స్థబ్దతను ప్రాణాయామముచేసి తొలగించుకొనవచ్చు. అందువలన నిర్విషయ మనస్సులో ధ్యానం ద్వారా మనము జ్ఞానానుభూతిని పొందగలము.

ధ్యానం లేకుండా జ్ఞానం కలుగదు. ఆ ధ్యానము కూడా ప్రాణాయామ పరాయణులు యోగయుక్తులు కాకుండా జరుగదు. ఈ ధ్యానముకొరకే మనము యోగసాధన చేయవలసి వుంటుంది. అందువలన ఏ జనులు యోగసాధన ద్వారా ధ్యాన జ్ఞాన సంపన్నులవుతారో వారే భవసాగరము దాటగలరు. ఈ సంసార సాగరమును దాటించగల పరమ పవిత్రమైన జ్ఞానము యోగాభ్యాసము చేసే ప్రసన్న చిత్తులు, ఏకాగ్రచిత్తులయిన యోగులకు మాత్రమే లభించగలదు.

**వాస్తవికమైన ధ్యాన స్వరూపము :** మనస్సును నిర్విషయంగా చేయాలనుకునే ధ్యానులు సుఖపూర్వకమైన సిద్ధాసనము లేక పద్మాసనములో కూర్చుండి రెండు మోకాళ్ళపై రెండు చేతుల నుంచి నిటారుగా కూర్చొని దృష్టిని నాశికాగ్ర భాగములో స్థిరముచేసి, మొదటగా అనేకసార్లు రేచకపూరకములు చేసి నాడీశుద్ధి చేయవలసి వుంటుంది. తరువాత ప్రణవ శబ్దమైన ఓంకారముతో రేచకపూరక కుంభక ప్రాణాయామమును చేయవలసి వుంటుంది. ఎప్పుడైతే ప్రాణ నిరోధంవల్ల మనస్సు శాంతిస్తుందో అప్పుడు హృదయములో ధ్వనించే ఓంకారముతో కూడిన అనాహత



ధ్వనిని, ఘంటానాదము మొదలైన నాదములను శ్రవణం చేయాలి. ఈ విధంగా బాగుగా ప్రాణాయామము అభ్యాసము చేస్తూ వున్నప్పుడు ఒక్క మాసములోనే ప్రాణ నిరోధము జరిగి మనస్సు శాంతించుతుంది. ప్రాణనిరోధము జరిగినప్పుడు సుషుమ్నలోని క్రిందకు తిరిగి ముకుళించుకున్న హృదయకమలము ఊర్ధ్వముఖముతో వికసించుకొంటుంది. అప్పుడు మనస్సు శాంతించి శూన్యమై ఏకాగ్రతను పొందుతుంది. ఈస్థితిలో ధ్యానము సహజమవుతుంది. నిశ్చయంగా మనసు వశంలోకి వస్తుంది. వాస్తవంగా దీనినే ధ్యానమని, జ్ఞానమని అంటారు. ఇది కాకుండా మిగిలినవన్ని ధ్యానమనబడే కల్పనలే అయివున్నాయి. ఈ విధమైన ప్రబల ధ్యానయోగముల ద్వారా చిత్తాన్ని స్వాధీనం చేసుకొన్న యోగులకు అన్ని భ్రాంతులు అనతికాలములో తొలగిపోతాయి.

# సిద్ధమహాయోగము

## మూడవ ప్రకరణము

**కళ్యాణకారకములైన మూడు మార్గములు :** మానవుల శ్రేయస్సుకొరకు జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము అనే మూడు విధాలయిన మార్గాలు చెప్పబడ్డాయి. ఈ మూడు కాకుండా భగవానుని పొందే కళ్యాణ కారకమైన మార్గము మరేదియు లేదు.

ఏ విధమైన కోరికలు లేనివారికి, కర్మలను దుఃఖభాజనంగా తలచి త్యాగం చేసిన వారికి, భగవత్ జ్ఞానంలో నిమగ్నులయి వైరాగ్యముగల నిష్కాములైన మానవుల కొరకు జ్ఞానయోగం చెప్పబడింది.

కర్మాసక్తిని త్యాగం చేయలేనివారికి, సంసార సుఖాలను అనుభవించాలనుకునే వారికి, అంటే ఈ ప్రపంచములోనే వుండి పరమార్థ జ్ఞానమును పొందా లనుకునేవారికి కర్మయోగము నిర్దేశింపబడింది.

సాంసారిక కర్మలపట్ల అతి ఆసక్తిగాని, విరక్తి గాని లేనివానికి, దైవేచ్ఛవల్ల భగవానునిపట్ల శ్రద్ధ ఉత్పన్నమయిన వానికి, భోగి మరియు త్యాగి కాని వారి కొరకు భక్తియోగము నిర్దేశించబడినది. సుఖాలలో చిక్కుకుంటే మనము భగవానుని పొందలేమనివారు అనుకొంటారు. అందువలన వీరు సాంసారిక సుఖాలను బాగా

అనుభవించాలనుకోరు. మరియు ఆ భోగాలను వదలివేయుటకు ఇష్టపడరు. అంటే వీరు ప్రపంచములో సుఖాలను అదేపనిగా అనుభవించి తనువు చాలించాలని అనుకోరు. ఇంకా అన్ని సుఖాలను వదులుకొని బికారులు కావాలని కూడా అనుకోరు. ఈ ప్రపంచములోనే వుండి భగవానుని పొందాలనే కోరికతో భగవత్ లీలలను వినాలనుకొంటారు. ఇటువంటి వారి కొరకు భక్తి యోగము సిద్ధిదాయకమైనది. అంటే ఎప్పటివరకు మనసు వాసనా రహితము కాదో, భగవత్ జ్ఞానంపైన దృఢ విశ్వాసం వుండదో, అనగా భగవత్ ప్రాప్తి కొరకు చిత్తంలో అత్యంత వ్యాకులత ఉండదో అప్పటి వరకు మనుష్యులు కర్మలు చేస్తూ వుండవలసి వుంటుంది. అంటే ఎప్పటివరకు కర్మలు చేస్తున్నా నైష్కర్మ్య స్థితి రాదో అనగా ప్రపంచం పట్ల తీవ్ర వైరాగ్యస్థితి రాదో అప్పటివరకు మనుజులు కర్మత్యాగం చేయకూడదు. ఎవరు తమ ధర్మము తప్పక కర్మఫల ఆసక్తిని వదలి, విహితకర్మలైన యజ్ఞదాన, జపతపాది నిష్కామ కర్మయోగము చేస్తారో వారు నిషిద్ధ కర్మలు చేయకుండా వుంటే పాపవిముక్తిపొంది పవిత్రులై ఈ లోకంలోనే విశుద్ధ తత్వజ్ఞానాన్ని పొందగలరు. లేక పరమాత్ముని యందు భక్తిని పొందగలరు. కర్మ మార్పు చెందేది. దాని ద్వారా వచ్చే బ్రహ్మలోకము మొదలగునవి కూడా మార్పు నొందేవి కాబట్టి అది అమంగళకరమైనదిగా భావించబడినది. అందువలన బుద్ధిమంతులైన వారు ఈ లోకం మాదిరిగానే పరలోకమును కూడా నశించేదిగా భావించి దానిపై మోహమును వదలివేయవలెను.

**మనుష్య జన్మము అత్యంత దుర్లభము :** కాని పుణ్యకర్మలు చేసి దేవతలు కావాలనుకునేవారు స్వర్గసుఖాలు కూడా చిరస్థాయిగా వుండేవికాదు అని తెలుసుకోవాలి. అందువలన నరకబాధలను అనుభవిస్తున్న జనుల మాదిరిగా స్వర్గంలో వుండే దేవతలు కూడా ఈ మనుష్య దేహమును తిరిగి పొందాలను కొంటారు. ఎందుకంటే ఈ మనుష్య శరీరమే జ్ఞానము మరియు భక్తిని పొందే సాధనమైవున్నది. దేవతా శరీరముతో భక్తిని పొందలేము. జ్ఞాన లాభమున పొందలేము. అందువలన వివేకవంతులైనవారు నరకమును కోరుకొనని విధముగా స్వర్గమును కూడా కోరరాదు. ఈ లోకములో మళ్ళీ మనుష్య శరీరము పొందాలనే ఇచ్ఛనుకూడా చేయకూడదు. ఎందుకంటే శరీరముపైన ఆసక్తి ఏర్పడగానే జ్ఞాన సాధనలో ఆటంకము ఏర్పడుతుంది. అందువలన బుద్ధిమంతులు తెలుసుకోవలసిన దేమంటే ఈ మనుష్య శరీరము నశించేదయినప్పటికి యోగసాధనద్వారా పరమ



పురుషార్థ సాధనను ఈ దేహముతోనే చేసి మోక్షాన్ని పొందవచ్చు. మోక్షప్రాప్తి తరువాత తిరిగి రావలసిన పనివుండదు. అందువలన ఈ శరీరమే అన్ని శుభకర్మముల ప్రాప్తికి మూలమయినది. ఇది పుణ్యకర్మములు చేసేవారికి సులభంగా లభిస్తుంది. పాపకర్మలు చేసేవారికి లభించుటం దుర్లభము. ఈ మానవదేహము భవసాగరమును దాటుటకు కావలసిన నౌక వంటిది. దీనిని నడిపే నావికుడు గురువు. ఆయన భగవత్ సాధన, స్మరణ అనే వాయువు సహాయముతో ఆ నౌకను తీరంచేరుస్తాడు. ఈ విధంగా ఉత్తమమైన మనుష్యదేహాన్ని పొందికూడా ఏ మనుష్యుడు సంసార సాగరమును దాటలేడో అతడిని ఆత్మఘాతకునిగా ఆత్మ హంతకునిగా తలచాలి.

**అష్టాంగయోగ సాధనామార్గము :** అందువలన తమ మేలుకొరకు మనుష్యులు యమ, నియమ మొదలుగాగల అష్టాంగ యోగసాధనతో కాని మరియు వేదాంతములో చెప్పిన నిత్యానిత్య వివేచనముతో చేసే బ్రహ్మ విద్యతో కాని, ఈశ్వర ప్రణిధానము అనే ఉపాసనతోకాని ఎవరికి ఏది అనుకూలంగా ఉంటుందో తదనుగుణంగా సాధనచేసి భగవత్ప్రాప్తి పొందవచ్చు. ఈ మార్గం కాకుండా భగవానుని పొందుటకు ఇతర మార్గము లేవీలేవు. కానీ భగవానుడు చెప్పిన మార్గములను వదలి జనులు తమ ఇష్టానుసారంగా ఇతర మార్గాలలో తిరుగాడుతారు. అటువంటివారికి భగవత్ ప్రాప్తి లభించదు. వారికి మేలు కూడా జరుగదు. అందువలన భగవత్ ప్రాప్తికి అష్టాంగ యోగము, వేదాంతములో చెప్పబడిన జ్ఞానము, ఈశ్వరప్రణిధాన రూపమైన భక్తి అనే మూడు మార్గాలే ఉపయుక్తమైనవి. అన్ని కర్మలపై ఆసక్తిని వదలి యోగసాధన ప్రారంభించే వైరాగ్యవంతులైన యోగులు, ఇంద్రియ సంయమనమును పాటించి ఈశ్వర ప్రణిధాన రూపమైన భక్తి ద్వారా యోగసాధనద్వారా తమ చిత్తమును నిలుపుదల చేసినవారు మాత్రమే భగవత్ ప్రాప్తిని పొందగలరు.

యోగమార్గము కాకుండా మనము మరి ఏ ఇతర మార్గముల ద్వారా అయినా మనస్సును శీఘ్రంగా వశం చేసుకొనలేము. విచారణ ద్వారా మనస్సును నిలుపుదల చేసినా అది వెంటనే చంచలమైన గుర్రము మాదిరి అటు నిటు పరిగెడుతుంది. అందువలన సాధకులు అటువంటి సమయంలో మనస్సుకు నచ్చచెప్పి మనస్సును తమ అధీనములోనికి తెచ్చుకోవాలి. మనస్సు కోరే చిన్న కోర్కెలనైనా తీర్చకపోతే అది చాలా చంచలమవుతుంది. అటువంటి సమయములో దాన్ని నిలుపుదల

చేయటం కూడా కష్టతరమవుతుంది. అందువలన సాధకులు బాగుగా యోచించి మనస్సుకు అనుకూలముగా ఉండే సుఖప్రదమైన విధానాన్ని అనుసరించాల్సి ఉంటుంది.

జ్ఞానయోగం, కర్మయోగం, భక్తియోగముల ననుసరించేవారి సర్వకామనలు క్రమముగా నశిస్తాయి. అప్పుడు ఆత్మ సాక్షాత్కారము కలిగి హృదయగ్రంథి విడిపోతుంది. అన్ని సందేహాలు నిర్మూలనమవుతాయి. సర్వ కర్మబంధాలు నశిస్తాయి. భగవానుడు కాకుండా ఈ ప్రపంచములో జ్ఞానులకు ప్రియమైన వస్తువేదీలేదు. ఈ జ్ఞానులయినవారికి భగవానుడు అత్యంతాప్తుడు. ఇటువంటి అనన్య భక్తులను, బుద్ధికి అతీతమైన పరతత్వమును గురించి తెలిసిన సమదర్శులయిన మహాత్ములను, సాంసారిక గుణదోషాలతో సంభవించే వికారాలేవీ బాధించవు. ఎవరు పైన చెప్పిన జ్ఞాన, కర్మ, భక్తియోగమార్గములను అవలంబించుతారో వారు అత్యంత సులభముగా పరంధామమును చేరుతారు.

**నాల్గు స్థాయిలలో వున్న మనుష్యులు :** ఈ ప్రపంచములో ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ, అధమ అనే నాలుగు స్థాయిలలో వున్న మనుష్యులుంటారు. వీరిలో మూడు వర్గాల వారు తమ తమ అనుకూలత, ఆవశ్యకత మరియు పరిస్థితుల ప్రకారం అనుష్ఠించడానికి జ్ఞానయోగం, కర్మయోగం, భక్తియోగం అనే మూడు యోగాలు ఇదివరలో చెప్పబడ్డాయి. వారిలో ఉత్తమ వర్గానికి చెందినవారు ఈ ప్రపంచమును అనిత్యముగా తలచి భోగాలను త్యాగముచేసి, జ్ఞాన, వైరాగ్య, త్యాగ, తపస్సులను ఆశ్రయించి నివృత్తి పరాయణులవుతారు. వారు అష్టాంగయోగ సాధన ద్వారా యదార్థ జ్ఞాన లాభమును పొందగలరు. ఆ పరమభక్తులైన జ్ఞానయోగులు భగవానునికి అత్యంత ప్రియతములు.

రెండవ మధ్యమ వర్గజనులు ఈ ప్రపంచమును మిథ్యగా తలచరు మరియు సత్యంగా ఒప్పుకోరు. ప్రపంచములోని భోగాలను ఇష్టముగా భోగించరు మరియు భోగించకుండా వదలిపెట్టనూలేరు. సందిగ్ధ స్థితిలో వుండి తమ కర్తవ్యాన్ని తమకు తాముగా లేక శాస్త్రాలలో చెప్పిన విధంగా నిర్వర్తించలేరు. అటువంటివారు పుణ్యకర్మలైన తీర్థదర్శనములు, వ్రతములు, దానములు మరియు భక్తియోగ సాధనలైన జపతపాదులు, పూజాదులు, హరికథాశ్రవణములు, సత్సంగములతోపాటు ఈశ్వర ప్రణిధాన రూప అష్టాంగ యోగసాధనచేసి భగవానుని పొందవచ్చును. యోగసాధన



చేయుటకొరకు వారు తమ ఇళ్ళూ, వాకిళ్ళూ వదలవలసిన పనిలేదు. అందువలన సందిగ్ధ స్థితిలో ఉంటూకూడా వారు యోగము ద్వారా తమను తాము ఉద్ధరించుకొన గలరు. ఇటువంటి భక్తి యోగముద్వారా భగవానుని కలుసుకోవాలనుకునే జనులు తమ భావనానుగుణంగా భగవానుని నుండి ఫలితాన్ని పొందగలరు.

మూడవ రకమైన కనిష్ఠ వర్గజనులు ఈ ప్రపంచాన్ని కొంత సత్యముగా భావించి పరోపకారము చేయుట కొరకు ఈ ప్రపంచములోనికి మళ్ళీ మళ్ళీ రావాలనుకుంటారు. వారు సాంసారిక భోగాలను అనుభవించాలని కోరుకుంటారు. మరియు భగవత్ ప్రాప్తిని కోరుకొంటారు. వారు కర్మయోగము ద్వారా పరోపకారము చేస్తూ వుంటారు. యజ్ఞాలు చేస్తారు. దానాలు చేస్తారు, పాఠశాలలు, ధర్మసత్రాలు, గోశాలలు కట్టిస్తారు. విద్యాలయాలను, అన్నదాన క్షేత్రములను ప్రారంభిస్తారు. ఈ విధంగా వారు అన్నదానం, వస్త్రదానం, ధనదానం మరియు జప, తప, తీర్థ, వ్రత యజ్ఞ కర్మల ద్వారా భగవానుని సేవిస్తారు. వారు నిష్కామ కర్మయోగము ద్వారా అష్టాంగ యోగసాధనచేసి భగవానుని ఆనందముగా పొందగలరు. ఈ ప్రకారంగా జ్ఞాన, భక్తి, కర్మ యోగసాధనచేసే అన్ని వర్గాలకు చెందిన జనులు భగవత్‌ప్రాప్తిని పొంది పరమానంద లాభమును పొందగలరు. అందువలన జ్ఞాన, భక్తి, కర్మయోగాలు కూడా అష్టాంగయోగముపైనే ఆధారపడి వున్నవి. ఇవి కాకుండా మరే ఇతర సాధనల ద్వారా భగవత్ ప్రాప్తి కలుగదు.

ఈ ప్రపంచములో నాలుగవ నిమ్న వర్గమునకు చెందిన మనుష్యులున్నారు. వారికి ఈ ప్రపంచమే సర్వస్వము వారు స్వార్థముతో న్యాయా న్యాయములను, పాపపుణ్యాలను కొంచెము కూడా ఒప్పుకోరు. ధర్మాచరణమునకు సుతారాము ఒప్పుకోరు. వారు ఏ విధంగా అయినా సంతోషముగా వుండటమే తమ అదృష్టంగా భావిస్తారు. ఇంద్రియ సుఖము కొరకు ఏదో ఒక ఉపాయము ద్వారా ధనాన్ని సంపాదించటంలో నిమగ్నమయి వుంటారు. వారు నిషిద్ధ, నిందిత పాపకర్మలు చేయడానికి వెనుకాడరు. వారు ఈ ప్రపంచములో ఏదోవిధంగా కాలం గడిపి చనిపోతారు. వారికి భగవానుని పొందాలనే కోరిక వుండదు. అటువంటి జనులు భగవానుని దివ్య కథాశ్రవణమును, సాధుసాంగత్యమును చేయుట అవసరమైవున్నది. ఏ మనుష్యుడు తన స్థితిని, భగవంతుని ఉనికిని తెలుసుకోలేడో అతడు ఎలా తరించగలడు? అందువలన మనుష్యులు తమకనుగుణమైన స్థితిని మరియు

వంటి పర్వదినములు పుణ్యప్రదమైనవి. జనన, మరణకాలములు, గ్రహణాది కాలములు అపవిత్రమయినవి. అంటే శుభకర్మలు చేయబడని కాలములను అయోగ్యమయినవిగా భావించాలి.

**శుద్ధాశుద్ధ వివేకము :** భౌతిక పదార్థములన్నింటియొక్క శుద్ధాశుద్ధ నిర్ణయమును ద్రవ్యము, కాలము మరియు సంస్కారము, అల్పతత్త్వము లేక మహత్త్వము వంటి వాటితో చేయబడుతుంది. నదులు, సరోవరములు, నూతులలోని జలము శుద్ధమయినది. కాని చిన్నకుంటలలోని జలము అపరిశుద్ధముగా పరిగణించబడుతుంది. దేశ, కాల, పాత్రాది భేదముతో ఒకే వస్తువు శుద్ధమయినదిగా మరియు అశుద్ధమయినదిగా భావించబడుతుంది. రాగి మరియు ఇత్తడి పాత్రలు శుద్ధమయినవి అయినా మూత్రాదుల స్పర్శతో అపవిత్రమవుతాయి. మరల వాటిని జలముతో శుద్ధి చేయవచ్చును. స్త్రీ రజస్వలగా ఉన్నప్పుడు అపవిత్రురాలిగా ఉంటుంది. ఋతుకాలము తరువాత శుద్ధిని పొందుతుంది. అప్పటికప్పుడు చేసిన భోజనము శుద్ధమయినదిగా, పాచిపోయిన అన్నము అశుద్ధ మయినదిగా భావించబడుతుంది. తులసీదళములను ఆఘ్రాణించుటచే అవి అపవిత్రమవుతాయి. వాటిపైన అభిమంత్రించిన జలము చల్లినపుడు అవి తిరిగి శుద్ధమవుతాయి.

ధాన్యము, కట్టెలు, ఎముకలు, నూనె, పాలు, పెరుగు, వెన్న, చక్కెర, బెల్లము, తేనె వంటి ద్రవ్యములు మరియు బంగారము, వెండి, పాదరసము వంటి విలువైన వస్తువులు, చర్మము వంటి పార్థివ పదార్థముల యొక్క శుద్ధి, కాలము, వాయువు, అగ్ని, జలములతో చేయబడుతుంది. దేశ, కాల, పరిస్థితులననుసరించి పదార్థములన్నింటి యొక్క శుద్ధి పైన చెప్పిన విధానములన్నింటితోగాని, ఏదో ఒక పద్ధతితో గాని జరుపబడుతుంది.

ఏవిధముగా ద్రవ్యము దేశకాల పాత్రతలననుసరించి శుద్ధాశుద్ధ స్థితిని పొందుతుందో అదేవిధముగా మనుష్యుడు కూడా తనశక్తి, బుద్ధి, వైభవముల ద్వారా పాత్రతను అనుసరించి చేసిన కర్మల వలన లభించిన పుణ్య, పాపములను పొంది శుద్ధునిగా, అశుద్ధునిగా మారగలడు. అంటే ఏవిధముగా జనులు పదార్థములను శుద్ధిచేసి ఉపయోగిస్తారో అదేవిధముగా మానవులు తమ కర్మలద్వారా తమను తాము శుద్ధి చేసుకోవాలి.

మానవుల మనస్సు, స్నానము, దానము, తపము, సంస్కారము, కర్మ మరియు స్మరణమువలన శుద్ధిని పొందుతుంది. ఈ విధముగా శుద్ధిని పొందిన ద్విజుడు



విహిత కర్మలను చేస్తూ వుండాలి. మంత్రమును గురుముఖత తెలుసుకొనుటచే మంత్రశుద్ధి కలుగుతుంది. విహిత కర్మలన్నింటిని భగవానునికి అర్పణ చేయుటచే కర్మలయొక్క శుద్ధి కలుగుతుంది. ఈ విధముగా దేశము, కాలము, పదార్థము కర్త, మంత్రము కర్మల యొక్క శుద్ధి జరిగినపుడు మానవులకు పుణ్యము ప్రాప్తిస్తుంది. అవి అశుద్ధమగుటచే పాపము కలుగుతుంది.

**గుణదోషములయొక్క భేదము కల్పితమయినది :** భూమిపైన నిద్రించిన మనుష్యుడు క్రిందపడడు. అదేవిధముగా పతితులు కర్మానుష్ఠానము ద్వారా ఇంకా పతితులు కాలేరు. కాని ద్విజులు పతితులకంటే ఎంతో ఉన్నత స్థితిలో వుంటారు. వారు క్రింద పడుటకు ఆస్కారమున్నది. అందువలన నిష్ఠాపూర్వకముగా ఆచరించిన కర్మలు స్థితి స్థానముల ననుసరించి దోషపూరితము కావచ్చును. గృహస్థులు ఆసక్తితో కర్మలను ఆచరించుట స్వాభావికము కావున వాటిని గుణకర్మలుగ చెప్పారు. కాని విరక్తులు ఆసక్తిని కలిగివుండుట దోషము.

అందువలన వాస్తవికముగా పైన చెప్పిన విషయము లేవీ సత్యములు కావు. ఇవి దేశ, కాల, స్థానముల ననుసరించి కొద్దికాలము చిత్త శుద్ధికి తోడ్పడతాయి. కాని చాలామంది మనుజులు యావజ్జీవము శుద్ధాశుద్ధి మరియు గుణదోషములను అంటిపెట్టుకొని వుంటారు. ఇటువంటి మనుష్యులు ముక్తిని పొందలేరు. వాస్తవముగా నివృత్తి మార్గము ద్వారా కర్మ క్షయమవుతుంది. అనగా రోగ, శోక, మోహ, భయములను తొలగించే నివృత్తి మార్గముద్వారా మాత్రమే జనులకు మేలు కలుగుతుంది.

**విషయాసక్తి యొక్క పరిణామము :** భగవానుడుపదేశించిన నివృత్తి మార్గమును పాటించక మనుష్యుడు విషయాసక్తుడై, సుఖములను కోరి కర్మలుచేస్తే వాటియందు అతడికి ఆసక్తి ఏర్పడుతుంది. సంగమువల్ల, సుఖలాలస పెరుగుతుంది. కోరికలకు వశుడై ఇతరులతో కలహిస్తాడు. కలహముతో క్రోధము వస్తుంది. క్రోధవశుడైన మనుష్యుని బుద్ధి చేతనాశక్తిని కోల్పోతుంది. జనులు కామ, క్రోధములకు వశులైనపుడు జ్ఞానశూన్యులుగామారి ఎందుకూ పనికిరారు. విషయ వాసనలతో ఎవరి జ్ఞానము హరించబడి వుంటుందో వారు తన వారిని, పరాయివారిని మరియు ఆత్మ పరమాత్మలను తెలుసుకొనలేరు. వారు వృక్షములవలె చిరకాలము వృధాగా జీవితమును గడుపుతారు.

**మానవజన్మయొక్క పరిపూర్ణత :** దేహధారులుగా నున్న వారు, దేహములు ధరించిన ఇతర జీవులకు ఉపకారము చేస్తే వారిజన్మ సఫలమవుతుంది. అందువలన బుద్ధిమంతులు తమయొక్క తన, మన, ధన, బుద్ధి, వాక్కుల ద్వారా, చివరకు ప్రాణములు అర్పించి అయినా జీవజాలమునకు ఉపకారముచేసి భగవంతుని సేవచేయాలి. వారు యమ, నియమములను విధిగా అనుష్ఠించాలి. భగవానుని స్వరూప జ్ఞానము కలిగిన శాంత చిత్తులు, ఈశ్వరరూప గురువులకు శ్రద్ధగా సేవచేయాలి. కాని వారు భగవంతునిపై విశ్వాసముంచి కర్మలను నిరాసక్తితో, వైరాగ్యభావంతో చేస్తూ వుండాలి. కోరికలన్నీ దుఃఖ హేతువులుగా తెలిసినా వాటిని వదలిపెట్టటానికి అశక్తులయినప్పుడు ఆసక్తి లేకుండా భోగాలను అనుభవిస్తూ శ్రద్ధ మరియు దృఢ నిశ్చయముతో ప్రేమపూర్వకముగా భగవానుని కీర్తన చేయవలయును. ఈ విధమైన భక్తిభావముతో నిరంతరం కీర్తన చేయుట చేత ఎప్పుడు వారి హృదయములో భగవానుని యదార్థజ్ఞానము కలుగుతుందో అప్పుడు వారి కోరికలన్నీ నశించిపోతాయి. కోరికలన్నీ నశించటాన్ని నిష్కామభావముగా, నిశ్రేయమార్గముగా, మహాకళ్యాణమార్గముగా చెపుతారు. అందువలన పైన చెప్పిన యోగ, జ్ఞాన, భక్తియుక్తులైన నిష్కాములు అయినవారికి మాత్రమే భగవానుని అనన్యభక్తి ప్రాప్తించుతుంది.

**యమ, నియమ, షట్ సంపత్తియొక్క లక్షణములు :** అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము, అసంచయము, ఆస్తికత్వము, బ్రహ్మచర్యము, మౌనము, స్థిరత్వము, క్షమ, అభయము, శౌచము, జపతప హోమములు, శ్రద్ధ, అతిథి సత్కారం, పూజ, తీర్థయాత్ర, పరోపకారము మరియు గురుసేవ అనెడి యమ నియమములు పాటించే వారికి ఇచ్ఛానుసారంగా కోర్కెలు సిద్ధించుతాయి.

శ్రద్ధతో బుద్ధిని భగవానుని యందు లగ్నముచేయుటయే శమము అయివున్నది. ఇంద్రియ సంయమమునే దమము అందురు. దుఃఖాన్ని భరించటమే తితిక్ష అయివున్నది. నాలుకను గుహ్యేంద్రియమును జయించుటయే ధైర్యము అయివున్నది. క్షమాదానమే పరమదానము, కోరికలను వదలివేయుటయే పరమమైన తపము అని చెప్పబడుతుంది. చంచలమనస్సును జయించుటయే శూరత్వం అయివున్నది. ఎల్లెడలా సమదర్శనము చేయుటయే పరమ సత్యము అయివున్నది. సుమధురవాణిని విద్వజ్జనులు ఋతము అని అంటారు. కర్మలను ఆచరించుటలో ఆసక్తి లేకుండుటను



శౌచము అంటారు. కర్మలను త్యజించుటయే సన్యాసము. ధర్మమే మనుష్యులకు ప్రియధనము. సకల ఐశ్వర్య సంపన్నుడైన యజ్ఞ పురుషుడు భగవానుడే అయివున్నాడు. జ్ఞాన ఉపదేశమే దక్షిణ అయివున్నది. ప్రాణాయామమే మనుష్యులకు పరమ బలమును కలిగించునది. భగవానుని యందు అనన్యభక్తిని పొందగలుగుటయే లాభముగా, ఆత్మ పరమాత్మ బేధ బుద్ధి లేకుండుటయే విద్యగా, నిందించబడే దుష్కర్మలకు దూరముగా ఉండుటయే లజ్జగా చెప్పబడింది. దేనిని కోరకుండుటయే భాగ్యముగా, సుఖదుఃఖాలకు అతీతంగా నుండుటయే పరమసుఖముగా చెప్పబడినది. విషయ సుఖములను కోరుటయే దుఃఖము అని, బంధ మోక్షములను ఎరిగినవాడు పండితుడు అని, దేహాదులను నేను అని తలచేవాడు మూర్ఖుడు అని, చిత్త విక్షేపమే చెడునడత అని, సత్వగుణము ఉదయించుటయే స్వర్గము అని, తమోగుణము పెరుగుటయే నరకమని చెప్పబడినది. గురురూపములోనున్న భగవానుడే బంధువు అయివున్నాడు. మనుష్య శరీరమే ఇల్లు అని, గుణవంతుడే నిజమైన ధనవంతుడుగా చెప్పబడ్డారు. సంతృప్తిలేని వారిని నిర్ధనులు అని, జితేంద్రియులు కానివారిని దీనులు కృపణులుగా చెప్పారు. భగవానుడిపైన భక్తి కలుగుటయే ధర్మముగా, అన్ని ప్రదేశము లందు ఏకాత్మను దర్శించుటయే జ్ఞానముగా చెప్పబడినది. త్రిగుణములతో కూడిన విషయములపట్ల అనాసక్తతయే వైరాగ్యముగా, అణిమాదిసిద్ధుల ప్రాప్తియే ఐశ్వర్యముగా చెప్పబడినది. అందువలన గుణదోషములను వివేచనచేసి చూచుటయే దోషముగా, ఆరెండింటిని ఆవిధముగా చూడకపోవుటయే గుణము అని చెప్పవచ్చును.

# సిద్ధమహాయోగము

## నాల్గవ ప్రకరణము

**తత్త్వవిచారము :** తత్త్వదర్శనముచేసిన ఋషులు తత్త్వముల సంఖ్యను రకరకాలుగా చెప్పారు. కొందరు 18 తత్త్వములను చెపితే మరికొందరు వాటిని 25 లేక 26 తత్వములుగా మరికొందరు 16 లేక 17 తత్త్వములుగా వర్ణించారు. విభిన్న రకములుగా బ్రహ్మవిదులు చెప్పినదంతా యదార్థమే. కాని భగవానుని మాయాశక్తికి మోహితులైన జనులు ఒకరు చెప్పినది మరి యొకరు తప్పుగా నిర్ధారించి వాద, ప్రతివాదాలు చేస్తారు. ఈవాద ప్రతివాదాలన్నింటికి భగవానుని అద్భుత మాయాశక్తియే కారణము. అందువలన ఈ మాయాశక్తిద్వారా ఈ వికల్పరూపమైన

ప్రపంచము సృష్టించబడినది. ఎప్పటివరకు ఈ జగత్తు వుంటుందో అప్పటివర వాద, వివాదాలు కొనసాగుతూ వుంటాయి. మనస్సు ఈ వాదవివాదాలన్నింటి మూల కారణము. కాని శమ, దమాది సాధనలద్వారా సమాధి స్థితి ప్రాప్తిం మనస్సు తన స్వస్వరూపము నందు నిలిచినపుడు ఈ వాదవివాదాలతో కూడి వికల్ప రూపమైన జగత్తులోని తత్త్వములు శాంతిస్తాయి.

భౌతిక తత్త్వములు పరస్పరము ఒకదానిలో ఒకటి కలిసిపోయి వుంటాయి. కార్య, కారణ భేదముతో తత్త్వముల సంఖ్యావివరణము అంతా సరిఅయినదే. కా కేవలము ఈ తత్త్వములను మౌఖిముగా లెక్కించి సిద్ధాంతీకరించుట వలన వాస్తవి జ్ఞానము లభించదు.

**పురుషుడు :** అనాది కాలముగా అవిద్యతో కూడిన పురుషుడు యోగసాధ చేయకుండా తనను తాను తెలుసుకొనలేడు. అతడికి జ్ఞానోపదేశముల నిచ్చుట ఎవరైన తత్త్వజ్ఞుడయిన పురుషుడు అవసరం అవుతాడు. కాని ఆత్మ మరియు పరమాత్మలో అణుమాత్రమయినా భేదములేదు. ఇటువంటి స్థితిలో అన్యపురుష కల్పనను చేయుట అనుచితము. జ్ఞానమనునది ప్రకృతిలోని సత్త్వాంశముయొక్క గుణము. కాని ఈ జ్ఞానము గురించి అనేకులు అనేకవిధములుగా చెప్పారు. ఈ తత్త్వముల సంఖ్యను తెలుసుకొనుటచే జగత్తు యొక్క కార్యకారణ, భేదాభేద అజ్ఞాన కలుగుతుంది. కాని ఆత్మ మరియు పరమాత్మ జ్ఞానము మాత్రము యోగసాధ ద్వారానే కలుగుతుంది.

**ప్రకృతి :** త్రిగుణములయొక్క సామ్యస్థితియే ప్రకృతిగా చెప్పబడినది. సత్త్వ, రజ, తమోగుణములు ప్రకృతికి సంబంధించినవి. ఇవి జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయములకు హేతువులవుతాయి. ఈ గుణములు ఆత్మకు సంబంధించినవికావు. సత్త్వగుణము జ్ఞానముగా, రజోగుణము కర్మగా, తమోగుణము అజ్ఞానముగా చెప్పబడినది. ఈ మూడు గుణముల యొక్క అసమతుల్యస్థితియే కాలము. స్వభావమే మహత్తత్త్వము. సృష్టి ప్రారంభములో కార్య, కారణరూపిణి అయిన ఈ ప్రకృతియే తన సత్త్వాది గుణముల ద్వారా తత్త్వముల స్థితిని ధారణ చేస్తుంది. అవ్యక్త పురుషుడు వాటిని వీక్షిస్తూ సాక్షీభూతుడుగా వుంటాడు. అవ్యక్త పురుషుని వీక్షణతో బలమును పొందిన మహతత్త్వము ప్రకృతిని ఆశ్రయించి ఈ బ్రహ్మాండమును సృష్టించుట జరిగినది.



**తత్త్వముల సంఖ్య :** పురుషుడు, ప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, ఆకాశము, వాయువు, తేజము మరియు పృథ్వి ఇవి తొమ్మిది తత్త్వములు. కర్ణము, చర్మము, నేత్రము, జిహ్వ, నాశిక అను జ్ఞానేంద్రియములు, వాక్కు, హస్తము, పాదము, గుదము, ఉపస్థ, కర్మేంద్రియములు ఇవి మనస్సుయొక్క ఉపకరణములు. అవి మనస్సు ఆధీనములో పనిచేస్తాయి. శ్రవణము చెవులు చేసే పని; స్పర్శను గ్రహించుట చర్మము ద్వారా జరుగుతుంది. రూపములను చూచుట కండ్ల పరిధిలోని విషయము. రసాస్వాదన చేయుట నాలుకయొక్క విషయము. వాసనను తెలుసుకొనుట నాశిక ద్వారా జరుగుతుంది. ఈ విధముగా శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములను అయిదు కూడా జ్ఞానేంద్రియముల పరిధిలోనివి. మాటలాడటము వాక్కుకు సంబంధించిన విషయముగా, ఇవ్వటము తీసుకోవటము అనునది చేతులు చేసేపనిగా, నడవటం, తిరగటం అనునది పాదముల పనిగా, మల విసర్జన చేయుట గుదముచేసే పనిగా, రతికర్మ ఉపస్థ చేసేపనిగా మనకి తెలుసు. ఇవి ఐదు కర్మేంద్రియములు చేసే పనిగా చెప్పబడినది. ఈ పనులను చేయటం చేయకపోవటం అనేది వాటి స్వభావమునకు సంబంధించిన విషయము.

కేవలము 7 తత్త్వములనే చెప్పే తత్త్వజుల అభిప్రాయము ప్రకారం ఆకాశాది పంచమహాభూతములతో పాటు, ఆత్మ పరమాత్మ కలిపి 7 తత్త్వములు ఉంటాయి. దేహేంద్రియములు పంచభూతముల అంతర్గతమైనవిగా భావిస్తారు. ఆరు తత్త్వములను చెప్పేవారి అభిప్రాయము ప్రకారము పంచభూతములతోపాటు, పరమాత్మ ఉంటాడు. ఆ పరమాత్మయే తననుండి ఉత్పన్నమయిన ఈ పంచ భూతములను సృష్టించి వాటిలో జీవునిగా ప్రవేశించి ఉన్నాడని వారి అభిప్రాయము. నాల్గుతత్త్వములు చెప్పేవారి మతానుసారము తేజము, జలము, అన్నము, ఆత్మ అను నాల్గు తత్త్వములు ఉంటాయి. వీటినుండే నిశ్చయముగా అన్ని తత్త్వములు ఉత్పన్నమవుతాయని వారి అభిప్రాయము. 17 తత్త్వములుగా చెప్పే తత్త్వజ్ఞుల అభిప్రాయము ప్రకారము పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచ తన్మాత్రలు, ఆత్మ మరియు మనస్సులతో కలిపి 17 తత్త్వములు మాత్రమే ఉన్నాయి. 16 తత్త్వములు చెప్పేవారి తత్త్వజ్ఞుల అభిప్రాయానుసారము పంచభూతములు, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు బుద్ధి, చిత్త అహంకారములతోపాటు జీవాత్మ, పరమాత్మతో కలిపి 16 తత్త్వములు మాత్రము ఉంటాయి. 13 తత్త్వములుగా సిద్ధాంతీకరించినవారి అభిప్రాయము ప్రకారము పంచభూతములు,

పంచజ్ఞానేంద్రియములు, మనస్సు, జీవాత్మ మరియు పరమాత్మ మాత్రమే ఉన్నాయి. అలాగుననే పదకొండు తత్త్వములుగా సిద్ధాంతీకరించినవారి మతానుసారము, ఆత్మ పంచ భూతములు మరియు పంచజ్ఞానేంద్రియములు మాత్రమే ఉన్నాయి. తొమ్మిది తత్త్వములు మాత్రమే చెప్పేవారి దృష్టిలో ప్రకృతి, పురుషుడు, మహతత్త్వము, అహంకారము, పంచజ్ఞానేంద్రియములు మాత్రమే ఉంటాయి. ఈ విధముగా ఋషులు తాము అర్థము చేసుకొన్న జ్ఞానము ననుసరించి తత్త్వములను వ్యాఖ్యానించి గణించారు.

ప్రాణులలో ప్రకృతి, పురుషుడు, మహత్తత్త్వము, అహంకారము మరియు పంచతన్మాత్రలు, మనస్సుతో కూడిన పదకొండు ఇంద్రియములు, పంచభూతములు, త్రిగుణములు కలిపి మొత్తము 28 తత్త్వములు ఋషులచే గుర్తించబడ్డాయి. వీటన్నింటి యందు వ్యాపించి యున్న ఆత్మను చూచుటయే పరమజ్ఞానముగా చెప్పబడినది. సత్వ, రజ, తమోగుణములకు సంబంధించిన భావముల ఉత్పత్తి, స్థితి, లయములను చూడకుండా కేవలము ఆత్మ తత్త్వమును మాత్రమే సర్వకాల సర్వావస్థల యందు ప్రత్యక్షముగా దర్శించగలిగితే దానిని విజ్ఞానమంటారు. ఆత్మశక్తి కారణము చేతనే భౌతిక పదార్థముల సృష్టి, స్థితి, లయములు జరుగుతూ వుంటాయి. ప్రళయములో ఇవి అన్నియు లయమును పొందినా, నిలిచి వుండే వాడు పరబ్రహ్మము లేక పరమాత్మ. ఈ భౌతికతత్త్వముల విషయములో ప్రత్యక్ష, అనుమాన, ఐతిహ్య, పరంపరాగతమను నాలుగు ప్రమాణముల ద్వారా విజ్ఞానులకు ఈ ప్రపంచములో ఎటువంటి శక్తియు సిద్ధించదు. అందువలన జ్ఞానులు ఈ వికల్పరూప ప్రపంచముపట్ల విరక్తులయి వుంటారు.

**ప్రకృతి పురుషుల భేదము :** ప్రకృతి మరియు పురుషుడు పరస్పరము భిన్నము అయినప్పటికి ఒకరిపై నొకరు ఆధారపడుట వలన భేదమేమీ అగుపించదు. ఈ ప్రపంచములో జీవులు భగవానుని మాయాశక్తి కారణముగా మోహవశులై వుంటారు. అటువంటి వారికి తిరిగి భగవానుని కృప కలిగితే జ్ఞానము ప్రాప్తిస్తుంది. కేవలము ప్రకృతిలోని త్రిగుణములలో మార్పుల కారణముగా ఈ ప్రపంచము నిరంతరము మార్పులు చెందుతూ వుంటుంది. భగవానుని యొక్క త్రిగుణాత్మకమైన మాయాశక్తి తన త్రిగుణముల ద్వారా ఈ ప్రపంచములో అనేక విధములుగా వైవిధ్య భరితమైన భేదములను ఉత్పన్నము చేస్తుంది. ఈ మార్పులలోని భేదములు అధ్యాత్మ, అధిభూత, అధిదైవమను మూడు విధములుగా వుంటాయి.



నేత్రేంద్రియమును అధ్యాత్మగా, రూపమును అధిభూతముగా, సూర్యుని అధిదైవముగా చెప్పవచ్చును. ఈ మూడు ఒకదానిపై ఇంకొకటి ఆధారపడి వుంటాయి. ఆకాశములో వున్న సూర్యుడు, రూపము మరియు చక్షువు కంటె భిన్నముగా ఉంటాడు. కాని సూర్యుని ప్రకాశముతో నేత్రము మరియు రూపము ప్రకాశిస్తాయి. వేరుగావున్న సూర్యుడు, రూపము మరియు నేత్రము ప్రకాశించుటకు కారణమయినాడు. అదేవిధముగా భౌతిక జగత్తునకు ఆదికారణము ఆత్మ అయివున్నది. ఆత్మ జగత్తుకు భిన్నముగా వుంటుంది. స్వప్రకాశము కలిగి వుండి ఈ ప్రపంచమును ప్రకాశింపజేసి తాను మాత్రము వేరుగా వుంటుంది. ఈ మార్పులతో కూడిన భేదములు అధ్యాత్మ, అధిభూత, అధిదైవ మను మూడు రకములుగా వుంటాయి. చర్మేంద్రియము అధ్యాత్మగా, దాని గుణమైన స్పర్శ అధిభూతముగా, వాయుదేవుడు అధిదైవముగా ఉంటాడు. అదేవిధముగా రసనేంద్రియము అధ్యాత్మగా, రుచి అధిభూతముగా, వరుణుడు అధిదైవముగా ఉంటాడు. నాశిక అధ్యాత్మగా, వాసన అధిభూతముగా, అశ్వనీకుమారులు అధిదైవములుగా ఉంటారు. అదేవిధముగా అంతఃకరణములో మనస్సు అధ్యాత్మగా, దానిగుణమైన సంకల్పము అధిభూతముగా, చంద్రుడు అధిదైవముగా ఉంటాడు. బుద్ధి అధ్యాత్మగా, దాని గుణమయిన బోధత్వము అధిభూతముగా బ్రహ్మ అధిదైవముగా వుంటాడు. చిత్తము అధ్యాత్మగా, చింతించే విషయము అధిభూతముగా, వాసుదేవుడు అధిదైవముగా ఉంటాడు. అహంకారము అధ్యాత్మగా, అహము అధిభూతముగా, రుద్రుడు అధిదేవతగా వుంటాడు.

**తారతమ్యములకు మూలకారణము :** త్రిగుణములలో హెచ్చు తగ్గులు కారణముగా ప్రకృతి ద్వారా మహతత్త్వము ఉత్పన్నమవుతుంది. దానియందున్న అహంకారమే మోహమునకు, వైవిధ్యముతో కూడిన భేదభావమునకు కారణమవుతుంది. ఈ అహంకారము సాత్విక, రాజసిక, తామసికమను మూడు విధాలుగా వుంటుంది. అందువలన జనులు ఈశ్వరుని ఉనికిని శంకిస్తూ వుంటారు. వారు మిథ్యయని మరియు సత్యము మనివాద వివాదము చేస్తూ బుద్ధియందు భేదములను ఉత్పన్నము చేసే అహంకారం కారణముగా ఆత్మ తత్త్వము తెలుసుకోలేరు. ఇటువంటివారికి, వారి అజ్ఞానము వల్లనే భేదములు కనిపిస్తాయి. ఎప్పటివరకు మానవుడు భగవానునిపట్ల విముఖతతో వుంటాడో అప్పటివరకు ఈ అహంకారముతో కూడిన భేదములు నివృత్తికావు.

గుణములద్వారా కర్మ ఉత్పన్నమవుతుంది. గుణముల సమతుల్యస్థితి యందు హెచ్చుతగ్గులు కారణముగా త్రిగుణములు ఏర్పడుతాయి. జీవాత్మ సత్వాది గుణములతో కలిసి కర్మఫలములను భోగిస్తుంది. ఎప్పటివరకు త్రిగుణములందు విషమత్వము ఉంటుందో అప్పటివరకు ఈ ప్రపంచములో భేదభావములు ఉంటాయి. భేదభావములు ఉన్నంత వరకు జీవాత్మ పరాధీనముగా ఉంటుంది. అప్పుడు జీవాత్మకు ఈశ్వరునిపట్ల భయము ఉంటుంది. అందువలన జనులు స్వర్గాది కామనలతో వైదిక కర్మలను ఉపాసిస్తారు. దుఃఖములతో మోహగ్రస్థులై, జననమరణ చక్రములో తిరుగాడుతూ వుంటారు.

**సాంఖ్యయోగము - సృష్టిక్రమము :** ఋషులచే చెప్పబడిన సాంఖ్యయోగ జ్ఞానము వలన భేదభావములతో కూడిన భ్రమలు వెంటనే తొలగిపోతాయి. సత్యయుగ ప్రారంభములో మానవులందరు వివేక విజ్ఞానములను కలిగి ఉన్నారు. ఆసమయములో వారు ద్రష్ట మరియు దృశ్యముల భేదము లేకుండా నిర్వికల్ప సత్యస్వరూపమైన బ్రహ్మ స్వరూపమును గురించి తెలుసుకొనివున్నారు. ఆ బ్రహ్మము మనో వాక్కులకు అతీతముగా వికల్ప రహితంగా వుండి సత్యస్వరూపుడై వుంటాడు. అతడు మాయ మరియు జ్ఞాన రూపమను రెండు తత్వములుగా రూపాంతరము చెందాడు. వాటిలో మొదటి తత్వమును ప్రకృతి అని, రెండవ తత్వమును జ్ఞానము లేక పురుషుడని కూడా అంటారు. పురుషుని ద్వారా వెలువడిన ఈ ప్రకృతి నుండి సత్వ, రజ, తమోగుణములను మూడుగుణములు ప్రభవించాయి. ఈ మూడు గుణముల నుండి మహత్తత్వము ఉద్భవించింది. ఆ మహత్తత్వములోని మార్పులతో మోహితులైన జీవులలో అహంకారము ఉత్పన్నమవుతుంది. ఆ అహంకారములో, వైకారిక, తైజస, తామసమను 3 భేదములు ఉన్నాయి. తామస అహంకార రూప తన్మాత్రల ద్వారా, ఆకాశాది పంచమహాభూతములు రాజసిక అహంకారము నుండి కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు సాత్విక అహంకారము నుండి ఇంద్రియాధిష్ఠాన దేవతలు పదకొండు మంది ఉత్పన్నమయినారు.

భగవానుని ప్రేరణవలన ఈ కారణములన్నియు పరస్పరము ఒకదానితో ఒకటి మిళితమయినాయి. వాటికలయిక చేతనే ఈ సుందర బ్రహ్మాండము నిర్మించబడినది. ఈ అనంత బ్రహ్మాండపు అఖండ జలరాశి యందు పరమాత్మ విరాజమానమై వుంటాడు. ఆయన నాభి నుండి విశ్వమను కమలము ఉద్భవించినది. ఆకమలములో విశ్వాత్మ అయిన బ్రహ్మదేవుడు ఉత్పన్నమై, పరమాత్మయొక్క అనుగ్రహముతో



లోకములను సృష్టించాడు. ఈ ప్రపంచములో ఉత్పన్నమయ్యే చిన్న, పెద్ద, లావు, సన్నమను ఎటువంటి పదార్థమైన ప్రకృతి, పురుషుల సంయోగముతోనే ఏర్పడుతుంది.

ఒకవస్తువుయొక్క ఆది అంతములలో ఏ పదార్థమైతే ఉంటుందో అదే పదార్థము మధ్యలో కూడా ఉంటుంది. అదియే సత్యము. అందులోని మార్పులు కేవలము వ్యవహారికముగానే జరుగుతూ వుంటాయి. ఈ జగత్తునకు ఉపాదాన కారణము ప్రకృతిగా, ఆధారము పరమ పురుషుడైన పరమాత్మగా వుండి ఈ దృశ్యమాన ప్రపంచము కాలరూపముగా అభివ్యక్తీకరించబడినది. అందువలన ఈ జగత్తుకు మూలకారణము పరమాత్మ అయివున్నాడు.

ఈశ్వరుని కృపాదృష్టి వున్నంతవరకు, జీవుల భోగార్థము సృష్టి ప్రారంభము నుండి అంత్యమువరకు క్రమముగా ప్రవాహరూపములో ముందునకు పోతూ వుంటుంది. సమయానుకూలముగా ఉత్పన్నమయి నశించిపోయే ఈ విరాట్‌రూప ప్రపంచము ప్రళయకాలములో చతుర్దశ భువనములతో పాటు పంచతత్వములలో లీనమయిపోతుంది.

**లయక్రమము :** శరీరము అన్నములో లయమగును; అన్నము బీజములో, బీజము పృధ్వియందు, పృధ్వి గంధములో, గంధము జలములో లయమగును. జలము తన గుణమైన రసమునందు, రసము అగ్నిలో, అగ్ని రూపములో లయమగును. రూపము వాయువునందు, వాయువు స్పర్శయందు, స్పర్శ ఆకాశమందు, ఆకాశము శబ్ద తన్మాత్రలయందు లయమగును. ఇంద్రియములు రాజస అహంకారము నందు లయమగును.

రాజస అహంకారము తనయజమాని అయిన మనస్సునెడి సాత్విక అహంకారములో లయమగును. శబ్దాదితన్మాత్రలు పంచభూతముల కారణముగా తామస అహంకారములో లీనమవుతాయి. వీటన్నిటియొక్క ప్రభువైన అహంకారము మహత్తత్వములో లీనమవుతుంది. ఈ మహత్తత్వము తనయొక్క సత్వాది గుణములయందు లీనమవుతుంది. ఈ త్రిగుణములు అవ్యక్త ప్రకృతి యందు, ప్రకృతి అవినాశి అయిన కాలమునందు లీనమగును. జీవుడు పరమాత్మలో లయమగును. పరమాత్మ వికల్పరహితముగా ఆత్మస్వరూపములో నిలిచి వుంటాడు.

ఈ జగత్తు ప్రారంభమునుండి అంతము వరకు ఒకేతత్వము వ్యాపించి వున్నది. దీనినంతయునూ దర్శించే పురుషునిలో వికల్పరూపమైన భ్రమలు ఎలా కలుగుతాయి.

ఈ సాంఖ్య యోగజ్ఞానమును పొందినవారికి అనగా సృష్టియొక్క కారణము నుండి కార్యమువరకు ప్రసవక్రమమును మరియు కార్యము నుండి కారణము వరకుగల లయక్రమమును తెలుసుకొన్న వారి సంశయములన్నీ తొలగిపోతాయి.

**మనస్సుయొక్క గతి విధులు త్రిగుణముల అధీనములో వుంటాయి :** జీవుని మనస్సు త్రిగుణములలో ఏగుణముయొక్క అధీనములో వుంటే ఆ గుణమునకు సంబంధించిన భావముల ఆధిక్యత ఉంటుంది. ఆగుణములకు లోబడి జీవుడు చేసిన కర్మల ఫలము మనస్సులోని గుణయుక్త భావనల ద్వారా కలుగుతుంది. పంచభూతములను ధారణచేసే మనస్సు అధ్యాత్మగా, సంకల్పమును అధిభూతముగా, చంద్రుడిని అధిదైవముగా చెప్పారు. ఈ మూడు ఒకదానిపై ఒకటి ఆధారపడినట్లు కనిపించినా, పరమాత్మ ప్రకృతికంటె వేరుగా ఉంటాడు. పరమాత్మ అధీనములో ప్రకృతి, ప్రకృతి అధీనములో త్రిగుణములు వుంటాయి. త్రిగుణముల అధీనములో మనస్సు, మనస్సుయొక్క అధీనములో చరాచర జగత్తునకు సంబంధించిన విషయములుంటాయి. కాని మనస్సు తన ఆధిక్యతను తెలుసుకొనలేదు. అందువలన త్రిగుణములను ఆశ్రయించి, వాటి సమక్షములో సుఖ దుఃఖములను భోగిస్తుంది. వాస్తవముగా మనస్సు త్రిగుణములకు, విషయములకు యజమాని అయివున్నది.

**త్రిగుణముల స్వభావము :** జీవుల మనస్సు సత్వగుణమును ఆశ్రయించినపుడు వారిలో శమ, దమ, తితిక్ష, వివేక, వైరాగ్య, తప, దయ, సత్య, సంతోష, మేధ, బుద్ధి, క్షమ, శ్రద్ధ, లజ్జ, జ్ఞాన ఆస్తికత, నిస్పృహ, వినయ మరియు గర్వరహిత ధర్మ భావములు ఉత్పన్నమయి పరమానంద ప్రాప్తి కలుగుతుంది.

జీవుల మనస్సు రజోగుణముతో కూడి వున్నప్పుడు కోర్కెలుద్భవించి వాటియందు ఆసక్తి పెరుగుతుంది. తృష్ణ, సుఖలాలస, దంభము, కాముకత్వము, అసత్యభాషణము, అధైర్యము, అమిత ఆనందము, దేశభ్రమణము, భేదబుద్ధి, విషయతృష్ణ, మదముతో కూడిన ఉత్సాహము వంటి ప్రవృత్తులు వారిలో కలుగుతాయి.

మనస్సు తమోగుణ యుక్తముగా ఉన్నప్పుడు జీవులలో నాస్తికత, వాదవివాదములు, చెడు సంకల్పములు, భయము, నిందిత కర్మలయందు ఆసక్తి, అజ్ఞానము, అతిక్రోధము మొదలైన దోషములు ప్రకటింపబడుతాయి. వీటికారణముగా జీవునిలో లోభము, హింస, యాచన, కలహము, శోకము, మోహము, క్లేశము, దీనత్వం, దరిద్రత, అకర్మణ్యత్వం, సోమరితనము ప్రాప్తిస్తాయి.



ఈ త్రిగుణముల యొక్క వృత్తులద్వారా ఏర్పడే కర్మలయొక్క మూడు విధములైన ఫలములను మరియు పరస్పరము కలిసియున్న గుణములను గురించిన జ్ఞానము తెలుసుకొనుట ద్వారా భగవత్ ప్రాప్తిమార్గము సాధకునికి సుగమము అవుతుంది. తద్వారా సాధకుడు తన మనః ప్రాణముల గతి విధానములను సహజముగా మార్చుకొనగలడు. ఈ జ్ఞానము లేకుండా సాధకుడు తన మనస్సుపై ఆధిపత్యమును సంపాదించుకొనలేడు. అందువలన వీటిని గురించి తెలుసుకొనుట అత్యావశ్యకము.

నేను నాది వంటి భావనలో త్రిగుణములు కలిసి వుంటాయి. శబ్దాది విషయములు, ఇంద్రియ, ప్రాణములద్వారా జరుపబడే క్రియాకర్మములన్నియు ఈ త్రిగుణముల కలయికతో జరుగుతాయి. సాధకుడు ధర్మ, అర్థ, కామ, మోక్షములను శ్రద్ధగా అనుసరించ గలిగినపుడు, ఈ త్రిగుణములు అంతర్లీనముగా పనిచేస్తున్నట్లుగా అర్థము చేసుకోవాలి. వీటిద్వారా సాధకునికి, శ్రద్ధ మరియు ధనాదులు ప్రాప్తిస్తాయి. సాధకుడు స్వధర్మానుసారము నిత్యనైమిత్తిక కర్మల అనుష్ఠానము చేస్తూ వున్నప్పుడు, కామ్యకర్మలందు, గృహస్థ ధర్మమునందు ఆసక్తి కనపరచినపుడు ఈ త్రిగుణముల కలయిక ద్వారానే అటువంటి ప్రవృత్తి కలుగుతుందని అర్థము చేసుకోవాలి.

గుణముల ఆధిక్యత చేత జీవునిలో ప్రవృత్తి, నివృత్తి ఏర్పడుతాయి. పైన చెప్పిన గుణముల లక్షణములద్వారా సాత్విక పురుషుడు శమ, దమాది గుణములు కలిగి వుంటాడని, రాజసిక పురుషుడు కామాది కోరికలను కలిగి వుంటాడని, తమోగుణముగల మానవుడు క్రోధగుణమును కలిగి వుంటాడని మనకు అర్థమవుతుంది. స్త్రీ అయినా పురుషుడు అయినా ప్రతిఫలాపేక్ష లేకుండా, నిష్కామంగా భగవంతుని కీర్తించినపుడు వారిని సత్వగుణ సంపన్నులుగా పరిగణించాలి. వారే ఏదైనా కోరికలతో ప్రార్థించితే వాడిని రజోగుణ సంపన్నులుగా భావించాలి. జీవులను బలి ఇచ్చుటద్వారా భగవంతుని పూజించే వారిని తమోగుణ సంపన్నులుగా అర్థము చేసుకోవాలి.

**కాలము - సమయము :** ప్రకాశవంతమైన, స్వచ్ఛమైన, శాంత మరియు కల్యాణ కారకమైన సత్వగుణము మిగిలిన రెండు గుణములను అణచి ఆధిక్యత చూపుతున్నప్పుడు సాధకునికి సుఖము మరియు ధర్మ, జ్ఞానాదులు ప్రాప్తిస్తాయి. రజోగుణము వలన ఆసక్తి, భేదబుద్ధి, ప్రవృత్తి పెరిగి సత్వ మరియు తమోగుణములు అణచి పెట్టబడుతాయి. అలాగుననే అజ్ఞాన ఆవరణ దోషముగల జడస్వరూప

**1. వేదాంతమార్గము :** ఈ వేదాంత మార్గము అన్నింటికంటే ముందుగా వచ్చినది. వైదికమైనది. ఈ వేదాంత మార్గము. ఈ మార్గములో, వివేక, వైరాగ్య శమాదిషట్ సంపత్తి మరియు ముముక్షత్వము జ్ఞానమార్గ సాధనములుగా నున్నవి ఈ సాధనలు చేయుటవలన మానవులు తత్వజ్ఞానమునకు అధికారి అవుతారు వేదాంతములో చెప్పిన సాధనా చతుష్టయమును పొందకుండా ఎవరు బ్రహ్మజ్ఞానమును పొందలేరు. ఏదైన దూర ప్రయాణముచేసే బాటసారి తనతోపాటు ఆవశ్యకత ననుసరించి ధనము తీసుకొనివెళ్ళే విధముగా ఆధ్యాత్మిక పథములో ప్రయాణించే సాధకునికి కూడా ఈ సాధనా చతుష్టయ సంపత్తి అత్యవసరము. వివేక, వైరాగ్య, శమాది షట్ సంపత్తితోపాటు శ్రవణ, మనన, నిధి ధ్యాసలతో చిత్తశుద్ధి జరిగి జ్ఞానము కలుగుతుందని వేదాంతము చెపుతున్నది. జ్ఞానము ద్వారానే మోక్షము కలుగుతుంది. జ్ఞానలాభము లేకుండా ఎవరూ ఈశ్వరుని ప్రాప్తించుకోలేరని వేదాంతముయొక్క సిద్ధాంతము అయివున్నది. వేదాంత మార్గములో వేదములు, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, శంకరాచార్యులవారు రచించిన గ్రంథములు, యోగవాసిష్ఠము వంటి అనేక గ్రంథములు కలవు.

**2. యోగమార్గము :** రెండవ మార్గము యోగమార్గము. దీనిలో సాధన పద్ధతి అష్టాంగయోగము అయివున్నది. యోగశాస్త్రము మహా విజ్ఞానమయివున్నది. యోగశాస్త్రము యొక్క ఆదిగురువు పరమేశ్వరుడే అయివున్నాడు. యోగవిద్యను అనుసరించిన సిద్ధులలో కపిలముని ప్రసిద్ధులు. వారు ప్రవచించిన సాంఖ్యదర్శనము, పతంజలి మునిచే ప్రవచింపబడిన యోగదర్శనముకంటే గొప్పదని జనులు తలుస్తారు. యోగసాధన చేయుట అందరికర్తవ్యము మరియు ఆచరించవలసిన విషయము.

**3. మంత్రమార్గము :** ప్రస్తుతము భారతదేశంలో ఈ విధమైన స్వతంత్ర సాంప్రదాయము కనిపించదు. కానీ అన్ని సాంప్రదాయములవారు ఈ మంత్ర మార్గమును ఒప్పుకుంటారు. జనులు మంత్రమార్గ విద్యను ఆచరించినట్లుగా యోగమార్గమును, వేదాంతమును ఆచరించుటలేదు. కారణమేమంటే యోగములో, వేదాంతములో భోగములను త్యజించవలెనని చెప్పివున్నారు. చాలామంది జనులకు భోగములను త్యజించుట ఇష్టం ఉండదు. వారికి ముక్తిని పొందాలను కోరిక కూడా ఉండదు. వారు కోరికలతో మంత్రానుష్ఠానము చేసి కార్యసిద్ధిని పొందాలను కొంటారు. వీరికి ముక్తిని పొందాలనుకోరిక వుండదు.



**4. తంత్ర మార్గము :** ఒకానొక సమయములో భారతదేశంలో ఈ సాంప్రదాయము బహుళ వ్యాప్తిలో ఉన్నది. ప్రస్తుత కాలములో ఇది కనుమరుగవుతున్నది. ఈ మార్గ అనుయాయులు శివశక్తి రూపములలో ఈశ్వరుని ఉపాసన చేస్తారు. వీరి సాధనా గ్రంథములు తంత్ర గ్రంథములు. యోగ సంబంధమైన జ్ఞానము ప్రత్యేకముగా ఈ గ్రంథములలోనే లభించును. మంత్రములన్నియూ తంత్ర గ్రంథములలో లభించును. మంత్ర అధిష్ఠాన దేవతల సిద్ధి మరియు వారిని పూజించు విధానము ఈ తంత్ర శాస్త్రములలో విస్తారంగా చెప్పియున్నారు. తంత్ర గ్రంథములలో మూడు విధానములు చెప్పబడినవి. వీటిలో మొదటి మార్గములోనికి జీవహింస మొదలైన తామసిక కర్మల ద్వారా ఉపాసన చేసే వ్యక్తులు వస్తారు. వారిని వామాచార పరాయణులు అంటారు. రెండవ మరియు మూడవ మార్గము పాటించే వీరాచార మరియు దివ్యాచార ఉపాసకుల యొక్క మంత్రశక్తి, కార్యదీక్ష, యోగజ్ఞానము అత్యంత ప్రశంశాయోగ్యము. తంత్రములలో చెప్పబడిన మార్గములను అనుష్ఠించుట వలన ఫలితము అతిశీఘ్రముగా నెరవేరును. అందువలన తంత్రశాస్త్రము నిగూఢము మరియు రహస్యమైనది.

**5. భక్తిమార్గము :** ఐదవ మార్గము భక్తిమార్గము. ప్రస్తుత కాలములో ఈ సంప్రదాయమును అనుసరించే జనులు మూర్తి పూజ చేస్తున్నారు. వారు ద్వైత భావములో భక్తిమార్గమును అనుసరిస్తారు. తమను దాసునిగా, భగవంతుని ప్రభువుగా తలచి పూజలు చేస్తారు. వేదాంతమును, యోగశాస్త్ర విజ్ఞానమును వీరు అనుసరించాలని అనుకోరు. యోగ వేదాంత మార్గములు అద్వైతము గూర్చి చెప్పుటయే దీనికి కారణము.

**జ్ఞాన, యోగ, భక్తి మార్గముల ఏకత్వము :** జ్ఞానము, యోగము, భక్తి ఈ మూడు మార్గముల ద్వారా భగవానుని పొందవచ్చును.ఎక్కడ జ్ఞానముంటుందో అక్కడ యోగం ఉంటుంది. అక్కడే భక్తి ఉంటుంది. జ్ఞానమనగా తెలుసుకొనుట, యోగమనగా చిత్తవృత్తుల్ని నిరోధించుట. భగవానుని యందు పరానురక్తిని పొందుటయే పరాభక్తి. జ్ఞానము ద్వారా తెలుసుకొని యోగము ద్వారా భగవానుని కలుసుకొనినపుడు మాత్రమే సాధకుడు పరాభక్తి పొందగలడు. అనగా యోగ, జ్ఞాన, భక్తి మార్గములు ఒకదానితో ఒకటి అవినాభావ సంబంధమును కలిగివున్నవి.

సాధన చేయకుండా ధర్మప్రచారం లేక పరోపకారము మిషతో ఉపదేశకుడిగా లేక ఏదో ఒక సాంప్రదాయము స్థాపించుట ద్వారా మేలుకలుగదు. సాధకుడు

ఆత్మతత్వానుభవమును పొందవలెను. తర్వాత భగవంతుని ఇచ్ఛానుసారం తనద్వారా జనులకు మేలు కలుగవలసివుంటే అతడుపదేశకుడు కాగలడు. సాధకుని అస్తిత్వము ఉన్నా లేకపోయినా ఈ ప్రపంచములో పెరిగేదిగానీ, తరిగేదిగాని- ఏమీ ఉండదు.

**సిద్ధిప్రద మార్గము :** జీవులందరూ సుఖదుఃఖములను మాయాజాలములో బంధింపబడివున్నారు. మనుషులకు సర్వసిద్ధిప్రదము, మాయాజాలము నుండి విముక్తిని కలిగించెడి మార్గము యోగమార్గము అయివున్నది.

కైవల్యరూప పరమపదము యోగము లేకుండా ఇతర మార్గముల ద్వారా ప్రాప్తించదు. మనసును వశపరచుకొనుట అంత సులభముకాదు. మనసు ప్రాణము యొక్క అధీనమున ఉన్నది. ప్రాణాయామము చేసి ప్రాణమును వశపరచుకొనకుండా మనస్సును జయించే మార్గమే లేదు. మానవునకు అసాధ్యమైన కార్యము ఏదీలేదు, కానీ మనస్సును క్షణమాత్రము నిల్పియుంచుట చాలా కష్టము. అందువలన మనో నిగ్రహమునకు యోగమార్గమే ఏకైక ఉపాయమైవున్నది.

**జ్ఞానము కొరకు శరీర దృఢత్వం అవసరము :** మనస్సును వశపర్చుకొనుటకు ముందు శరీరమును వశపర్చుకొనుట ముఖ్యమైయున్నది. వశమైన శరీరముతో సాధనలు చేయుట వలన చిత్త విక్షేపములు తొలగి ఇంద్రియ జయము కలిగి ఆత్మలాభము కలుగును. శరీరముపై అదుపులేని సాధకుడు స్వప్నములో కూడా భగవంతుని దర్శించలేడు. వశముకాని శరీరము ఆత్మజ్ఞానము పొందుటకు ముందుగానే వ్యాధిగ్రస్థమై నష్టమై పోతుంది.

**మహాయోగము :** కొందరు హఠయోగ, మంత్రయోగ, లయయోగ మరియు రాజయోగములు వేరువేరని తలుస్తారు. కాని అది నిజముకాదు. కుండలిని జాగరణ ద్వారా ఈ నాలుగు యోగములు స్వతః సిద్ధముగా కలుగుతాయి. అందువలనే దీనిని మహాయోగము అంటారు.

మార్గము ఎంత సులభముగా యున్నప్పటికీ సాధకునికి భగవానుని పట్ల వ్యాకులత లేకుంటే వారికి భగవత్ ప్రాప్తి కలుగదు. తపస్సే భగవానుని పొందుటకు ముఖ్యసాధనము. మనోజయమే తపస్సు అయివున్నది.

సాధకులు ప్రాణమును అపానములో హోమము చేయటము ద్వారా అనగా ప్రాణ, అపానముల గతిని నిరోధించి ప్రాణాయామ పరాయణులు కావలసి యుంటుంది. తపమే భగవంతుని పొందుటకు ముఖ్యసాధనము అయివున్నది.



ప్రాణాయామమును మించిన ఇతర తపములు ఏమియులేవు. ప్రాణాయామము ద్వారా రాగద్వేషములు నివృత్తి చెంది జ్ఞానప్రకాశము కలుగుతుంది.

**ప్రాణయజ్ఞము :** యజ్ఞములన్నింటియందు ప్రాణయజ్ఞము గొప్పది. సాధకునికి అత్యంత ప్రియమైన ప్రాణమును బ్రహ్మాగ్ని యందు ఆహుతులుగా సమర్పించుటచే సమస్త కార్యములు నెరవేరుతాయి. ప్రాణయజ్ఞ అనుష్ఠానమునకు ధనవ్యయము గాని, సమయమును వెచ్చించవలసిన పనిగానిలేదు. ఈ యజ్ఞమును ప్రాతఃకాలము బ్రహ్మముహూర్తము నందు ఆరంభించవలసి వుంటుంది. ఎందుకంటే అప్పుడు సాధకునికి చేయవలసిన పనులేవీ ఉండవు. రాత్రికాలము ప్రాణుల విశ్రాంతి కొరకు ఏర్పరచబడినది. అందువలన ప్రాతఃకాలము మూడు జాముల కాలముగాని కనీసము ఒక జాము కాలముగాని సాధకులు ఈ ప్రాణయజ్ఞము చేయవలసి వుంటుంది. సాధకుడు ధర్మ, అర్థ, కామ, మోక్షముల కొరకు చింతించ వలసిన పనిలేదు. ఏమనుజుడు ధైర్యముతో, కర్తవ్య పరాయణుడై ప్రాణయజ్ఞము చేస్తాడో అతడికి స్వర్గద్వారములు తెరువబడుతాయి. అతడి మానసిక ఔన్నత్యము దేవతలనందరిని ప్రసన్నులుగా చేస్తుంది. అతడి సత్య సంకల్పమను ఆహుతులతో పితృదేవతలు సంతృప్తి చెంది ఆశీర్వదిస్తారు. అతడి యోగక్షేమములను భగవానుడే వహిస్తాడు. భగవానుని కొరకు ప్రాణములను ఇవ్వగలవాడు భగవానునికి అత్యంత ప్రియమైనవాడు. ఎప్పటివరకు సాధకుడు భగవానునికి ప్రాణములను అర్పణచేయడో అప్పటివరకు భగవానుడు ప్రసన్నుడుకాడు. అందువలన సాధకులందరు ప్రాణ యజ్ఞమును ప్రారంభించాలి. ఎందుకంటే ప్రాణము భగవానుని ఛాయారూపమై వున్నది. మనస్సు పరమాత్మకు చాలా దూరములో ఉంటుంది కాని ప్రాణము భగవానునితో కూడి వుంటుంది. సాధకుని ప్రాణమునకు దెబ్బ తగిలినప్పుడు భగవానుడు విచలితుడు అవుతాడు.

ఈ ప్రాణమే విశ్వములోని ప్రాణుల జీవనమై వున్నది. దీనిద్వారా జనులు, ఆయువు, బలము, తేజమును పొందుతున్నారు. ప్రాణముయొక్క తరుగుదల ద్వారా జనులు రోగులుగా, దరిద్రులుగా మారుతున్నారు. ప్రాణయజ్ఞము ద్వారా సాధక జనులు శతాయుష్షును పొంది రోగవిముక్తులై, నిర్భయముగా, నిశ్చింతగా వుండగలరు. యోగసాధన చేసినట్లయితే జనుల సమస్త కార్యములు సహజముగా నెరవేరుతాయి. కొద్ది సమయములోనే సాధకునికి ఈ ప్రపంచమంతయు తిరోధానము

చెందుచున్నట్లుగా కనిపించి సాధకుని అంతరములో దివ్యజ్యోతి ప్రకాశము
అంధకారము తొలగిపోతుంది.

సాధకుడు ప్రాణముయొక్క ప్రథమ ఆహుతి అయిన పూరకమును చేస్తున్న మనస్సును మూలాధారమునందు లగ్నము చేయాలి. సాధకుడు రెండవ ఆహు కుంభకమును చేసి అక్కడే నిలచినపుడు నాభిస్థానమువద్ద గల విష్ణుగ్రంథియందు విష్ణుభగవానుని దర్శనము కొరకు యోగమాత అయిన కుండలినీదే సాక్షాత్కరింపజేసుకొనవలసి వుంటుంది. ఆశక్తి సాధకునికి గొప్ప సహాయ చేయును. ఆశక్తి సహాయముతో సాధకుడు భగవానుని నిర్గుణ స్వరూపము దర్శించగలడు. అప్పుడు భగవానుడైన మహావిష్ణువుయొక్క సర్వవ్యాప అనుభవమునకు వచ్చి, ఈశరీరరూప బ్రహ్మాండములో నడుపబడు సమస్త కార్యము అనుభవములోనికి వస్తాయి.

సాధకుని ప్రథమ ఆహుతి (పూరకము) తో అతడి శరీరమను బ్రహ్మాండ (సహస్రారము)నకు మార్గము సుగమమగుట ప్రారంభమవుతుంది. రెండవ ఆహు (కుంభకము) ద్వారా బ్రహ్మాగ్ని ప్రజ్వలితమవుతుంది. దానివలన అంతరమున పు జ్యోతిమేల్కొని ప్రయాగతీర్థమున ప్రవేశిస్తుంది. తరువాత మూడవ ఆహుతి అయి రేచకము ద్వారా సర్వపాపరాశి దగ్ధమవుతుంది. తద్వారా పితృదేవత ప్రసన్నులవుతారు. ఓంకారరూప మహామంత్రమును జపిస్తూ, వరుసగా ఆహుతుల ప్రయాగ తీర్థములోని అధిష్ఠాన దేవత అయిన మాధవునికి అనగా ప్రత్యగాత్మ సమర్పించి నమస్కరిస్తూ వున్నప్పుడు సాధకునికి ప్రాయశ్చిత్తము కలిగి దివ్యనేత్రమ తెరుచుకొంటుంది. సరస్వతీదేవి ఆ సాధకుని కంఠమందు నివాసముంటుంది సాధకుడు పూర్ణశాంతిని పొందగలడు.

ఈ స్థితిలో కుండలినీదేవి సాధకునికి అంతా తెలియపరుస్తుంది. అప్పటినుండి సాధకునికి తనకుతానుగా ఆహుతులనివ్వవలసిన పనిలేదు. ప్రతిదినము ఉదయము సాయంత్రము సాధకుడు కండ్లు మూసుకొని కూర్చుంటే చాలు. కొద్ది సమయములో సాధకుని జ్ఞాన ధ్యానములలో మార్పు కనిపిస్తుంది. ఇహలోక సంబంధ విషయములను సాధకుడు ఇష్టపడడు. అంతరాత్మకు సంబంధించిన విషయములను ఇక్కడనున్న వారికి వినిపించితే జనులు అతడిని పిచ్చివాడిగా తలుస్తారు. ఆ విధముగా ప్రతిరోజు, సాధకులుచేసే ధ్యాన, జ్ఞానములలో మార్పు కనబడుతుంది. సాధకుడు



వివేక, వైరాగ్య సంపన్నుడవుతాడు. అతడికి లౌకిక విషయములేవీ రుచించవు. యోగమాయ యొక్క చక్రము అతడిని నిరంతరము త్రిప్పుతూ వుంటుంది. అతడు స్థిరముగా వుండలేడు. ప్రపంచమంతయు కదలుతూ, తిరుగుతున్నట్లుగా వుంటుంది. స్థిరత్వము సాధకునికి ఎక్కడా లభించదు. ఈ ప్రపంచములో ఏ పదార్థము స్థిరముగా వుండదను అభిప్రాయము ఈ యజ్ఞము ద్వారా కళ్ళకు కట్టినట్లు తెలుస్తుంది. శాస్త్రములలో జగత్తు చంచలము, అస్థిరమైనదిగా చెప్పబడినది. సాధకుడు చూచే స్వప్నములు అన్నీ అంతర్ జగత్తుకు సంబంధించినవిగా ఉంటాయి. అక్కడ చూచిన విషయములు సాధకుడు ఎక్కడా చూచి ఉండడు, విని యుండడు. ఇటువంటి ఘటనలు స్వప్నములో కాకుండా సాధకుడు కండ్లుమూసినప్పుడు కూడా కనబడుతాయి. సాధకునికి అది స్వప్నమా లేక జగత్తులోని విషయమా అను సందేహము కలుగుతుంది. సంసారికులకు తమ సర్వస్వమును సమర్పణచేసినా అటువంటి స్థితి లభించదు. కాని సాధకుడు సహజముగా ఆ స్థితిని పొందగలడు. ఈ ప్రకారముగా సాధకుని పాప పుణ్యములన్నియు నశించిపోయాయని అనుభవమునకు వచ్చినప్పుడు అతనికి భగవత్‌ప్రాప్తి కలుగుతుంది.

ప్రయాగలో ప్రాయశ్చిత్తము చేసిన తరువాత సాధకునిలో సత్వగుణము స్థిరపడుతుంది. "సత్వాత్ సంజాయతే జ్ఞానః" అనుశాస్త్రవాక్యము యొక్క అర్థము స్పష్టమవుతూ అతనికి ఆనందము వృద్ధి పొందుతూ ఉంటుంది. ఈ స్థితులన్నీ గురువుద్వారా దీక్షను గ్రహించి ప్రాణయజ్ఞమును ప్రారంభించిన వానికి మాత్రమే కలుగుతాయి. ఎవరిపై గురుకృప కలుగుతుందో వారికి మాత్రమే ప్రథమ ఆహూతి నుండి పైవిషయములన్నీ అనుభవములోకివస్తాయి. ఇందులో ఎటువంటి సందేహములేదు.

**గురువుయొక్క ఆవశ్యకత :** సాధకుడు శాస్త్రములో చెప్పిన విధివిధానములను పాటించవలసి ఉన్నది. ఎందుకంటే శాస్త్రములు భగవత్ ప్రాప్తికి మార్గదర్శనము చేస్తాయి. వాటిలో చెప్పిన విధముగా గురువు ఆచరించవలసి ఉంటుంది. జీవులు అనాదికాలము నుండి అవిద్యను కలిగియున్నారు. అందువలన వారు స్వప్రయత్నముతో ఆత్మజ్ఞానమును పొందలేరు. వారికి ఆత్మజ్ఞానమును కలిగించుటకు తత్వజ్ఞానమును కలిగించుటకు తత్వజ్ఞానియైన గురువు యొక్క ఆవశ్యకత ఉన్నది.

రామావతారములో భగవానుడు వశిష్ఠమునివద్ద ఉపదేశము తీసుకున్నాడు. వారు చేసిన శక్తిపాతముద్వారా శ్రీరాముడు సమాధిస్థితిని పొంది బ్రహ్మజ్ఞానమును

పొందాడు. భగవంతుడే శ్రీకృష్ణునిగా అంగీరస ఋషినుండి ఉపదేశము గ్రహి శాంతిని పొందాడు. గురుముఖతః గ్రహించిన విద్యయే ఫలిస్తుంది. తద్వా శాస్త్రములకు మరియు గురుపరంపరకూ రక్షణ లభిస్తుంది. భగవాను జ్ఞానోపదేశము ఎవరూ చేయలేరు. కాని లౌకిక వ్యవహారానుసారము జనులందరి భగవానుడు కూడా ప్రవర్తిస్తాడు. వేదములలో చెప్పబడిన యజ్ఞములన్నియు గురు లేకుండా అనుష్ఠించాలంటే కొన్ని సంవత్సరాలు పడతాయి. కాని పైన చెప్పబడి లక్షణములుగల గురువుద్వారా వాటి ఫలితము సత్వరమే సిద్ధిస్తుంది. ఎవరి ఇటువంటి గురువు లభించదో వారు చింతించకుండా పైన చెప్పిన సాధనల ప్రారంభించాలి. మొదట కష్టములు సంభవించినా, ఆహూతులనిస్తూ వున్నప్పు వారికి కూడా తగిన సమయమున సహాయము లభిస్తుంది.

**ప్రాణాయామ విధివిధానములు :** ఏ యజ్ఞము గురించి పైన చెప్పబడిన ఆయజ్ఞమును అర్థముచేసుకొనుట తేలికైన విషయమే. కాని దాని అనుష్ఠాన కష్టసాధ్యముగా వుంటుంది. అది అత్యంత గొప్పదైన ఆత్మజ్ఞానమును ప్రసాదిస్తుం ఈ ప్రాణయజ్ఞమును బాగా ఆకళింపు చేసుకొని సరైన పద్ధతిలో చేస్తే భగవత్ప్రా వెంటనే లభిస్తుంది. సాధకుడు తన అనుకూలతననుసరించి స్థానమును సమయమును నిర్ణయించుకోవాలి. ఈ యజ్ఞ అనుష్ఠానమునకు శు శుద్ధనియమములనేవి పాటించ నక్కరలేదు. సాధకుడు పవిత్రముగా, ప్రసన్నముగా రాగద్వేషరహితునిగా ఉండి, ప్రాతఃకాలమునందు, సాయంకాలమునందు య అనుష్ఠానము చేస్తూ ఉండాలి. ఇంటిలో చేసేటట్లుగా ఉంటే ఇంటిలో ఏదైనా ఏకాం ప్రదేశమును ఎన్నుకోవాలి. తూర్పు దిక్కునకు అభిముఖముగా ఆసనము వేసుకోవా సాధకుడు సిద్ధాసనము లేక పద్మాసనములో కూర్చుండి శాంతచిత్తుడై గురువునకు ఈశ్వరునకు, సిద్ధులకు ప్రణామము చేసి శ్వాస, ప్రశ్వాసలను గమనిస్తూ ఉండాలి ఆ సమయములో సుషుమ్న నడచినట్లయితే మనస్సును ఏకాగ్రపరుచుటకు ఆటంకమేమీ ఉండదు. ఆసనముపై స్థిరపడిన తర్వాత ప్రాణాయామము చేయవలెను పతంజలి మహర్షియొక్క కథా నుసారము శ్వాస, ప్రశ్వాసల గతి నిరోధమే ప్రాణాయామము అయివున్నది. ఆప్రాణాయామము బాహ్య, అంతర, స్తంభవృత్తి అను మూడు విధములుగా ఉండును. అదికూడా దేశ, కాల, సంఖ్యానుసారము దీర్ఘముగాను, సూక్ష్మముగాను ఉంటుంది. రేచకము బాహ్య ప్రాణాయామముగా పూరకము అంతర ప్రాణాయామముగా, కుంభకము స్తంభవృత్తి ప్రాణాయామముగా



చెప్పబడినది. అనగా యథాశక్తి శ్వాసను బాహ్యమున నిరోధించుటను, సాధ్యమయినంతవరకు శ్వాసను లోపలకు లాగుటను, శక్త్యానుసారము శ్వాసను అంతరములో నిరోధించుటను ప్రాణాయామమందురు. పూరక విధానములో ప్రాణము యొక్క హవనము, రేచకము విధానములో అపానముయొక్క హవనము, కుంభకము ద్వారా ప్రాణాపానముల హవనము చేసెడివారిని ప్రాణాయామ పరాయణులని అంటారు. ఈ యజ్ఞమునే భగవానుడు గీతయందు ఉపదేశించాడు.

**ప్రాణాయామ ఫలము :** సాధకుని ప్రాణము అపానముతో కలసి కుంభకస్థితి ప్రాప్తించినపుడు మూలాధారములో మనస్సును కేంద్రీకరించాలి. అక్కడ ఆధారశక్తి అయిన కుండలీ నిద్రించి వుంటుంది. ఈవిధమైన ప్రాణ అపానముల కలయిక వలన ఆ నిద్రాణ స్థితిలోని ఆత్మశక్తి జాగృతమవుతుంది. ఆ శక్తి మేల్కొనుటయే అన్నిసాధనల పరమ ఉద్దేశ్యముగా భావింపబడుతుంది. ఆశక్తి మేల్కొననంతవరకు సాధకుడు తన యజ్ఞమును నియమిత రూపమున కొనసాగించాలి. ఆశక్తి మేల్కొంటే సాధకుడు చేయవలసినదేమీ వుండదు. కుండలినీశక్తి జాగృతమయినపుడు సాధకుడు నిశ్శబ్దముగా ఆసనముపై కూర్చొంటే చాలు ఆశక్తి సాధకునిచే అన్నింటిని చేయిస్తుంది.

ప్రాణయజ్ఞము చేస్తున్నప్పుడు మనస్సు నిలువకపోతే శరీరములోని నాడులలో ప్రవహించుచున్న ప్రాణప్రవాహమును గమనిస్తూ వుండాలి. ఇడ, పింగళ సుషుమ్న అను నాడులు ముఖ్యమైనవిగా చెప్పబడ్డాయి. వాటియందు ప్రవహించుచున్న ప్రాణ ప్రవాహమును గమనిస్తూ వుండాలి. మిగిలిన నాడులలో కూడా ప్రాణము సూక్ష్మరూపములో అవశ్యము వెళుతుంది. కాని మనస్సునకు సూక్ష్మదృష్టిలేని కారణముచేత మనకు ఆ విషయము అనుభవమునకురాదు. మనశరీరములో మూడున్నరలక్షలనాడులు కలవు. ఆకునందు సూక్ష్మముగా, అతిసూక్ష్మముగా ఈనెలు వ్యాపించినట్లు, ఈనాడులు శరీరమంతటా వ్యాపించి వుంటాయి. ఈ మూడున్నర లక్షల నాడులలో 72 వేల నాడులందు మాత్రమే ప్రాణవాయు సంచారముంటుంది. మిగిలిన నాడులలో క్రమబద్ధమైన శరీర వ్యాపారములు లేని కారణముచే ప్రాణము అక్కడికి వెళ్ళలేదు. యోగశాస్త్రములలో చెప్పిన విధముగా నాడీశుద్ధిలేక శరీరశుద్ధి క్రియలుచేసినట్లయితే అన్ని నాడులలో ప్రాణ సంచారము కలుగుతుంది. అప్పుడు యోగాభ్యాసియొక్క శరీరము అతని అదుపులోనికి వస్తుంది. ఆస్థితిలో సాధకుని ఇచ్ఛానుసారమే అతడి ప్రాణము అతడి శరీరమును విడిచి వెళుతుంది. అతడికి

ఇచ్ఛా మరణము ప్రాప్తిస్తుంది. ఈ విధమైన సిద్ధిని పొందిన సాధకునికి భగవత్ ప్రాప్తికి ఎటువంటి ఆటంకములు ఉండవు. ఈ శరీర విజ్ఞానము గురించి యోగశాస్త్రములో విపులముగా వర్ణించబడినది.

శరీరము యొక్క మధ్యభాగమందు నాభిస్థానమున్నది. అక్కడ భగవంతుడు వైశ్వానరాగ్ని రూపములో ఉంటాడు. కుంభక ప్రాణాయామము ద్వారా అక్కడున్న అగ్నిని దర్శించవచ్చును. ప్రాణులలో భగవంతుడే అగ్నిరూపములో నాభిస్థానమందుండి ప్రాణ అపానముల సంయోగము ద్వారా నాల్గు విధములైన ఆహారములను పచనము చేస్తూ వుంటాడు. దేహమధ్యములో జ్వలించు స్వర్ణకాంతుల సదృశముగా త్రికోణ యుక్తమైన అగ్నిస్థానముకలదు. ఇది మనుష్యులలో త్రికోణముగా పశువులయందు చతుష్కోణముగా, పక్షులందు వృత్తాకారముగా ఉండును. కుంభకస్థితిలో సువర్ణకాంతులీనుతూ ఉన్నట్లుగా సాధకుడు దర్శించగలడు.

మూలాధారము అన్ని నాడులయొక్క ఉత్పత్తి స్థానము. అందువలన ఆ స్థానమును మూలాధారము అన్నారు. ఇక్కడ నుండి కొన్నినాడులు పైకి మరికొన్ని నాడులు క్రిందకు వ్యాపిస్తాయి. భగవత్ ప్రాప్తిని పొందాలనుకొనేవారు ఇక్కడకు రావలసి వుంటుంది. ఈదారి మూసివేయబడి వుంటుంది. కాని అంతరములోనికి వెళ్ళే మార్గము ఇక్కడనే వున్నది. ప్రాణము యొక్క సహకారముతో దీనియందు ప్రవేశించగలము. కుంభకము చేసి ప్రాణశక్తిని పెంచినట్లయితే ప్రబలప్రాణ ప్రవాహమువలన ఈ ద్వారము తెరుచుకొంటుంది. దానియందు ప్రాణముతోపాటు మనస్సు కూడా ప్రవేశిస్తుంది. ఇవి మేరు దండములోని సుషుమ్నానాడిలో గల మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, అజ్ఞాచక్రముల ద్వారా సహస్రారమునకు చేరుకుంటాయి. ఈ సహస్రారమే భగవానుని నివాస స్థానము. ఇక్కడకు వచ్చిన మనుష్యుడు ప్రపంచమునకు తిరిగిరాడు. అక్కడకు వెళ్ళే మార్గములో సాధకునకు అనుభవములు కలుగుతాయి. వాటిని లిపి బద్ధము చేయటానికి జీవితమంతా వ్రాసినా సరిపోదు.

ఎక్కడ ఈశ్వరుడు ఉంటాడో అక్కడ సర్వత్రా ఆనందమే ఉంటుంది. సాధకుని మనస్సు ప్రకృతియొక్క సరిహద్దులనుదాటి కొంచెము ముందుకు పోయినపుడు అప్పుడు మొదటగా ఆనందము అనుభవములోనికి వస్తుంది. అనాహత ధ్వని చెవులకు విన్పించినపుడు సాధకుడు సరిఅయిన మార్గములో ఉన్నాడని



భావించవలెను. ఈధ్వనుల యొక్క మాధుర్యములో మనస్సు నిమగ్నమయినప్పుడు సాధకుడు తనను తాను మర్చిపోతాడు. ఈ దివ్యధ్వనిని విననంతమాత్రముననే, కర్ణ కవాటములు తెరుచుకొంటాయి. దివ్యగంధము యొక్క సౌరభముతో సాధకుడు నిశ్చేష్టుడవుతాడు. దివ్యజ్యోతి ప్రకాశము మనసును స్తంభింపజేస్తుంది. ఈ జగత్తులోని మెరుపులు, చంద్రకాంతి, ప్రజ్వలిత అగ్నియొక్క కాంతులు ఆదివ్యజ్యోతియొక్క విస్ఫులింగాలని సాధకునికి అవగతమవుతుంది. సాధకునికి ఇవి అన్నియు చాలా గొప్పవయిన అనుభవములుగా పరిగణించబడినవి. వీటియొక్క దివ్యకాంతులవల్ల సాధకుడు తన అస్థిత్వమును కోల్పోయి భగవంతుని ప్రాప్తించుకొంటాడు.

అందరికి, అన్నింటికి వెలుగు నిచ్చేవాడు భగవంతుడే. సాధకుని అభ్యాసము పెరుగుతున్న కొద్దీ దివ్య అనుభవములు కూడా పెరుగుతూ వుంటాయి. కొన్నికోట్ల బ్రహ్మాండములను ధరించి, భరిస్తున్న భగవంతుని సాధకుడు దర్శిస్తాడు. సృష్టి, స్థితి లయ లందు గల అంతరమును సాధకుడు క్షణ కాలములో దర్శించగలడు.

ఈ చమత్కారములన్నింటిని దాటి సాధకుడు ప్రతిభాది సిద్ధులను పొందినపుడు భగవానునియొక్క పూర్ణ జ్ఞానము ప్రాప్తిస్తుంది. భగవానుని మహిమను ఋషులు అనేక విధములుగా కీర్తించారు. బ్రహ్మసూత్రములు భగవంతుని గురించి చెప్పాయి. అన్ని యజ్ఞములయొక్క భోక్త భగవంతుడే.

యోగమను యజ్ఞము యొక్క సాధనము ప్రాణాయామము. అందులో హవనము చేయబడే సంస్కారములు అనే సామాగ్రికి తిలాంజలులు ఇవ్వాలి. ఈ యజ్ఞమును సాధకుడు నియమితరూపములో చేసినపుడు, ఆహార సంయమనము చేసి, నిత్యము బ్రహ్మముహూర్తము నందు లేచి శ్రోత్రచక్షు, రసనాది ఇంద్రియ విషయములను బ్రహ్మాగ్ని యందు దగ్ధము చేసినపుడు భగవత్ప్రాప్తి తప్పక కలుగుతుంది. ఈ విధముగా నియమబద్ధమైన ప్రాణ యజ్ఞమును సాధకుడు చేస్తూ వున్నప్పుడు అతడిపై భగవానుడు పరమానంద వృష్టిని కురిపించుతాడు. అతడికి వైరాగ్యము పెరుగుతుంది. సమాధి – ఉన్మనీ అను పూలు వికసిస్తాయి. కల్పవృక్షము, కామధేనువు సంకల్పము చేసినగాని ఫలములనివ్వవు. కాని ఈ యజ్ఞ ఫలితముగా సాధకుడు కోరకుండానే అన్నీ సిద్ధిస్తాయి. సాధకుడు మరణించాలని కోరుకుంటే దేవతలు అతడికి దాస్యము చేయుటకు వస్తారు.

**మానవ జన్మయొక్క గొప్పతనము :** మానవజన్మయొక్క గొప్పతనమును దేవతలు కీర్తించారు. వారుకూడా మానవ జన్మ పొందాలని కోరుకుంటారు. మానవ

శరీరము ప్రాప్తించకపోతే మోక్షము లభించదు. అందువలన దేవతలుకూడా మానవ శరీరమును గౌరవిస్తారు. ఈ జగత్తులోని ప్రతిఒక్కరు మానవులంటే భయపడుతారు. దేవతలకుకూడా మానవుడంటే భయమే. తపస్సుచేసి మానవులు వారి పదవిని ప్రాప్తించుకుంటారని వారి భయము. మానవుడు తన బుద్ధిబలము చేత మహాక్రూర జంతువులైన పులి సింహము వంటి వాటిని కూడా వశపర్చుకోగలడు. ఇంకా చెప్పాలంటే భక్తితో భగవంతుని కూడా సహజముగా పొందగలడు. మానవుని బుద్ధి యొక్క వైశిష్ట్యము నలుదిక్కులా వ్యాపించివున్నది. అందువలన సాధకులు శ్రద్ధగా యోగసాధన చేయవలసి వుంటుంది.

గృహస్థులు ఏమీ సాధనచేయలేరనుకొంటారు. కాని సన్యాసము తీసుకొన్న వారందరూ కూడా కృతార్థులు కాలేదు. ఈ జగత్తులో రెండవవాని సహకారములేనిదే ఏకార్యమూ సిద్ధించదు. భగవంతుడు కూడా మాయాశక్తిద్వారా సమస్త సృష్టిని నడుపుతున్నాడు. మానవుల పూర్వీకులు అయిన 88 వేల మంది ఋషులందరిలో కపిలుడు, దత్తాత్రేయుడు, వామదేవుడు, శుకదేవుడు, జడ భరతుడను కొద్దిమంది మాత్రము గృహస్థులుకారు. మిగిలినవారందరు గృహస్థులే. మహాజ్ఞానిగా భావించే వశిష్ఠునికి నూర్గురు పుత్రులున్నారు. మహాయోగి యాజ్ఞవల్క్యునికి ఇద్దరు భార్యలున్నారు. అందువలన సాధకులు తెలుసుకోవాల్సిన విషయ మేమంటే ఈ ప్రపంచములోని వైవిధ్యమంతా మనసునకు చెందినదే. యోగసాధన ద్వారా మనస్సును అంతర్ముఖము చేయుటద్వారా సాధకునికి మంగళము చేకూరుతుంది.

# సిద్ధమహాయోగము

## ఆరవ ప్రకరణము

శ్రీమహేశ్వరులచే చెప్పబడినట్టి మహాయోగము సూర్యునివలె స్వయం ప్రకాశమానమై ఆత్మ స్వరూపమును దర్శింపజేయగల అతిదుర్లభమైనదని శాస్త్రములు వివరించాయి. ఈమహాయోగరూప అగ్ని శీఘ్రముగా కర్మరూప పాపపంజరమును భస్మముచేసి సాక్షాత్తు మోక్ష సిద్ధిని కలుగజేసి నిర్మలజ్ఞానమును ప్రకటింపచేస్తుంది. యోగసాధన ద్వారా జ్ఞానము ఉత్పన్నమవుతుంది. జ్ఞానముతో యోగప్రవృత్తి కలుగుతుంది. జ్ఞానము యోగమునకు దిశా నిర్దేశముచేసి మోక్షప్రాప్తికి సహాయకారిగా వుంటుంది. అనగా ఏ సాధకునిలో జ్ఞానము, యోగము రెండూ కలిసి వుంటాయో



అతడిపట్ల భగవానుడు అత్యంత ప్రసన్నుడై వుంటాడు. అందువల్ల ప్రతిదినము మహాయోగమును రెండు మూడు పర్యాయములు అనుష్ఠించే సాధకులను శివస్వరూపులుగా తలచాలి.

ఈ యోగముకూడ రెండు విధాలుగా వుంటుంది. మొదటిది సాధనద్వారా పొందెడి అనుభవయోగము. రెండవది అన్నియోగములలో అత్యుత్తమమైన మహాయోగము అయివున్నది. ఆత్మను నిర్గుణ శూన్యముగా తలచి ధ్యానము ద్వారా సాక్షాత్కరింపజేసే యోగమును అనుభవయోగమందురు. రెండవది అయిన మహాయోగములో యోగిజనులు నిత్యానంద స్వరూపమైన, నిరంజనమైన ఆత్మను దర్శించి సమాధి స్థితిని పొంది భగవానునితో సాయుజ్య స్థితిని పొందుతారు. అందువలన రెండవది అయిన మహాయోగము సర్వశ్రేష్ఠమయినదిగా చెప్పబడినది. ఈ మహాయోగము పరమేశ్వరుని ద్వారా చెప్పబడినది. కావున యోగుల ద్వారా చెప్పబడే ఇతర యోగవిధానములు దీనికి సాటిరావు. ఈ యోగములో జీవన్ముక్తులైన యోగిజనులు సాక్షాత్తు ఈశ్వరదర్శనమును పొందుతారు. ఈ పరమపావనమైన మహాయోగ ప్రభావముతో బ్రహ్మాండములోని సమస్త తత్త్వములు తెలియబడతాయి. అందువలన అన్ని యోగములలో పరమేశ్వరుని ద్వారా చెప్పబడిన మహాయోగము సర్వోత్తమమయినది. అది జీవుని ఈశ్వరునితో కలుపుతుంది. వేలకొలది వున్న ఇతర యోగమార్గములన్నియు తిరస్కార యోగ్యమయినవి. ఎందుకంటే అవి ఈశ్వరుని దర్శింపజేయలేవు. వాటిని సాధనచేసే సాధకులు భగవానుని దర్శించలేరు. కేవలము మహాయోగముద్వారా మాత్రమే భగవానునితో కలయిక సాధ్యమవుతుంది.

**మహాయోగ పరంపర :** ఈ పరమపావనమైన సర్వోత్తమమయిన మహాయోగ విజ్ఞానమును శ్రీ మహేశ్వరుడు శ్రీమన్నారాయణునికి ఉపదేశించి శాంతచిత్తులైన బ్రహ్మ వాదులైన సాధకులకు ప్రదానము చేయవలసినదిగా కోరియున్నాడు. తదుపరి శ్రీమన్నారాయణుడు తనను పరివేష్ఠించి యున్న మహర్షి గణములన్నింటికి ఈ మహాయోగ విజ్ఞానమును అందించి ఈ జ్ఞానమును భక్తులైన వారికి మరియు అర్హులైన తమ శిష్యులకు అందజేయవలసినదిగా ఆదేశించియున్నాడు. శివ, కేశవ భేదము పాటించని యోగిజనులకు మాత్రమే ఈ మహాయోగమును ఉపదేశించ వలసినదని పరమేశ్వరుడు మునిగణములను ఆదేశించియున్నాడు. ఎందుకంటే శివ, కేశవులు అభిన్నులు. ఎవరు నారాయణునిగా వుంటాడో అతడే శివ స్వరూపుడు

అయివున్నాడు. ఇందులో సందేహమేమియులేదు. శ్రీమన్నారాయణుని పేరుతో పూజింపబడే పరమకల్యాణమూర్తి సాక్షాత్తు శివస్వరూపమై యున్నది. ఆమూర్తి సర్వప్రాణులలో ఆత్మస్వరూపముగా నిలబడి యుంటుంది. శివకేశవుల భేదమును పాటించే జనులకు ముక్తిమార్గము అత్యంత దుర్లభము. వారు జననమరణ చక్రములో తిరుగాడుతూ వుంటారు. అటువంటివారికి ఈయోగ విజ్ఞానమును అందించకూడదు.

ఏ సాధకులు అవ్యక్తుడైన శ్రీమహావిష్ణువును మహాదేవుడైన శ్రీ మహేశ్వరుని ఒకే రూపముగా భావిస్తారో వారికి ఈ మహాయోగ జ్ఞానము తెలియబడుతుంది. వారికి పునర్జన్మ వుండదు. అవినాశి, అనాది, అవ్యయ ఆత్మస్వరూపమైన విష్ణు స్వరూపమును శివస్వరూపముగా భావించి పూజించవలెను. ఏ జనులు భేదబుద్ధితో పరమేశ్వరునికి భిన్నముగా ఇతర దేవతలను భావిస్తారో వారు ఘోర నరకమును పొందుతారు. వారు సాక్షాత్తు ఈశ్వర భక్తులైనప్పటికి వారి ఉత్తరదాయిత్వమును పరమేశ్వరుడు స్వీకరింపడు.

శ్రీమన్నారాయణుని భక్తుడు మూర్ఖుడిగా వున్ననూ లేక పండితుడుగానున్ననూ లేక పరమనికృష్ఠ స్థితిలో వున్నను పరమేశ్వరుని కృపకు పాత్రుడవుతాడు. అందువలన పరమేశ్వరుని పరమభక్తులైన యోగిజనులు పరమేశ్వరుని ప్రీతికొరకు విధిగా పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని పూజింపవలసి వుంటుంది. శ్రీమన్నారాయణుడే పూజించే భక్తులపైననే పరమేశ్వరుని కృప నిలిచి వుంటుంది. శ్రీమన్నారాయణులు ఈ మహాయోగవిజ్ఞానమును ధర్మాత్ములైన శిష్యులకు ఉపదేశించవలసినదిగా కోరివున్నాడు. ధర్మాత్ములైన వారిలోకూడా భక్తులకు, అగ్నిహోత్రులకు విశేషించి బ్రాహ్మణులకు ఈ విజ్ఞానమును అందజేయవలసినదిగా కోరియున్నాడు.

తదనంతరము మహాముని పుంగవుడైన సనత్కుమారుడు ఈ విజ్ఞానమును సంవర్తునికి ఉపదేశించాడు. అదేవిధముగా సనందుడు మహర్షి పులహునికి ఉపదేశించగా ప్రజాపతి పులహుడు దీనిని గౌతమ మహర్షికి అందించాడు. అంగీరస మహర్షి వేదవిజ్ఞానము తెలిసిన భరద్వాజ మహర్షికి అందించాడు. యోగిరాజు అయిన కపిల మహాముని ఈ విజ్ఞానమును జైగీషవ్యునికి పంచశిఖాచార్యునికి ఉపదేశించాడు.

సర్వతత్త్వజ్ఞానమును పొందగలిగే మహాయోగ విజ్ఞానమును వేదవ్యాసుని తండ్రి అయిన పరాశర మహర్షి యోగీంద్రుడైన సనకముని నుండి పొందాడు. అతడి



నుండి వాల్మీకి మహర్షికి లభ్యమయినది. భగవానుడైన శ్రీకృష్ణుడు ఈ మహాయోగ విజ్ఞానమును అర్జునునికి ఉపదేశించాడు. ఈ విధముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పరంపరగా ఈ మహాయోగ విజ్ఞానము అందించబడుతూ వున్నది.

వేదవ్యాసుడు ఈ మహాయోగ విజ్ఞానమును శివుని తేజఃశక్తి అయిన సతీదేవి నుండి ఉద్భవించిన రుద్రరూప మహాయోగి అయిన వామదేవుల నుండి పొందాడు. ఈ విజ్ఞానమును పొందిన వేదవ్యాసులవారు కూడా శివుని పట్ల అత్యంత భక్తి భావనను పొందాడు. వారి ఆదేశమును పొందిన శౌనకాది ముని జనులు కూడా శరణాగత వత్సలుడైన శివునిపట్ల అత్యంత భక్తి భావమును పొంది దృఢభక్తితో మహాయోగమును అనుష్ఠించి శివుని కృపను పొందారు.

**శైవ పాశుపతధర్మము :** పరంపరాగతమైన పాశుపత మహాయోగమును సాధనచేయు సాధకులు మహేశ్వరునిచే చెప్పబడిన సనాతన, చతుష్పాద శైవ ధర్మమును ఆచరించ వలయును. ఇందు జ్ఞాన, చర్య (అనగా శాస్త్ర విహిత ఆచార వ్యవహారములు), క్రియ మరియు యోగము అను నాలుగు పాదములు కలవు.

'చర్య' : ఈ విధానములో జనులు శాస్త్రవిహిత వర్ణాశ్రమ ధర్మములను పాటించి దేవతార్చనలను విధివిధానములతో ఆచరించవలసి వుంటుంది. జనులు తమ యోగక్షేమముల కొరకు సాంసారిక ప్రవృత్తిలో నిమగ్నమయివుంటారు. జీవితాంతము దానినుండి బయటపడలేరు. దానినే జీవితలక్ష్యముగా ఏర్పరచుకొని జీవనయానం చేస్తూ వుంటారు. మనుష్యుడు లోకవ్యవహారములను పాటించుతూ కూడా దైనిక వ్యవహారములలో వైరాగ్యయుక్తముగా నుండి జ్ఞానయోగముల పట్ల ప్రవృత్తిని కలిగి వుండటానికి ఋషులద్వారా వర్ణాశ్రమ ధర్మనియమములు దేవతార్చనలు ఏర్పరచ బడినవి. సనాతన ధర్మములో చర్యాపాదము అతిముఖ్యమైన అంగము అయివున్నది.

**క్రియమరియు యోగము :** వాస్తవముగా మానవజన్మము యొక్క ధ్యేయము జ్ఞానార్జనచేసి మోక్షమును పొందుట అయివున్నది. లోక వ్యవహారములలో ఉండి మనుష్యుడు ప్రతిదినము క్రియ మరియు యోగమును పాటించినట్లయిన అతడికి తగిన సమయములో జ్ఞానప్రాప్తి కలుగుతుంది. అనగా జ్ఞానము స్వయముగా యోగసిద్ధి కలిగినపుడు తన అంతరాత్మలో ప్రాప్తిస్తుంది. మొదట క్రియ తరువాత యోగ సాధన చేయబడుతుంది. క్రియల ద్వారా యోగసిద్ధి కలుగుతుంది. చిత్తవృత్తుల నిరోధమును యోగమందురు.

శ్రీ మహేశ్వరులద్వారా అనుగ్రహించిన మార్గములో భగవంతుని పై చిత్తమును నిల్పి అన్యవృత్తులను నిరోధించుటయే యోగము అని చెప్పబడుతుంది. యోగసిద్ధి కొరకు క్రియలను అభ్యసించవలసి వుంటుంది.

షట్ చక్రములను శుద్ధిచేసెడి విధివిధానమును గురించి సద్గురువు వద్ద సమర్పణ భావముతో యోగాభ్యాసమును చేయుటనే క్రియ అని అంటారు. క్రియలద్వారానే షట్ చక్రముల శుద్ధి జరుగుతుంది. క్రియాభ్యాసము గురు కృపా కారణముచే మాత్రమే లభిస్తుంది. అందువలన గురుకృపను పొందుట అత్యంత ఆవశ్యకము అయివున్నది. గురుకృపద్వారా క్రియలు, క్రియలద్వారా షట్చక్ర శుద్ధి పిమ్మట యోగము ప్రాప్తిస్తుంది.

**జ్ఞానము :** జ్ఞానములేకుండా మోక్షము లభించదు. అందువలన జ్ఞాన మనగా నేమో తెలుసుకొనవలసి వుంటుంది. పాశుపత మహాయోగ మతానుసారము మొదటిగా జీవుడు, రెండవది, అతడి బంధన హేతువులైన మోహపాశములు, మూడు పాశవిముక్తుడు అగుటకు ఉపాయము ఈ మూడింటి యొక్క అనగా పశు, పాశ మరియు పతిని గురించిన జ్ఞానమును యదార్ధ జ్ఞానము అంటారు.

ద్వేషము, లజ్జ, భయము, శోకము, ఏవగింపు, కులము, సౌందర్యము, జాతి మొదలైనవి అష్టవిధపాశములు. వీటితో బంధించబడిన జీవుడు పశువు అనబడతాడు. వీటినుండి విముక్తిని పొందితే శివుడవుతాడు. అందువలన శివుని పశుపతి అని అంటారు. ఈ జీవబ్రహ్మ జ్ఞానము మోక్షప్రదమైనది. చర్య, క్రియా, యోగము యొక్క సహకారముతో జ్ఞానానుభవము కలుగుతుంది. జ్ఞానాగ్నిలో అష్టపాశములు భస్మమయిపోతాయి. వీటి శుద్ధ భస్మమును ఆభరణములుగా దాల్చిన జీవుడు కాంతివంతమైన శివస్వరూపుడుగా నిలిచి శివానంద అనుభవమును పొందుతాడు.

**పాశుపత మహాయోగము ద్వారా జ్ఞానప్రాప్తి :** జ్ఞానప్రాప్తి కొరకు క్రియా మరియు యోగములయొక్క సాధనా క్రమమును మహాయోగము అంటారు. ఈ మహాయోగము సిద్ధించుటకు కృపతో సద్గురువు శిష్యుని అనుగ్రహించి శక్తి పాతము చేయవలసి వుంటుంది. దీనికి ఇంకా వేరు ఉపాయములు ఏమియులేవు.

శక్తిపాతములేకుండా శిష్యుడు చేసే సాధన నిష్ఫల మవుతుంది. ఎందుకంటే తత్వముల యొక్క తత్వజ్ఞానము శక్తిపాతములేకుండా ఎప్పటికి లభించదు. ఆ పరబ్రహ్మయొక్క శుద్ధ వ్యాపకత్వ అనుభవ గమ్యజ్ఞానము పంచతత్వములు శుద్ధి



జరిగిన తరువాత మాత్రమే లభిస్తుంది. పంచతత్వముల శుద్ధి కొరకు నివృత్తి - ప్రతిష్ఠా, విద్యా, శాంతి మరియు శాంత్యాతీత స్థితులు మనస్సులో ఉదయించవలసి వుంటుంది. తద్వారా ఆనందకరుడైన భగవానుని జ్ఞానప్రకాశము చిత్తములో ఆనందముగా, పరమానందముగా, ప్రబోధముగా ప్రకాశముగా వెలువడుతుంది. మోక్షప్రాప్తికి పూర్వము బ్రహ్మజ్ఞానము పైనచెప్పిన విధముగా ఆసాధకులకు అనుభవములోనికి రావలసి వుంటుంది. పై చిత్త స్థితి లభించనంతకాలము సాధకునకు ఎటువంటి సిద్ధి కలుగదు. కేవలము నేను ఆత్మను అని నోటితో ఉచ్చరించినంత మాత్రమున మోక్షము లభించదు. భిన్న భూమికల నుండి చిత్త స్థితి ఉత్థానము పొందిన తరువాత మాత్రమే పరబ్రహ్మ సాక్షాత్కారము కలిగి మోక్షప్రాప్తి కలుగుతుంది.

**తత్త్వశుద్ధి :** ఈశ్వరుని సర్వవ్యాపక శక్తి యొక్క అనుభవము తత్త్వశుద్ధితో కలుగుతుంది. అందువలన మొదట నివృత్తి ద్వారా శరీరములో రుద్రతత్త్వ పర్యంత శుద్ధి జరుగుతుంది. అనగా ఎప్పటివరకు స్థూల శరీరమునకు సృష్టి, స్థితి మరియు సంహార శక్తులతో సంబంధము వుంటుందో అప్పటివరకు శుద్ధి నివృత్తి మార్గమును ధారణ చేయుట ద్వారా లభిస్తుంది. అందులో ఆత్మతత్వము యొక్క ఛాయ వైరాగ్యము అనెడి కాంతి రూపములో ప్రకాశిస్తుంది. పై స్థితిలో స్థిరపడి తరువాత ఎక్కడివరకు అవ్యక్త ఇంద్రియములు చేరగలవో అక్కడివరకు అనగా సూక్ష్మశరీరము వరకు శుద్ధి ప్రతిష్ఠితమవుతుంది. దాని తరువాత ఎక్కడవరకు విద్యాతత్త్వము లేక ఈశ్వరతత్వము వెళ్ళగలదో అక్కడివరకు విద్య ఉదయించుట ద్వారా శుద్ధి జరుగుతుంది. తరువాత క్రమముగా ప్రకాశము, ప్రబోధము, పరమానందము, ఆనంద వికాసము కలుగుతుంది. దీనిపైన శాంత స్థితి అనగా చివరిలో శాంతి ఉదయించుటవల్ల శుద్ధి కలుగుతుంది. దీని తరువాత ప్రకృతియొక్క హద్దులవరకు అనగా పరమాకాశము వరకు శాంత్యాతీతస్థితి లభించుట ద్వారా శుద్ధి జరుగుతుంది. ఈ విధముగా మనస్సు, బుద్ధి అహంకారము, మహతత్త్వము మరియు అవ్యక్త ప్రకృతియొక్క శుద్ధి జరిగినపుడు పూర్ణబ్రహ్మభావము పెంపొందుతుంది.

**విద్యోత్పత్తి :** అవిద్యా స్థితినుండి విద్యాస్థితి ఉదయించినపుడు కలిగే అయిదు స్థితులను సాధకుడు అర్థము చేసుకోవడానికి ప్రయత్నించాలి. ఎందుకంటే ఈ విషయము అతి సూక్ష్మమయినది. నిగూఢమయినది కూడా. అనుభవము లేకుండా

దీనిని సాధకుడు అర్థముచేసుకొనలేడు. తారతమ్యత ప్రకారము ఆ స్థితులను క్రింద వివరించిన విధములుగా వర్ణించారు. 1) ప్రకాశము, 2) చిదుదయము, 3) పరమానందముతో కూడిన చిత్తోత్పత్తి ప్రబోధకము, 4) పరమానంద స్వరూపమైన పరమాత్మా అనుభవము, 5) ఆనందానుభవముతో కూడిన బ్రాహ్మీస్థితి.

సమాధి స్థితి అనుభవము ప్రారంభము కాగానే సాధకునికి అనుభూతులలో తారతమ్యత కనిపిస్తుంది. అతడు తనకు వాస్తవిక జ్ఞాన అనుభూతి ప్రాప్తించినదా లేదా అని అనుమానపడతాడు. సాధారణముగా సాధకుడు జ్ఞాన అనుభవము పొందుతూ కూడా ఆ స్థితిని అర్థము చేసుకొనలేడు. ఇక్కడ పై స్థితులన్నింటిని పరిశీలించి సాధకుడు తన ప్రస్తుత పరిస్థితిని అంచనా వేసుకొనవచ్చు. ఐదింటిలో మొదటిది అయిన ప్రకాశ స్థితిలో వెలుగు, కళ, సమయ అభావము ఉన్నప్పటికి ఇంద్రియ జ్ఞానము మరియు వికల్పముల విస్మృతి కలుగుతుంది. చిత్తము లయమయినట్లుగా అనిపిస్తుంది. తరువాత చిదుదయము అవుతుంది. అప్పుడు అభ్యాసము, కర్తృత్వము, మనస్సు, తత్త్వము మరియు కాంతులయొక్క జ్ఞానము కలిగి తాను అభ్యాసము చేస్తున్నట్లుగా అనిపిస్తుంది. అతడు ఆ సమయములో తన మనస్సు ద్వారా ప్రకాశములో అనుభూతమయ్యే తత్త్వములు మరియు కాంతులయొక్క అనుభవమును పొందుతాడు. ఈ రెండు కూడా చిత్తము యొక్క లయము ఉదయమునకు సంబంధించిన స్థితులని తెలుసుకొంటాడు. ఇవి వరుసగా ఒకదాని తరువాత ఇంకొకటి సంభవిస్తాయి. దీనిద్వారా ధారణకు సంబంధించిన ప్రజ్ఞ ఉదయిస్తుంది. ఈ స్థితిలో ప్రకాశము, విచారము, ఉల్లాసము, లయము, అవిభవము అను ఐదు స్థితులలో ఏదో ఒక అనుభవము కలిగితే అది ప్రబోధస్థితి అని చెప్పవచ్చును. కిరణ, స్ఫూర్తి, విస్ఫూర్తి, హర్ష మరియు కేవలసత్వ వంటి స్థితులను పరమానందస్వరూప పరమాత్మ తత్త్వములో అనుభవములోనికి వస్తాయి. ఇక్కడ ధ్యాన స్థితి కలుగుతుంది. తరువాత వచ్చెడి ఆనందమయ బ్రాహ్మీస్థితిలో వినాశము, క్షయము, భేదబుద్ధి దాహము అనగా చిత్త సంతాపము వంటి ఇంద్రియ సంబంధ జ్ఞానము యొక్క ప్రబోధము కలుగుతుంది. దీనివల్ల ఋతాంభరా ప్రజ్ఞ ఉదయిస్తుంది. పైన చెప్పిన అంతిమ అనుభవములో కేవలము ఆనంద రూప అవ్యక్త విషయము యొక్క స్థితిని అర్థము చేసుకొనవలసి వుంటుంది. ఎందుకంటే ఈ స్థితిలో సుఖదుఃఖాలనే ద్వంద్వములు, మానసిక త్రితాపములు ఉండవు. ఇది ఆనంద స్థితియొక్క లక్షణము.



అవ్యక్తము పరతత్త్వము అయి వున్నది. అది ప్రకృతియొక్క అవ్యక్త స్వరూపము. అది నిత్యము సత్యరూపములో ఉంటుంది. దాని ఆవల ఒకే ఒక పరమ పురుషుడు కలడు. అతడిని తత్పరుడు, నిరంజనుడు అను పేర్లతో వ్యాఖ్యానించారు.

ఆనంద స్థితి అవ్యక్తము వరకు అనుభవగమ్యము. పరమపురుషుని నిర్గుణ, నిర్మల, వ్యాపక కేవల మరియు ఆనందమయమను ఐదు లక్షణములతో కూడి ఉన్నట్లుగా భావించవలెను. నిరాకార, నిత్య, నిజస్వరూప, నిరంజనుడు, ప్రత్యేకమైన ప్రదేశము లేనివాడు అనగా అనికేతనుడుగా ఉండటాన్ని తత్పర అనుభవమందురు. ఈ సమాధిస్థితిలో సమయము, స్థానము, పరిణామ అనుభవములుండవు.

ఏ సాధకునకు పైన ఉదహరించిన స్థితులు అనుభవమునకు వస్తాయో అతడు సాక్షాత్తు మహేశ్వరుడే అవుతాడు.

# సిద్ధమహాయోగము

## ఏడవ ప్రకరణము

**యోగసాధన ద్వారా ప్రాప్తించు ఆత్మజ్ఞానము :** యోగసాధన ద్వారా ప్రాప్తించే ఆత్మజ్ఞానము రెండు విధములుగా వుంటుంది. యోగ, జ్ఞానముల అర్థము విజ్ఞానమై యున్నది. జ్ఞాన, విజ్ఞానములతో పరిపూర్ణుడయిన సిద్ధ పురుషునికి భగవానుని యొక శ్రేష్ఠ పరమ పదము తెలియబడుతుంది. అటువంటివారు నిరంతరము జ్ఞానమార్గావలంబులై భగవానునితో కూడివుందురు. వారు భగవానునికి అత్యంత ప్రియులై యున్నారు. అందువలన సాధకులు జ్ఞానయుక్తులై, ఆత్మ స్వరూపమును తెలుసుకొని, జ్ఞాన విజ్ఞానములను పొంది భక్తిపూర్వకముగా భగవానుని కీర్తించవలసి వుంటుంది. జ్ఞాన, విజ్ఞాన రూప యజ్ఞము ద్వారానే యజ్ఞపతి అయిన పరబ్రహ్మమును మునిగణములు ఆత్మరూపములో ప్రాప్తించుకొన్నారు. తత్త్వజ్ఞానము అను ఒక్క అంశము ద్వారా లభించే సిద్ధి ఎటువంటిదంటే అది జప, తప, తీర్థ సేవనము, వ్రతములు, దానముల వంటి పవిత్ర కార్యములతో కూడా లభించదు. ఈ జ్ఞాన ప్రాప్తికి యోగసాధన చేయవలసి ఉంటుంది.

యోగసాధనలో ప్రాప్తించు జ్ఞానమును ఆత్మజ్ఞానము అంటారు. దీని ప్రభావముతో సాధకుడు ఆనందస్వరూపుడు కాగలడు. జనన మరణ చక్రము

నుండి విడిపించగల జ్ఞానము రెండు విధాలుగా వుంటుంది. ఒకటి సామాన్యము, రెండు విశేషము. జనులు శాస్త్రముల ద్వారా తెలుసుకొన్న జ్ఞానమును, శాస్త్రజన్య పరోక్షజ్ఞానము అందురు. తపస్సు, యోగసాధన ద్వారా లభించెడి అనుభవ జ్ఞానము, సాధనసిద్ధ అపరోక్ష జ్ఞానమని అందురు. ఈ విశేష జ్ఞానప్రాప్తి కొరకు సాధకులు యోగసాధన చేయవలసి వుంటుంది. ఎందువల్లనంటే యోగరహిత జ్ఞానము మోక్షదాయకముకాదు. జ్ఞానములేకుండా యోగ సిద్ధికూడా కలుగదు. జ్ఞానమంటే తెలుసుకొనుట, యోగమంటే కలయిక అయివున్నది. అంటే జ్ఞానముద్వారా సాధకునికి ఏమీ తెలియబడదు. యోగరహిత జ్ఞానము ఎట్లు మోక్షదాయకము కాదో, అదేవిధముగా జ్ఞానరహిత యోగము కూడా మోక్షము నీయలేదు. అందువలన సాధకులు యధావిధిగా జ్ఞాన, యోగములు రెండింటిని అనుష్ఠానము చేయవలసి వుంటుంది.

కేవలము జ్ఞాన మార్గమును అనుసరించినట్లయితే అనేక జన్మల తరువాత యోగము ప్రాప్తిస్తుంది. కాని యోగముద్వారా ఒకే జన్మలో జ్ఞానము ప్రాప్తిస్తుంది. అందువలన యోగసాధన మోక్షదాయక మార్గము అయివున్నది. ఏ మనుజుడు అయినా కేవలము జ్ఞానమార్గము ద్వారా చిరకాలము నేను ముక్తుడనని విచారణ చేసినందువలన ముక్తుడు కాలేడు. పైన చెప్పినట్లుగా యోగము లేకుండా జ్ఞానము ఎప్పటికిని లభించదు. మానసికముగా నేను ముక్తుడను అని తలచే జ్ఞానమార్గావలంబులు కొన్నివందల జన్మలద్వారా యోగముతో మాత్రమే ముక్తులు కాగలరు. యోగసాధన లేకుండా, శాస్త్ర పఠనముద్వారా లభించెడు జ్ఞానమును నమ్ముకుంటే జననమరణ చక్రము నుండి విముక్తి లభించదు. కాని యోగ సాధన ద్వారా ఒకే జన్మలో జ్ఞానసిద్ధి కలుగగలదు. ప్రాణ, అపానములను ప్రాణాయామము ద్వారా కలుపుటను యోగముగా చెప్పబడుతుంది. ప్రాణాయామము ద్వారా కుండలినీ శక్తిని మేల్కొలిపి తద్వారా బ్రహ్మాగ్నిని ప్రజ్వలితముచేసి మనస్సును, ప్రాణమును, శరీరమును సంఘటితము గావించి ప్రకృతి పై విజయము సాధించి నిర్వికల్ప సమాధిస్థితి ద్వారా జీవబ్రహ్మైక్యతను పొందుటకు యోగసాధన చేయవలసి యున్నది.

యోగముద్వారా జ్ఞానము ఉత్పన్నమగును మరియు జ్ఞానముతోడనే యోగము లభిస్తుంది. అందువలన జనులు నిత్యము యోగ- జ్ఞానములను అభ్యాసముచేసినచో ఎటువంటి కష్టములు కలుగవు. మనము యోగసాధనద్వారానే యోగమును తెలుసుకొనవలెను. యోగాభ్యాసము ద్వారానే యోగము ఏర్పడుతుంది.



పైన ఉదహరించిన లక్ష్యసిద్ధి కొరకు మనము స్వప్రయత్నముతోపాటు ఈశ్వర కృపను ఆశ్రయించి ప్రాణ - అపాన యజ్ఞము (ప్రాణాయామము) ను చేసినచో ఈ ప్రపంచములో లభ్యముకాని వస్తువు ఏదియు వుండదు. పై లక్ష్యసిద్ధికి అనగా ప్రాణ - అపాన యజ్ఞము చేయుటకు ముందుగా పద్మాసనములో కూర్చుండి, సద్గురువునకు నమస్కరించి, మంగళకారకుడైన మహేశ్వరుని యజ్ఞములో ఆటంకముల నివారణ కొరకు ప్రార్థించవలయును. దురదృష్ట వశాత్తు విఘ్నములు కలిగితే ఓంకారమును జపించవలయును. వెనువెంటనే ఆద్యాశక్తి మరియు మహా మాయాకుండలినీదేవియొక్క ధ్యానము చేయుటద్వారా ఆ తల్లి కృపతో యోగులకు సిద్ధి ప్రాప్తించును. ఆ నిద్రించుచున్న శక్తి సాధకులు చేసే ప్రాణ - అపాన యజ్ఞ ప్రభావము ద్వారా మేల్కొని దీర్ఘకాల నిద్రను వదలి మహేశ్వరుని కలయికకై త్వరపడును. ఆ సమయములో సాధకులు ప్రాణయజ్ఞము చేయుచున్నా శివశక్తుల కలయిక కొరకు జరిగే ప్రయత్నములో అనేక క్రియలనుచేస్తూ, నవ్వుతూ, నాట్యము చేయగలరు. అప్పుడు సాధకునికి తాను ప్రాణాయామము చేస్తున్న అనుభూతికూడా ఉండదు. అతడు నవ్వుట, దుముకుట, నాట్యము చేయుటవంటి క్రియలనే ఇష్టపడతాడు.

ఆ సమయములో సాధకునికి సంపూర్ణ బ్రహ్మాండమంతయూ అంతరములోనే కనిపించును. దివ్య, మహాదివ్య, జ్యోతి ప్రకాశములు సాధకుని అంతః కరణములో కనిపించును. ఈస్థితి ప్రాణ అపాన రూప యజ్ఞము ద్వారానే ప్రాప్తించును. సాధకుడు ప్రాణమును అపానములో, అపానమును ప్రాణములో హవనము చేయుచున్నప్పుడు వివిధములైన దృశ్యములు కనిపించును. ఆ స్థితిలో సాధకుని మానసిక సృష్టిలోని విచిత్ర స్థితులను వర్ణించుటకు ఎవరికీ సాధ్యపడదు.

**ఆత్మశక్తి జాగృతమగుటవలన ఆశ్చర్యకరమైన అనుభవములు కలుగును:**

కుండలినీశక్తి యొక్క క్రియలద్వారా ఎల్లవేళలా మనస్సును, మనస్సుతో పరిశీలిస్తూ యోగసాధన చేయవలసి ఉంటుంది. యోగసాధన ద్వారా మనస్సును మనస్సుతో అవలోకనము చేస్తుంటే సాధనలో ఉన్నతికి సంబంధించిన బాహ్యచిహ్నములు అనేక విధములుగా కనిపించును. ఆ అనుభవములతో సాధకునికి త్వరలో యోగసిద్ధి కలుగగలదని భావము ధృవపడును. నాద, బిందు, కళ, జ్యోతి, సూర్య, చంద్ర, ధృవతారలు మొదలగునవి అంతరాకాశములో కనిపించి శాంతి లభిస్తుంది. అప్పుడు

మనస్సుకు శాంతభావము కలుగుతుంది. ఆ సమయములో మనస్సునందు క్రియలు ఏవియు కలుగవు. తరువాత శాంత్యతీత స్థితి కలుగుతుంది. శాంతికి అతీతమైనస్థితి పరబ్రహ్మము అయివున్నది. అది మనోవాక్కులకు అతీతమయినది. స్వానుభవ గమ్యమైనది.

అటువంటి దివ్య అనుభూతులద్వారా యోగి ఆనందముతో నవ్వుతూ ఎప్పుడు ప్రసన్నుడుగా ఉండగలడు. ప్రేమమయుడై గొప్ప సుఖానుభూతిని పొందగలడు. అటువంటి ఆత్మసుఖమును పొందిన యోగి విషయసుఖములపట్ల విముఖుడై వుంటాడు. శోకములో క్రుంగిపోడు. సంపద లభించిన పొంగిపోడు. శత్రుత్వము వహింపడు. కామజనిత వికారముల వలన శరీరములో జరుగు పరిణామములను తెలుసుకొనగలడు. కావున అన్ని కామనలకు దూరంగా మనస్సును నిలిపి వుంచగలడు. శరీరములో ఏ స్థానములో ప్రాణవాయువు ఉంటుందో, చిత్తము కూడా నిశ్చయముగా అక్కడనే వుంటుంది. పైన ఉదహరించిన సంఘటనలన్ని కూడా గురు ప్రదత్తశక్తి ప్రభావముతోగాని, ప్రాణాయామము ద్వారా పాపక్షయము కలిగిన తరువాతగాని సంభవించును. కంటికి కనిపించే సమస్త సృష్టియొక్క సూక్ష్మ అంశము అంతరాకాశములో వున్నది. కుండలినీశక్తి క్రియాశీలమైన తరువాత సాధకుడు వానిని సర్వదా చూడగలడు. సాధకునికి సంతోషము శ్రద్ధ కలుగ జేసేటందుకు ఈ శుభలక్షణములు బాహ్యముగా అభివ్యక్తము కాగలవు. ఎప్పటి వరకు శివశక్తుల కలయిక జరుగదో అప్పటివరకు ఈ అలౌకిక, ఆశ్చర్యజనక సంఘటనలు సాధకుని అంతరములో కలుగుతూ వుంటాయి. ఎప్పుడైతే అంతరయజ్ఞ పూర్ణాహుతి స్థితి లభిస్తుందో అప్పుడు సాధకుడు నిర్వికల్ప సమాధి స్థితిని పొందగలడు. అప్పుడు బాహ్యజగత్తు వాస్తవముగా స్వప్న తుల్యముగా కనిపించును.

యజ్ఞ ప్రారంభము నుండి పూర్ణాహుతి పర్యంతము సాధకుని అనుభవములకు వచ్చు సంఘటనలను యధాతథముగా వర్ణించుట అసాధ్యము. కాని వాటి అనుభవము మాత్రము అతడికి కలుగుచుండును. ఈ అనుభవములను కలుగజేసెడి అంతరికశక్తి కుండలినీ శక్తి అయివున్నది. ఆ శక్తి ఊర్ధ్వగామి అగుచున్నప్పుడు సాధకునికి ఆశ్చర్యకరమైన, అతి ఆశ్చర్యకరమైన అనుభూతులు కలుగును. కాని అటువంటి అనుభూతులద్వారా పరిపూర్ణత లభించదు. ఇంకను ముందుకు వెళ్ళి ఆశక్తి శివునితో ఐక్యం కావలసి యుంటుంది. అప్పుడే సాధకునికి పరిపూర్ణ స్థితి లభిస్తుంది.



**ప్రాణాయామమునకు కాలవ్యవధి లేదు :** సాధకులు తమకు సాధ్యపడినంత వరకు ప్రాణాయామమును అనుష్ఠించవలసి యుంటుంది. ఈ ప్రాణరూప యజ్ఞమునకు ఆహుతులను ఎన్ని రోజులు, ఎంతకాలము ఇవ్వవలసి వుంటుందని ప్రశ్నిస్తే, దానికి కాలవ్యవధి ఏమియులేదు. ఈ విషయములు ఇతమిద్ధముగా ఎవరూ చెప్పలేరు. సాధనను కొనసాగించవలసి యుంటుంది. సాధారణముగా జనులు కుండలినీ శక్తి జాగృత మయినంతనే అంతా సిద్ధిస్తుంది అని అభిప్రాయపడతారు. కుండలినీ శక్తి జాగృతమగుట ఒక్కటే కాకుండా అది క్రియాశీల మగుటచే సాధనలో పురోగతి లభిస్తుంది. ఎవరైన నిద్రిస్తున్న వ్యక్తిని పెద్దగా అరచి మేల్కొలిపిన తరువాత అతడు మేల్కొని కూడా పనిచేయకుండా వుంటే ఏమి ప్రయోజనము? అదేవిధముగా కుండలినీశక్తి జాగృతమయి కార్యశీలతను పొందకపోతే ఎటువంటి ఫలితము కలుగదు.

అంటే సాధారణ స్థితిలో వున్న కుండలినీ శక్తి జాగృతమయిన తరువాత కూడా ప్రాణాయామము చేయవలసి వుంటుంది. కుండలినీ శక్తి ప్రాణాయామము ద్వారా ఉత్పన్నమైన అగ్నిద్వారా జాగృతమై, మనస్సు, ప్రాణములను సహస్రారము వరకు తీసుకొని వెళ్ళి పరబ్రహ్మములో లయము చేయుటవల్లనే సాధన యొక్క పరిపూర్ణ స్థితి లభిస్తుందని చెప్పగలము. ఎంత ఎక్కువగా ప్రాణ అపాన రూప యజ్ఞమునకు సాధకులు ఆహుతులను ఇస్తే అంత త్వరగా ఆత్మశక్తి వికాసము జరుగుతుంది. అంటే ఈ కార్యము అవసరము వున్నంతకాలము నియమబద్ధముగా, శ్రద్ధాభక్తులతో, ఉత్సాహముతో కొనసాగించ వలసి యుంటుంది. ప్రాణ యజ్ఞమునకు ఆహుతులను (కుంభకస్థితి) ఎంత ఎక్కువగా ఇస్తే అంత ఎక్కువగా ఆనందము కలుగుతుంది.

**శక్తి జాగరణ ద్వారా మహాయోగము స్వయముగా సిద్ధిస్తుంది :** కుండలినీ శక్తి జాగృతమయి క్రియాశీలమయినప్పుడు కనిపించే లక్షణములు కొన్నివేలమంది సాధకుల ప్రత్యక్ష అనుభవములను పరిశీలించి లిఖించబడినవి. ఈ విషయములో ఎటువంటి సందేహమునకు తావులేదు. ఎందుకంటే యోగము ప్రత్యక్ష ఫలము నిస్తుంది. యోగసిద్ధి కలిగిన సామర్థ్యముగల గురువు ద్వారా శక్తి పాతముతో కుండలినీ శక్తి జాగృతమయి క్రియాశీలతను పొందుతుంది. అప్పుడు సాధకునిలో ఈ క్రింది లక్షణములు కనిపిస్తాయి.

ప్రాణాయామముద్వారా లేక సమర్థులైన గురువు అనుగ్రహముద్వారా అంతరశక్తి జాగృతమవుతుంది. ఆత్మశక్తి ప్రచోదనమువలన ప్రాణము మూలాధారములో

నిలిచినపుడు శరీరము కంపిస్తుంది. మూలాధార చక్రములో ప్రాణము నిలిచినప్పుడు యోగి ఆనందముతో నృత్యము చేస్తాడు. ఆధారచక్రములో ప్రాణవాయు నిరోధము ద్వారా సమస్త విశ్వము సాధకుని ముందు ప్రత్యక్షము అవుతుంది. ఎందుకంటే కుండలినీ శక్తి మూలాధారములోనే నివాసము వుంటుంది. సమస్త సృష్టికి ఆధారము మూలాధారము అయి వున్నది. ఈ మూలాధారములోనే సమస్త దేవతలు నివాసము వున్నారు.

ఈ ఆధార చక్రములోనే సమస్త వేదములయొక్క జ్ఞానము నిక్షిప్తమై యున్నది. అందువలన ఈఆధారచక్రమునే ఆశ్రయించవలసి వుంటుంది. ఈ మూలాధారములో ఇడా, పింగళ, సుషుమ్న (గంగ, యమున, సరస్వతి) నదులసంగమము జరుగుతుంది. అక్కడ మనస్సు, ప్రాణములను స్థిరముచేసి ఏ మనుష్యుడు దివ్యస్నానమును చేస్తాడో అతడు సర్వపాపములనుండి విముక్తుడు అవుతాడు. ఆధారచక్రము పశ్చిమ స్థానములో స్వయంభూ లింగము ప్రతిష్ఠింపబడి యున్నది. అక్కడనే సుషుమ్నలో ప్రవేశించే మార్గము (బ్రహ్మద్వారము) వున్నది. ఆ మార్గము తెరువబడిన తరువాత మాత్రమే మనుష్యుడు సంసార చక్రము నుండి విముక్తుడు కాగలడు.

మూలాధారములో కంపనము కలిగినపుడు, శరీరములో కంపనములు కలిగినపుడు, కుంభకస్థితి అప్రయత్నముగా సిద్ధించినపుడు, శ్వాసప్రశ్వాసలు అనియంత్రితముగా దీర్ఘముగా పొడిగించబడినపుడు, శరీరముపై నియంత్రణ కోల్పోయినపుడు కుండలినీశక్తి జాగృతమయి కార్యశీలమైనట్లుగా తలచాలి. ఆ సమయములో సాధకుడు నిర్భయముగా ఏమి జరుగుతుందో చూస్తూ కూర్చొనవలసి యుంటుంది.

శరీరము వణుకుతూ, రోమాంచము కలిగినపుడు, అప్రయత్నముగా నవ్వు వచ్చినప్పుడు లేదా ఏడ్చినప్పుడు ముఖము నుండి వికృతశబ్దములు వచ్చినపుడు లేక వీర్యపతనము జరిగినపుడు, లేదా భయము ఉత్పన్నమయినప్పుడు అనియంత్రితముగా మూత్రము వెలువడినపుడు కుండలినీశక్తి జాగరణ జరిగినట్లు తలచాలి.

కూర్చొన్న స్థితిలో నిశ్చలత వచ్చినప్పుడు (ఆసన స్థిరత) ఉడ్యానబంధము, జాలంధర బంధము, మూలబంధము అప్రయత్నముగా సిద్ధించినపుడు, నాలుక తాలుమూలములోనికి వెళ్ళి స్థిరముగా ఉన్నప్పుడు, చేతులు, కాళ్ళలో బలవంతముగా కదలిక లేర్పడినపుడు ఆపరాశక్తి కుండలినీదేవి క్రియాశీల మయినట్లుగా తలచాలి.



ఆసన స్థిరత కలిగినపుడు, చూపు భ్రుకుటిలో స్థిరపడినపుడు, కంటిపాపలు తిరుగుతూ వున్నప్పుడు, కేవల కుంభకస్థితి కలిగినపుడు, మనస్సు బాహ్యస్మృతి కోల్పోయి నిశ్చలమైనపుడు, శరీర స్మృతి కోల్పోయినపుడు, కండ్లు ప్రయత్నించినా తెరిపిడి పడనపుడు, శరీరములో విద్యుత్ ప్రవహించినట్లనిపించినపుడు ఆ మహామాయా కుండలినీ శక్తి జాగృతమయినట్లుగా తలచాలి.

నేత్రములు అప్రయత్నముగా మూతలుపడి శరీరము నిలకడ లేక భూమిపై పడినపుడు, శరీరము తిరగలి మాదిరి తిరుగుతూ వున్నప్పుడు శ్వాస, ప్రశ్వాసలు బయటకురానప్పుడు, శరీరము కప్ప మాదిరి ఎగిరిపడుతూ వున్నప్పుడు లేక మృతుడి మాదిరి భూమిపై పడినపుడు, చేతులు ప్రయత్నించిన పైకి లేవనపుడు, అన్ని నాడులనుండి ప్రాణములు లాగి వేయబడినట్లుగా అనిపించినపుడు, శరీరము చేప మాదిరిగా ఎగురుతూ గిలగిలా కొట్టుకొనినపుడు యోగమాయ అయిన కుండలినీ శక్తి జాగృతమయినట్లుగా తలచాలి.

కండ్లు మూతలు పడి వెనువెంటనే శరీరములో మార్పులు కలిగి చేతులు కాళ్లు విసరివేయబడినపుడు, బలాత్కారముగా ముఖము నుండి వికృత శబ్దములు వచ్చినపుడు, స్వరభంగము కలిగినపుడు, పశు పక్ష్యాదులు లేక కప్పల మాదిరి శబ్దములు ముఖమునుండి వెలువడినపుడు, లేక కుక్క, పిల్లి, పెద్దపులి, సింహములవంటి జంతువుల అరుపులవోలె భయానక శబ్దములు అప్రయత్నముగా వెలువడినపుడు రుద్రాణి మహాశక్తి కుండలినీదేవి జాగృతమయినట్లుగా తలచాలి.

శరీరములో ప్రాణసంచారము తెలియబడినపుడు, ఎక్కడ మనస్సు నిలిచివుంటే అక్కడ ప్రాణముకూడా వున్నట్లుగా తెలియబడితే, స్నాయువులలో విద్యుత్తు ప్రవాహమువలె సుఖపూర్వకముగా క్రియలు జరిగినపుడు, ఆ కుండలినీదేవి క్రియాశీలమయినట్లుగా తలచాలి.

మనస్సు ఏకాగ్రమయినప్పుడు, శరీరములో కంపనము కలిగి అనియంత్రితముగా కదలిక కలిగినపుడు, అపరిశుభ్ర స్థానములో కూర్చొన్నప్పటికి మనస్సు ఆనందమగ్నమయి క్రియాత్మక స్థితిలో వున్నప్పుడు, నిద్రించినపుడు కూడా ప్రాణ ప్రవాహము సహస్రారములోనికి వెళ్ళి స్వప్న స్థితిలో కూడా మనస్సు క్రియాత్మకమయినపుడు, ఆహ్లాదినీ కుండలినీశక్తి క్రియాశీలమయినట్లుగా తలచాలి.

ఆసనములో కూర్చొనగానే శరీరములో కదలికలు ప్రారంభమయి, వివిధములైన రాగములతో గానము ప్రారంభమయి శ్రోతలు ముగ్ధులయినపుడు, పద్యములు

స్వతః సిద్ధముగా పలికినపుడు, అనేకములయిన భాషలు మాట్లాడుతూ ఆభాష ఎవరికీ అర్థము కానప్పటికి మనస్సునకు ఆహ్లాదము కలిగినపుడు ఆ సరస్వతీ రూపములో వున్న కుండలినీ శక్తి జాగృతమయినట్లుగా తలచాలి.

భంగు త్రాగకుండానే త్రాగినట్లుగా మత్తు కలిగినపుడు నడుస్తూ వున్నప్పుడు కాళ్ళు చేతులూ వణుకుతూ స్థిరత్వములేనపుడు, మనస్సు ఆనందమగ్నమయి, లౌకిక కర్తవ్యములను నిర్వర్తించలేనపుడు, ఏమియు వినలేని స్థితి చెప్పలేని స్థితి కలిగినపుడు, మద్యము త్రాగిన వానిలా మత్తుగా నున్న స్థితి కలిగినపుడు, ఆత్మశక్తి కుండలినీ క్రియాశీలమయినట్లుగా తలచాలి.

రహదారిలో నడుస్తూ వున్నప్పుడు మనస్సులో పైకి ఎగురుదామనిపించినపుడు భూమిపైన పాదము పెట్టగనే పరుగెత్తాలని అనుపించినపుడు, శరీరము వాయువు మాదిరి తేలికపడి ఎగురుతున్నట్లుగా అనిపించినపుడు మనస్సు ఆనందమగ్నమయినపుడు, స్వప్నములో కూడా మనస్సు ఆనంద స్థితిలో నుండి నిశ్చలమైనపుడు, బ్రహ్మశక్తి కుండలినీ క్రియాశీలమయినట్లుగా తలచాలి.

ఆసనములో కూర్చుండి నేత్రములు మూసినపుడు, స్వప్నము వంటి స్థితి కలిగి దేవతలు దర్శనము కలిగినపుడు, దివ్యగంధము, రూపములు, రసము, శబ్దము మరియు స్పర్శ అనుభవములోనికి వచ్చినపుడు మరియు దేవతల నుండి ఆదేశములు లభించినపుడు, దేవశక్తి కుండలినీ జాగృతమయినట్లుగా తలచాలి.

ధ్యానములో కూర్చొనగానే భవిష్యత్తులో జరుగబోయే సంఘటనలు తెలియబడుతున్నప్పుడు, వేద వేదాంగముల నిగూఢ రహస్యములు తెలియబడినపుడు మనస్సులోని సందేహములు నివృత్తమయినప్పుడు, ఏవైనా శాస్త్రములు కొద్దిగా చదివినపుడు వాటి భావార్థ మంతయు అప్రయత్నముగా తెలియబడినపుడు, శాస్త్రములపై వ్యాఖ్యానము చేయగల శక్తి ఉదయించినపుడు, జ్ఞానప్రాప్తి కొరకై ఆ పరబ్రహ్మమును ప్రార్థించకనే ఆత్మనిష్ఠ కలిగినపుడు, ఆ సిద్ధశక్తి కుండలినీ దేవి క్రియాశీలమయినట్లుగా తలచాలి.

ఆసనముపై కూర్చొనగానే భృకుటిలో దృష్టి స్థిర మయినపుడు, నాలుకద్వారా ఖేచరీ స్థితి కలిగినపుడు, ప్రాణప్రవాహము ఆగిపోయి మనస్సు ఆనంద సాగరములో మునిగితేలినప్పుడు, శాంభవీ ముద్రాసిద్ధి కలిగినపుడు, సవికల్ప సమాధి అనుభవము కలిగినపుడు, యోగశక్తి కుండలినీదేవి క్రియాశీలమయినట్లుగా తలచాలి. సాధనలో కూర్చొనగానే మనస్సు ఏకాగ్రమయి దేవి దేవతల సంభాషణలు వినిపిస్తూ వారిద్వారా



వ్యాధులకు తగిన ఔషధములు లభించినపుడు, విఘ్నములు తొలగుటకు దేవతా మంత్రములు లభించినపుడు, సిద్ధుల నుండి యోగ-జ్ఞానముల ఉపదేశము లభించినపుడు, సిద్ధిప్రదాత అయిన కుండలినీ శక్తి క్రియాశీలమయినట్లుగా తలచవలెను.

ఆసనముపై కూర్చొండి క్రియల అనుష్ఠించ వలననెడి సంకల్పముతోడనే తన సూక్ష్మశరీరము ఎదురుగా ప్రత్యక్షమయినపుడు, స్థూలశరీరము ఉన్నట్లుగా తెలియనపుడు, నేత్రములు తెరచినప్పటికి అంతటా శూన్యము గోచరించినపుడు, సమయజ్ఞానము లేకుండా పోయినపుడు, చిత్తశక్తి అయిన కుండలినీదేవి క్రియాశీలమయినట్లుగా తలచవలెను.

ప్రాతఃకాలము, సాయంకాలము సరి అయిన సమయములో అనియంత్రితముగా క్రియలు వేగవంతముగా జరిగి శరీరము, మనస్సు, ప్రాణము వివశమయినప్పుడు కుండలినీ శక్తి సరిగా పనిచేయుచున్నది అని తెలుసుకొనవచ్చును.

**మానవులకు మాత్రమే జ్ఞానము పొందుటకు అర్హత యున్నది. కర్మ, జాతి (కుల) వ్యవస్థ భేదములు తపస్సు నందు లేవు :** ఈ విధముగా కుండలినీశక్తి భిన్న ప్రకృతిగల వారిలో వారి మనస్సు, ప్రాణము, శరీర స్థితుల కనుకూలముగా భిన్న భిన్న రూపములలో యోగశాస్త్రములో చెప్పబడిన సమాధి స్థితికొరకు, శివ, శక్తుల కలయిక కొరకు అనేక ప్రకారములుగా క్రియలను చేయించును. మానవునిలో అతడు ఆస్తికుడైనా లేక నాస్తికుడైనా, స్త్రీ అయినా పురుషుడు అయినా, బాలుడు అయినా, వృద్ధుడు అయినా, రోగి అయినా, రోగము లేనివాడైనా, పాపాత్ముడైనా, పుణ్యాత్ముడైనా, మహామూర్ఖుడు అయినా, ఆత్మ శక్తి జాగృతమయిన వెంటనే పైన చెప్పబడిన లక్షణములు క్రమముగా కలుగుతాయి. సిద్ధి తమ తమ సంస్కారములను అనుసరించి కలుగుతుంది. కాని ఆత్మశక్తి జాగరణలో దేశకాలములకు సంబంధించిన అంతరాయములు ఏమీ కలుగవు. ఎందువలనంటే మనుష్యునికి భగవత్ ప్రాప్తి పొందుటకు అర్హత యున్నది. ఇచ్చట కర్మ సంబంధ, జాతి సంబంధ భేదములు లేవు. ప్రజ్వలించు అగ్నియందు చందనము వేసిననూ, దుర్గంధ భూయిష్టమైన మలమును సమిధలుగా వేసిననూ అవి మండి ఎర్రగా మారుతాయి. అప్పుడు చందనపు సుగంధముగాని, మలము దుర్గంధముగాని నిలిచి వుండదు. రెండును అగ్ని రూపమును సంతరించుకొంటాయి. అదేవిధముగా యోగసాధన రూపమైన తపస్సులో, బ్రహ్మాగ్నిలో అన్నీకూడా బ్రహ్మముగా మారిపోతాయి. యోగసాధన, తపస్సుచేసి సాధకులు పైన చెప్పిన అనుభవములను పొందవలసియున్నది.

కుండలినీ శక్తి గురువు లభ్యము కాకపోయినా జాగృతము కావచ్చు
సద్గురువు కొరకు తపస్సు చేయవలసి యుంటుంది. పైన ఉదహరించిన స్థి
గురువు అనుగ్రహముతో శక్తి జాగరణ కారణముగా కలిగినప్పటికీ కొం
గురువు ద్వారా కాకుండా ప్రాణాయామ సాధన చేసే సాధకులలో కుండలి
జాగరణ తాలూకు శుభలక్షణములు కన్పిస్తాయి. ప్రాణాయామముతోనే కుండలి
జాగృతమవుతుంది. ఆత్మశక్తి జాగరణ వలన పైన చెప్పిన స్థితులన్నీ కలుగు
ఇందులో సందేహములేదు. ప్రపంచములో తత్త్వవిచారము చేసేవారిలో మను
తనకు తానుగా చిత్తములోని అశుభ ప్రవృత్తులను నిరోధించి తనను
ఉద్ధరించుకొనగలడు. సమస్తప్రాణులకు భగవానుడే గురువును అయివు
కాని మనుష్యునిలో ఇంకొక ప్రత్యేకత ఏమంటే అతడు ప్రత్యక్ష లేక ప
జ్ఞానముద్వారా తన శ్రేయస్సును నిర్ణయించుకొంటాడు. ఎందుకంటే అ
సహజముగా వివేకవంతుడు. అందువలన గురువును లభ్యము కాకపో
చింతించక తపస్సు చేస్తూ వుండాలి. పైన చెప్పిన గురువు పొందుటకొరకు కా
తపస్సు చేయవలసి వుంటుంది. అనగా తపస్సును, సాధనగురువు ఆలంబ
ఆత్మ గురువును ప్రాప్తించుకొనుట కు చేయవలయును. దైవికముగా సద్గు
లభిస్తే అతడు మహాభాగ్యవంతుడవుతాడు. ఎందుకంటే సాధకునికి ఉపయుక్త గు
లభించుట అంత సులభముకాదు. గురువు లభించగలడని భావించి తప
నిర్లక్ష్యము చేయరాదు. పురుషార్థమును నిర్వర్తించ వలసి యుంటుంది. ఎప్పు
ఒకప్పుడు సద్గురువు లభిస్తాడు. చేసిన ప్రయత్నము ఎన్నటికీ వృధాకాదు.
సమయములో ఫలితము లభిస్తుంది. గురువు లభించినప్పటికి సాధకుడు వెంట
ముక్తుడు కాలేడు. తరువాత కూడా సాధనను అనుష్ఠించవలసి ఉంటుంది.
విశ్వాసమును నిలుపుకొంటే అంతా మంగళకరము కాగలదు.

**యోగముయొక్క ఫలము ప్రత్యక్షముగా కనిపించును :** మహాయోగ
అనుష్ఠించే సాధకులలో కుండలినీ శక్తి జాగృతమయి క్రియలను చేస్తుంది
చెప్పబడినది. సాధకులకు పైన చెప్పిన స్థితులు కలుగవచ్చును లేక ప్రత్యేక
స్థితులు కలుగవచ్చును. తమ సంస్కారముల ననుసరించి అవసరమైన మేర
జరుగుతుంది. ఇందులో ఇసుమంతయినా సందేహములేదు. మహాయోగము యొ
మాహాత్మ్యము చాలా గొప్పది. యోగమాయ కుండలినీ శక్తి క్రియలను చేయించు
ప్రత్యక్షముగా జరిగే పనులకు ప్రమాణము అవసరములేదు. ఎవరైనా సాధకు



దురదృష్టవశాత్తు పూర్ణ యజ్ఞమును నిర్వర్తించ లేనప్పుడు లేక గురువుయొక్క కృపను
పరిపూర్ణముగా సంపాదించలేనపుడు పైన చెప్పిన అనుభవములలో అసంపూర్ణత
కలుగవచ్చును. అందువలన సాధకుడు గురువుయొక్క పరిపూర్ణ కృపకు పాత్రులు
కావలసి వుంటుంది. యజ్ఞము విధిపూర్వకముగా అనుష్ఠించినపుడు ఈశ్వరుని
కృపతో అన్నీ సిద్ధించును. శ్రద్ధ, బలము, స్మృతి, మేధస్సును సంపాదించవలసి
వుంటుంది. ఉత్సాహముతో, సాహసముతో తత్వ వివేచనచేసి సాధకుడు సిద్ధావస్థకు
వెళ్ళవలసియుంటుంది. అందువలన నిరంతరము జాగరూకతతో వుండవలసి
ఉంటుంది. విఘ్నముల బెడద ఎప్పుడూ ఉంటుంది.

**మనస్సును దుష్ట సంస్కారములు బాధించగలవు :** మనస్సులోని దుష్ట
సంస్కారములు చాలా ప్రబలముగా వుంటాయి. పైన ఉదహరించిన ప్రత్యక్ష
ప్రమాణములను, ఆశ్చర్య జనకమైన స్థితులను అనుభవించి కూడా ఆత్మ విశ్వాసము
లేక చాలామంది సాధకులు గురుకృపద్వారా ప్రాప్తించిన సాధనను నిర్లక్ష్యముచేసి
ముందుకు పోలేరు. కారణమేమంటే వారి మనస్సులలో దుష్ట సంస్కారములు మొదటి
నుండి వుంటాయి. చిత్తశుద్ధి కొరకు ఎటువంటి సాధనలు వారు చేసి యుండరు.
అకస్మాత్తుగా ఆత్మశక్తి జాగృత పరచబడిన సాధకులలో దుష్ట సంస్కారములు నశించి
వుండవు. అవి సాధనచేయుటకు అడ్డుపడుతూ వుంటాయి. సాధనను స్థిరచిత్తముతో
చేయవలసి వుంటుంది. దీనివలన శుభ సంస్కారములు ప్రబలమవుతాయి. దుష్ట
సంస్కారములు నశిస్తాయి.

అందువలన శాస్త్రములలో సాధకుల పాత్రత యొక్క ఆవశ్యకత ఉల్లేఖించ
బడినది. పాత్రత లేకుండా గొప్పవైన వస్తువులను కూడా ఎవ్వరూ సంరక్షించు
కొనలేరు. అందువలన సాధకులు కడు జాగ్రత్తతో సద్గురుని స్మరించి ఈశ్వరుని
అనుగ్రహమునకు ప్రార్థించవలసి ఉంటుంది. ప్రయాగలో (సుషుమ్నలో)
దివ్యస్నానము చేయగానే సాధకులలో కుండలినీ శక్తి జాగృతమయి క్రియాశీల
మవుతుంది. అంటే సాధకునికి దివ్యలోకాల ద్వారాలు తెరువబడతాయి. కాని వెంటనే
సాధకులు అక్కడికి వెళ్ళలేరు. ప్రయాగ తీర్థ అధిష్ఠాన దేవత యొక్క దర్శన భాగ్యము
పొందవలసి యున్నది.

**కుండలినీ శక్తి మనస్సు, ప్రాణము, శరీరములను సంఘటిత పరుస్తుంది**
సాధకునికి శాస్త్ర విషయము ద్వారా ప్రాప్తించిన జ్ఞానము సుదృఢ పరచటానికి.
అపరిపక్వ జ్ఞానమును పరిపక్వ స్థితిలోనికి తేవటానికి కుండలినీశక్తి అనేక శారీరక,

మానసిక క్రియలను చేయిస్తుంది. దీనివల్ల సాధకుని శరీరము, మనస్సు, ప్రాణము స్వస్థతను పొంది సంఘటిత మవుతాయి. శరీరము శుద్ధి లేకుండా దుర్బల మనస్సుతో ఎవ్వరూ ఆత్మదర్శనమును పొందలేరు. అందువలన యోగమాయ అయిన కుండలినీశక్తి ఆత్మజ్ఞానము కొరకు సాధకునికి అవసరమైన సాధనలను చేయిస్తుంది. దీనివలన సాధకుడు ఈ జన్మలోనే ముక్తిని పొందగలడు. జీవన్ముక్తి ఇవ్వగలిగినది మహాయోగము. దీనిలో నాలుగు స్థితులు వుంటాయి.

**మహాయోగము యొక్క నాలుగు స్థితులు :** ప్రారంభస్థితి, ఘటావస్థ, పరిచయావస్థ, నిష్పత్తి అవస్థ అను ఈ నాలుగు స్థితులు చిత్తవృత్తుల నిరోధ రూపములో అన్ని యోగములలోను వస్తూ వుంటాయి.

**ప్రారంభస్థితి :** జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము ద్వారా ఉత్పన్నమయ్యే బాహ్యకర్మలను త్యాగముచేసి అంతరిక మానసికకర్మ కుండలినీ శక్తి ప్రేరణద్వారా జరిగెడి యోగసాధనను ఆరంభస్థితి అంటారు. అనగా కుండలినీ శక్తి జాగృతమై క్రియలను చేయుటను ఆరంభస్థితి అంటారు. వాస్తవముగా యోగము ఇక్కడి నుండి ఆరంభమవుతుంది.

ఆ ప్రారంభస్థితిని యోగమాయ కుండలినీశక్తి హఠయోగముతో ప్రారంభిస్తుంది. ఇందులో నానా విధాలయిన శారీరక క్రియలు ఘటిస్తాయి. వివిధ ఆసనములు, బంధములు, ముద్రలు, ప్రాణాయామముల ద్వారా నాడీ శుద్ధి జరుగుతుంది. ఆసనముల ద్వారా శరీరమునకు స్థిరత్వము వస్తుంది. బంధములు, ముద్రల ద్వారా శరీరమునకు దృఢత్వము వస్తుంది. ప్రాణాయామముద్వారా శరీరము తేలిక పడుతుంది. నాడీశుద్ధి ద్వారా శరీర సామ్యత సిద్ధిస్తుంది. హఠయోగము ద్వారా శరీరము పరిపక్వమవుతుంది. అంటే శరీరమును నియంత్రణలో పెట్టుట హఠయోగము ద్వారానే సాధ్యపడుతుంది. హఠయోగము చేయకుండా జ్ఞానలాభము కలుగదు.

**ఘటావస్థ :** రెండవస్థితి ఘటావస్థ అయివున్నది. ఘటావస్థ స్థితిలో శరీరము సంపూర్ణముగా శుద్ధముగా ఉండి సత్వగుణ యుక్తంగా వుంటుంది. విషయ వాసనలు క్షీణిస్తాయి. ఎల్లవేళలా ఈశ్వరుని స్మరణ నిలిచి ఉంటుంది. హఠయోగము, లయయోగము సులభమవుతాయి. సాధకుడు పవిత్రముగా, ప్రసన్నుడుగా వుంటాడు. వైరాగ్యము రోజురోజుకూ పెరుగుతూ వుంటుంది. ఈశ్వరుని సమాగమము కొరకు మనస్సు వ్యాకులపడుతుంది. ఆరంభ స్థితి, ఘటావస్థ రెండూ కలిసే వుంటాయి.



ఆరంభ స్థితిలో శరీరము, ఘటావస్థలో మనస్సు సంఘటిత మవుతాయి. ఈ రెండు స్థితుల ద్వారా శరీరము, మనస్సు శుద్ధము మరియు స్వస్థతకు వెళ్ళేమార్గము సుగమవుతుంది. దీనితో సాధకుడు ప్రాణవాయువును సుషుమ్న మార్గములో ప్రవేశపెట్టి నిలిపేసామర్థ్యమును పొందుతాడు. అందువల్ల ప్రాణ నిరోధము జరిగి మనస్సునకు స్థిరత్వము వస్తుంది. ఈ స్థిరత్వము ప్రాప్తించు స్థితిని జ్ఞానులు యోగ సాధనలో ఘటావస్థగా చెప్పియున్నారు. తరువాత పరిచయావస్థను సాధకుడు పొందుతాడు.

**పరిచయావస్థ :** పరిచయావస్థలో సాధకుని ప్రాణము అంతరాకాశములో విలీనమవుతుంది. ప్రాణశక్తి అయిన కుండలినీదేవి హృదయాకాశములో ప్రాణమును స్థిరపరచి, సహస్రారములో శివునితోపాటు కలిసి యుంటుంది. ప్రాణనిరోధము అయినంత వరకు సాధకుడు శారీరకముగా, నిష్క్రియుడుగా, నిర్జీవముగా వుంటాడు. బాహ్య లక్షణములనుబట్టి అతడు నిర్జీవుడుగా మృతుడిగా కనబడినప్పటికి అంతరములో సజీవుడుగానే వుంటాడు.

పరిచయావస్థలో ప్రాణముతోపాటు ఆత్మశక్తి మిళితమవుతుంది. అందువలన మహాయోగములో పరిచయావస్థ లేక సిద్ధావస్థ అత్యంత మహత్వ పూర్వకమైనదిగా చెప్పబడుతుంది. ఈ స్థితిని పొందిన సాధకుని సిద్ధుడు అని అంటారు. అతడు అలౌకిక సామర్థ్యమును కలిగివుంటాడు. కుండలినీదేవి కృపతోగాని, దేవుని అనుగ్రహముతోపరిచయావస్థ ప్రాప్తించుతుంది. ఈ స్థితిలో సంకల్పమాత్రముచే ప్రాణశక్తి శరీరము నుండి లాగివేయబడి మూలాధారములో ఏకత్రితమవుతుంది. ప్రాణశక్తి ఒకచోటకు ఏకత్రితమవుతుండగా సాధకుడు అనిర్వచనీయమైన సుఖమును పొందగలడు. శరీరములో ఏ స్థానము నుండి ప్రాణశక్తి లాగి వేయబడినదో ఆ స్థానము మృతినొందిన విధముగా నిష్క్రియమవుతుంది.

శరీరమంతటా వ్యాపించిన ప్రాణము అంగుష్ఠ మాత్రముగా మారి అతిసూక్ష్మ స్థితిలో సుషుమ్న మార్గమునందు ప్రవేశించి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రములద్వారా సహస్రారములో ప్రవేశిస్తుంది. దీనితోపాటు జఠరాగ్ని మరియు మనస్సు కూడా ప్రాణములో కలిసిపోతాయి. బిందువు (వీర్యము) స్వస్థానములో భస్మము అయి ఓజః శక్తిగా మారుతుంది. ఆ స్థితిలో సాధకుడు బ్రహ్మాండమునంతటిని క్రియాశీలము చేసెడి మరియు అందరిలో జీవనరూపములో నున్న ప్రాణ పరిచయమును పొంది కృతార్థుడవుతాడు.

ఈ స్థితిలో సాధకుని బుద్ధిలో ఆత్మతేజము యొక్క ఛాయ ప్రతిఫలిస్తుంది. ఈ జ్ఞానస్థితిని పొందిన బుద్ధి ఋతంభరా ప్రజ్ఞను కలిగి వుంటుంది. సత్యజ్ఞాన సాక్షాత్కారముచే సాధకుడు సిద్ధుడవుతాడు. అనగా ప్రకృతిపై ఆధిపత్యము సాధిస్తాడు. అప్పుడు అతడి కొరకు సర్వత్రా శక్తి యొక్క భాండాగారము తెరువబడుతుంది. కుండలినీశక్తి సరళముగా మారి సుషుమ్నను తన స్థావరముగా చేసుకొంటుంది. అందువల్ల సాధక యోగివర్యునకు ఆత్మజ్ఞానమునకు సంబంధించిన సాధనములన్నియు సహజమవుతాయి. అతడు తలచుకుంటే తన ఆత్మ సామర్థ్యమును ఇతరుల కెవరికైనా ఇవ్వగలడు. బద్ధజీవుల సామర్థ్యమును పెంచగలడు. తన ప్రాణమును ఇతర ప్రాణులలో ప్రవేశపెట్టగలడు. ఇతరుల ప్రాణములను ఆకర్షించగలడు. ప్రకృతి అతడికి అనుకూలముగా మారుతుంది. అందువలన అతడి ఇచ్ఛానుసారముగా కుండలినీశక్తి ఇతరుల శరీరములో జాగృతమవుతుంది. క్రియలను చేస్తుంది. ఇతరుల ప్రారబ్ధకర్మను తన ఇష్టానుసారముగా మార్పు చేయగలడు. అనుభవించవలసిన వ్యాధులను ఒక శరీరమునుండి మరియొక శరీరమునకు సంకల్పమాత్రముచే మార్చి వేయగలడు. జడపదార్థములైన పాషాణాదులలో ఇతరుల వ్యాధులను తన శుద్ధ సంకల్పముతో అనుభవింపజేయగలడు.

అతడి మనస్సు, ప్రాణము ఆత్మతత్వములో ఆకర్షింపబడుతూ వుంటాయి. హృదయ గ్రంథి తెరువబడుతుంది. సంశయములు కర్మ బంధాలు తొలగిపోతాయి. పరమేశ్వరుని కృపకారణముచే అతడు కృతార్థుడవుతాడు. అనేకులను కృతార్థులుగా చేయగలడు. లోక వ్యవహారములో అతడు ఎంత దురాచారపరుడుగా కన్పించినను అతడి స్వరూపజ్ఞానమునకు ఆవరణ దోషము అంటదు. అతడిని నిందించేవారు, అతడి పాపకర్మలను, స్తుతించేవారు, అతడి పుణ్య కర్మలను తీసుకొనిపోతారు. అతడు ఇక్కడ నుండి వెళ్ళేటప్పుడు నేరుగా సత్యలోకమునకు పోగలడు. పరిచయావస్థ ప్రాప్తించిన పురుషుడే సాధకుని భగవంతునితో కలుపగలడు. అతడు ఎవరినైనా ఎప్పుడు కావలెనంటే అప్పుడు భగవంతునితో కలుపగలడు.

నిష్పత్తి అవస్థ : ఈ స్థితిలో మహాసిద్ధి అయినటువంటి ఆత్మజ్ఞానము సిద్ధిస్తుంది. ఈ స్థితిలో సాధకుడు తన జీవత్వమును వదలి శివత్వమును పొందగలడు. మరియు కుండలినీ మహాశక్తి తన స్వస్థానమైన పరమశివునిలో లయమవుతుంది. అప్పుడు యోగికి జీవన్ముక్త స్థితి లభిస్తుంది. అప్పుడు యోగి కుండలినీ శక్తిని పరమశివునిలో విలీనముచేసే సామర్థ్యమును పొందగలడు.



# సిద్ధమహాయోగము

## ఎనిమిదవ ప్రకరణము

సాంప్రదాయానుసారము దీక్షా విధానము : జ్ఞానమార్గమునకు సంబంధించిన వేదాంత, యోగ, మంత్ర, తంత్ర, భక్తి మొదలుగాగల సంప్రదాయములన్నింటిలోను దీక్ష ఇవ్వబడుతుంది. శక్తిపాత దీక్ష ద్వారా సద్గురువులు పాత్రతగల శిష్యునిలో తమశక్తి సంచారమును కలుగచేస్తారు. అందువలన శిష్యుని బౌద్ధిక జ్ఞానము అతీంద్రియ విషయాలను సులభముగా గ్రహించ గలుగుతుంది. శక్తిపాత పద్ధతిలో ప్రాప్తించు దీక్షా విధానములో అనేక తారతమ్యములు కలవు.

శక్తి పాతమునకు సంబంధించిన దీక్షా పద్ధతి భగవానులైన మహేశ్వరుని నుండి పరంపరానుగతముగా వస్తూ వున్నది. నేటి యుగములో ఇది అంత ప్రాచుర్యములో లేదు. అందువలన చాలామంది సాధకులకు దీని గురించి తెలియదు. కాని ఈ విద్య తాలూకు బీజములు నశించిపోవు. ఆధ్యాత్మిక జ్ఞానములో వున్న గొప్పదనము శ్రీ మహేశ్వరునిచే ప్రసాదింపబడిన శక్తిపాతము ద్వారా వెంటనే తెలియబడుతుంది. ఏవిధముగా పరసువేది మణిని తాకిన ఇనుము బంగారముగా మారుతుందో అదేవిధముగా శక్తిపాత గురువులు మలిన సంస్కారములతో నున్న శిష్యుల మనస్సును బంగారముగా చేయగలరు. స్పర్శమణి కేవలము ఇనుమును బంగారముగా చేయగలదు. కాని ఈ మార్గములోని గురుదేవుల యొక్క విశేషగుణము ఏమంటే వారు తనమాదిరి ఇంకొక దివ్యస్పర్శ (అయస్కాంత) మణివంటి శిష్యులను తయారుచేయగలరు. తద్వారా జనులకు మంగళము కలుగచేయగలరు. ఈ పద్ధతిలో ఎప్పటివరకు గురువు శిష్యునికి గురుపదమును ప్రసాదింపడో అప్పటివరకు ఏ శిష్యుడు కూడా గురువుకాలేడు.

అనగా యోగ్య శిష్యుడు గురువుగా మారే అధికారము గురుపరంపర ద్వారా వస్తుంది. గురువు పాత్రత గల శిష్యునికి దీక్షద్వారా శక్తి ప్రసారము చేసి శివతత్వము, జీవతత్వము, ప్రకృతితత్వము, ఆత్మతత్త్వము లేక గురుతత్వములను అనగా మూలాధారములోవున్న శివతత్వము నుండి స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాచక్రము మరియు సహస్రారచక్ర పర్యంతము క్రమానుసారముగా తత్వజ్ఞానమును కలుగజేసి అతడిని కూడా గురుతుల్యునిగా తీర్చిదిద్దును. ఈ

విధముగా ఈ విద్యకు సంబంధించిన బీజములు నష్టపోకుండా పరంపరా గతముగా నిలిచియుండును.

ఈ విద్య భగవానులైన శ్రీ మహేశ్వరుల నుండి గురుపరంపరగా నిరంతరము కొనసాగుతూ వస్తున్నది. అందువలన ఏ సాధకుని గురు పరంపరలోని సద్గురువులు సంకల్పమాత్రముచే అయస్కాంత లక్షణములుగల గురుతుల్యునిగా చేస్తారో అతడే తిరిగి గురుపదమును అధిష్ఠించగల పూజనీయుడైన గురువు కాగలడు. ఎవరైతే తన ఉన్నతి కొరకు దీక్షను గురువు అనుగ్రహముతో పొంది సాధన ద్వారా కృతార్థులవుతారో వారు పరసువేది తాకిన ఇనుము మాదిరి బంగారముగా మారినప్పటికి ఇతరులకు కల్యాణ కారకమైన గురుపదమును పొందలేడు. కాని గురు కృపతో ఎవరు అయస్కాంత గురువుగా మారగలడో అతడే జనులకు కళ్యాణమును కలుగజేయగలడు. బంగారమునకు ఇనుమును అయస్కాంతము చేసే శక్తి లేదు. ఒక్క అయస్కాంతము మాత్రమే ఇనుప ముక్కను తిరిగి అయస్కాంతముగా మార్చగలదు. అన్ని లోహములు అయస్కాంతముగా తయారుకాలేవు. అదేవిధముగా గురువులందరు అయస్కాంత గురువులు కాలేరు. అనగా శక్తిపాత దీక్షను ఇవ్వలేరు. శక్తిపాత సాంప్రదాయపు గురుపరంపరలోని గురువులు మాత్రమే శాస్త్ర సమ్మతమైన దీక్షను ఇవ్వగలరు.

**దీక్ష యొక్క అర్థము :** "దీక్ష" అనుశబ్దములో రెండు అక్షరములున్నవి. "దీ" అను అక్షరము 'క్ష' అను అక్షరము కలసి దీక్ష అయినది. 'దీ' అను అక్షరమునకు దివ్యజ్ఞానము ఇచ్చునది అని అర్థము. 'క్ష' అను అక్షరమునకు అన్ని పాపములను క్షయము చేయునది అని అర్థము. అనగా దీక్ష ద్వారా మానవుల పాపరాశి దహించబడి దైవీ శక్తి ప్రాప్తిస్తుంది. దీక్షద్వారా పరమశివుని మాదిరిగా సాధకుడు సమాధిస్థితిని పొందగలడు. అది జీవుని ఆవరించిన మూడు ఆవరణలను తొలగిస్తుంది. దీక్ష తంత్రము యొక్క అర్థము తెలిసిన ఋషులు దీనిని "దీక్ష" అని అన్నారు. అనగా దీక్ష కొరకు ఎవరిని పడితే వారిని ఆశ్రయించి వారి పాదములు పట్టుకొనుట వలన జనులకు మంగళము కలుగదు.

దీక్ష బ్రహ్మజ్ఞానమును ఇచ్చి కర్మబంధములను తొలగిస్తుంది. అందువలన తాత్వికులైన జ్ఞానులు దీనిని "దీక్ష" అని అన్నారు. మనస్సు ద్వారా, వాక్కు ద్వారా, కర్మలద్వారా సంచయమయిన పాపరాశిని దీక్ష దహించి వేస్తుంది. దీక్షద్వారా ప్రత్యక్ష జ్ఞానము లభించి, ద్వైతభావము నశించి మనోనాశము జరిగి ముక్తిని పొందగలరు.



**దీక్షా విధానములు :** శ్రీ గురువుల ద్వారా ప్రాప్తించిన దీక్ష మూడు విధములుగా వున్నది. అవి స్పర్శ దీక్ష, దృష్టిదీక్ష, మానస దీక్ష అయివున్నవి. సమర్థ గురువుల అనుగ్రహము ద్వారా శిష్యునికి హస్త స్పర్శద్వారా ఇచ్చు దీక్షను స్పర్శదీక్ష అని, తన దివ్య దృష్టితో ఇచ్చు దీక్షను దృగ్దీక్ష అని, సంకల్ప మాత్రముచే ఇచ్చు దీక్షను మానసదీక్ష అని అంటారు. దీక్ష ద్వారా కుండలినీశక్తి జాగృతమయి స్వతః సిద్ధసాధన ప్రారంభమవుతుంది. ఇందులో సాధకుడు తనకు తానుగా చేయవలసినది ఏమీ వుండదు. ఈ దీక్షలు క్రియావతి, కళావతి, వర్ణమయి, వేధిమయి అను నాల్గు విధములుగా వర్గీకరించబడినవి. సర్వసంపదలను అనుగ్రహించే శుభకరమైన వివిధములైన దీక్షలను పైన పేర్కొనిన వర్గీకరణలో చేర్చవచ్చును.

శివపరమాత్మ చెప్పిన విధముగా దీక్షలు స్పర్శ ద్వారా, దృష్టి ద్వారా మనస్సుద్వారా ప్రదానము చేయబడతాయి. కాని బ్రహ్మ దేవుని మతానుసారము ఈ దీక్షలు నాల్గు విధాలుగా వుంటాయి. అవి మనస్సుద్వారా, వాక్కుద్వారా, దృష్టిద్వారా, స్పర్శద్వారా ఇవ్వబడతాయి. దీక్ష ఇచ్చే స్థానము, సమయము మరియు అధికార భేదము, ఉపాసనాపద్ధతులలోని భిన్నత్వము కారణముగా దీక్షా విధానములు అనేక విధములైన పేర్లతో పిలువబడుతున్నాయి. ఈ దీక్షలు దేశ, కాల, పాత్రానుసారము ఇవ్వబడుతాయి. అందువలననే వేదాంత మార్గములో శాంభవీదీక్ష, తంత్రమార్గములో వేధదీక్ష, మంత్రమార్గములో మంత్రదీక్ష లేక అణవీదీక్ష మరియు భక్తి మార్గములో వైష్ణవీ దీక్షలు ఇవ్వబడతాయి. ఇదేవిధముగా వేదాంత మార్గములో, యోగ మార్గములో, మంత్ర, తంత్ర, భక్తి మార్గములకు సంబంధించిన సంప్రదాయము లన్నింటిలోను దీక్షా విధానము పరంపరాగతముగా వస్తున్నది. అందువలన ఇహలోక బంధ విముక్తి కొరకు దీక్షను గ్రహించిన సాధకులందరు వారి వారి గురువుల ద్వారా దీక్షను తీసుకొన్నప్పటికి కాలప్రభావము వలన అంటే వారి దురదృష్టమువలన దీక్షా ఫలితములైన జ్ఞానము, పరమశాంతిని పొందలేకపోతున్నారు. ఎక్కడనో ఒక అదృష్టవంతుడు మాత్రమే వాటిని పొందగలుగుతున్నాడు.

**వేదాంత మార్గములోని శాంభవీ దీక్షా విధానము :** సమర్థులైన గురువుల కృపాశక్తి స్పర్శద్వారా, దృష్టిద్వారా లేక ఉపదేశము ద్వారా అనుగ్రహించబడినప్పుడు శిష్యుడు సాధనలు ఏమీ చేయనవసరములేదు.

పరమ కృపాలుడైన గురువుల యొక్క దృష్టి మాత్రముచేగాని, బోధచేగాని లేక సిద్ధగురువులయొక్క స్పర్శతోగాని శక్తి శిష్యునిలో ప్రసరింపబడి శిష్యునిలో వెనువెంటనే

దివ్యజ్ఞానము ఉత్పన్నమవుతుంది. గురువు కృపకారణముగా ఆత్మ సాక్షాత్కారమును కలిగించే దీక్షను తత్వవేత్తలు శంభు పదమును ప్రాప్తింపజేసే శాంభవీ దీక్షగా అభివర్ణించి యున్నారు. శ్రీ గురువుల అనుగ్రహము కారణముగా శివస్వరూపమైన సమాధి అనుభవము శిష్యునిలో కలిగి అతడు కృతార్థుడవుతాడు. ఈ దీక్ష శిష్యునికి వెంటనే సిద్ధి కలిగిస్తుంది.

**యోగమార్గములోని యోగదీక్ష మరియు శక్తిదీక్షా విధానము :** శక్తివంతులైన యోగ గురువులు తమ సామర్థ్యమును అనుసరించి సంకల్ప మాత్రముచే ఇతరులలో వేర్వేరు చిత్త స్థితులను కలుగజేసి అనేక ప్రకారములయిన క్రియలను ఉత్పన్నము చేయగలరు. పరమయోగీశ్వరుడైన కపిలముని తన జిజ్ఞాసువైన శిష్యునికి తంత్రజ్ఞాన ఉపదేశమును ఉత్తమ చిత్త స్థితిని కలుగజేసి అనుగ్రహించారు.

ప్రకృతి పై స్వామిత్వము గల యోగులకు ఈ విశ్వములో అసాధ్యమైనది ఏమియులేదు. వీరు తమ యోగబలముతో ఎవరిని ఏవిధముగా చేయాలనుకొంటే వారిని ఆ విధముగా చేయగలరు. యోగమార్గములోని ప్రత్యేకతను ఇది సూచిస్తుంది. యోగశాస్త్రము ద్వారా కాకుండా ఇతర శాస్త్రముల ద్వారా ప్రాప్తించిన జ్ఞానముయొక్క ఫలము చాలాకాలము తరువాతగాని లేక జన్మాంతరములో గాని లభించదు. కానీ యోగశాస్త్రము ద్వారా ప్రాప్తించిన జ్ఞానము వెంటనే, స్వల్పసమయంలో ఈ జన్మలోనే ఫలిస్తుంది. అందువలన యోగ శాస్త్రమును ప్రత్యక్ష శాస్త్రముగా అభివర్ణించియున్నారు. శ్రీ మహేశ్వరులు చెప్పిన విధముగా యోగి శిష్యుని సూక్ష్మశరీరములో ప్రవేశించి అతడి ఆత్మను తన ఆత్మతో అనుసంధానము చేయిస్తాడు. అనగా తన సామర్థ్యమిచ్చి నిర్వికల్ప స్థితిని కలుగజేస్తాడు. ఇందులో గురువుయొక్క ఆత్మ బలము కారణముగా శిష్యునిలో జ్ఞానము లేక సమాధి స్థితి కలుగుతుంది. అణిమాది మహాసిద్ధులు కలుగుతాయి.

శ్రీ గురువులు యోగమార్గముద్వారా శిష్యుని శరీరములో ప్రవేశించి జ్ఞానచక్షువుతో, దివ్యదృష్టితో ఇచ్చేదీక్ష జ్ఞానవతి శాక్తదీక్షగా చెప్పబడినది. శాక్తదీక్షలో గురువు శిష్యుని సామర్థ్యమును పరీక్షించి అతడి అర్హతను నిర్ణయిస్తాడు. శాక్త దీక్షకు అర్హతవుంటే దీక్షను ప్రదానం చేస్తాడు. మిగిలిన దీక్షలన్నింటిలో శిష్యుడు గురువు వద్దకు రావలసి వుంటుంది, లేక గురువు శిష్యునివద్దకు పోవలసి ఉంటుంది. కానీ ఈ శాక్త దీక్ష గురువు యొక్క యోగశక్తితో ఇవ్వబడుతుంది. శాక్త దీక్షలో ప్రత్యేకత



ఏమంటే గురు శిష్యులు వేర్వేరు ప్రదేశములలో వున్నప్పటికి గురువు సంకల్ప శక్తితో శక్తి ప్రసరణ జరిగి దీక్షా ప్రదానము జరుగుతుంది. అందువలననే ఈ దీక్షను జ్ఞానవతి శాక్త దీక్షగా పేర్కొన్నారు. శ్రీ మహేశ్వరుల అనుగ్రహములో యోగమార్గములో ఈ విధముగా జరగటం చాలా స్వాభావికము. ఇందులో సందేహ పడవలసిన విషయమేమీలేదు. ఇటువంటి సంఘటలను మనము ప్రత్యక్షముగా కూడా చూడవచ్చును. దేశ, కాల, మరియు పాత్రతను అనుసరించి యోగమార్గములో అన్నియు జరుగగలవు. గురువుయొక్క యోగశక్తి ద్వారా ఇవ్వబడే ఈ దీక్షను శక్తి దీక్ష అంటారు. ఇందులో శక్తి పరాకుండలినీ దేవి అయివున్నది. గురుదేవుల అనుగ్రహముతో దీక్షనిచ్చినప్పుడు కుండలినీశక్తి మేల్కొనుట ద్వారా సమస్త శక్తులకు సంబంధించిన భాండాగారము తెరువబడుతుంది. శిష్యుడు తనకు తానుగా చేయవలసిన దేమియువుండదు. కుండలినీ శక్తి తనకు తానుగా క్రియలను చేయిస్తుంది. అందువలన ప్రాణము పశ్చిమ మార్గమైన సుషుమ్నలో ప్రవహించుట మొదలవుతుంది. కుండలినీశక్తి ప్రాణశక్తితోపాటు బ్రహ్మనాడిలో ప్రవేశించి సహస్రారములోని శివునితో ఐక్యమవుతుంది. అప్పుడు ప్రాణము బ్రహ్మరంధ్రములో లయమవుతుంది. సుషుమ్నా మార్గముద్వారా కుండలినీశక్తి పరమేశ్వరుని కలియుటనే శాక్త దీక్ష అంటారు. ఈ విధముగా శక్తి, శివునితో కలిసిన తరువాత శిష్యునికి ఇంక చేయవలసిన పని ఏమియు వుండదు. శిష్యుడు గురువునకు దగ్గరగా వున్నా లేకపోయినా శిష్యునికి గురుశక్తి యొక్క జ్ఞానము సర్వకాలము ఆవశ్యకత ననుసరించి లభిస్తూ వుంటుంది. గురువు యొక్క సామర్థ్యముతో ఇవ్వబడే ఇటువంటి దీక్ష జ్ఞానవతిశాక్త దీక్షగా చెప్పబడినది.

**మంత్రమార్గములో మాంత్రి మరియు అణవీదీక్ష పద్ధతులు :** గురువు మంత్రశాస్త్రానుసారము తన ఇష్టదేవతను సాక్షాత్కరింపజేసుకొని శిష్యునికి కూడా బోధను కలుగజేయుటనే మంత్రదీక్షగా చెప్పబడుతుంది. గురువు మంత్రమూర్తిగా మారి ప్రేమతో శిష్యునిలో మంత్రశక్తిని ప్రసరింప చేయుటద్వారా మంత్ర చైతన్యమును కలుగజేస్తాడు. మంత్ర చైతన్యము ద్వారా మంత్ర ప్రతి పాద్యశక్తి అయిన కుండలినీ శక్తి మేల్కొని శిష్యునికి ఉపాస్యదేవతా సిద్ధిని కలుగజేస్తుంది. ఈ మంత్రదీక్షలో శక్తి గురువుయొక్క ఆత్మబలము ద్వారా ప్రాప్తిస్తుంది. అప్పుడు శిష్యుని శరీరము కంపించి ఇష్టదేవతయొక్క ఆవేశమువల్ల శిష్యుడు తన్మయుడైపోతాడు. అతడి మనస్సు, ప్రాణము, దేహములలో మార్పు కలిగి భావసమాధి స్థితి ప్రాప్తిస్తుంది. ఈ మంత్రదీక్ష,

మంత్రము ద్వారా యంత్రముద్వారా, గురుపూజ మరియు అర్చనలద్వారా ప్రదానము చేయబడుతుంది. దీనియొక్క ఫలితము ప్రవృత్తి పరాయణులైన వారికి భోగములను కలుగజేసి నివృత్తి పరాయణులైన వారికి మోక్షమును కలుగజేస్తుంది. ఈ మంత్రదీక్షా పద్ధతిలో భోగ మోక్షములు రెండునూ కలుగగలవు.

**అణవీ దీక్షాపద్ధతి :** మంత్రశాస్త్రములో చెప్పిన విధముగా మంత్ర, అర్చన, ఆసన, న్యాస, ధ్యాన, ఉపచార విధానములద్వారా మరియు శాస్త్రములలో చెప్పిన విధముగా ఇవ్వబడే దీక్షను అణవీ దీక్షలని అంటారు. శివ శక్తుల కలయిక వల్లగాని పూర్వజన్మలలోని పుణ్యఫలమువల్లగాని, లేక శివపూజానుష్ఠానమువల్లగాని సాధకునిలో పాప పుణ్యకర్మములయొక్క సామ్యస్థితి కలిగినపుడు అనగా పాపపుణ్యములు సమానమైన స్థితిలో ఈ అణవీ దీక్షవలన సాధకుడు శివస్వరూపమును పొందుతాడు. అనగా నిష్కామముగా పరమార్థమును కాంక్షిస్తూ శాస్త్రములలో చెప్పినవిధముగా సమర్ధులైన గురువులను ప్రసన్నము చేసుకొని ఏ సాధకుడు దీక్షను పొందుతాడో అతడు ఆ దీక్షల ఫలితమైన ముక్తిని పొందగలడు.

**తంత్రమార్గములో వేధ దీక్షలు :** ఇహలోక బంధ విముక్తిని కలుగజేసే దీక్షలు వేధ దీక్షలుగా చెప్పబడతాయి. గురువు శిష్యుని శరీరములో విమలము, తేజోమయము, దేదీప్య మానమైన, త్రికోణ మధ్యస్థముగా కోటి విద్యుత్ కాంతులలో పరివేష్టితమై మహాప్రకాశముతో వెలుగొందుచున్న శివశక్తి అయిన కుండలినీ దేవియొక్క ధ్యానమును చతుర్దళ మూలాధార కమలమునందు చేస్తాడు. ఆ శక్తియొక్క దివ్యశరీరము చైతన్య స్వరూపముగా ఉండి సూక్ష్మాతి సూక్ష్మమైన శక్తిని కలిగి ఉంటుంది. ఆ దివ్యశక్తిని సుషుమ్న మార్గములో ప్రవేశపెట్టి షట్చక్రముల వేధద్వారా శివపరమాత్మలో విలీనము చేయాలి. పై విధముగా గురువు తన ఆత్మశక్తిని ప్రసరింపజేసి శిష్యునికి ఆ పరమేశ్వర స్వరూపమును బోధపరుస్తాడు.

శ్రీ మహాదేవుని పరంపరా గతమైన మార్గమును అనుసరించే జ్ఞాన యుక్తులైన గురువులు ఉపదేశమిచ్చినపుడు, శక్తి పాతము కారణముగా శిష్యుడు పాపరహితుడై బంధ విముక్తిని పొంది వెనువెంటనే బహిర్ వ్యాపారముల నన్నింటిని మరచి భూమిపై పడతాడు. దివ్యభావ ప్రాప్తివల్ల అతనికి సర్వమును తెలియబడుతుంది. అనగా దీక్షాస్థితిలో గురువు ఎటువంటి భావమును కలిగివుంటాడో శిష్యునికి కూడా అటువంటి భావప్రాప్తి కలుగుతుంది.



అనగా శిష్యునిలో వెంటనే బోధకలుగుతుంది. అతడిలో మహాసుఖానుభూతి కలుగుతుంది. ఈ స్థితిలో వేధదీక్ష ప్రాప్తించుకొన్న సాధకుడు సాక్షాత్తు శివ స్వరూపుడవుతాడు. అతడికి పునర్జన్మ కలుగదు. ఇటువంటి తీవ్రతరమైన వేధదీక్ష ద్వారా భవబంధములన్నియు తొలగిపోయి సాధకునికి శివభావము (కళ్యాణము) నిశ్చయముగా ప్రాప్తిస్తుంది.

గురుదేవుల అనుగ్రహముతో వేధ దీక్ష పొందినపుడు శిష్యునిలో ఆనందము, కంపము, ఉద్భవము, శరీరము గిరగిరా తిరుగుట, నిద్ర మరియు మూర్ఛ అను ఆరుస్థితులు కలుగగలవు. ఈ ఆరుస్థితులు కలిగాయి అంటే వేధ దీక్ష ప్రాప్తించినట్లే అని భావించాలి. వేధ దీక్ష ప్రాప్తించిన శిష్యుడు ఎక్కడ ఉన్నప్పటికి ముక్తిని పొందగలడు. ఇటువంటి పరమకళ్యాణకారి అయిన వేధ దీక్షను అనుగ్రహించగల గురువు లభించుట ఈ లోకములో దుర్లభము. ఈ వేధ దీక్షను పొందగల శిష్యుడుకూడా పుణ్యవశముననే లభించ గలడు. అందువలన శ్రీ మహేశ్వరుల ఆదేశమేమంటే పాత్రత లేకుండా ఎవరికిపడితే వారికి వేధ దీక్ష ఇవ్వకూడదు.

శక్తిపాతముద్వారా శిష్యుడు అనుగ్రహింపబడతాడు. ఎక్కడ శక్తి పాతము జరుగదో అక్కడ అనుగ్రహము కలుగదు. అనగా అసమర్ధుడైన గురువు ద్వారా శిష్యునికి మంగళము కలుగదు. శాంభవీ దీక్ష, యోగదీక్ష మరియు వేధ దీక్ష ద్వారా శక్తి పాతము చేయబడుతుంది. తత్ ఫలితముగా ఆత్మజ్ఞానము ఉదయిస్తుంది. యోగ, వేదాంత, తంత్ర శాస్త్రములలో చెప్పిన ఈ శక్తి పాతదీక్షా విధానము అత్యంత ఆశ్చర్యకరమైన ప్రభావయుక్తమైన ప్రత్యక్ష ఫలములను ఇవ్వగలదు.

శ్రీ మహాదేవుల వరప్రసాదముగా పై విద్య పొందిన మహాజ్ఞాని అయిన వశిష్ఠ మహర్షి ఈ విద్యను భగవానులైన శ్రీరామచంద్రునకు ప్రసాదించారు. శ్రీరామచంద్రునకు ఈ ప్రపంచము పట్ల వైరాగ్యస్థితి కలిగి అతడు నిద్రాహారములు మాని రాజసుఖాలను త్యాగముచేసి కృశించి పోయాడు. అప్పుడు ఋషి, మునులందరు ఆయనను రాజసభకు తీసుకొని వెళ్ళి అనేక విధములైన ఉపదేశ వాక్యములతో స్వాంతన పరిచారు. అప్పుడు విశ్వామిత్ర ముని, వశిష్ఠుల వారిని ప్రార్థించగా వసిష్ఠులవారు శ్రీ రామచంద్రునికి శక్తిపాతముచేసి గురుతత్వాన్ని బోధించారు. దీనిఫలితముగానే మనకు యోగవాశిష్ఠమనే జ్ఞానగ్రంథము ప్రసాదించబడినది.

సాధకుని ప్రబల పుణ్య ప్రభావముతో అతడిలోవున్న ధర్మాధర్మ సంస్కారముల సామ్య సంభవించినపుడు శ్రీశంభుని జ్ఞానాత్మక పరాశక్తి గురువు ద్వారా ప్రసరిం శక్తిపాతము జరుగుతుంది. అప్పుడు సాధకునిలో ఈ క్రింద నుదహరించి లక్షణములు అగపడుతాయి.

శక్తి పాతము జరుగగానే శరీరము భూమిపై పడుతుంది. శరీరములో కంపన కలుగుతుంది. మనస్సు అపరిమితమైన సంతోషమును పొందుతుంది. దానివల రోమాంచము కలుగుతుంది. చెమటపడుతుంది. పై లక్షణములు సాధకునిలో కలిగి మంగళమయుడైన మహేశ్వరుని కృప లభించినట్లుగా తలచాలి. సాధకుడు కృతార్థుడవుతాడు. అతడికి పునర్జన్మ వుండదు. ఈ విధముగా శంకరుని కృప ప్రసాదమును పొందిన సాధకులలో వేదాంతములో చెప్పిన బ్రహ్మజ్ఞానము ఉదయించి, అజ్ఞాన విముక్తుడవుతాడు. శక్తిపాతము అనుగ్రహించబడని భక్తిపరుడై శిష్యుడు సత్యవాది అయిన గురూపదేశములు విని, క్రమముగా సంసా బంధములనుండి విముక్తుడవుతాడు.

కాని శక్తిపాత లాభముపొందిన శిష్యుడు, నిస్సందేహముగా అదే క్షణముల ముక్తుడవుతాడు. అనగా వేదాంత ప్రతిపాదితమైన జీవన్ముక్తి పొందుటకు సాధకుని శ్రీ మహేశ్వరుల ప్రసాదితమైన గురుకృప అత్యావశ్యకము.

శ్రీ శంభునిచే అనుగ్రహించబడి పరంపరాగతముగా సంక్రమణమగుచు శక్తి యొక్క సామర్థ్యములో తేడాలు లేనప్పటికి, పాత్రతా భేదము కారణముగా శిష్యులను ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ అను మూడు విధాలుగా వర్గీకరణ చేసారు దీక్షా సమయములో శక్తి పాతము జరుగుటవలన కన్పించెడి లక్షణములు మూడు తరగతులుగా వర్గీకరించారు. వారికి లభించెడి ఫలితముకూడా మూడు విధములుగా ఉంటుంది. అంటే ఉత్తమ సాధకులకు వెంటనే, మధ్యమ సాధకులకు క్రమముగా, కనిష్ఠ సాధకులకు ఆలస్యముగా లభిస్తుంది. మొదటి తరగతిలేక యోగ్యుడైన ఉత్తమ అధికారి శిష్యులు ఆది నుండి భక్తిని కలిగి వుంటారు. దీక్షను ఉత్సాహముతో స్వీకరిస్తారు. దీక్ష తరువాత ఆనందభరితులవుతారు. వీరిని ఉత్తమశిష్యులు లేక యోగ్య లేక ఉత్తమ అధికార శిష్యులుగా చెప్పవచ్చును. వీరికి దీక్షాజనిత జ్ఞానము పక్షినేరుగా పండుపైన వాలినట్లుగా వెంటనే లభిస్తుంది.

రెండవ తరగతికి చెందిన మధ్యమ అధికారి శిష్యులు దీక్షాసమయమునందు జ్ఞానా జ్ఞానరహితులుగా ఉంటారు. వారు దీక్షను గురించిగాని లేక యోగమును



గురించిగాని ఎటువంటి జ్ఞానమును కలిగివుండరు. కానీ దీక్ష ప్రాప్తించగనే వారిలో భక్తి కలుగుతుంది. బుద్ధినిర్మలమవుతుంది. వీరిని మధ్యమ అధికారి శిష్యులుగా చెప్పవచ్చును. వీరికి ఉపదేశ ఫలము కోతి ఒకచెట్టుకొమ్మ నుండి ఇంకొక చెట్టుకొమ్మ మీదకు గెంతి ఫలమును పొందినట్లుగా క్రమముగా లభిస్తుంది.

మూడవ తరగతికి చెందిన కనిష్ఠ సాధకులు మొదటి నుండి భక్తిని కలిగి వుండరు. దీక్షను గ్రహించిన తరువాత భక్తి ఉదయిస్తుంది. ఈ విధముగా చివరిలో జ్ఞానభక్తి యుతులుగా మారెడి శిష్యులు కనిష్ఠ అధికార శిష్యులుగా చెప్పబడతారు. వారికి గురు ప్రదత్తమైన ఫలితము చాలాకాలము తరువాత గాని లభించదు. వారిప్రగతి చీమ నెమ్మదిగా ప్రాకి చెట్టుపైన వున్న పండువరకు చేరినట్లుగా చాలాకాలమునకు గాని లభించదు.

**భక్తిమార్గములో కూడా శక్తి పాతము కలదు :** వేదాంత లేక యోగ సంప్రదాయములలో చెప్పినట్లుగా గురుకృప కారణముగా ఆత్మశక్తి జాగృతమగుటచే మనస్సు, ప్రాణము మరియు శరీరములలో వివిధ క్రియలు ఉత్పన్నమయి శిష్యుని ఆత్మజ్ఞాన సంసిద్ధుని చేసినట్లుగా భక్తి మార్గములో కూడా గురుకృప లేక పూర్వ సంస్కారముల కారణముగా మరియు తన పురుషార్థ ఫలితముగా కుండలినీ శక్తి జాగృతమవుతుంది. అప్పుడు భక్తి సాధనలో కూడా శక్తిపాతము ద్వారా చిత్తస్థితికి అనుగుణముగా అన్ని బాహ్యలక్షణములు కలుగుతాయి. నాట్యము చేయుట, పాటలు పాడుట, భూమిపై పడిదొర్లుట, పెద్ద గొంతుతో సంకీర్తనము చేయుట, దీర్ఘశ్వాసను కలిగివుండుట, లోకనిందలను లేక పొగడ్తలను ఉపేక్షించుట, లాలాజలము స్రవించుట, పెద్దగా నవ్వుట, ఎక్కిళ్ళు వచ్చుట, శరీరములో చల్లదనపు అనుభవము మరియుచేతులతో కాళ్ళతో నేలను తాడించుట వంటి బాహ్యలక్షణములు కన్పించును.

ఎప్పుడైతే చిత్తము స్వస్థతను పొంది ప్రాణములో లీనమవుతుందో అనగా ప్రాణాయామము సంభవిస్తుందో అప్పుడు ప్రాణములో అనేక విధములైన బాహ్య, అంతర్క్రియలు కలుగుతాయి. ప్రాణము యొక్క క్రియాశక్తి కారణముగా శరీరములో విశేషరూపములో మార్పులు సంభవిస్తాయి. భక్తుని శరీరములో నిశ్చేష్టత, కంపము, స్వేదము, రోమాంచము, స్వరవికృతి, శరీర ఛాయ మార్పు, అశ్రువులు, నిద్రవంటి ఎనిమిది సాత్విక స్థితులు కలుగును.

ప్రాణము అప్పుడప్పుడు దేహములో పృథ్వీ, జలము, తేజము, ఆకాశమను నాల్గు మహాభూతములో ఏదో ఒక దానిని ఆలంబన చేసుకొని శరీరములో ఎల్లెడలా

సాధకుని ప్రబల పుణ్య ప్రభావముతో అతడిలోవున్న ధర్మాధర్మ సంస్కారముల సామ్యత సంభవించినపుడు శ్రీశంభుని జ్ఞానాత్మక పరాశక్తి గురువు ద్వారా ప్రసరించి శక్తిపాతము జరుగుతుంది. అప్పుడు సాధకునిలో ఈ క్రింద నుదహరించిన లక్షణములు అగపడుతాయి.

శక్తి పాతము జరుగగానే శరీరము భూమిపై పడుతుంది. శరీరములో కంపము కలుగుతుంది. మనస్సు అపరిమితమైన సంతోషమును పొందుతుంది. దానివలన రోమాంచము కలుగుతుంది. చెమటపడుతుంది. పై లక్షణములు సాధకునిలో కలిగితే మంగళమయుడైన మహేశ్వరుని కృప లభించినట్లుగా తలచాలి. సాధకుడు కృతార్థుడవుతాడు. అతడికి పునర్జన్మ వుండదు. ఈ విధముగా శంకరుని కృపా ప్రసాదమును పొందిన సాధకులలో వేదాంతములో చెప్పిన బ్రహ్మజ్ఞానము ఉదయించి, అజ్ఞాన విముక్తుడవుతాడు. శక్తిపాతము అనుగ్రహించబడని భక్తిపరుడైన శిష్యుడు సత్యవాది అయిన గురూపదేశములు విని, క్రమముగా సంసార బంధములనుండి విముక్తుడవుతాడు.

కాని శక్తిపాత లాభముపొందిన శిష్యుడు, నిస్సందేహముగా అదే క్షణములో ముక్తుడవుతాడు. అనగా వేదాంత ప్రతిపాదితమైన జీవన్ముక్తి పొందుటకు సాధకునికి శ్రీ మహేశ్వరుల ప్రసాదితమైన గురుకృప అత్యావశ్యకము.

శ్రీ శంభునిచే అనుగ్రహించబడి పరంపరాగతముగా సంక్రమణమగుచున్న శక్తి యొక్క సామర్థ్యములో తేడాలు లేనప్పటికి, పాత్రతా భేదము కారణముగా, శిష్యులను ఉత్తమ, మధ్యమ, కనిష్ఠ అను మూడు విధాలుగా వర్గీకరణ చేసారు. దీక్షా సమయములో శక్తి పాతము జరుగుటవలన కన్పించెడి లక్షణములు మూడు తరగతులుగా వర్గీకరించారు. వారికి లభించెడి ఫలితముకూడా మూడు విధములుగా ఉంటుంది. అంటే ఉత్తమ సాధకులకు వెంటనే, మధ్యమ సాధకులకు క్రమముగా, కనిష్ఠ సాధకులకు ఆలస్యముగా లభిస్తుంది. మొదటి తరగతిలేక యోగ్యుడైన ఉత్తమ అధికారి శిష్యులు ఆది నుండి భక్తిని కలిగి వుంటారు. దీక్షను ఉత్సాహముతో స్వీకరిస్తారు. దీక్ష తరువాత ఆనందభరితులవుతారు. వీరిని ఉత్తమశిష్యులు లేక యోగ్య లేక ఉత్తమ అధికార శిష్యులుగా చెప్పవచ్చును. వీరికి దీక్షాజనిత జ్ఞానము పక్షినేరుగా పండుపైన వాలినట్లుగా వెంటనే లభిస్తుంది.

రెండవ తరగతికి చెందిన మధ్యమ అధికారి శిష్యులు దీక్షాసమయమునందు జ్ఞానా జ్ఞానరహితులుగా ఉంటారు. వారు దీక్షను గురించిగాని లేక యోగమును



గురించిగాని ఎటువంటి జ్ఞానమును కలిగివుండరు. కానీ దీక్ష ప్రాప్తించగనే వారిలో భక్తి కలుగుతుంది. బుద్ధినిర్మలమవుతుంది. వీరిని మధ్యమ అధికారి శిష్యులుగా చెప్పవచ్చును. వీరికి ఉపదేశ ఫలము కోతి ఒకచెట్టుకొమ్మ నుండి ఇంకొక చెట్టుకొమ్మ మీదకు గెంతి ఫలమును పొందినట్లుగా క్రమముగా లభిస్తుంది.

మూడవ తరగతికి చెందిన కనిష్ఠ సాధకులు మొదటి నుండి భక్తిని కలిగి వుండరు. దీక్షను గ్రహించిన తరువాత భక్తి ఉదయిస్తుంది. ఈ విధముగా చివరిలో జ్ఞానభక్తి యుతులుగా మారెడి శిష్యులు కనిష్ఠ అధికార శిష్యులుగా చెప్పబడతారు. వారికి గురు ప్రదత్తమైన ఫలితము చాలాకాలము తరువాత గాని లభించదు. వారిప్రగతి చీమ నెమ్మదిగా ప్రాకి చెట్టుపైన వున్న పండువరకు చేరినట్లుగా చాలాకాలమునకు గాని లభించదు.

**భక్తిమార్గములో కూడా శక్తి పాతము కలదు :** వేదాంత లేక యోగ సంప్రదాయములలో చెప్పినట్లుగా గురుకృప కారణముగా ఆత్మశక్తి జాగృతమగుటచే మనస్సు, ప్రాణము మరియు శరీరములలో వివిధ క్రియలు ఉత్పన్నమయి శిష్యుని ఆత్మజ్ఞాన సంసిద్ధుని చేసినట్లుగా భక్తి మార్గములో కూడా గురుకృప లేక పూర్వ సంస్కారముల కారణముగా మరియు తన పురుషార్థ ఫలితముగా కుండలినీ శక్తి జాగృతమవుతుంది. అప్పుడు భక్తి సాధనలో కూడా శక్తిపాతము ద్వారా చిత్తస్థితికి అనుగుణముగా అన్ని బాహ్యలక్షణములు కలుగుతాయి. నాట్యము చేయుట, పాటలు పాడుట, భూమిపై పడిదొర్లుట, పెద్ద గొంతుతో సంకీర్తనము చేయుట, దీర్ఘశ్వాసను కలిగివుండుట, లోకనిందలను లేక పొగడ్తలను ఉపేక్షించుట, లాలాజలము స్రవించుట, పెద్దగా నవ్వుట, ఎక్కిళ్ళు వచ్చుట, శరీరములో చల్లదనపు అనుభవము మరియుచేతులతో కాళ్ళతో నేలను తాడించుట వంటి బాహ్యలక్షణములు కన్పించును.

ఎప్పుడైతే చిత్తము స్వస్థతను పొంది ప్రాణములో లీనమవుతుందో అనగా ప్రాణాయామము సంభవిస్తుందో అప్పుడు ప్రాణములో అనేక విధములైన బాహ్య, అంతరక్రియలు కలుగుతాయి. ప్రాణము యొక్క క్రియాశక్తి కారణముగా శరీరములో విశేషరూపములో మార్పులు సంభవిస్తాయి. భక్తుని శరీరములో నిశ్చేష్టత, కంపము, స్వేదము, రోమాంచము, స్వరవికృతి, శరీర ఛాయ మార్పు, అశ్రువులు, నిద్రవంటి ఎనిమిది సాత్విక స్థితులు కలుగును.

ప్రాణము అప్పుడప్పుడు దేహములో పృథ్వీ, జలము, తేజము, ఆకాశమను నాల్గు మహాభూతములో ఏదో ఒక దానిని ఆలంబన చేసుకొని శరీరములో ఎల్లెడలా

విహరిస్తుంది. భూతత్త్వమును అలంబన చేసుకొంటే ప్రాణమునకు స్తంభీభావ స్థితి లభిస్తుంది. జలతత్త్వము ఆశ్రయిస్తే అశ్రుపాతము మరియు తేజః తత్త్వమందు స్థిరపడితే స్వేదము ఉత్పన్నమయి శరీరము ఛాయ మారుతుంది. ఆకాశతత్త్వమున స్థిరమయితే ప్రళయము వంటి స్థితికలిగి భావసమాధి, మూర్ఛ, నిద్రాస్థితులు కలుగుతాయి.

సాధకుడు వేదాంతి అయినా, యోగి అయినా లేక సాకార రూపమును ఆరాధించే భక్తుడైనా లేక సాధనలు ఏమీ చేయనివాడైనా కూడా ప్రాణశక్తి మరియు ఆత్మశక్తి ప్రేరేపణ కారణముగా పైన ఉదహరించిన లక్షణాలు కలుగుతాయి. అందువలన మహాదేవులు ఉపదేశించిన మహాయోగమును అందరు అనగా జ్ఞానులు, ధ్యానులు, యోగులు, యతులు, భక్తులు మొదలగు వారందరు సాధన చేయవలసి యుంటుంది.

శ్రీమహాదేవులనుగ్రహించిన శక్తిపాతము అను ప్రసాదము పొందుటకు అందరికి అర్హత వున్నది. శక్తిపాతము ద్వారా శిష్యుని బుద్ధియందు జ్ఞాన బీజములు ఉత్పన్నమవుతాయి. అనేక విధములు పరీక్షించిన తరువాత తెలుసుకొన్నదేమంటే శిష్యునికి శాస్త్రములలో చెప్పిన విధముగా పాత్రత ఉంటే దీక్షా ఫలితము వెను వెంటనే లభిస్తుంది. లేకున్న శిష్యుడు సాధన చేయవలసిన వుంటుంది. శిష్యునియొక్క శరీరము, మనస్సు, ప్రాణము ఆత్మజ్ఞానము పొందుటకు వీలుగా పరివర్తన చెందాలి. అందుకొరకు శక్తి అతడి సంస్కారానుగుణముగా భక్తి, యోగ వేదాంత సంబంధిత సాధనలు చేయిస్తుంది. అనగా శక్తిపాతము అయిన తోడనే శిష్యుడు ముక్తుడు కాలేడు. అతని మనస్సు, ప్రాణము, శరీరములలో విశేష పరివర్తన అవసరమవుతుంది.

గర్భవతి కాగానే సంతానము వెంటనే కలుగదు, కాని ఆ గర్భధారణకు సంబంధించిన లక్షణాలు కనిపిస్తాయి. అదే విధముగా గురువు యొక్క శక్తిపాతము ద్వారా శిష్యులందరకు జ్ఞానబీజముల స్థాపన జరిగినదని అనుభవమునకు వస్తుంది. సమయానుసారము జ్ఞాన అనుభవము కలుగుతుంది. ఏ విధముగా మాతృమూర్తి గర్భస్థ శిశువు సురక్షితముగా ఉండాలని నియమాలు పాటిస్తుందో అదేవిధముగా శిష్యుడు కూడా జ్ఞాన బీజముల సంరక్షణ కొరకు విధిగా శాస్త్రములుపదేశించిన నియమములు పాటించాలి.



గర్భవతిగానున్న స్త్రీ తన గర్భములోని సంతానమును దుర్బుద్ధితో నాశనము చేసుకొంటే గర్భముపోయిన విధముగా శిష్యునికి గురువు ద్వారా లభించిన జ్ఞానబీజములు అతడి దుష్కర్మల కారణముగా లేక శాస్త్ర కథిత విధి విధానములు అనుసరించని కారణముచేత నష్టమగును. జ్ఞానము ఉత్పన్నము కానంతవరకు ధర్మాధర్మ రూపసంస్కారములు కూడా నశించవు. అందువలన జ్ఞానలాభము కలిగేవరకు శాస్త్రములలో చెప్పిన విధివిధానములను తప్పక పాటించవలసి ఉంటుంది. ఈ సద్విద్య తాలూకు బీజములు నాశనము కావు. ఇది జీవుల జన్మాంతరములో తగుబోధను కలిగించి బీజాంకురములు కలుగుటకు సహాయ పడతాయి. అందువలన జ్ఞాన సిద్ధి కలుగనంతవరకు స్వేచ్ఛగా వర్తించకూడదు.

శ్రీమహేశ్వరుల ద్వారా అనుగ్రహించబడిన ఈ శక్తి పాతముతో లేక సాధకుని యొక్క ప్రబల పుణ్యఫలము కారణముగా అతడి ఆత్మశక్తి మేల్కొంటుంది. దీనినే యోగులు కుండలినీశక్తిగా, భక్తి మార్గావలంబులు ఆహ్లాదినీ శక్తిగా, వేదాంతానుయాయులు చిత్తశక్తి లేక ఆత్మశక్తిగా, తంత్రమార్గావలంబులు మహామాయా ఆద్యాశక్తి లేక కులకుండలినీ శక్తిగా వివిధ నామములతో పిలుస్తారు. ఈ శక్తియొక్క అనుగ్రహమును అందరూ కోరుకొంటారు. ఎందుకంటే ఆ శక్తి తోడ్పాటుతోనే సాధకుడు భగవంతుని పొందగలరు.

దీక్షా ఫలము మోక్షప్రాప్తి అయివున్నది : ఏ దీక్ష కారణముగా సాధకునిలో వెనువెంటనే కలుగు అనుభవములకు ఆత్మస్థితియందు విశ్వాసము కలుగుతుందో, ఆ దీక్ష ద్వారా మోక్షము ప్రాప్తించగలదని తెలుసుకొనవలయును. పై అనుభవములు లేని దీక్షలన్నియు నామమాత్రమయినది. వాటివల్ల ఫలితముండదు. అనేక వందల ఉపాసనలు చేసినప్పటికి శిష్యుడు చింతా విముక్తుడుకాడు కాని గురువు ద్వారా లభించిన దీక్ష కారణముగా అతడు ముక్తుడవుతాడు. ఏ విధముగా పరసు వేదిని తాకిన ఇనుము బంగారము కాగలదో అదేవిధముగా దీక్షా రూప సంస్కారము ద్వారా సాధకుడు శివస్వరూపుడు అవుతాడు.

దీక్షాగ్నిలో సాధకుని కర్మలు దగ్ధము కాగలవు. కర్మబీజములు నాశనము కాగానే హృదయబంధనములు తొలగిపోతాయి. అప్పుడు సాధకుడు నిర్వికల్ప స్థితిని పొంది శివస్వరూపుడవుతాడు. ఈ స్థితిలో సాధకునికి జాతి భేదములు అనగా బ్రాహ్మణ, శూద్రభావములు తొలగిపోతాయి. శక్తి జాగరణ కొరకు పూజలు చేసినను దీక్ష ద్వారా మాత్రమే శక్తిజాగరణ జరుగుతుంది.

విధి పూర్వకముగా దీక్షాయుతుడైన వానికి నిత్య నైమిత్తిక కర్మలు చేయవలసిన ఆవశ్యకత లేదు. అతడికి జప, తప, నియమములు వ్రత, తీర్థయాత్రలు వంటి శారీరక కష్టములు అనుష్ఠించవలసిన పనివుండదు. ఎందుకంటే దీక్ష ద్వారా పైన చెప్పిన సాధనా ఫలితములు అతడికి లభిస్తాయి.

దీక్షితులు కానివారు మాత్రము జప తపాలను అనుష్ఠించ వలసి వుంటుంది. దీక్షితుడు కాకపోవుటచే అతడు రాతినేలపై నాటిన బీజముల మాదిరి ఫలితమును పొందలేడు.

# సిద్ధమహాయోగము

## తొమ్మిదవ ప్రకరణము

**కుండలినీశక్తి యొక్క స్థితి మరియు స్వరూపము :** యోగశాస్త్ర సిద్ధాంత ప్రకారము 1. కుండలినీ, 2. శక్తి, 3. మనస్సు, 4.ప్రాణము, 5. నాదము మరియు బిందు అను ఈ ఐదు విషయములు బ్రహ్మాండముయొక్క వ్యాపకత్వమును మనకు తెలియపరచును. అందువలన యోగశాస్త్రములో వీటిని గురించి తెలుసుకొనుట అత్యవసరము. కుండలినీశక్తిని గురించి ఎంత చెప్పినా విషయము స్వల్పమే అవుతుంది. వనములు, పర్వతములు, నదులు, సరోవరములు మరియు సముద్రములతో కూడిన భూమియొక్క ఆధారము శేషనాగుడు (బ్రహ్మయొక్క శక్తి) అయినట్లుగానే అన్ని యోగములకు, తంత్రములకు ఆధారము కుండలినీ శక్తి అయివున్నది.

అందువలన మూలాధారములో నివాస ముండెడి సూక్ష్మశక్తి (ఇష్టదేవతా, కుండలినీదేవి) యొక్క ధ్యానమును సాధకుడు చేయవలసి వుంటుంది. ఆశక్తి కోటి, కోటి విద్యుత్ పుంజముల సదృశముగా వుండి మూలాధారములోగల స్వయంభూలింగమును 3 1/2 చుట్లతో పరివేష్ఠించి యుండును. ఆ మహాదేవిని ప్రాణమంత్రము అనగా ప్రాణయామముతో మేల్కొలిపి బ్రహ్మరంధ్రము వరకు తీసుకొని వచ్చిన సాధకుడు ముక్తుడు అవుతాడు. ఆ చంచలశక్తి నిద్రించిన నాగినివలె నుండి తన స్వయంప్రభలయొక్క మహాతేజస్సుతో వెలిగిపోతూ వుంటుంది. సుషుమ్న మార్గమునకు అనుసంధానించబడిన మూలాధార చక్రములో సర్పము మాదిరి చుట్టుచుట్టుకొని సూక్ష్మస్థితిలో నిష్క్రియగా, నిర్జీవ స్థితిలాంటి సమాధిస్థితిలో వున్న



ఈ వాగ్దేవి, మంత్ర బీజ స్వరూపిణి, కుండలాకారములో స్వర్ణకాంతులీనుతూ ప్రకాశిస్తూ వుంటుంది.

ఈ శక్తియే నిర్భయ స్థితులను అనుగ్రహించే విష్ణుశక్తి అయివున్నది. ఈ వైష్ణవీ మహాశక్తి తత్వము సత్వ, రజ, తమోగుణములకు మాతృకాశక్తి అయివున్నది. ఈ శక్తి స్వయం ప్రభలతో దేదీప్యమానముగా మూలాధారములోని అగ్ని తేజః పుంజము మధ్యన వుండే జీవశక్తి అయిన కుండలినీ శక్తిగా పిలువబడుతున్నది. ఈ శక్తియే ప్రాణ రూపములో ప్రాణులయందు విరాజమానమై వుంటుంది. సాధకులు ప్రాణాయామము ద్వారా తమ అంతరములో ఈ శక్తిని దర్శించగలరు. ఈ పరబ్రహ్మ స్వరూపిణి శబ్ద బ్రహ్మమయమైన దేవీశక్తికి అనేక ఆకృతులు ఉన్నాయి. వాటిని మనము వర్ణించలేము. ఇటువంటి వర్ణనాతీతమైన దివ్యరూపములు కలిగి స్వయముగా అనుభవమునకు వచ్చెడి శక్తి కుండలినీ శక్తిగా పిలువబడుతుంది. ఈ శక్తి మూలాధార చక్రములో వుండి అన్ని కోర్కెలను తీర్చుతూ వుంటుంది. ఈ మహాశక్తి కుండలినీదేవి యొక్క వర్ణన యోగశాస్త్రములో అనేకవిధములుగా చేయబడి యున్నది.

ఈ ఆత్మశక్తి మూలాధారము వద్దగల కందము అనుప్రదేశమున నిద్రాస్థితిలో వుండును. అజ్ఞానములో వున్న మానవులు ఈ శక్తిని ఎరుగక లౌకిక బంధనములలో చిక్కుబడి వుంటారు. ఈ శక్తి మోక్షదాయకమని యోగులందరికి తెలియును. ఈ పరదేవతాశక్తి అయిన కుండలినీశక్తి మూలాధారములో 3½ చుట్లు చుట్టుకొని సర్ప ఆకృతిలో నిద్రించి యుండును. ఎప్పటివరకు ఆ శక్తి నిద్రించి వుంటుందో అప్పటివరకు జీవుడు పశుపక్ష్యాదుల మాదిరి అజ్ఞానస్థితిలో వుంటాడు. కుండలినీశక్తి మేల్కొనకుండా ఎన్ని యోగములు చేసినా జ్ఞానము లభించదు. ఈ ఆధార శక్తి నిద్రించిన సకలజగత్తు నిద్రాస్థితిలో వుండును. ఆ శక్తి మేల్కొంటే ముల్లోకములు జాగృత స్థితిలో వుంటాయి. అందువలన కుండలినీ శక్తి జాగృతమవకుండా సాధకులు చేసే జ్ఞానసాధనలన్నియు నిష్ఫలము కాగలవు.

గుదస్థానము లింగస్థానమునకు మధ్యలో మూలాధార చక్రమున్నది. దీనినే జీవరూపములో వున్న శివుని నివాసముగా చెపుతారు. అక్కడనే పరాశక్తి కుండలినీశక్తి వున్నది. ఆ శక్తి కారణముగా ప్రాణము, వాయువు, అగ్ని మరియు బిందువు వుత్పన్న మవుతాయి. దీని నుండి నాదము ఉత్పత్తి అవుతుంది. ఇక్కడ నుండియే మనస్సు

ఉత్పన్నమవుతుంది. అన్ని కామనలకు ఫలితమును ఇవ్వగల కామరూపపీఠ స్థానము ఈ మూలాధారకమలమై యున్నది.

ఆధార శక్తి నుండియే ఈ విశ్వము ఉత్పన్నమయి అందులోనే లీనమగును దీనిని తెలుసుకొనుటకు సహజముగా గురువును ఆశ్రయించ వలసి యుంటుంది అతడు అజ్ఞానము మరియు అంధకారములకు అతీతముగా వున్న ఈ జ్యోతిర్మయ చిదాత్మను గురించి తెలుసుకొని కృతార్ధుడయి వుంటాడు. ఆధారశక్తి జ్ఞానము కలుగగానే మనుష్యుడు అన్ని పాపములనుండి ముక్తుడవుతాడు. విద్యుత్ సమమైన మహాకాంతులతో మూలాధారములో విరాజమానమై యున్న ఆత్మశక్తిని అవలోకించుటవలన ముక్తి లభిస్తుంది. గురువు స్వయముగా ప్రసన్నుడైన ముక్తి మార్గమునకు ఆటంకమేమున్నది? ఈ శక్తిని కొందరు ఆధారశక్తి అని, కొందరు సుషుమ్న శక్తి అని, మరి కొందరు కుండలినీ శక్తి యని కొందరు సరస్వతీ శక్తి అని పిలుస్తారు. ఈ శక్తియే మహామాయగా, మహాలక్ష్మిగా, మహాదేవిగా, సరస్వతిగా మరియు అవ్యక్త స్థితిలో ఆధారక శక్తిగా వుండి సాధకుల మనస్సు, ప్రాణము, శరీరములతో క్రియలను చేయిస్తుంది. ఈ శక్తినుండియే విశ్వమంతయూ ప్రభవించినది.

**వేదములలో మహాయోగము :** వేదములు అన్ని విద్యలకు భాండాగారము వంటివి. వేదములద్వారా బ్రహ్మవిద్యాప్రాప్తి కలుగుతుంది. అందువలన వేదముల ఆధీనములో మహాయోగమున్నది. మహాయోగ ఆధీనములో కుండలినీ శక్తి కుండలినీశక్తి ఆధీనములో చిత్తము, చిత్తముయొక్క ఆధీనములో చరాచర జగత్తు వున్నవి. అనగా మనస్సునకు సిద్ధత్వము లభించగానే శక్తి నిశ్చయముగా ప్రాప్తిస్తుంది. శక్తి తన ఆధీనములో వుంటే త్రిలోకాధిపత్యమును పొందవచ్చును. అందువలన కుండలినీ శక్తి జాగృతిని పొందకుండా సాధకుడు జ్ఞాన, యోగ, భక్తి సాధనల యొక్క ఫలితమును పొందలేడు. సాధకుడు తన ఆత్మశక్తిని పెంపొందించుకొన వలసి వుంటుంది.

ఈ ఆత్మశక్తి జాగృతికొరకు గురువు యొక్క ఆవశ్యకత వున్నది. అందువలన సమస్త శాస్త్రములు గురువును కలిగి వుండవలెనని ఉద్భోధించినవి. సద్గురువు లేకుండా సాధనలు చేసినపుడు వాటి ఫలితము లభించుటకు చాలాకాలము పడుతుంది.



**దీక్షారహిత జ్ఞానము నిష్ఫలము :** శ్రీ మహేశ్వరుల ద్వారా ఉద్భోధించబడిన కళ్యాణ కారకమైన మార్గములో దీక్షగైకొనని సాధకుల జ్ఞాన, ధ్యాన, యోగ, జప, తప, భక్తి, కర్మ, ధర్మములు ఏమియు ఫలించవు. అందువలన సాధకులు తమ కళ్యాణము కొరకు తప్పక దీక్షితులు కావలసి యుంటుంది. గురువు లేకుండా దీక్ష ప్రాప్తించదు. అందువలన సాధకుడు గురువు వద్దకు వెళ్ళవలసి యుంటుంది. దీక్షితుడుకాని మనుష్యుని ధర్మ కర్మములు ఏవియు సిద్ధించవు. సద్గతులు లభించవు. అందువలన సాధకుడు బాగుగా ప్రయత్నించి గురువు వద్ద దీక్షితుడు కావాలి.

**కుండలినీ జాగృతి కొరకు దీక్షను తీసుకొనవలయును :** అనాదిగా సాధకునిలో కుండలినీ శక్తి నిద్రించి వుంటుంది. అందువలన అతడి ధర్మకర్మములు ఫలించవు. కుండలినీ శక్తి నిద్రించియున్న కారణముచే సాధకుని యొక్క జప, తప, జ్ఞాన, ధ్యాన, భక్తి, యోగ, ధర్మ, కర్మము లందు అంధకారము ఆవరించి వుంటుంది. మనస్సుకు నచ్చచెపుతూ సుఖము లభించినట్లుగా భావన చేయుటవలన వాస్తవిక సుఖము లభించదు. నిజమైన సుఖమును ఇచ్చే ఆత్మశక్తి సాధకునిలో నిద్రించి వుంటుంది. ఆ శక్తి మేల్కొనుటకు దీక్షను తీసుకొనవలసి వుంటుంది. సాధకుడు ఆత్మజ్ఞానము పొందుటకు దీక్షాగ్రహణము చేసినపుడు అతడి ధర్మ, కర్మ సంస్కారములు విశృంఖల స్థితినుండి శృంఖలాబద్ధము గావించబడి సామ్యతను పొందుతాయి. అప్పుడు సాధకునికి తాను అనుష్ఠించిన సత్కర్మల యొక్క నిజమైన సుఖము అనుభవములోనికి వస్తుంది. దీనికారణముగా సాధకుడు సహజముగా తన అంతరాత్మనుండి శక్తిని పొందగలడు. సాధకునకు వాస్తవికమైన సుఖము ప్రాప్తిస్తుంది. ఆ స్థితిలో సాధకునికి జగత్తు ఆనందమయముగా కనిపిస్తుంది.

మనుష్యులు ఈ ప్రపంచమును దుఃఖ భాజనముగా భావించి ద్వేషిస్తూ వుంటారు. ఇహలోక ప్రపంచమును కారాగారముగా భావించి దుఃఖ కారణముగా చెపుతారు. కాని ఇదే ప్రపంచము ఆత్మశక్తి జాగృతి పొందిన సాధకునికి మహా సుఖమును కలిగించును. ఈ ప్రపంచము సుఖ దుఃఖముల అనుభవము కొరకు సృజించబడి వున్నది. ఇది అజ్ఞానులకు మహాదుఃఖమును కలిగించునదిగా, జ్ఞానులకు ఈశ్వరుని క్రీడాస్థానముగా చెప్పబడి ఆనంద దాయకముగా ఉంటుంది. అంధులకు ఎక్కడ చూచినా అంధకారమే కనిపిస్తుంది. కానీ నేత్రములు కలవారికి అన్ని ప్రదేశములలో ప్రకాశము కన్పిస్తుంది. జగత్తు లేకుంటే మనుష్యులకు జన్మించవలసిన

అవసరము ఏమున్నది. ఇంకా భగవత్ప్రాప్తి పొందాల్సిన అవశ్యకత ఏమున్నది? అనగా ఈ ప్రపంచము ద్వారా భగవత్ జ్ఞానము అనుభవములోనికి వస్తుంది. కుండలినీశక్తి మూలాధార చక్రములో నిద్రించియున్నంతవరకు సాధకులు జప, తప, జ్ఞాన, ధ్యాన, పూజ, మంత్ర, యంత్రముల వంటి సాధనల ద్వారా కూడా సిద్ధిలభించదు. కాని అదృష్టవశాత్తు, గురుకృప లేక సాధకుని అనంతపుణ్య ఫలముచే కుండలిని దేవి జాగృతమయితే సాధకుని జప, తప, జ్ఞాన, ధ్యాన, యోగ, మంత్ర, తంత్ర, పూజ మొదలగు సాధనలు అన్ని ఫలిస్తాయి. అప్పుడు కారాగారముగా భావించిన ఈ ప్రపంచము నందనవన మవుతుంది. రోగగ్రస్తునికి దివ్యౌషధము లభించి రోగ విముక్తుడైన విధముగా సాధకుని ఆత్మశక్తి జాగృతమగుటచే అతడికి భవరోగముల నుండి విముక్తి లభిస్తుంది. రోగములు లేని వాడికి శారీరక, మానసిక కష్టములుండవు. సాధకునిలో మనోవ్యధలు, శారీరక బాధలు తొలగిపోయినందువల్ల సుఖదుఃఖములనెడి స్వప్నములు కూడా తొలగిపోతాయి. అతడు ఆనందసాగరములో ఓలలాడుతాడు.

**దీక్షకొరకు సమర్థుడైన గురువు కావలయును :** ఈ ఆనందమును వెనువెంటనే అనుభవమునకు తెచ్చువాడే సమర్థ గురువు అయి వున్నాడు. గురువు ద్వారా సాధకుడు ఈశ్వరుని పొందగలడు. స్వప్రయత్నము ద్వారా మన అంతరములోనున్న ఆనంద స్థితిని పొందుటకు మనకు కొన్ని సంవత్సరములు లేక జన్మలు పట్టవచ్చును. మన ప్రస్తుత స్థితిని మార్చగల పురుషార్థములు ఏవియు అంత సులభముగా లభించవు. అందువలన కేవలము గురుకృపతో మాత్రమే మనము మన పురుషార్థమును ఈ జన్మలోనే పొందగలము. అటువంటి గురువు యోగ్యుడు, సమర్థుడు అయివుండాలి. దానితోపాటు శిష్యుడు కూడా యోగ్యుడయివుండాలి. సాధకునికి వ్యాసుడు, వశిష్టుని వంటి గురువు లభించినపుడు అతడు రామచంద్రుడు లేక జైమిని వంటి యోగ్యతలు కలిగి యుండాలి. లేకుంటే సాధకుడు ఎటువంటి స్థితిలో వుంటే అటువంటి గురువు మాత్రమే లభిస్తాడు.

అనగా వ్యాసుడు, వశిష్ఠుడు శక్తి, పరాశరుని వంటి గురువులను మనము కోరుకొంటే మనము శుకదేవుడు, జైమిని, గౌడపాదుడు, గోవింద పాదుడు, శంకరాచార్యుని వంటి యోగ్యతలు ప్రాప్తించుకొనవలసి వుంటుంది. అప్పుడు సాధకునికి ప్రయత్నించకనే వ్యాసుని వంటి సమర్థుడైన గురువు లభించగలడు.



సాధకునిలో అకర్మణ్యత, సోమరి తనము, నిర్లక్ష్యము ఉన్నట్లయితే అతడికి లభించే గురువుకూడా అతడిని సంసార బంధనములలో పడద్రోసే వాడయివుంటాడు. అందువలన సాధకుడు మొదట యోగ్యశిష్యుడుగా మారుటకు కావలసిన లక్షణములు తెలుసుకొని యోగ్యునిగా మారాలి. తరువాత సాధకుడు సమర్థ గురువు ద్వారా లభించిన జ్ఞానమును, ఆత్మజ్ఞాన దీక్షాఫలమును, గురువుద్వారా లభించేశక్తి యొక్క సామర్థ్యముల గురించి తప్పక తెలుసుకొని వుండాలి. ఎందువలనంటే విరుద్ధ ధర్మములు పాటించే గురుశిష్యులు కలిసి వుండలేదు. అందువలన అర్హతగల శిష్యునికి మాత్రమే దీక్ష ఇవ్వబడుతుంది. శిష్యునికి ఆ దీక్షాఫలము వెనువెంటనే, లేక క్రమముగా లేక ఆలస్యముగా లభిస్తుంది. పైన చెప్పినవిధముగా శిష్యుడు మంచి సమర్థుడైన గురువు కొరకు తపస్సు చేయవలసి వుంటుంది. అదేవిధముగా పాత్రతగల శిష్యుని కొరకు గురువు నిరీక్షించవలసి వుంటుంది. శిష్యునియొక్క యోగ్యతయే గురువుయొక్క గురుత్వము శిష్యుని యొక్క శిష్యత్వమును తెలియ పరచగలదు. యోగ్యుడైన వైద్యునివద్ద చికిత్స చేయించుకొనగోరే రోగి సమర్పణ భావముతో తన ఆరోగ్య విషయములను వైద్యుని ఆధీనములో ఉంచినట్లుగానే, భవరోగ గ్రస్తుడైన శిష్యునియొక్క మంచి చెడులు భవరోగ చికిత్సకుడైన గురువు ఆధీనములో ఉంటాయి. వైద్యుని పరమ కర్తవ్యమేమంటే రోగికి అవసరమైన చికిత్స చేసి రోగ విముక్తుడినిగా చేయటం. గురువు యొక్క పరమకర్తవ్యము కూడా కేవలము ఆత్మబలముతో శిష్యునికి శుభమును చేకూర్చటము అయి వున్నది. అనగా గురువు తన వ్యక్తిగత జీవిత నిర్వహణ కొరకు శిష్యులను ఉపయోగించుకొనే ఆలోచన చేయకూడదు. శిష్యుడు కూడా తన గురువును ఉపదేశమిచ్చువాడే అని తలపక తన కర్తవ్యమును నిర్వహించవలసి వుంటుంది. ఈ విధముగా గురు, శిష్యు లిరువురు ఆత్మభావముతో పరస్పర శుభమును చేకూర్చుకొనగలరు. ఇదియే గురు పరంపర నియమమై యున్నది. గురు శిష్యులయొక్క ఈ ఆత్మ సంబంధమునకు శాస్త్రములలో విశేష ప్రాధాన్యమున్నది. అందువలన బాగుగా ఆలోచించుకొని ఇరువురు సంబంధ మేర్పరచుకొనవలసి వుంటుంది. లేకుంటే ఇరువురకు ఉన్నత స్థితి లభించదు. శాస్త్రములలో ఉల్లేఖించిన పై నియమములను పాటించకుండా ఎవరూ కూడా తమ అభీష్టమును సిద్ధింపజేసుకొనలేరు.

ఈ ప్రపంచములో గురుపదమును అధిష్ఠించిన మహానుభావులు అందరూ త్యాగధనులు, తపోధనులు అయివున్నారు. వారందరూ ప్రాపంచిక సుఖాలను

త్యాగముచేసినవారే! ఎవరికి పరమానందకరమైన ఆత్మసుఖము లభించినదో వారు ప్రాపంచిక సుఖములను వాంఛింపరు. తమ ప్రారబ్ధానుసారము భౌతిక సుఖములు లభించినప్పటికి వాటిని వారు మానసికముగా త్యజించి ఉంటారు. వారు ఆ భౌతిక సుఖాలను యధేచ్ఛగా భోగింపరు. పరహితమును కోరుతూ, దేశకాలాను సారముగా, ఆసక్తి లేకుండా వాటిని అనుభవిస్తారు. అత్యధిక సుఖము మరియు అత్యధిక సామర్థ్యముగల వారు అదేస్థాయిలో వాటిని త్యజించ గలిగినపుడే వారికి గొప్పతనము లభిస్తుంది. ఆ విధముగా వారి గొప్పదనమును మనము గుర్తించవచ్చు. కుచేలుడు కోశాధిపతిగా, సాక్షాత్తు అన్నపూర్ణాదేవిని ఇల్లాలుగా కలిగి అణిమాది మహాసిద్ధులతో జగత్ పరిపాలకుడు మరియు పరమ కృపాలుడైన మహాశివుడు భిక్షాటన ద్వారా త్యాగము యొక్క గొప్పతనమును జనులకు తెలియబరచుచున్నారు. పరమశివుని ఆజ్ఞానుసారము విరక్తుడైన శిష్యునికి మాత్రమే పాత్రత లభించే వరకు కొంతకాలము నిరీక్షించి గురువు శక్తిపాతము చేయవలసి వుంటుంది. యోగసాధనకు పాత్రతలేని శిష్యుడు పరమశివుడు చెప్పిన యోగసాధనను చేయలేడు, పొందలేడు. శ్రీమహేశ్వరుల వాక్యానుసారము పాత్రతగల శిష్యునికి మాత్రమే దేహాంతము ముక్తి లభిస్తుంది. అందువలన మహేశ్వరుల ఆజ్ఞానుసారము గురువు ప్రయత్న పూర్వకముగా శిష్యుని పాత్ర తను పరీక్షించి అనుగ్రహించ వలసి వుంటుంది. శిష్యుడు కూడా గురుశివుని నిశితముగా పరీక్షించి పరంపరాగతముగా లభించిన సామర్థ్యము కలిగిన వ్యక్తిని మాత్రమే గురువుగా స్వీకరింపవలయును. అందువలన గురువు విధి పూర్వకముగా పరీక్షించిన తరువాత మాత్రమే శక్తిని అనుగ్రహించవలసి వుంటుంది, లేకుంటే అనుగ్రహింపబడిన శక్తి నిష్ఫలమవుతుంది.

వ్యామోహముతో గురు, శిష్యులు పరస్పరము ఎటువంటి ఆలోచన లేకుండా ఉపదేశము తీసుకుంటే అటువంటి వారికి చనిపోయిన తరువాత పిశాచ జన్మ లభిస్తుంది. ఆధ్యాత్మిక మార్గములో చేయదగిన పనులను, చేయకూడని పనులను శాస్త్రములు నిర్ణయించాయి. శాస్త్ర విధిని అనుసరించక, అశాస్త్రీయముగా జ్ఞానోపదేశములను చేసే గురువులకు మరియు తీసుకొనే శిష్యులకు మరణానంతరము నరకప్రాప్తి కలుగుతుంది. అన్యాయముగా గురువు శిష్యులను, శిష్యుడు గురువును పొందితే వారికి జ్ఞానమార్గములో వారి దోషపూరిత ప్రవర్తన కారణముగా బ్రహ్మార్షి యొక్క శాపము తగులుతుంది. మోసముతో ఇచ్చిన ఉపదేశము మరియు తీసుకొనిన జ్ఞానము యొక్క ఫలితము అనర్థమును కలిగిస్తుంది. జ్ఞానమార్గములో సత్యము,



[illegible] మరియు శుద్ధత ప్రతిఫలిస్తూ వుంటాయి. శాస్త్ర విధి విధానములను ఉల్లంఘించి స్వేచ్ఛగా చేసిన కర్మముల ఫలితము అనర్థదాయకము.

అందువలన శిష్యునియొక్క పాత్రతను జ్ఞానపూర్వకముగా, క్రియా పూర్వకముగా ఒక సంవత్సరముకాని, ఆరునెలలుగాని, కనీసము 3 నెలలుగాని పరీక్షించి గురువు దీక్షా ప్రదానము చేయవలసి వుంటుంది. ధనముపై వ్యామోహముతోగాని, ఎవరికైనా భయపడిగాని లేక లోభముతోగాని అయోగ్యుడైన వ్యక్తికి దీక్షను అనుగ్రహిస్తే దేవతల శాపము తగులుతుంది. అందువలన సాధించినదంతా నిరుపయోగ మవుతుంది. శ్రీ మహేశ్వరులు నిర్దేశించిన విధముగా శివ శాసనమును పాటించుట గురుశిష్యుల కర్తవ్యమై వున్నది.

అందువలన శాస్త్ర విధిని త్యజించి ఎవరైతే స్వేచ్ఛగా తిరుగుతారో వారు సిద్ధి పొందలేరు, సుఖమును పొందలేరు, జ్ఞానమును పొందలేరు. శాస్త్రానుసారముగా కర్తవ్యములను నిర్వర్తించిన వారికి మాత్రమే అభీష్ట సిద్ధి కలుగుతుంది. భక్తి శ్రద్ధలులేని వ్యక్తికి జ్ఞానోపదేశములు చేసినట్లయితే అతడు అపవిత్రుడవుతాడు. గోవుయొక్క పవిత్రమైన పాలు, నెయ్యి కుక్కకు తినిపించినట్లయితే కుక్కకు గజ్జి, దురదలు కలిగి కేశములు రాలిపోయిన విధముగా అపాత్రునికి ప్రసాదించిన జ్ఞానము అతడికి అనర్థము కలుగజేయును. శ్రద్ధావంతుడు, ఉత్తముడు, భక్తుడైనవాడికి ఇవ్వబడిన జ్ఞానదీక్ష అతడికి అనేక శాస్త్రములు నిర్దేశించిన ప్రయోజనములను సిద్ధింపజేయును. అనగా శాస్త్రములలో తర్కయుక్తముగా బోధించిన జ్ఞానమును భక్తుడైన సాధకుడు పొందగలడు. అతడే శాస్త్రములలో పొందుపరచిన జ్ఞానముయొక్క అర్థములను తెలియజేయగలడు.

**పాత్రతలేని అనధికార శిష్యుల లక్షణములు :** ప్రతి ఒక్క మనుష్యునిలో సకల కార్యములను చేయగల శక్తి వుండదు. అదేవిధముగా ఆధ్యాత్మిక జ్ఞానమును పొందుటకు అందరూ పాత్రులుకారు. అందువలననే శాస్త్రములలో పాత్రా పాత్రతలను గురించి నిర్ణయము చేయబడినది. జనులు తాము నిర్వర్తించే కర్మలచేతనే అదృష్టవంతులు మరియు దురదృష్టవంతులుగా నిర్ణయింపబడతారు. అధికారులు, అనధికారులుగా శాస్త్రములలో నిర్దేశించి, సద్గుణములు కలిగిన వారికే ఆత్మజ్ఞానము పొందుటకు అర్హత కల్పించి యున్నారు. శాస్త్రములో చెప్పిన సద్గుణములు ఎవరిలో లోపించునో వారి బుద్ధిలో బ్రహ్మజ్ఞానము ప్రకాశింపదు. అటువంటి అనధికారులైన శిష్యుని లక్షణములు భగవానులు ఈ విధముగా చెప్తారు.

దుష్ట వంశములలో జన్మించినవాడిని, దుష్టుడైనవాడిని, సద్గుణములు లేనివాడిని, పిరికివాడిని, నపుంసకుడిని, తన పాండిత్యముపై గర్వము గలవాడని, ఇతరులకు శిష్యుడైన వాడిని, గురువు శిష్యునిగా చేసుకొనరాదు. వారు ఆత్మజ్ఞాన దీక్షకు అర్హులుకారు. అంగవిహీనులు లేక అధిక అంగములు కలవారు, శరీరాంగములను నష్టపోయినవారు, వికలాంగులు, గ్రుడ్డివారు, చెవిటివారు రోగగ్రస్తులైన వారిని గురువు శిష్యునిగా చేసుకొనరాదు. ఇంటి నుండి, సమాజము నుండి బహిష్కృతులైనవారు, గురువు, తల్లిదండ్రులు, గ్రామస్థులు త్యజించిన వారు, చూడగానే దుఃఖము, బాధ, భయము కలిగే లక్షణములుగల వానిని, వికృతముఖాకృతిని కలిగినవారు, స్వేచ్ఛగా వేషములు మార్చువారిని అనగా ఒకసారి సాధువుగా మారి ఇంకొకసారి ఉద్యోగము చేస్తూ అనేక విధములైన ప్రవృత్తులు గలవారిని, వికృతాంగములు కలిగి వికృతచేష్టలు గలవారు, తనవాక్కు ద్వారా క్షోభను, భయమును కలుగజేయువారు దీక్షకు అర్హులుకారు. ఇతరులవద్ద ఎప్పుడూ తమ దుఃఖ గాథలు చెప్పి బాధపడేవాడు, తన యజమానికి ద్రోహము చేసినవాడు, ఎప్పుడూ తిండి యందు, మైథునమునందు ఆసక్తి కలవాడు, దొంగ అయివుండి తనవారిని మోసము చేసేవాడు, పశువుల మాదిరి మంచిచెడ్డల ఆలోచన చేయకుండా నడిచేటటువంటి ఆత్మవంచకుడు దీక్షకు అధికారి కాలేడు. అకారణముగా ద్వేషించేవాడు, నవ్వేవాడు, క్లేశములు కలిగించేవాడు, క్రోధమును ప్రదర్శించేవాడు మరియు అత్యంత హీనకర్మములు చేయుటకు సాహసించేవాడు, ఎటువంటి ప్రయోజనము లేకున్న ఇతరుల మనస్సు కష్టపెట్టి ఎగతాళి చేయువానికి శిష్యునిగా చేసుకొనకూడదు. కాముకుడు, అభిమానము లేనివాడు, అసూయ, మదము, మత్సరము, అహంకారమును కలిగి వుండేవాడిని గురువు ఎప్పటికి శిష్యునిగా స్వీకరింపకూడదు.

మనస్సులో ఈర్ష్య, నిర్దయం, కపటము, కృపణత్వము, క్రోధము కలిగియున్నవాడు, ధైర్యము లేనివాడు, దుఃఖితుడు, భీరువు, అశక్తుడు, అయిన వ్యక్తికి ఆత్మజ్ఞాన దీక్షను ప్రసాదించకూడదు.

అజ్ఞాని, మందమతి, మూఢుడు, చింతాగ్రస్థుడు, కాంక్షతో లోభముతో అసంతుష్టుడు, ఇతరులవద్ద తన దీనత్వమును ప్రదర్శించి యాచించేవానికి తత్వజ్ఞాన దీక్షను పొందుటకు అర్హతలేదు.

అతిగా భుజించువానికి, కపటత్వము కలిగి ఇతరులకు భ్రమింపజేసే కుటిలునకు మరియు భక్తి, శ్రద్ధ, దయ, శాంతి లేక ధర్మాచరణమందు ఆసక్తి లేనివానికి దీక్షను



ప్రదానము చేయరాదు. తల్లి, తండ్రి, గురువు, జ్ఞానులు, మంచి చెప్పినా వారిని ఎగతాళి చేయువాడిని గురువు శిష్యునిగా స్వీకరింపకూడదు. అటువంటి వాడు జ్ఞానదీక్షకు అర్హుడుకాదు.

**ఉత్తమ శిష్యుల లక్షణములు :** భగవానుడు పైన చెప్పిన విధముగా ఉత్తమశిష్యుని లక్షణములను తెల్పి, సౌభాగ్యవంతుడు, పుణ్యాత్ముడు, యోగసాధనకు ఉత్తమ అధికారుడైన శిష్యుని లక్షణములు ఈ క్రింది విధముగా చెప్పియున్నారు.

సమాధి స్థితిని పొందుటకు అవసరమైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామాది సాధనలు పాటించుతూ మంచిగుణములు మరియు శీల సంపదను కలిగివున్న శిష్యుడు తత్వజ్ఞాన దీక్షను పొందుటకు ఉత్తమ అధికారిగా చెప్పబడ్డాడు. శుద్ధ మనస్సు గలవాడు, శ్రద్ధా భక్తులు గలవాడు, సుందరశరీర ఆకృతిగలవాడు, పరిశుభ్రమైన వస్త్రములు ధరించువాడు. ఆత్మజ్ఞాన దీక్షను పొందుటకు అర్హత గలిగివున్నాడు. వివేచనచేసి కర్మలను ఆచరించేవాడు. ఉదారచిత్తుడు, గాంభీర్యము గలవాడు, మితాహారి, అన్ని కార్యములను నిరభిమానముగా ఆచరించువాడు అనగా ధీరుడు అయినవాడు, ఎల్లప్పుడు నిష్కామముగా కర్మలను ఆచరించెడి ఉత్తమ వ్యక్తి యోగదీక్షకు అధికారి అయివున్నాడు.

పుణ్యకార్యము లన్నింటిని నేర్పుగా ఆచరించువాడు, అందరికి ఉపకారము చేయుచూ పాపకార్యములపట్ల విముఖత కలిగినవాడు, పుణ్యకర్మల ద్వారా పవిత్రుడైన వాడు, కృతజ్ఞత కలిగియుండి, సాధుసంతులు చెప్పినవిధముగా నడుచుకొనువాడు, జ్ఞానదీక్షకు ఉత్తమ అధికారి అయివున్నాడు. ఆస్తికుడు, దానశీలి, అందరిమేలుకోరి సాధన చేస్తూ వుండేవాడు, మోసగించి ధనమును సంపాదించని వాడు, వినయశీలి, విశ్వాసపాత్రుడు అయినటువంటి వాడు జ్ఞానదీక్షకు యోగ్యత కలిగి వున్నాడు. తన స్వశక్తితో అసాధ్యమైన పనులను సాధించువాడు బ్రహ్మజ్ఞానదీక్షకు యోగ్యుడైన అధికారి అయివున్నాడు.

అందరితో హితకరముగా మాట్లాడుతూ, సత్యమును పల్కుతూ పరిమితముగా, ఆనంద ప్రదముగా మాట్లాడువాడు, అత్యంత తెలివిగలవాడు, చతురుడు, ఒకసారి చెప్పగానే అర్థము చేసుకొనే బుద్ధిమంతుడైన శిష్యుడు బ్రహ్మజ్ఞాన దీక్ష పొందుటకు అర్హత కలిగియున్నాడు. తన గురించి పొగడ్తలను ఇతరుల గురించి నిందా వాక్యములను వినుటకు ఇష్టపడనివాడు, ఎప్పుడూ ఆనందముగా వుండువాడు,

ఇతరులకు ప్రియమైన పనులను చేయువాడు, జితేంద్రియుడు, సంతృప్తి గలవాడు బుద్ధిమంతుడు, బ్రహ్మచారి అయినటువంటి వ్యక్తికి పై దీక్షాగ్రహణమునకు అర్హత గలదు. అధి, వ్యాధులు లేని అనగా మనస్తాపము, దుశ్చింతన వంటి మానసిక రోగములు, శారీరక రోగములు లేనివాడు, చంచలత, చపలత, దుఃఖము, భ్రాంతి సంశయములు లేనివాడు, గురువును ధ్యానించుతూ, స్తుతించుతూ దేవతా సమానముగా భావించువానికి దీక్షను తీసుకొనుటకు అధికారము గలదు. నిత్యము గురువు సమీపమున ఉండువాడు, ప్రతిక్షణము గురు ప్రసన్నత కోరి మాత్రమే పనులు చేసెడివాడు, గురువు మరియు దేవతల యందు సమానమైన భక్తి ప్రపత్తులు కలిగి వుండి **మహామాయాకుండలనీశక్తి** యొక్క పూజాపరాయణుడు అయిన వ్యక్తి దీక్షకు అర్హుడు. శరీర, మన, ప్రాణములతో అను నిత్యము గురువునకు సేవచేస్తూ గురువు ఆజ్ఞాలను పాటించేవాడు, గురువు కీర్తి ప్రతిష్ఠలను పెంచేవాడు మాత్రమే యోగదీక్షకు ఉత్తమ అధికారి అయివున్నాడు. గురువు చెప్పిన వాక్యమునే ప్రమాణముగా తీసుకొనేవాడు, గురువు యొక్క సేవాశుశ్రూషలలో నిమగ్నుడయిన వాడు గురువునకు అనుగుణముగా ప్రవర్తించేవాడు జ్ఞానదీక్షకు యోగ్యుడైన అధికారి అయివున్నాడు.

తనజాతి గౌరవము, ధనము యొక్క గొప్పదనమును గురువు వద్ద ప్రదర్శించని వాడు, గురుద్రవ్యమును కోరని వాడు, గురుకృపను కాంక్షించేవాడు, అటువంటి ఉత్తమ శిష్యునికి మాత్రమే తత్త్వజ్ఞాన దీక్షకు అర్హత యున్నది. నిరంతరము జప, తప, ధ్యానాదులను ఆచరించే వాడు, కేవలము మోక్షమార్గమును మాత్రమే కాంక్షించే శుభ లక్షణములు కలవాడిని మాత్రమే గురువు శిష్యునిగా గ్రహించాలి. అతడికి మాత్రమే ఆత్మజ్ఞాన దీక్షకు అర్హత ఉన్నది.

శరీరముతోను, మనస్సుతోను, ప్రాణముల తోను సమర్పణ భావముతో గురువు వద్ద యోగమును నేర్చుకొనే వ్యక్తి మాత్రమే శిష్యునిగా చెప్పబడతాడు.

**మిథ్యాగురువు లక్షణములు :** జ్ఞానదీక్షకు అయోగ్యుడు, త్యజించవలసిన గురువు యొక్క లక్షణములను ఈ క్రింది విధముగా వుంటాయి.

క్షయరోగగ్రస్తుడు, తామర, గజ్జివంటి చర్మరోగములు కలవాడు, రక్తదోషములు గలవాడు, గోళ్ళు వికృతముగా ఉన్నవాడు, నల్లని నీలపుపండ్లు గలవాడు, చెవిటివాడు, కండ్లు ఎర్రగా వున్నవాడు, దృష్టిదోషములు గలవాడు, అంధుడైనవాడు, శిరస్సుపై కేశములు అన్నీ పోయి బట్టతల అయిన వాడు, వికలాంగుడు. మరియు



అధికాంగములు గలవాడు, పిల్లికళ్ళవాడు, ముక్కునుండి దుర్గంధము వచ్చువాడు, పొట్టివాడు, గూనివాడు, బొల్లిగలవాడు, నపుంసకత వంటి శారీరక దోషములతో అశుభ లక్షణములుగల వ్యక్తికి ఆత్మ జ్ఞాన దీక్షను అనుగ్రహించే అర్హతలేదు.

సంస్కార రహితుడు, మూర్ఖుడు అయినవాడు, వేదశాస్త్ర జ్ఞానము లేనివాడు, వేదములలో చెప్పబడిన క్రియా కర్మములను ఆచరించనివాడు అనగా వైదిక కర్మలు ఆచరించనివాడు లేక తెలియనివాడు, కుత్సితుడు, శుష్కమైన అసభ్యపద జాలమును మాట్లాడువాడు, ధన సంపాదన కొరకు వైద్యవృత్తిని అవలంబించువాడు, కాముకుడు, స్త్రీలోలుడు, ఎక్కువగా భుజించువాడు, క్రూరవృత్తి గలవాడు, బీరములు పల్కువాడు, మాత్సర్యము గలవాడు, మిథ్యావాది అయిన వ్యక్తిని గురువుగా స్వీకరింపరాదు. చోరుడు, మూర్ఖుడు, ధూర్తుడు, గంజాయి, భంగు, సారాయి మొదలగు మాదక ద్రవ్యములను వ్యసనముగా గలవాడు, లోభి, ఇతరులకు అపకారము చేయువాడు, దుష్టుడు, పశుప్రవృత్తి గలవాడు, కుసాంగత్యము చేయువాడు, నాస్తికుడు, పిరికివాడు, మహాపాతక కర్మములు ఈ జన్మలో గాని గత జన్మలోగాని చేసి ఆ కర్మల ద్వారా ప్రాప్తించిన కుష్ఠువంటి మహారోగములు గలవాడిని గురువు స్వీకరింపరాదు.

దేవతలను, అగ్నిని, గురువును పూజించనివాడు, సంధ్యావందన, తర్పణ, పూజాది మంత్ర జ్ఞానము లేనివాడు అనగా సంధ్యావందనాది నిత్యకర్మలు త్యాగముచేసిన వాడు, అకర్మణ్యుడు, సోమరి, ధర్మము పాటింపనివాడు, భోగలాలసుడు ఇతరులపైన భారము వేసి జీవించెడి సంసారాసక్తుడైన మనుష్యుని జ్ఞానదీక్షకు ఎంచుకొనకూడదు.

వ్యాధిగ్రస్తుడైన వానిని, గృహస్థుడై వుండి సంతానము లేనివాడిని, భార్యలేకుండా ఒంటరిగా ఉండు వానిని, మంత్రజపము కారణముగా మతిచెడిన గురువు నుండి మంత్రముగాని, దీక్షనుగాని తీసుకొనకూడదు. శిష్యులను ప్రలోభపరచి అపమార్గముల ద్వారా శిష్యుల ధనమును అపహరించువానిని, శిష్యుల హితముకోరని గురువును త్యాగము చేయవలయును.

పై చెప్పిన విధముగా దోషపూరితమైన యోగసిద్ధిని కలుగజేయు గురువును, అతడి ద్వారా కర్మ మరియు మంత్ర సిద్ధి కలిగినా అతడిని గురువుగా స్వీకరించకూడదు. శారీరక, మానసిక ప్రవర్తనాదోషములు కలవారి యోగము, మంత్రము మరియు ఔషధ సిద్ధులనుచూచి పొరపడకూడదు. ఇటువంటివారికి

ముక్తి లభించదు. ఏదైన ప్రలోభముల కారణముగా ఇటువంటి గురువుల వద్ద దీక్షను తీసుకొనినప్పుడు, దానికి ప్రాయశ్చిత్వము అనుష్ఠించి పునః దీక్ష కొరకు ఎవరైనా జ్ఞానులను శరణుకోరవలసి వుంటుంది.

మోక్షమును ఆశించి మాత్రమే అందరూ గురువు వద్ద దీక్షను తీసుకొనరు. ప్రతిమనుష్యుని యొక్క ప్రకృతి మరియు ప్రవృత్తి వేర్వేరుగా వుంటాయి. అందువల్ల సాధకుని పాత్రతకు అనుగుణమైన గురువు లభిస్తాడు. అందరూ మోక్షమును ఆశించరు. భగవానుడైన రామచంద్రుడు హనుమంతుడితో చెప్పిన విధముగా ప్రపంచములో కొందరు ధర్మము పాటించుటకు గురువును సేవిస్తారు, కొందరు ధనమును కాంక్షించి అనగా కోరికలను తీర్చుకొనుటకు గురు శుశ్రూష చేస్తారు. కొద్దిమంది మోక్షమును కాంక్షించి గురు సేవను చేస్తారు. కాని అందరికీ వారివారి మనోభీష్టము సిద్ధించని కారణముగా వారి గురుసేవ వ్యర్ధమవుతుంది. తన ప్రవృత్తికి భిన్నమైన మార్గావలంబనవలన అభీష్ట సిద్ధి కలుగదు. ధర్మ, అర్థములు కాంక్షించే వ్యక్తులకు మోక్ష ప్రదాత అయిన గురువు సేవచేయుట వ్యర్థము. మోక్షము కోరు సాధకులకు ధనమును కోర్కెలను ప్రాప్తింపజేసెడి గురువును సేవించుట వ్యర్థము. ప్రాపంచిక భోగ ఐశ్వర్యాలను కాంక్షించే వ్యక్తులకు, జ్ఞానులు, మహాత్ములవల్ల లాభమేమీ కలుగదు. అందువలన అతడు జ్ఞాని అయిన గురువును వదలివేయవలసి వుంటుంది. జిజ్ఞాసువులు ముముక్షువులు అయినవారు ధనము, కోర్కెలను ప్రాప్తింపజేసే అజ్ఞానులైన గురువును వదలివేస్తారు. ఆ గురువు కూడా వీరిని వదలివేస్తాడు. ఇది ఇద్దరికి హితకరము. అందువలన జనకమహారాజు మరియు వారి అర్ధాంగి తమ ప్రవృత్తికి భిన్నమైన గురువులను వదలి జ్ఞానులైన గురువులను శరణుకోరారు. అనగా ఆవశ్యకతానుసారము గురు శరణమును కోరవలసి వుంటుంది. తమ ప్రవృత్తికి భిన్న ప్రవృత్తిగల వానిని గురువుగా స్వీకరింపకూడదు. శాస్త్రములు, నిర్దేశించిన విధముగా మోక్షమార్గవలంబులు దైవీగుణములు, దైవీ శక్తియొక్క వికాసము చేయగల గురువు లభించువరకు అన్వేషణ చేయవలసి వుంటుంది. ఏ గురువును ఆశ్రయించుటవలన శాస్త్రములలో ఉదహరించిన దైవీశక్తుల యొక్క వికాసము కలుగుతుందో అటువంటి గురువును శిష్యుడు ఆశ్రయించ వలసి యుంటుంది. అటువంటి గురువును త్యజించుట మహాపాపము. అజ్ఞానములో నున్న వ్యక్తిని గురువుగా స్వీకరించుట సాధకునికి మంగళకరము కాదు. శ్రీ మహేశ్వరులు చెప్పిన విధముగా ఈ ప్రపంచములో కొంతమంది జనులు



జ్ఞానము కొరకు మాత్రమే గురుశుశ్రూష చేస్తారు. జ్ఞానము వల్లనే వారికి పరమశాంతి, మోక్షము ప్రాప్తిస్తాయి. అందువలన జ్ఞానమే పరమశ్రేష్ఠ మయివున్నది. ఏ గురువునకు జ్ఞానదీక్షని అనుగ్రహించు సామర్థ్యము ఉండదో అతడిని త్యజించవలెను. క్షుదార్తుడు, ఆకలి గొన్నవాడు, భోజనము పెట్టే సామర్థ్యములేని వానిని వదలివేసినట్లుగా, జ్ఞానప్రాప్తిని అనుగ్రహించలేని గురువును శిష్యుడు వెంటనే త్యజించ వలసి వుంటుంది. తేనెటీగ మకరందము లేని పుష్పమును వెంటనే త్యజించి వేరొక పుష్పమును ఆశ్రయించిన విధముగా శిష్యుడుకూడా సమర్థుడుకాని గురువును త్యజించి జ్ఞాన లాభము కొరకు జ్ఞాని అయిన గురువును ఆశ్రయించాలి.

అజ్ఞాని సమర్థతలేని గురువును త్యజించి వేరొక గురువును ఆశ్రయించుట వలన శిష్యునికి గురువును త్యజించుటవలన దోషములు అంటవు. అందువలన గురువును సేవించి శక్తి పాతదీక్షను తీసుకొన్న సాధకునకు ఒక సంవత్సరము లోపల శక్తిపాతము ద్వారా పొందెడి లక్షణములు ప్రత్యక్షముగా అనుభవమునకు రాకపోయినట్లయితే అటువంటి గురువును త్యజించి వేరొక గురువు ద్వారా దీక్షాగ్రహణము చేయవలసి వుంటుంది. వేరొక గురువును శరణు కోరునపుడు పూర్వ గురువును గురు పుత్రులను గురు సహోదరులను నిర్లక్ష్యము చేయక వారి యోగ్యత ననుసరించి గౌరవించవలసి వుంటుంది.

**సద్గురువు యొక్క లక్షణములు :** ఇప్పుడు యోగదీక్షను అనుగ్రహించగల సమర్థుడైన సద్గురువు లక్షణములు తెలుసుకొందాము.

పరిశుభ్రమైన వస్త్రములు ధరించి చక్కని వస్త్రధారణ కలిగి యున్నవాడు, శారీరకముగా శుభలక్షణములతో శోభిల్లువాడు, అన్ని శాస్త్రముల యొక్క తత్వార్థము తెలిసినవాడు, అనగా శాస్త్రములు తెల్పిన క్రియా కర్మములు తెలిసినవాడు, తన వద్దకు వచ్చిన వారందరిని ఆనంద పరచువాడు, ప్రసన్న వదనుడు, కఠినాతి కఠినమైన విషయములను కూడాసులభముగా వివరించగల సామర్థ్యము గలవాడు, భ్రమలు, సంశయములు తొలగించు ఉత్తమ పురుషుడు తత్వజ్ఞాన దీక్షానుగ్రహము చేయుటకు తగినవాడు.

దృష్టి బాహ్యముగా ఉన్నట్లుగా అగుపించినను లక్ష్యము అంతరములో నుండువాడు, సర్వజ్ఞుడు, త్రికాలదర్శి అయినవాడు, సిద్ధులను కలిగి సిద్ధత్వము గలవాడు, వాక్‌సిద్ధి కలవాడు, కృపా సామర్థ్యము, దండన సామర్థ్యము గలవాడు, జ్ఞానపథములో నిలిచి వుండి తన ఆత్మసామర్థ్యముతో ఇతరులలో శక్తి సంచారముచేసి

జ్ఞానబోధను చేయగలవాడు, శాంతముతో నుండి జీవులపై దయను చూపువాడు, అరిషడ్వర్గములు జయించినవాడు, జితేంద్రియుడు, దీక్షానుగ్రహము చేయుటకు యోగ్యుడైన గురువు, శివకేశవులను సమదృష్టితో చూచువాడు, సకల సద్గుణములు కలవాడు, దీక్షాప్రదానము చేయుటకు సమర్థత గల వాడుగా చెప్పవచ్చును.

మమతానుబంధములు లేకుండా నిత్యము సంతృప్తితో స్వతంత్రుడిగా వుండి అనంతశక్తి సామర్థ్యములు గలవాడు, సద్భక్తుల యెడల ప్రేమాను రాగములు గలవాడు, ధీరుడు, కృపాలుడు, చతురోక్తులతో కష్టపెట్టకుండా మాటలాడువాడు. రాగ, ద్వేషములు, భయము, క్లేశములు, గర్వము, అహంకారము లేనివాడు, నిత్య, నైమిత్తిక, అనిందిత కర్మలను అనుష్ఠించు వానికి దీక్షానుగ్రహ యోగ్యత కలదు. విధివిహిత అనుష్ఠానములు పాటించుతూ, ధర్మ, జ్ఞానములు జనులకు తెలియజేయువాడు, దైవానుగ్రహముతో లభించెడి ధనముతో సంతృప్తి చెందెడివాడు, దీక్షను అనుగ్రహించగల యోగ్యతగల గురువు అయి ఉన్నాడు.

ధనమునందు, స్త్రీలపట్ల విముఖత కలిగినవాడు, దుష్ట సాంగత్యము మరియు వ్యసనములు లేనివాడు, కోరికలు లేకుండా తానున్న స్థితియందు సంతృప్తి కలవాడు, పక్షపాతము చూపనివాడు, ఆసక్తి లేనివాడు, వికల్పములు లేనివాడు, ఆత్మసాక్షాత్కారము పొందినవాడు, ధార్మికుడు, నిందా స్తుతులను సమానముగా భావించువాడు, ఎవరి నుండి ఏదీకోరనివాడు, తన ఆత్మబలముతో ఇతరులను నియంత్రించెడి శుభలక్షణములుగల పురుషుడు ఆత్మజ్ఞానదీక్షా ప్రదానము చేయగల సమర్థత కలిగి ఉంటాడు.

**గురువు సాక్షాత్తు శివ స్వరూపము అయివున్నాడు :** అనంతుడు, అవ్యయుడు, నిత్యుడు, నిర్గుణుడు, దిగంబరుడు (దిక్కులు అంబరముగా గలవాడు) అయిన శివపరమాత్మను మనము ఏవిధముగా పూజించగలము. అనగా శివుడే గురు రూపమున భక్తితో పూజింపబడి ముక్తిని ప్రదానము చేస్తాడు. శివుడే మానవుల కంటికి కనిపించకుండా గురు రూపమును ధరించి శిష్యులను సర్వదా రక్షిస్తాడు.

సాక్షాత్తు పరమశివుడు మనుష్య రూపములో అవ్యక్తముగా వుండి తన శిష్యులపైన అనుగ్రహము కురిపిస్తాడు. ఆ పరమశివుడు నిరాకారుడుగా నున్నప్పటికి సద్భక్తులను రక్షించుటకు గురు రూపములో ప్రాపంచిక కార్యకలాపములు అనుష్ఠించు విధముగా కన్పిస్తాడు. పాప కర్ములకు గురువు మనుష్యరూపములో కనిపిస్తాడు. కాని పుణ్యకర్మములు అనుష్ఠించువారు గురువును శివస్వరూపముగా చూస్తారు.



అంధులు సూర్యోదయమును చూడలేనట్లే భాగ్యహీనులు సాక్షాత్తు పరమతత్వ స్వరూపములోనున్న గురువును గుర్తించలేరు. అంటే గురువు సాక్షాత్తు శివ స్వరూపుడు అనుటలో ఏమీ సందేహించవలసిన పనిలేదు. గురువు సదాశివుని రూపము కాకుంటే భుక్తి ముక్తిని ఎవరు ఇవ్వగలడు. అందువలన సదాశివునికి, గురువునకు భేదము ఏమీలేదు. ఇరువురిలో భేదమును చూచువారు పాపాత్ములు.

గురువు ఉపదేశకునిగా మారి జీవుల బంధనములను త్రెంచి పరమ పదము ప్రాప్తింపజేస్తాడు. అందరిపై అనుగ్రహమును చూపే కరుణానిధి అయిన ఈశ్వరుడు ఆచార్యుని రూపము ధరించి దీక్షవిధానము ద్వారా ముక్తిని ప్రాప్తింపచేస్తాడు. అతడే శివరూపములో పూజలు అందుకొంటాడు, మరియు గురు రూపములో సంసారబంధములు నశింపచేస్తాడు.

మనస్సు యొక్క సంకల్ప వికల్పములే బంధనమునకు మూలకారణము. వికల్పరూప భ్రాంతి కారణముగా బంధనము అనేదిలేకుండా చిత్తము లయము చెందినపుడు మోక్షము ప్రాప్తిస్తుంది. అందువలన చిత్తముయొక్క వికల్ప రూప భ్రాంతిని నాశనముచేసి శిష్యుని చిత్తము లయమయ్యే స్థితికి (సమాధి) తీసుకొనిరాగల గురువు సద్గురువుగా భావింపబడతాడు. కేవలము శాస్త్ర విషయములు ఉటంకించు మనుజుడు గురువుకాలేడు, సత్యవాది, గురుభక్తుడు, దృఢ చిత్తము గలవాడు ఆత్మనిష్ఠుడు, దానాది సత్కర్మానుష్ఠానములు చేయువాడు, కపటము లోభము లేనివాడు, ఉత్తమ కులము అనగా భక్తుల వంశములో జన్మించిన గురువుని ప్రయత్న పూర్వకముగా గుర్తించి ఆయనతో సాంగత్యము చేయవలెను. అప్పుడే వారి కృపద్వారా మనస్సు శాంతించి పరమపద ప్రాప్తి కలుగుతుది.

త్రితాపములు అనగా ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికతలతో తపించు మనుజులను విష్ణు భగవానుల చరణముల వద్దకు చేర్చువాడు, సుషుమ్నా మార్గములో గల షట్చక్రముల ఛేదించగలవాడు, తత్వజ్ఞాన పారంగతుడు, కుండలినీశక్తిని, రూపాతీత పరబ్రహ్మమును వివేచన చేయగల శక్తి గలవాడు, షట్చక్ర మార్గమును శుద్ధి చేయగలశక్తి గలవాడు, మంత్ర చైతన్య స్థితులు తెలుసుకొన్నవాడు గురువుగా చెప్పబడ్డాడు. మంత్ర తంత్రముల రహస్యములు తెలిసినవాడు, జాగృత కుండలినీశక్తి యొక్క గతి విధులు తెలిసివాడు, మంత్రసిద్ధి సాధనములను విధి పూర్వకముగా తెలిసియున్నవాడు మాత్రమే గురువు కాగలడు. వేరొకడు గురువు కాలేడు.

# సిద్ధమహాయోగము

## పదవ ప్రకరణము

**దీక్షా ప్రదానము చేసే ప్రదేశము :** ఏ దీక్షద్వారా గురువు శిష్యునికి ఆత్మ మరియు పరమాత్మతో అనుబంధమును కల్పించునో ఆ దీక్షా ప్రదానము చేయుటకు స్థలము, సమయము శాస్త్రములలో వివరించబడినవి. ఉత్తమ స్థానములో, ఉత్తమ సమయములో దీక్షను తీసుకొనుటవలన శిష్యునకు అభీష్ట సిద్ధి కలుగుతుంది.

దీక్షా ప్రదానమునకు గోశాల, గురువు నివసించు గృహము, దేవాలయము, వనము (ఏకాంత అరణ్యము), పుణ్యక్షేత్రము (తీర్థస్థానము), ఉద్యానవనము, లేక నదీ తీరము అనుకూలమైన ప్రదేశములు. ఉసిరిక చెట్టు, బిల్వవృక్షము క్రింద, కొండగుహలందు కూడా దీక్షా ప్రదానము చేయవచ్చును. గంగాతీరమున ఏ స్థానమునందైనను దీక్షను గైకొనుట విశేష పుణ్యమునిస్తుంది. అందువలన గంగా తీరమున దీక్షనుగైకొనుట ఉత్తమము. కాని గురువు అభీష్టము ప్రకారము ఇవ్వబడిన దీక్ష అత్యుత్తమము. ఎందువలనంటే గురువును మించిన తీర్థస్థానములు లేవు. వారి మాట వేదవాక్కుతో సమానము.

**దీక్షా సమయము :** జనులు ఉపనయనము, వివాహములు చేయుటకు పంచాంగము చూసి ముహూర్త నిర్ణయము చేస్తుంటారు. తీర్థయాత్రలు, యజ్ఞములు, దానములు, జప, తపములలో కూడా శుభాశుభ సమయ నిర్ణయము చేసి ప్రారంభిస్తారు. మంచి సమయములో మంచి తిథి, వార, నక్షత్రములలో తమ నామ నక్షత్రముల ననుసరించి చేయబడిన శుభకర్మలు నిర్విఘ్నముగా నెరవేరి వాంఛిత ఫలములను ప్రసాదిస్తాయి. అందువలన జ్యోతిషము ద్వారా మంచి చెడులను నిర్ణయించి పుణ్యకర్మలు చేయబడుతాయి మరియు చేయాలి కూడా. కాని కాలాకాల నిర్ణయములు విచారణ చేయక అదృష్టవశాత్తు లభించిన సిద్ధ పురుషుని ద్వారా దీక్షాగ్రహణము తప్పక చేయవలెను. ఎందువలనంటే, ఏ సమయములో సద్గురువు యొక్క దుర్లభమైన దర్శనము ప్రాప్తించి అతడు ప్రసన్నుడై దీక్షను ప్రదానము చేయుటకు సిద్ధపడతాడో ఆ సమయము శిష్యునికి సర్వ శ్రేష్ఠమైనదిగా పరిగణించాలి. అనగా గురువు యొక్క ఆజ్ఞానుసారము గురుశిష్యుల కోరిక పై దీక్ష ఇవ్వబడుతుంది. గురువు స్వయముగా కృపచూపినప్పుడు కాలాకాలములతో పనిలేదు.



సామర్థ్యముగల గురువునకు శాస్త్రములలో నిర్ణయించిన విధి నిషేధములు ...వు. వారు ఎవరిపై కృపను చూపుతారో వారిని విధి నిషేధముల నుండి ...ంధముల నుండి విముక్తి పరచగలరు. అటువంటి గురువు యొక్క సంగము ...గ్రవశమునకు మాత్రమే ఎవరికైనా ప్రాప్తిస్తుంది. సాధారణముగా జనులు ...న్హికియా కర్మములు చేసెడి సాధారణ గురువుల నుండి దీక్షను తీసుకొంటారు. ...దువలన శాస్త్రములలో చెప్పిన విధముగా దీక్షకు పూర్వము తీర్థాది స్థలములు ...చుకొని దీక్షావ్రతము గైకొని స్నానము, జపము, తపము, యజ్ఞము వంటి ...క లౌకిక కర్మలు ఆచరిస్తారు. కాని ఇవి అన్నీ వాస్తవిక దీక్షకు ముఖ్య అంశములు ... సద్గురువు కృప లభించినట్లయితే శిష్యునికి ఎటువంటి ప్రాయశ్చిత్త కర్మలు ...రించవలసిన పనిలేదు. సద్గురువు లభించిన తరువాత శిష్యునిపై గురువునకు ... కృప మరియు శిష్యుని కోరిక మాత్రమే దీక్షాప్రదానమునకు హేతువుగా ...ప్పబడుతుంది.

గురువు దయచూపి శిష్యుని తనవద్దకు పిలిపించుకొని దీక్షను ...నుగ్రహించునపుడు లగ్నము, తిథి, వార, గ్రహ, నక్షత్ర, రాసులవంటి వాటితో ...హూర్త నిర్ణయముతో పనిలేదు. ఎందుకంటే ఏరోజున గురువు సంతృప్తి చెంది ...ష్యునికి దీక్షా ప్రదానము చేస్తాడో, ఆరోజున తిథివార నక్షత్రములు అనుకూలముగా ...కున్ననూ గురుకృప కారణముచేత శుభము చేకూరును.

అందువలన సమర్థుడైన గురువు ఆజ్ఞానుసారము శుభాశుభలగ్నములందు ...క తీర్థాది స్థలముల యందు దీక్షాకార్యము జరుగవలసి ఉంటుంది. ఇందులో ...థి, వార, పూజా వ్రతముల వంటివాని ఆవశ్యకత ఉండదు. జ్ఞాన ప్రాప్తికి ఎటువంటి ...హ్య ఆలంబనములు అవసరములేదు. బాహ్య సాధనములు అయిన లౌకిక ...లు అనగా దేశకాలములు, తిథి వారములు, స్నాన సంధ్యలు, పూజా యజ్ఞములు, ...నము నివ్వలేవు. ఏరోజున గురువు దయతో దీక్షా ప్రదానము చేయునో, మరియు ...ష్యుడు స్వీకరించునో ఆరోజున మాత్రమే శిష్యునికు తిథి వార, నక్షత్ర గ్రహరాశులు ...ంగళము కలుగజేస్తాయి. గురువునకు దీక్షా ప్రదానము చేయవలెననెడి కోరిక ...ప్పుడు కలుగుతుందో ఆ సమయము శిష్యునకు అత్యుత్తమమైన సమయముగా ...గణించాలి. గురువు మరియు శిష్యుల యొక్క కోరికయే దీక్షకు శుభ సమయముగా ...ప్పబడుతుంది.

**దీక్షను గ్రహించుటకు ఏర్పరచబడిన విధివిధానములు :** అన్ని సద్గుణములు గల మహాసమర్థుడైన, జప, తప, ధ్యాన, యోగ పరాయణుడు, తత్త్వజ్ఞానము తెలిసినటువంటి గురువు వద్దకు శిష్యుడు మీకు ముందుగా వెళ్ళి శుద్ధ మనస్సుతో త్రికరణ శుద్ధిగా అనగా మనోవాక్కాయ కర్మలతో పూజించాలి. తన యోగ్యతానుసారము భక్తియుతముగా ఏనుగులు, గుర్రములు, రత్నములు, రధములు భూములు, గృహములు, ఆభరణములు, వస్త్రములు, ధన ధాన్యముల వంటి సంపదలను గురుశుశ్రూషకు వినియోగించాలి.

**శిష్యునియొక్క కర్తవ్యము :** శిష్యుడు తన కళ్యాణార్థము పైన చెప్పిన విధముగా తన సామర్థ్యము ననుసరించి ధన, వైభవములతో గురువును సేవించాలి. శక్తి లేనపుడు పత్ర, పుష్ప, ఫల, జలములు సమర్పించి అనన్య భావముతో గురువును ఆశ్రయించాలి. తనవద్ద ధనము ఉన్నప్పుడు లోటులేకుండా గురువును సేవించాలి. ధనము వుండి గురువునకు సమర్పించక పోయిన ఎడల శిష్యునికి ఎటువంటి ధర్మ కర్మలు సిద్ధించవు. అందువలన గురువు వద్ద ఆత్మవంచన లేకుండా కపట రహితముగా తమ నిజస్థాయి ననుసరించి శిష్యుడు యధాశక్తిగా ఫల, పత్ర, పుష్పములతో పూజించాలి. తరువాత దాపరికము లేకుండా తాను చేసిన మంచి చెడులను మరియు భవిష్యత్తులో చేయదలుచుకొన్న పనుల వివరములను గురువునకు నివేదించి సంతోషపరచి వారి నుండి దీక్ష లాభమును పొందవలసి యుంటుంది.

శిష్యునియొక్క భక్తితో ప్రసన్నుడైన కృపాలుడైన గురువు అతడికి దీక్ష ననుగ్రహించి నపుడు గురు ప్రదత్తమైన యోగసాధన ద్వారా శిష్యునకు కర్మబంధములు తొలగి భుక్తి, ముక్తులు ప్రాప్తించుకొనే సామర్థ్యము లభిస్తుంది. అందువలన శిష్యునకు గురువుయొక్క కృపను పొందుట అత్యంత ఆవశ్యకము. ఎందుకంటే గురువు సంతుష్టుడైనపుడే శిష్యునికి ధర్మ, కర్మములు సిద్ధించి శాశ్వతమైన ముక్తి లభిస్తుంది. గురువు ప్రసన్నుడు కాకుంటే ఎటువంటి సిద్ధి లభించదు. గురువు అసంతృప్తు డయినపుడు శిష్యుని యొక్క ధర్మ, కర్మములు దోషయుక్తమై విపరీత బుద్ధి కలిగి సాధకుడు పతనమవుతాడు. అంటే గురువును సాధారణ మానవునిగా తలంచక భగవంతుని రూపముగా తలచి అతడికి ఎప్పుడూ అనాదరణగాని అవమానము గాని చేయరాదు. ఎందుకంటే గురువు శివస్వరూపము. అందువలన శిష్యుడు దీక్షాగ్రహణము చేసిన తరువాత కూడా గురువు నిర్దేశములను పాటించుతూ ఆనందముతో సేవాశుశ్రూషలు చేయవలసి వుంటుంది.



దీక్షను తీసుకొన్న శిష్యుడు దాని పూర్తి ఫలితము సిద్ధించే వరకు కనీసము 3 దినములు భక్తి యుతముగా గురువును సేవించవలయును. లేకున్న శిష్యునిలో ప్రవేశించిన గురువు యొక్క తేజః శక్తి నిస్సందేహముగా తిరిగి గురువులోనికి వచ్చి వేస్తుంది. అందువలన దీక్షానుగ్రహము తరువాత కూడా మూడుదినములు గాని, ఐదు దినములుగాని, ఏడుదినములు గాని ఎప్పటివరకు శిష్యునిలో ప్రవేశించిన క్రియాశక్తి వికాసము జరుగదో అప్పటివరకు గురుసామీప్యములో ఉండి అతడి ఆజ్ఞానుసారము ఏకాంతముగా సాధన చేయవలసి వుంటుంది. గురువు ప్రసన్నుడై అనుమతి నిచ్చినప్పుడుగాని లేక తన ఇచ్ఛ నెరవేరినపుడుగాని అనగా గురుశక్తియొక్క జ్ఞానము లభించినపుడు శిష్యుడు గురువువద్ద వీడ్కోలు తీసుకొనవలసి వుంటుంది. ఆ విధముగా చేయనపుడు గురువు నుండి శిష్యునికి ప్రాప్తించిన శక్తి తిరిగి గురువులోనికి వచ్చి వేస్తుంది. ఇందులో ఎటువంటి సందేహములేదు. దీక్షను తీసుకొన్న తరువాత ప్రతిదినము యోగాభ్యాసము చేయక గురువుపట్ల ఉదాసీనత ఏర్పడినపుడుగాని లేక గురువుతో సంపర్కము లేనపుడు గాని గురువు యొక్క సంచారిణీశక్తి క్రియల తీవ్రత తగ్గి శరీరములో నానావిధములైన రోగములు ఉద్భవిస్తాయి మరియు ధర్మకర్మములలో సాధకునికి విపరీత బుద్ధి ఏర్పడి బుద్ధి భ్రష్టత ఏర్పడుతుంది. దీనివలన సాధకునికి దురదృష్టము ప్రాప్తిస్తుంది. అందువలన తన సాధనలో ఉన్నతికి శిష్యుడు ఆవశ్యకతానుసారము క్రమబద్ధముగా గురువును కలుస్తూ వుండవలసి వుంటుంది. సంవత్సరములో ఒకమాసము లేదా ఒక పక్షము, లేక ఒకవారము గురువువద్ద ఉన్నప్పుడు శిష్యునికి కోరినవిధముగా ఉన్నతి కలిగి అభీష్టసిద్ధి కలుగుతుంది. ఇదే కాకుండా నిత్యము ధ్యానముద్వారా లేక లేఖలద్వారా సర్వదా గురువుతో సంపర్కము పెట్టుకొన్న శిష్యునికి ఎటువంటి విఘ్నములు కలుగవు.

**గురుదక్షిణ :** ఏ గురువుయొక్క మహాశక్తి ప్రభావముతో శిష్యునిలో అతి ఆశ్చర్యజనకమైన క్రియాశక్తి యొక్క అనుభవము కలుగుతుందో, ఎవరి కృపాకారణముచే శిష్యునిలో ధర్మార్థ కామమోక్షములను పొందెడి సమర్థత కలుగుతుందో అటువంటి శివ స్వరూపుడైన గురువు వద్ద నుండి దీక్షను గ్రహించి సాధకుడు దీక్షాగ్రహణము తరువాత గురువు అనుమతితో తన శక్తిననుసరించి దక్షిణ ఇవ్వవలసి ఉంటుంది. గురువు నుండి దీక్షను గైకొని తన శక్తి ప్రకారము దక్షిణ ఇవ్వకపోయినట్లయితే సంచారిణీ శక్తి శిష్యునిలో ఉండలేదు. ఒకవేళ ఆ శక్తి శిష్యునిలో నిలిచి వున్నప్పటికి అమంగళము కలుగజేస్తుంది. అందువలన ఉత్తమ

ధనము, బంగారము, వస్త్రము లేక ఫలములు పుష్పములను గురుదక్షిణగా అత్యంత వినయముగా, భక్తి భావముతో సమర్పణ చేయవలయును. గురువునకు తప్పనిసరిగా దక్షిణ ఇవ్వవలసి వుంటుంది. న్యాయముగా కూడబెట్టిన తన సంపాదనలో సగభాగము లేక నాల్గవభాగము లేక యధాశక్తి తనవద్ద ఉన్న ధనమును భక్తి పూర్వకముగా గురువునకు అర్పణ చేయాలి. ధనము ఉంచుకొని లేని విధముగా ప్రవర్తించకూడదు. ఎవరు ధనము వుండి కూడా గురువు వద్ద లేనట్లుగా ప్రవర్తిస్తారో మరియు తన వాస్తవిక మనః ప్రవృత్తులను గురువువద్ద దాచివుంచుతారో వారికి అనర్థము కలుగుతుంది. వారికి దీక్షాజనిత జ్ఞానఫలము లభించదు. అందువలన తన శక్త్యనుసారము గురువునకు గోవులు, భూమి, సువర్ణము, వస్త్రములు మొదలగునవి నివేదన చేయాలి. గురువుయొక్క పుత్రునికి మరియు వారి ధర్మ పత్నికి కూడా యధాశక్తి వస్త్ర, ఆ భూషణములు సమర్పించవలసి వుంటుంది. గురువునకు భార్యగాని పుత్రుడుగాని లేనపుడు వారియొక్క ప్రధాన శిష్యునికి సమర్పించవలసి వుంటుంది. దీక్షాప్రదాన దినమున అందరికి మృష్టాన్న భోజనము పెట్టవలసి వుంటుంది.

జన్మప్రదాతలు అయిన తల్లితండ్రుల పోషణభారము పుత్రుని పరమ కర్తవ్యమయినట్లుగానే సంసార బంధముల నుండి ముక్తుడిని చేసెడి జ్ఞానదాత అయిన గురువునకు సేవచేయుట శిష్యుని పరమకర్తవ్యము అయివున్నది. కర్తవ్యమును పాటించక తల్లి, తండ్రుల పోషణభారము వహించక పోయినను మరియు గురువువద్ద నుండి విద్యను పొంది దక్షిణ ఇవ్వకపోయినట్లయినను మరణించువరకు కృతఘ్నుతా దోషము పట్టి పీడిస్తుంది. ఆ కృతఘ్నునికి మరణము ఒక్కటే నిష్కృతి అయివున్నది. అనగా ఎవరు గురువు నుండి బ్రహ్మవిద్యను పొంది మోహవశమున పారితోషిక రూపములో దక్షిణ నివ్వరోవారు ప్రళయ పర్యంతము నరక రూపమైన దుఃఖములను పొందగలరు.

యజ్ఞములో దక్షిణకు ప్రాముఖ్యత ఉన్నది. ఆ దక్షిణ అనేది శ్రద్ధతో ఇవ్వాలి. శ్రద్ధతో మాత్రమే దక్షిణ ఫలప్రదమవుతుంది. అందువలన యజ్ఞము చేసే వారు, చేయించే బ్రాహ్మణులకు శ్రద్ధతో దక్షిణ ఇస్తారు. ఎందుకంటే శ్రద్ధతో ఇవ్వబడిన దక్షిణ యజ్ఞఫలములనిస్తుంది. దక్షిణ లేకుండా చేసిన యజ్ఞము వాంఛిత ఫలముల నివ్వదు మరియు మోక్ష ప్రదముకాదు. శాస్త్ర కథనము ప్రకారము దీక్షకూడా ఒక రకమైన యజ్ఞము. క్రియావతి దీక్ష బాహ్య యజ్ఞము అయివున్నది. ఇది బాహ్యముగా



చేయబడే హవనము మొదలగువానితో ఇవ్వబడుతుంది. జ్ఞానవతి దీక్ష అంతర యజ్ఞము అయినవున్నది. ఇది గురువుయొక్క ఆత్మశక్తి ద్వారా ఇవ్వబడుతుంది. నైయజ్ఞములకు దక్షిణలు ఇవ్వకపోతే అవి నిష్ఫలమవుతాయి. అందువలన దీక్ష లకు దక్షిణను తప్పనిసరిగా ఇవ్వవలసి వుంటుంది. దీక్ష మరియు దక్షిణ యజ్ఞమునకు భార్య వంటివి. వీటి సంయోగము వల్ల యజ్ఞము వాంఛిత ఫలములనిస్తుంది. అందువలన ఈ ప్రపంచములో దీక్ష మరియు దక్షిణ లేకుండా ఆచరించిన ధర్మ కర్మములు అన్నీ నిష్ఫలమవుతాయి. అంటే మానవుడు వైదిక యజ్ఞ విధానములో దీక్షితుడై యజ్ఞముచేసి దక్షిణ ఇచ్చినప్పుడు మాత్రమే వాంఛిత ఫలములు పొందగలడు. శ్రద్ధ మరియు భక్తితో ఇవ్వని దక్షిణ కూడా వ్యర్థమవుతుంది.

ఏ శిష్యునికి గురువుపట్ల భక్తి వుండదో అతడు తన సర్వస్వము అర్పణచేసినా దీక్షా ఫలితమును పొందలేడు. ఎందుకంటే ఫలప్రాప్తికి గురు భక్తియే ఏకైక మార్గము. అందువలన ఏ శిష్యుడు శ్రద్ధాహీనుడుగా వుండి గురువు ఆజ్ఞలను పాటింపడో, గురురూప ఆజ్ఞాశక్తిని పొంది దక్షిణ నివ్వడో, అటువంటి వారి జప, తప, కర్మలు సదా నిష్ఫలవుతాయి.

అందువలన శాస్త్రములలో చెప్పిన విధముగా గురువునకు శుశ్రూష చేసి సంతోషపరచినపుడు గురు కృపాఫలితము పూర్ణ జ్ఞానముగా మారుతుంది. శిష్యుడు నిర్విఘ్నముగా అభీష్టసిద్ధిని సహజముగా పొందగలడు. అన్యాయముగా ఆత్మద్రోహముతో గురువు నుండి గొప్ప ఉపకారమును పొంది ప్రత్యుపకారము చేయనపుడు శిష్యునిలో గురువు యొక్క సంచారిణీ శక్తి నశిస్తుంది లేక వేరొక విధముగా పరిణమిస్తుంది. అటువంటి సాధనవల్ల శిష్యునియొక్క మనస్సులో ఆటంకములు కలుగుతాయి. అదేవిధముగా గురుభక్తి లేకుండా గురువుపట్ల శ్రద్ధ లేకుండా ఉన్నప్పుడు శిష్యునికి శారీరక, మానసిక, ఆర్థిక కష్టములు ప్రాప్తిస్తాయి. తప్పనిసరిగా అతడు ధనము నష్టపోతాడు మరియు అతడికి అనేక ఆపదలు కలుగుతాయి. ఎందుకంటే అన్యాయముగా గ్రహించిన దీక్షాజ్ఞానము విపరీత ఫలములనిస్తుంది.

ఏ గురువుయొక్క ఆత్మశక్తి శిష్యునిలో ఇరవైనాలుగు గంటలు క్రియలను జరుపుతూ వుంటుందో, ఏ గురుశక్తి స్మరణ మాత్రముచేత శిష్యునిలో అష్టాంగ యోగము స్వయముగా సిద్ధిస్తుందో, ఎవరి శక్తియొక్క క్రియాశీలత చేత శిష్యుని

శరీరము, మనస్సు, ప్రాణము, బుద్ధి వివశతను పొంది అస్తిత్వమును కోల్పోతుందో
ఏ గురువు యొక్క కృపచేత సాధకునికి ఈ ప్రపంచములో సుఖము
అనాయాసముగా ధర్మ, అర్థ, కామ, మోక్షములు ప్రాప్తించుకొనే సామర్థ్యము
కలుగుతుందో అటువంటి మహాకల్యాణ కారకుడైన, కరుణాసాగరుడైన గురువు
నుండి దీక్షను తీసుకొని ప్రత్యుపకారముగా శిష్యుడు ఎటువంటి సేవ చేయనప్పుడు
అతడు చాలా నిర్భాగ్యుడని చెప్పవచ్చు. అతడు సుఖముగా ఉండలేడు. శిష్యులకు
దీక్ష నిచ్చిన తరువాత గురువుయొక్క తేజస్సులో తరుగుదల కనబడుతుంది. సర్పము
తన విషమును నష్టపోయి బలహీనపడినట్లుగా, పురుషుడు వీర్య నాశనముచే
బలహీనుడైనట్లుగా, గురువుకూడా తన ఆత్మసామర్థ్యమును వ్యయముచేసి దీక్ష
సమయములో కొంత తేజస్సును కోల్పోతాడు. గురువు దీక్షనిచ్చినపుడు శిష్యుని
పాపకర్మలు కొంత నశించిపోతాయి. అతడి సంస్కారములు గురువుపై ఆక్రమణ
చేస్తాయి. గురువు శక్తివంతుడు అగుటచేత వాటిని పోగొట్టుకొంటాడు. శిష్యుని
చెడు సంస్కారాలు దాడి చేయుటచేత కొంతకాలముపాటు గురువు వ్యాధిగ్రస్తుడయ్యే
అవకాశము ఉన్నది. అటువంటి స్థితిలో, గురు కృపను పొంది శక్తివంతుడైన శిష్యుడు
గురువునకు సేవచేయనపుడు గురువు యొక్క మనస్సులో శిష్యునిపట్ల ఆసక్తి లే
తిరస్కారము భావము కలుగుతుంది. అది శిష్యునికి శుభకరము కాదు. ఇటువంటి
స్థితిలో గురువుయొక్క మనస్సు కూడా దీక్షా కార్యక్రమము పట్ల ఉదాసీనతను
పొందుతుంది. గురువులలో కూడా ఒకే సిద్ధ గురువునకు అనేకమంది శిష్యులు
ఉన్నప్పటికి అందరూ సమానమైన శక్తిని కలిగి వుండరు. అందువలన శిష్యులలో
వారి క్రియాశక్తి వికాసములో వ్యత్యాసములు వుంటాయి. ఏ గురువు పరమ
వైరాగ్యభావముతో ఒకే స్థానములో వుండక సంచారము చేస్తూ వుంటాడో, అటువంటి
వానికి సేవ చేయవలసిన ఆవశ్యకత చాలా తక్కువగా వుంటుంది. కాని కొంతమంది
గురువులు గృహస్థులుగా వుండి ప్రాపంచిక కార్యక్రమములలో నిమగ్నమై
వుంటారు. అటువంటి వారికి సేవచేయవలసి వుంటుంది. అందువలన శాస్త్రములలో
గురు సేవచేయవలెనని చెప్పబడినది. పూర్వకాలములో వశిష్ఠాది ఋషులు
యాజ్ఞవల్క్యుడు వంటి యోగులు గృహస్థాశ్రమములో గురువులుగా వుండేవారు
కాని వర్తమాన కాలములో కేవలము సాధనలు చేసే శక్తి సంపన్నులైన గురువులు
మనకు లభిస్తారు. కాని సాధనలో సిద్ధత్వము పొందిన గురువులు లభించటము
అత్యంత దుర్లభము. అందువలన చెడు తలంపులు మాని ఏ గురువు ద్వారా సాధన
లాభమును పొందారో వారికి తప్పనిసరిగా ప్రత్యుపకారము చేయవలసి వుంటుంది



**గురువు యొక్క కర్తవ్యము :** శాస్త్ర కథనానుసారము శిష్యుడు తనమేలు
కొరకు గురువునకు తన శరీరముతో, మనస్సుతో, ధనముతోడను సేవచేసి అతడి
కృపను కాంక్షించవలసి వుంటుంది. దీనితో శిష్యునకు తను ఆచరించవలసిన
విధి పూర్తి అవుతుంది. కాని గురువుయొక్క ముఖ్య కర్తవ్యమేమంటే అతడు
తనసామర్థ్యముతో దీక్షద్వారా శిష్యుని కృతార్థుని చేయవలసి వుంటుంది. ఎందుకంటే
శిష్యునిగా ఒకసారి స్వీకరించిన తరువాత గురువుయొక్క బాధ్యత పెరుగుతుంది.
గురువు శిష్యుని నుండి సేవాశుశ్రూషలు గైకొని అతడిని ఉద్ధరించ లేకపోయిన
యెడల మహాపాపమును భోగించవలసి యుంటుంది. మోక్షప్రాప్తి పర్యంతము
సర్వకాల సర్వావస్థలలో శిష్యుని మనో, ప్రాణములను లక్ష్యము చేసుకొని
ఆవశ్యకతానుసారము తన ఆత్మ సామర్థ్యముతో గురువు శిష్యునికి సహాయము
చేయవలసి ఉంటుంది. కేవలము దీక్షా ప్రదానముతో గురువుయొక్క కర్తవ్యము
తీరిపోదు. శిష్యుడు నిర్విఘ్నముగా తన అభీష్ట సిద్ధి అయిన జ్ఞాన లాభము
పొందినపుడు మాత్రమే గురువు కర్తవ్య విముక్తిని పొందుతాడు. ఈ కర్తవ్యమును
నిర్వర్తించటానికి గురువునకు శక్తి సంచాలనము చేయగల సామర్థ్యము ఉండాలి.
ఎందుకంటే శిష్యునిలో శక్తి సంచాలనము లేనపుడు అతడు తత్వముల యొక్క
యదార్థ స్వరూపమును వాటి వ్యాప్తి యొక్క వాస్తవిక జ్ఞానమును తెలుసుకొనలేడు.
ఈశ్వరుని శక్తి గురు మాధ్యమముగా శిష్యునిలో ప్రసరించి శ్రీ మహేశ్వరులచే
చెప్పబడిన మహాయోగ జ్ఞానము స్వయముగా తెలియబడు ననుట ప్రత్యక్షసత్యము.

శైవ ధర్మము ప్రకారము శ్రీ మహేశ్వరుల శక్తి యొక్క ప్రకాశము మాత్రమే
శిష్యునకు కల్యాణ కారి అవుతుంది. ఇందులో శక్తి సంచారము ననుసరించి శిష్యునికి
ఫలము లభిస్తుంది. శక్తిపాతము జరుగకపోతే శిష్యునిలో శుద్ధి జరుగదు. మరియు
అవిద్య నశించదు. మరియు శైవ ధర్మపద్ధతి అయిన అష్టాంగ యోగము సిద్ధించదు.
ఎక్కడ శక్తియొక్క పాతము జరుగదో అక్కడ ముక్తి లభించదు. మరియు ఎటువంటి
ధర్మ కర్మములు సిద్ధించవు. అందువలన గురువు దీక్షను అనుగ్రహించి శక్తిపాతము
ద్వారా కలుగు వివిధములైన యోగక్రియల ద్వారా శిష్యునిలో ఆనంద అనుభూతి
కలుగుతుందో లేదో పరీక్షించి చూడాలి. లేకుంటే తిరిగి శిష్యునిలో శక్తి ప్రసారము
చేసి పై అనుభవములు కలుగజేయాలి. అప్పుడు శిష్యుడు తన అనుభవముతో,
గురుబోధతో, మరియు శాస్త్ర ప్రమాణము ద్వారా తెలుసుకొని భ్రాంతి రహితుడై
సందేహ నివృత్తిని పొందుతాడు. గురువు కర్తవ్యమేమంటే, అతడు తన జ్ఞాన మరియు

యోగములతో శిష్యుని యొక్క అంతః కరణమును శుద్ధిచేసి జ్ఞాన, యోగములను శిష్యుని యందు కలుగజేయాలి. శిష్యునిలో జ్ఞానప్రకాశము స్వయముగా సిద్ధించి యోగక్రియలు స్వతః సిద్ధముగా ప్రారంభము కాకుంటే గురువుయొక్క కార్యము సంపూర్తి అయినట్లుగా భావించరాదు. శక్తి సంచార సామర్థ్యము లేకుండా శిష్యుని సేవలు గైకొని లేక సామర్థ్యము ఉన్నా మోహవశుడై శిష్యునిలో సంపూర్ణ శక్తి వికాసము కలుగజేయకుండా మధ్యలోనే వదలివేసే గురువు నశిస్తాడు. అందువలన గురువు ఈ క్రింద నివ్వబడిన శాస్త్రోక్త లక్షణములు శిష్యునిలో ఉన్నవో లేవో అని పరీక్షించి చూడాలి.

శ్రీమహేశ్వర ప్రతిపాదితమైన శక్తిపాతము ద్వారా శిష్యునిలో శక్తి మేల్కొని ఆనందము కలుగజేస్తుంది. ఎందుకంటే పరాశక్తి ఆనంద ప్రబోధ స్వరూపము అయివున్నది. శక్తి మేల్కొనుటచేత శిష్యుని అతః స్ఫురణలో మంత్రయోగ, లయయోగ సంబంధిత నానావిధములైన యోగక్రియలు, కంపము, రోమాంచము మరియు స్వరము, నేత్రాది అంగములకు సంబంధించిన క్రియలు జరుగుతాయి. ఈ లక్షణములను పరిశీలించటం ద్వారా శిష్యుడు కూడా గురువునకు సమర్థత ఉన్నదీ లేనిది పరీక్షించవచ్చు. శిష్యుడు పై క్రియలద్వారా తనలో శక్తి సంచారము జరిగినదో లేదో తెలుసుకొని నిశ్చింతగా వుంటాడు. గురువు కూడా పరమేశ్వరుని శక్తి ప్రకాశముయొక్క బాహ్య, అంతరక్రియలు పరీక్షించి చూచి నిశ్చింత వహిస్తాడు. ఈశ్వరుని శక్తి గురువు ద్వారా శిష్యునిలో సంచరించి, శిష్యునిలోని శక్తిని మేల్కొలిపినపుడు ఆనందము కలుగుతుంది. శిష్యునికి ఒక విధమైన అపూర్వ జ్ఞానము మరియు నిర్విషయ పరమానంద సుఖము అనుభవములోనికి వస్తుంది. ఈ లక్షణమే పరమగమ్యమైనది. ప్రతి ఒక్క శిష్యుడు అప్పటికప్పుడు ఈ అనుభవమును పొందలేడు. కాని అంతః స్ఫురణ రూపమైన నానా విధములైన బాహ్య అంతర రూప క్రియలద్వారా పై అనుభవము పొందగలడు. అతడిలో తత్త్వ జ్ఞానము, ఆనందము మిళితమవుతుంది. శిష్యునికి తన శరీరములో ఏదో శక్తి ప్రవేశించినట్లుగా అనుభవమవుతుంది. కంపము, రోమాంచము, కంఠధ్వనిలో మార్పు, నేత్రాదుల యందు మరియు శిరస్సుపై రోమములలో కదలిక, శరీరము విరుచుకు పడుట లేక బరువుగా మారుట మొదలగునవి సంభవించవచ్చును. చేతులు, కాళ్ళు బిగువును కోల్పోవచ్చును. ఇంకా వీపు వెనుకగాని, హృదయము లేక శిరస్సునందు బరువుగా వుండి శరీరము కదలికను గాని ఊగుటనుగాని కోరుతుంది. సాధకుడు సంకల్ప రహితముగా వెంటనే భూమిపై పడుట, అంగ వికృతి వంటి చేష్టలు కలుగుతాయి.



అనగా శ్వాస, ప్రశ్వాసలు పెరుగుతాయి లేక నిద్రా స్థితి వంటి స్థితి కలిగి చిత్తము కర్తవ్య విమూఢమవుతుంది. శరీరముపై చీమలు ప్రాకుతున్న అనుభూతి కలుగుతుంది. మనస్సు, ప్రాణములు, క్రియా హీనమవుతాయి. శరీరములో వేడిమి పెరిగి, నిద్ర, సుషుప్తి లేక మూర్ఛ వంటి స్థితి కలుగుతుంది, లేక తల తిరుగుతుంది. భంగు తాగిన వాడిలా అతడిలో నిషా పెరుగుతుంది. మనో సంకల్పములు బాగా తగ్గిపోతాయి. లేక చాలా ఉత్సాహముతో, ఆనంద పారవశ్యములో సాధకునికి అనేక విధములైన యోగక్రియలు కలుగుతాయి.

ఈ అవ్యక్త శక్తి సంచారమునకు సంబంధించిన బాహ్య అభ్యంతర లక్షణములన్నియు సాధారణముగా గురువు యొక్క శక్తిపాతము తరువాత శిష్యునిలో మొదటి దినము గాని, రెండవ దినముగాని, మూడవ దినముగాని కనపబడుతాయి. లేక అయిదుగాని ఏడు రోజులలోగాని తప్పక అగపడతాయి. కాని పైస్థితులు ఏర్పడుట అనునది గురువుయొక్క సామర్థ్యము లేక కృప మరియు శిష్యుని గురుభక్తి లేక సుసంస్కారముపైన ఆధారపడి వుంటాయి. ఎందువలనంటే దీక్షా ప్రదానములో గురువు లందరికి ఒక రకమైన శక్తి సామర్థ్యము వుండదు. మరియు శిష్యులందరిలో ఒక రకమైన సుసంస్కారములు వుండవు. అందువలన క్రియాశక్తి వికాసములో తేడాలు వుంటాయి. అనగా దీక్షానంతరము క్రియాశక్తి వికాసము కనపడనప్పుడు శిష్యుడు నిరాశ చెందకూడదు. ఎందుకంటే శిష్యునియొక్క ధ్యానాదికాలములో గురుశక్తి యొక్క స్వల్ప అనుభవము కలిగినా తనలో ఆ శక్తి యొక్క వికాసము తప్పక కలుగుతుందని తెలుసుకోవాలి. ఈ విధముగా శిష్యుడు తనలో గురుశక్తియొక్క వికాసము చూచి నిశ్చింతగా వుండాలి. దీక్షానంతరము ఒక సంవత్సరము పర్యంతము కూడా శిష్యుడు, గురుశక్తి యొక్క వికాసము కొరకు నిరీక్షించవచ్చునని శాస్త్రములలో చెప్పబడినది. ఈ విషయములో ఎక్కువ చెప్పాల్సిన పనిలేదు. ఎందుకంటే ఏ మనుజుడు శివశక్తులను ఆశ్రయించి అనగా శ్రీ మహేశ్వరుల శక్తి ద్వారా దీక్షితుడు అవుతాడో మరియు అతడికి దీక్షను అనుగ్రహించగల పూర్ణ సామర్థ్యము గురువులో ఆయన నుండి ఆయన శక్తి సంచాలనము చేసినపుడు కూడా అధికార భేదము కారణముగా శిష్యునిలో క్రియావికాసము విభిన్న రకములుగా వుంటుంది. అందువలన సాధకులందరికి ఒకే విధములైన క్రియలు కలుగవు. శిష్యునికి గురువునందు నిశ్చలభక్తి పెరుగుతున్నప్పుడు శిష్యునిలోకూడా యోగము తాలూకు క్రియాశక్తి పెరుగుతూ వుంటుంది. దీనివలన శిష్యుని విజ్ఞానము పెరుగుతుంది.

కాని దురదృష్టవశాత్తు ఎవరైన శిష్యునిలో పూర్వజన్మ పాపకర్మలు ఆటంక పరచినపుడు అతడు గురుకృపాలాభమును పొందలేడు. కుండలినీ శక్తి జాగరణ ద్వారా లభించే జ్ఞానమును కూడా పొందలేడు. అందువలన అతడు ముందు నుండి ప్రాయశ్చిత్త కర్మలు చేయవలసి వుంటుంది. అతడికొరకు క్రమదీక్షా పద్ధతి ఏర్పరచబడినది.

కాని ఈ మానసిక దీక్ష అయోగ్యునికి ప్రదానము చేయుటచే నిర్వీర్య మవుతుంది. దీనికి నిశ్చయముగా ఫలితము లభించదు. అందువలన ఏ గురువులు కూడా ధనమోహముతో అనధికారికి దీక్షా ప్రదానము చేయకూడదు. చేసిన ఎడల అటువంటి గురువునకు దారిద్ర్యము సంప్రాప్తించి దుఃఖితుడవుతాడు. దీక్ష గ్రహించిన పాత్రతలేని శిష్యుడుకూడా మహాదుఃఖమును పొందగలడు.

**యోగసాధనకొరకు ఆసనమును ఏర్పరచుకొనుట :** సాధారణముగా యోగసాధనను చేసే సాధకులు ఆసనము లేకుండా ధ్యాన, భజనలు చేయకూడదు. అందువలన ఒక నిర్దిష్ట స్థానములో ఆసనము పరచుకొని తపస్సు చేయవలసి వుంటుంది. అనగా బుద్ధిమంతులైన సాధకులు కంబళివంటి వస్త్రములు, సింహము, వ్యాఘ్రముల యొక్క మృగచర్మమువంటి ఆసనములు వాడవలసి వుంటుంది. కృష్ణజింక చర్మముపై కూర్చొని ధ్యానధారణలు చేస్తే జ్ఞానసిద్ధి కలుగుతుంది. సింహము లేక వ్యాఘ్రచర్మముపై కూర్చుని సాధనచేసినట్లయిన మోక్షప్రాప్తి కలుగుతుంది. కంబళి వంటి ఆసనము పైకూర్చొని సాధనచేసినట్లయితే దుఃఖ నివృత్తి కలుగుతుంది. ఉన్ని వంటి వస్త్రములపై కూర్చొని సాధన చేసినట్లయిన సమస్త వ్యాధులు నశిస్తాయి.

భూమిపై ఆసనము లేకుండా భజన, జపము, ధ్యానము చేసినట్లయితే దుర్భాగ్యస్థితి కలుగుతుంది. వెదురుతో చేసి ఆసనముపై సాధనవలన దారిద్ర్యము, రాతిపైకూర్చొని సాధనచేయుటవలన బాధలు మరియు రోగములు కలుగుతాయి. గడ్డితో చేసిన ఆసనముపై కూర్చొని సాధన చేయుటవల్ల అపకీర్తి కలుగుతుంది. ఆకులతో చేసిన చాపవంటి ఆసనముపై కూర్చొని సాధన చేయుటవలన చిత్తభ్రాంతి కలుగుతుంది. వస్త్రముపై కూర్చొని సాధనచేయుట వలన, జప, ధ్యాన, తపస్సులు నశిస్తాయి. దీక్షను తీసుకొనని వారు, గృహస్థులకు మృగచర్మము నిషిద్ధము. యతులు, అది కేవలము వానప్రస్థులు, బ్రహ్మచారులు మరియు సన్యాసుల కొరకు నిర్దేశించబడినది. పునశ్చరణ లేక మంత్రానుష్ఠానమునకు దర్భాసనము దానిపై జింక చర్మము దానిపై పట్టువస్త్రములు పరుచుకొని చేయవలసి వుంటుంది.



# సిద్ధమహాయోగము

## పదకొండవ ప్రకరణము

### దీక్షాయోగము ప్రత్యక్ష ప్రమాణము

**ఇదివరలో చెప్పినట్లుగా జ్ఞానము రెండు విధములు :** ఒకటి శాస్త్రముల ద్వారా లభించెడి పరోక్ష జ్ఞానము, రెండు సాధనద్వారా లభించెడి అపరోక్ష జ్ఞానము. శాస్త్రముల ద్వారా లభించెడి పరోక్ష జ్ఞానము అస్థిరమైనది. అస్థిరమైనది శాశ్వతము కాదు. అది మారవచ్చును లేక ఇంకొక రూపములో పరిణామము చెందవచ్చును. దాని ద్వారా చిత్తమునకు వాస్తవిక సంతోషము లభించదు. కాని సాధన ద్వారా లభించే అపరోక్ష జ్ఞానము సుస్థిరము మరియు ప్రత్యక్షము. అది ఒక్కసారి లభిస్తే ఎప్పటికి నిలిచి వుంటుంది. దానికి మార్పులేదు. దానితో చిత్తమునకు పరిపూర్ణమైన తృప్తి లభిస్తుంది. శాస్త్రముల ద్వారా లేక ఇతరుల ఉపదేశము ద్వారా లభించే జ్ఞానము పరోక్ష జ్ఞానముగా చెప్పబడుతుంది. కాని శ్రేష్ఠమైన యోగసాధన ద్వారా లభించే జ్ఞానము అపరోక్ష జ్ఞానముగా చెప్పబడుతుంది. సమస్త శాస్త్రములు తెలిసిన జ్ఞానుల అభిప్రాయము ప్రకారము మరియు వేదములలో చెప్పిన ప్రకారము అపరోక్ష జ్ఞానము పొందని వారికి మోక్షములేదు. ఈ ప్రత్యక్ష అపరోక్ష జ్ఞానము యోగము చేయకుండా లభించదు. అందువలన యోగసాధనయే పరమకర్తవ్యము.

పరతత్త్వము తెలిసిన జ్ఞానుల అభిప్రాయము ప్రకారము 1. విజ్ఞానము 2.ఆనందము 3. బ్రహ్మము అను మూడు తత్వములుగా చెప్పబడ్డాయి. ఇది దృష్టాంత రహితము అనగా మనోవాక్కుల కతీతము. అనగా ఏవిజ్ఞానము ప్రత్యక్ష స్వరూపముగా, ఆనంద స్వరూపముగా, పూర్ణబ్రహ్మ స్వరూపముగా మరియు సర్వవ్యాప్తతత్వ స్వరూపముగా ఉంటుందో అది మనోవాక్కుల కతీతము. కేవలము యోగసాధన ద్వారా మాత్రమే అపరోక్ష జ్ఞానము లభిస్తుంది. అందువలన దానిని మనము యుక్తి, తర్క దృష్టాంతముల ద్వారా అర్థము చేసుకొనలేము. మాటలద్వారా ఇతరులకు వ్యక్తము చేయలేము. యోగసాధన అనుష్ఠింపకుండా తమను తాము బ్రహ్మ జ్ఞానులుగా చెప్పుకొనేవారు చెట్టు చివరన ఉన్న పండును చూచుటద్వారా ఆస్వాదనా ఫలితమును పొందలేనట్లుగానే వారు బ్రహ్మజ్ఞానము యొక్క వాస్తవిక ఫలితాన్ని ఆస్వాదించలేరు.

అవిద్యా బంధనముల నుండి ముక్తిని పొందగోరెడివారు, సత్య జ్ఞాన మరియు ఆనంద స్వరూపమైన ఆత్మానుభవమును పొందాలి. ఈ ఆత్మజ్ఞానము ప్రాప్తికొరకు 1. శాస్త్ర 2. యుక్తి 3. గురుబోధ 4. తన అంతరములోని అనుభవము అనెడి నాలుగు ప్రమాణములను అన్ని శాస్త్రములు అంగీకరించాయి. అందువలన వ్యవహారికముగా ప్రత్యక్షము, అనుమానము, శాస్త్రము అను మూడు ప్రమాణముల ద్వారా జనులు తత్త్వవివేచనచేస్తారు. దీనిని తర్కము, యుక్తి మరియు శాస్త్రములద్వారా వివేచనచేసి నిర్ణయిస్తారు. కాని శాస్త్రములద్వారా, అనుమాన ప్రమాణముల ద్వారా లభించే జ్ఞానముకన్నా ప్రత్యక్ష ప్రమాణము ద్వారా లభించెడు జ్ఞానము మిన్నగా చెప్పబడుతుంది. ఏదైన విషయ పరిజ్ఞానము స్వయముగా పొందినపుడు యుక్తి తర్క వితర్కములు చేసే కుతార్కికులుకూడా తగ్గిపోతారు. ఎందుకంటే పరోక్షములో లభించే విషయ పరిజ్ఞానము ఇతమిద్ధముగా ఎవరూ నిర్ణయించలేరు. అందువలన ప్రత్యక్ష ప్రమాణము లభించినట్లయితే ఇతర ప్రమాణముల అవశ్యకత ఉండదు.

**గురు దీక్ష :** దీక్ష బాహ్యము, అంతరము అను రెండు విధాలుగా వుంటుంది. ధర్మ, అర్థ, కామముల ప్రాప్తికొరకు హవనము, జపము, దేవతార్చన, పునశ్చరణలు మొదలగు వివిధములైన క్రియాకలాపములతో లభించెడి శాస్త్రీ, హోత్రీ, క్రియావతి, వర్ణమయి మరియు క్రమదీక్షల వంటి దీక్షలన్నియు బాహ్యదీక్షలుగా చెప్పబడుతాయి. వీటిలో జప, తప, హవనము వంటి సాధనతో కూడిన క్రియాకర్మములు చేయబడుతాయి. కాని శాంభవి, శక్తి, యోగ, వేధ దీక్షల వంటి దీక్షలు ఆంతరిక దీక్షలుగా చెప్పబడుతాయి. వీనిలో బాహ్యడంబరములతో కూడిన క్రియాకర్మములు చేయవలసిన పనిలేదు. ఈ దీక్షలు గురువుయొక్క ఆత్మ సామర్థ్యముతో కుండలినీ శక్తి జాగరణద్వారా లభిస్తాయి. వీటిక్రియలు కూడా అనాయాసముగా వుండి మోక్షప్రాప్తిని కలుగజేస్తాయి. దీక్ష అధికార భేదముతో రెండు విధములుగా ఉంటుంది. ఒకటి ఆసక్తితోకూడిన కామ్యదీక్ష, రెండవది ఆసక్తి రహితముగా మోక్ష ప్రాప్తికొరకు ఇవ్వబడే దీక్షాపద్ధతి అయివున్నది. నిత్య, నైమిత్తిక మరియు కామ్యకర్మల సిద్ధికొరకు ఇవ్వబడే దీక్షలు అనగా సంధ్యావందనము వంటి నిత్యకర్మల కొరకు ఇవ్వబడే ఉపనయన దీక్షలవంటివి, శత్రునాశనము కొరకు మరియు ఇతరులను వశపర్చుకొనుటకు చేసే యజ్ఞయాగాది క్రతువులు, యశస్సు, ఐశ్వర్యము, కోర్కెల సిద్ధి కొరకు చేయబడే వ్రతములు, యజ్ఞముల వంటి దీక్షలను కామ్యదీక్ష లంటారు. వీటి ద్వారా ధర్మ, అర్థ, కామ్యములు సిద్ధిస్తాయి. కానీ ఈ బాహ్యదీక్షలు మోక్షము



ఇవ్వలేవు. అందువలన మోక్షము నిచ్చెడి రెండవ అంతరిక దీక్షను నిరాధార దీక్ష అని అంటారు. తత్త్వ వివేచన చేసే జ్ఞానులైన మహాత్ములు చెప్పిన విధముగా ఈ నిరాధార అంతరిక దీక్షలనే నిర్మలమైన పవిత్రమైన మోక్షప్రదమైన దీక్షలుగా భావించాలి. ఈ అంతరిక దీక్షలకు బాహ్యమైన స్థూల వస్తువుల అవసరము లేదు. బాహ్యముగా ఎటువంటి క్రియాకలాపములు చేయవలసిన పనిలేదు. ఇవి కేవలము గురు, శిష్యుల యొక్క మనోవ్యాపారము మూలముగా సిద్ధిస్తాయి. అందువలన వీటిని నిరాధార దీక్షలు అని అంటారు. ఈ దీక్ష ద్వారా గురువు శిష్యునిలో శక్తి సంచారము చేస్తాడు.

సూక్ష్మమైన చైతన్య స్వరూపమైన శివశక్తి ద్వారా గురువు శిష్యునిలో శక్తి సంచారము చేస్తాడు. దీనిద్వారా అన్నివిధములైన యోగక్రియలు కలుగుతాయి. ఇది గురుపరంపర ద్వారా శిష్యునిలో ప్రవేశిస్తుంది మరియు స్పష్టముగా చైతన్య రూపములో ప్రకాశిస్తుంది. అప్పుడు ఆ శక్తి గురు ఆజ్ఞానుసారము శిష్యునిలో పనిచేసి ఆత్మజ్ఞాన సిద్ధికొరకు కావలసిన క్రియలను చేస్తుంది. గురువుయొక్క దృష్టిద్వారా, స్పర్శద్వారా, వాక్కుద్వారా లేదా మనస్సుద్వారా శిష్యునికి శక్తి ప్రాప్తించినపుడు అతడు తనకు తానుగా జప, తప, ప్రాణాయామ ధారణ, ధ్యానాదులు చేయవలసిన అవసరములేదు. ఏవిధముగా యజమాని సేవకునికి తాను చెప్పిన పనిచేయవలసినదిగా నిర్దేశిస్తాడో అదేవిధముగా శిష్యుడుకూడా గురువుయొక్క సంచారిణీ శక్తియొక్క ఆజ్ఞానుసారము అన్ని పనులను సమర్పణ భావముతో చేయవలసి వుంటుంది. సేవకుడు యజమాని ఆజ్ఞను పాటించవలసి వుంటుంది. అదేవిధముగా శిష్యుడు కూడా తన జ్ఞానము, ధ్యానము త్యజించి గురువు ఆజ్ఞను పాటించవలసి వుంటుంది. గురువుయొక్క ఆజ్ఞాశక్తిని మించి శిష్యునికి పాటించవలసిన క్రియాకర్మములు ఏమీలేవు. ఇదే పాశుపత మహాయోగ సిద్ధాంతము. అనగా మహాయోగమును సాధనచేసే సాధకులకు గురువు ఆజ్ఞాపాలన మినహా చేయవలసిన ఇతర సాధనలు ఏమీ ఉండవు. ఏ గురువు యొక్క ఆజ్ఞాశక్తి అన్నింటిని చేస్తూ ఉంటుందో దానిలో శిష్యుడు తన బుద్ధియొక్క వివేచననుగాని, ఇచ్ఛనుగాని, సొంత సాధనను గాని కలిపితే అనర్థము కలుగుతుంది. అందువలన గురువుయొక్క ఆజ్ఞాశక్తిని ప్రాప్తించుకొన్న అదృష్టవంతులైన సాధకులు తెలుసుకోవలసినది ఏమంటే గురువు ఆజ్ఞయే అన్నింటికంటే మిన్న అని దానిని పాటించకపోతే తనకుతాను చెరుపు చేసుకొన్నట్లే. గురువు తన యోగశక్తితో లేక మనోశక్తితో శిష్యునికి అంతరిక

దీక్షా ప్రదానము చేసినపుడు ఆ శిష్యునికి ఆశ్చర్యజనకమైన, మహాశ్చర్య జనకమైన సంఘటనలు అనుభవములోనికి వస్తాయి. వాటి రహస్యము శ్రీ గురువులకే అవగతము కాగలదు. ఇవి రహస్యమైనవి. బయటకు చెప్పదగినవికావు. అంటే శాస్త్రములలో గుప్తముగా వుంచబడ్డాయి. ఇక్కడ అవసరమైనంతవరకే చెప్పబడ్డాయి. ఈ విషయములో ఎవరైనా విస్తారముగా తెలుసుకోవాలని వుంటే తమ, గురువులను సంప్రదించవలసి ఉంటుంది.

**సద్గురువు కృప :** దీక్షా సమయములో గురువు శివుని ప్రభావమును పొంది ప్రసన్నుడై శిష్యునికి శక్తిని ప్రదానముచేసి ఆశీర్వదిస్తాడు. ఆశీర్వాద ఫలితముగా మూలాధారములో నిత్యనివాస ముండే శక్తి యొక్క బోధతో శిష్యునిలో తత్వజ్ఞానము కలుగుతుంది. తత్వ జ్ఞానబోధచేయగల ఆశక్తి తత్వ స్వరూపముగా ఉండి పద్మతంతువులాగా సూక్ష్మాతి సూక్ష్మముగా ఉండే పరాశక్తి కుండలినీ మహాదేవి అయివున్నది. ఆ శక్తి కోట్లకొలది విద్యుత్కాంతులతో ప్రకాశిస్తూ పరమశివుని సహధర్మచారిణిగా అతడి ప్రసన్నతకు సదానృత్యము చేస్తూ వుంటుంది. ఆ శక్తి అక్షర స్వరూపిణి. ఆ శక్తి ద్వారా సాధకునికి యోగ, ధ్యాన జ్ఞానములకు సంబంధించిన క్రియలు కలిగి యోగము యొక్క పరమ ఉత్కృష్ట సిద్ధి కలుగుతుంది. ఆ శక్తి యోగము యొక్క పరమ ఉత్కృష్టమైన జ్ఞానమును ప్రదానము చేస్తుంది. ఇటువంటి నిరంతరము ఉపాన చేయవలసిన సచ్చిదానంద స్వరూపిణి, ప్రణవ గాయత్రీ స్వరూపిణి అయిన కుండలినీమాత, గురు పరంపరయొక్క ఆశీర్వాదముతో సాధకునిలో నిత్యము జాగృతస్థితిలో ఉండి, అతడి చేత అనేకవిధములైన యోగక్రియలు చేయిస్తూ దివ్య అనుభవములను కలుగజేస్తూ అతడియొక్క తనువు, మనస్సు ప్రాణములకు పరిపుష్టిని కలుజేస్తూ ఉంటుంది. గురువు ఆశీర్వదము ద్వారా ఆద్యాశక్తిని పొందిన సాధకుడు యోగముద్వారా తన అంతరములోని శివశక్తులను పూజించటం వలన మంత్రము, జపము లేకుండానే సంధ్యావందనాది కర్మల ఫలితము లభిస్తుంది. సుషుమ్న పనిచేస్తూవుంటే సాధకుని యందు పూజ మరియు హోమ అనుష్ఠానము లేకుండా జపము స్వతః సిద్ధముగా జరుగుతుంది. అటువంటివారు సమిధలు లేకుండా నిత్యము యజ్ఞము చేస్తున్నట్లే. వారు దశదిశలయందు సర్వవ్యాపిగా నున్న ఈశ్వరుని శరీర మాధ్యమముగా పూజిస్తారు. ఈ విధముగా ఈశ్వరుని సర్వత్రా పూజించు ధ్యానపారాయణులైన జనులకు ఈశ్వరుని జ్యోతిర్మయ సూక్ష్మ స్వరూపము ప్రత్యక్షముగా కనిపిస్తుంది. అందువలన



ఆ సాధకులు గురుశక్తితో కూడిన ధ్యానరూప యజ్ఞములో నిరంతరము నిలిచి వుంటారు. ఎవరికి జ్యోతిర్మయ స్వరూపమైన శివుని దర్శనభాగ్యము లభిస్తుందో వారు చెక్కతో, రాతితో, మట్టితో చేసిన దేవతలను ధ్యానించ వలసిన పనిలేదు. వారు వాటి ఆలంబనను వదిలివేస్తారు. వారు శివుని వాస్తవిక స్వరూపము తెలుసుకొనుటవలన బాహ్యముగా వున్న స్థూలరూపములైన దేవీదేవతల అర్చనను వదిలివేస్తారు.

శ్రీమహేశ్వరులు సూచించినవిధముగా వాస్తవిక యోగము ఈ విధముగా ఉంటుంది. గురువుయొక్క శక్తిపాతము ద్వారా శిష్యుని అంతరములో కుండలినీశక్తి జాగృతమయి అనేక క్రియలను చేస్తుంది. అప్పుడు శిష్యుని యొక్క మనః, ప్రాణ శరీరములలో అనేక విధములైన బాహ్య, అంతర క్రియలు కలుగుతాయి. శిష్యునిలో కోట్ల కొలది జన్మల సంస్కారములు వివిధ రూపములు పొంది నశిస్తాయి. అందువలన సాధకునికి జన్మజన్మాంతరముల యొక్క అస్పష్టమైన స్మృతులు కలుగుతాయి. అంటే అనేక జన్మల తాలూకు సుఖదుఃఖముల అనుభవము కలుగుతుంది. దాని కారణముగా అతడు పశుపక్షుల మాదిరి భయానకమైన శబ్దాలను ఉచ్చరిస్తాడు లేక ఆహ్లాదముతో నవ్వుతాడు, ఏడుస్తాడు. భావపూర్ణ స్థితిలో మహదానందమును పొంది పరమ ప్రసన్నతను పొందుతాడు. ఆ ఆనందస్థితిలో వేణువు, వీణ, మృదంగ వాద్య ధ్వనులను నోటితో పలుకుతాడు. వెనువెంటనే పాటలను, కవిత్వములను కూర్చి పాడుతాడు. కొంతసేపు విలపిస్తాడు. లేక తనకు తానుగా ఉపన్యాసములు ఇవ్వటం మొదలుపెడతాడు. వివిధ రకాలైన భాషలను మాట్లాడుతాడు. ఆసనము నుండి లేచి వివిధరకములైన చేష్టలు చేస్తాడు. ఆవలిస్తూ వుంటాడు. ఇంటిలో అటు ఇటూ తిరుగుతూ వుంటాడు. ఈ విధముగా గురుకృపతో కుండలినీ జాగరణ కారణముగా ఇటువంటి మానసిక, ప్రాణసంబంధమైన క్రియలతో జరిగే సాధననే వాస్తవిక యోగసాధనగా చెప్పవచ్చు. ఈ యోగములో సంభవించే క్రియలయొక్క సంఖ్యను మరియు స్వరూపమును వర్ణించటం మానవుని తెలివితేటలకు అతీతమైన విషయముగా చెప్పవచ్చు. అంటే ఈ మహాయోగ విజ్ఞానము గురించి శ్రద్ధాయుతుడుగావున్న సాధకుడు మాత్రమే తెలుసుకొనగలడు. సాధకుడు ఆనందోల్లాస భరితుడై ఎన్ని విచిత్రములైన పనులను చేసినప్పటికి అంటే ఆసన ప్రాణాయామ, బంధ, ముద్రల వంటి విచిత్రములైన యోగక్రియలు ఎన్నిచేసినప్పటికి అతడి మనస్సు పరాధీనము కాదు మరియు జ్ఞానశూన్యముకాదు. సాధకుడు పూర్వ

జ్ఞానమును కలిగి వుంటాడు. ఆనందమయుడై ఉత్సాహముతో సాధకుడు
అంతరములో పనిచేసేశక్తి ప్రేరణతో చేసే క్రియలు అతి సహజంగా జరుగుతాయి
బలాత్కారముగా జరుగవు. సాధకుడు తన బాహ్యస్పృహను కోల్పోడు. సంకల్ప
మాత్రము చేత సాధకుడు తన పూర్వ స్థితికి రాగలడు. ఈ విధముగా మనస్సు
ఉల్లాస భరితమై పైక్రియలను చేస్తూ వున్నప్పుడు సాధక యోగికి దివ్యభావము
ప్రాప్తిస్తుంది.

ఈ క్రియలయొక్క ఆవేశము దీక్షాసమయములోనే కాకుండా దీక్ష తరువాత
కూడా ఎప్పటివరకు శివ, శక్తుల సమ్మేళనము జరుగదో అప్పటివరకు అనగా
జీవితాంతము మరియు ముక్తి లభించు వరకు జన్మ జన్మల వరకు జరుగుతూ
వుంటుంది. అందువలన సాధకుడు ప్రత్యేకించి ఎటువంటి నియమములకు లోబడి
సాధన చేయవలసిన పనిలేదు. కాని గురువు ఆదేశానుసారము ప్రతిదినము ప్రాతః
కాలము, సాయంకాలము సాధనచేయవలసి వుంటుంది. అందువలన ప్రతిరోజు
క్రొత్త క్రొత్త క్రియలు, అనేక విధములైన అనుభవములు తనకు తానుగా జరుగుతాయి.
ఈ విధముగా యోగసాధన చేసేవారికి వివిధములైన ఆసనములు చేయుట ద్వారా
లేక అనేక పర్యాయములు ప్రాణాయామము మరియు శ్వాస, ప్రశ్వాసలకు
సంబంధించిన క్రియలు కారణముగా ఉన్మనీ స్థితి లభిస్తుంది. దీనివలన శరీరము
మరియు ఇంద్రియములు వశమును కోల్పోయి ప్రాణస్పందన లయమవుతుంది.
మనస్సు ఏకాగ్రమై నిరుద్ధమవుతుంది. ఈ విధముగా శరీరము, మనః ప్రాణములు,
ఇంద్రియములు వశమును కోల్పోయి వివశమగుటచే సమస్థితి ఐన సమాధిస్థితి
కలుగుతుంది. ఈ సమాధి స్థితికి పూర్వము సాధకునికి ఇంకా ఎక్కువ క్రియలు
జరుగుతాయి. ఆసన, ప్రాణాయామ, బంధ, ముద్రలు, నాడీశుద్ధి వంటి క్రియల
కారణముగా సమాధిస్థితి కలుగుతుంది. సమాధి స్థితి కలిగిన తరువాత ఆవశ్యకత
ననుసరించి పైక్రియలు జరుగుతాయి. ఎప్పటివరకు ఈక్రియలు స్థిరముగా
వస్తూవుంటాయో అప్పటివరకు అన్ని స్థితులువస్తూ పోతూ వుంటాయి. ఈ
క్రియలతోపాటు సాధకునికి శాంభవీ ముద్ర కలుగుతుంది. దీనివలన సాధకునికి
అంతరములో లక్ష్యము, బాహ్యముగా దృష్టి ఏర్పడుతుంది. ఈ శాంభవీముద్ర
తంత్రములన్నింటి యందు గుప్తముగా ఉంచబడినది. ఇది సాధకునికి ప్రయత్నమేమీ
లేకుండా లభిస్తుంది. ఇటువంటి సాధకునికి ఖేచరీముద్ర కూడా ఏర్పడుతుంది.
నాలుక అంగిలిలో నిలిచిపోయి రసపానము చేస్తుంది. ఇది కూడా తనంత తానుగా



జరుగుతుంది. పరమశివుని స్థానమైన సహస్రారములో అమృతపాన అనుభవమును
కలుగజేసెడి ఖేచరీముద్ర మరియు శివ స్వరూపమును దర్శింపజేసెడి శాంభవీ
ముద్ర సాధకునికి తనంత తానుగా కలుగుతాయి. వీటి కారణముగా సాధకునికి
ఆత్మతత్త్వప్రకాశము కలుగుతుంది. దీనివలన సాధకునికి తనకి తాను ఆత్మనని
బోధకలుగుతుంది.

ఈ ప్రకారముగా సాధకునికి శాంభవీ మరియు ఖేచరీముద్రలు ఏర్పడిన
తరువాత శారీరక, మానసిక క్రియలు తగ్గిపోతాయి. కేవలము ప్రాణక్రియలు మాత్రమే
మిగిలివుంటాయి. ప్రాణము సుషుమ్నలో ప్రవేశించి శాంభవీ మరియు ఖేచరీ ముద్రలు
చాలాదృఢముగా కలుగుతాయి. దీనితో సాధకునికి కలిగెడి ఆత్మానుభవమును
వర్ణించలేము. ఈ స్థితిలో సాధకునికి ఏమీ తెలియదు. అతడు బాహ్యజ్ఞానమును
కోల్పోతాడు. ఆత్మతత్త్వములో తన్మయుడవుతాడు. అందువలన అతడికి ఆత్మమినహా
మరేమియు తెలియదు. కాని ఆత్మధ్యానము ద్వారా లభించెడి పరమ సుఖము
మనోవాక్కుల కతీతము. ఆత్మ ధ్యానముచేసే సాధకుడు స్వయముగా ఆ
అనుభవమును పొందుతాడు. కాని ఇతరులకు వివరించలేడు. అనగా యోగ
సాధనద్వారా ధ్యానయుక్తులైన సాధకులు ధ్యానము ద్వారా లభించెడి ఆనందమును
బయటకు చెప్పలేరు. కాని అతడి బాహ్య లక్షణములను బట్టి అంతరములోని
ఆనంద స్థితిని కొద్దిగా తెలుసుకోవచ్చు.

ఎవరు గురుప్రదత్తమైన యోగసాధన చేస్తూ వుంటారో, ఎవరి కుండలినీశక్తి
క్రియాశీలమయి వుంటుందో, ఎవరి ధ్యానము సంకల్ప మాత్రమున ధ్యేయములో
స్వాభావికముగా నిలిచి వుంటుందో, అతడి అంతరములోని లక్షణములు అతడికి
మాత్రమే తెలియును. కాని అతడిలో కొన్ని బాహ్యలక్షణములు కూడా కనపడతాయి.
అతడి మనస్సు, ప్రాణము శరీర చేష్టలు సాత్వికతను పొందుతాయి. అందువలన
ఇంద్రియములు శాంతించి స్వచ్ఛతను పొందుతాయి. అతడు ఎల్లప్పుడు
ఆనందోల్లాసముతో కనిపిస్తాడు. ధ్యానస్థితి గుర్తుకు రావటము తోడనే అతడి దృష్టి
అంతర్ముఖ మవుతుంది. అందువలన నేత్రములు బరువెక్కుతాయి. వాక్కు కోమలము
మరియు గద్గదమవుతుంది. అంతరాత్మ సుఖమువల్ల శరీరములో పారవశ్యముతో
కూడిన రోమాంచము కలిగి కంపనాది క్రియలు జరుగుతాయి. శ్వాస, ప్రశ్వాసలు
నిలిచిపోతాయి. ఈ బాహ్యలక్షణములు కనిపించినపుడు ధ్యానము సక్రమముగా
జరుగుతున్నట్లు భావించవలయును. ఎందుకంటే కుండలినీ శక్తి జాగృతమయినప్పుడు

మనః ప్రాణ, దేహ ఆవేశములు సంపూర్ణముగా వుంటాయి. ఆ పరమదేహావేశములో ధ్యానస్థితిలో లభించెడి పరమ సుఖము ఆ సాధకుడు ధ్యానస్థితినుండి బయటకు వచ్చిన తరువాత కూడా వ్యక్తము చేయలేడు. ఏ అదృష్టవంతుడైన సాధకుడు ఈవిధముగా ఆత్మధ్యానము చేస్తూ వుంటాడో అతడు క్షణమాత్రముకూడా ఈ పరమానంద స్థితిని వదలి వుండలేడు. అతడు ఇటువంటి పరమ ధ్యానము ద్వారా లభించెడి సుఖవియోగమును క్షణమాత్రము కూడా భరించలేడు.

సమర్థ సద్గురువు ద్వారా ఇవ్వబడిన శక్తిపాతము దీక్షవల్ల కాని లేక ఈశ్వర అనుగ్రహముతోగాని లేక పూర్వజన్మలో చేసిన అనంత పుణ్యఫలము వలనగాని లేక శివార్చన వంటి భక్తిసాధనల ద్వారా కుండలినీశక్తి జాగృతమయి, పూర్వజన్మలలో చేసిన యోగసాధనను ఈ జన్మలో ఆరంభము చేయిస్తుంది. దీనికి నిదర్శనముగా అనేక క్రియలు సంభవిస్తాయి. సాధకునికి కంపము, శ్వేదము, అశ్రుపాతము, కంఠస్వరములో మార్పు, వికృత శబ్దోచ్చారణ, దుముకుట, నాట్యము చేయుట, నవ్వుట, ఏడ్చుట, అరచుట వంటి క్రియలు ద్వారా ఆనందము కలుగుతుంది. ఏమనుష్యులలో ఈ లక్షణములు వేరువేరుగా కనిపిస్తాయో లేక అన్ని కూడా ఒకే పర్యాయము మంద, మధ్యమ, ఉత్తమ స్థితులలో ప్రాప్తిస్తాయో ఆ భక్తులను ఉత్తమ, శ్రేష్ఠసాధకులుగా పరిగణించాలి. మందస్థితిలో కంపనాది శారీరక క్రియలను ఇచ్ఛా మాత్రముతో నిలుపుదల చేయవచ్చును. మధ్యమస్థితిలో శారీరక, మానసిక క్రియలను కష్టముతో నిలుపు జేయవచ్చును. అనగా బాహ్య అభ్యంతర క్రియలను నిలుపుదల చేయుటవలన మనస్సుకు దుఃఖము కలుగుతుంది. ఉత్తమ స్థితిలో క్రియలు మనస్సుని, శరీరమును వివశము చేసినపుడు క్రియాశక్తిని నిలుపుదల చేయాలని అనిపించదు.

గురుకృపాకారణముగా కుండలినీశక్తి జాగరణతో భగవంతునియందు భక్తి ఉత్పన్నమయినటువంటి భక్తులను సామాన్య వ్యక్తులుగా పరిగణించకూడదు. ఇనుమునందు అగ్ని ప్రవేశించినపుడు అది ఏవిధంగా కేవలము ఇనుప ముక్కగా ఉండక అగ్ని లక్షణములు పొందినట్లుగా భగవంతుని సాన్నిధ్యమునకు వచ్చినవారు కేవలము మనుష్య మాత్రులుగా వుండరు. వారికి దివ్యభావ ప్రాప్తి జరిగి, దివ్య గుణములతో కూడిన దైవీశక్తి సంపన్నులుగా మారి పూజనీయులు అవుతారు. అటువంటి భగవానుని భక్తులను అవహేళన చేసిన మూర్ఖులు తమ ఆయుస్సును, సిరి సంపదలను, శీలమును నష్టపోయి అధోగాములవుతారు.



ఈ విధముగా కుండలినీశక్తి జాగృతమయి క్రియాశీలమగుటచే వాస్తవిక యోగసాధన ఆరంభమవుతుంది. దీనినే స్వాభావిక లేక సహజయోగము, సిద్ధ లేక మహాయోగము అని అంటారు. ఇదియే సిద్ధినొసగు మార్గము. ఈ మార్గముద్వారా సర్వవేద జ్ఞానమయి, మంత్ర స్వరూపిణి, సర్వమంత్రాత్మిక, విద్యాశక్తి మరియు వేద విద్యలను తెలియజేయగల కుండలినీ శక్తి సాధకుని చేత క్రియలను చేయిస్తుంది. దీనివలన సాధకునికి సమస్త మంత్రముల మరియు సమస్త విద్యలయొక్క విజ్ఞానము లభిస్తుంది. అప్పుడు సాధకుడు దేవీదేవతల దర్శనము పొంది వారి అనుగ్రహమును పొందగలడు. అతడు వేదాది శాస్త్రములలో చెప్పబడిన మంత్ర విజ్ఞానము తెలుసుకొంటాడు. వేదములలోని నిగూఢ రహస్యమును కూడా తెలుసుకోగలడు. కుండలినీశక్తి సాధకునకు అంతరములో నున్న దివ్యలోకముల అనుభవ జ్ఞానమును కలుగజేస్తుంది. తత్వజ్ఞానమును కలుగజేస్తుంది. కుండలినీ శక్తి షట్చక్రభేదన మరియు శోధన చేసి సుషుమ్న మార్గములో ప్రవేశించినపుడు సాధకునికి క్రమముగా సమాధి స్థితులు కలుగుతాయి. శివశక్తుల కలయిక కొరకు కుండలినీ శక్తి యొక్క ప్రేరణతో సాధకులలో ఎటువంటి ఆశ్చర్యకరమైన క్రియలు కలుగుతాయంటే వాటిని ఎవరూ ఊహించలేరు. తమ తమ సంస్కారములను అనుసరించి సాధక జనులు వివిధరకముల హఠ, మంత్ర, లయ, రాజయోగముల యొక్క శారీరిక, మానసిక, ప్రాణిక క్రియలను చేస్తారు. వాటిని వర్ణించటం అంత సులభముకాదు. కాని ఏ అనుభవము సాధకులలో బాహ్యముగా కనిపిస్తుందో దానివర్ణన ఇక్కడ చేయబడినది.

**నాడీశుద్ధికి సంబంధించిన క్రియలు** : శరీరములోని నాడులలో ఉన్న మాలిన్యము కారణముగా ప్రాణము సుషుమ్నలో ప్రవేశించలేదు. అందువలన ప్రాణాయామ సిద్ధి కలుగదు. తత్వజ్ఞానము కూడా తెలియబడదు. దీనికొరకు ప్రారంభములోనే నాడీ శుద్ధి జరుగవలసి వుంటుంది. అందువలన కుండలినీ శక్తి ప్రారంభములో నాడీశుద్ధికి సంబంధించిన క్రియలను చేయిస్తుంది. నేతి, ధౌతి, వస్థి మొదలగు యోగక్రియలకు సంబంధించిన భస్త్రిక, అగ్నిసారము, శీతసారము, వాయుసారము, నౌలి, కపాల భాతి వంటి క్రియలను చేయిస్తుంది. ఇవి సాధకులకు వాయువుద్వారా రేచక, పూరక కుంభక ప్రాణాయామముద్వారా కలుగుతాయి. అనగా సాధకులకు ముక్కు గుదము, లింగము నుండి ప్రాణ, అపాన వాయువులను గ్రహించి, నిరోధించుట ద్వారా కుండలినీ శక్తి ప్రేరణతో ఈ క్రియలు సంభవిస్తాయి.

శరీర అంగములలో మార్పు – అనేక విధములైన పద్ధతులలో శుద్ధికి సంబంధించిన క్రియలు అనగా దేహ అంగముల ఘర్షణతో కూడిన వ్యాయామము,

శరీర అంగముల మర్దన, రాపిడి వివిధములైన శబ్దములు, నేత్ర సంబంధ క్రియలు, కనుపాపలు తిరుగాడుట, కాళ్ళు, చేతులను విసరి వేయుట, గిరిగిరా త్రిప్పుట, గుండ్రముగా తిరుగుట, క్రిందపడి దొర్లుట, నృత్యము చేయుట, పద్మాసనములో కూర్చుండి కప్పవలె ఎగిరి పడుట, దుముకుట, పిచ్చివాడిలా లేక మద్యము సేవించిన వానిలా, ఉన్మత్తునిగా, భూతావేశము కలిగిన వాడిలా, శారీరక, మానసిక చేష్టలు చేయుట వంటి ప్రాణవాయు క్రియలను సాధకుడు చేస్తాడు. సాధకుని ప్రవృత్తి ననుసరించి ఇంకనూ తీవ్రమగు క్రియలు అనగా రోమాంచము, అంతః స్ఫురణ, స్పందన, స్పర్శ, హాస్య, రోదన, స్తంభన వంటి క్రియలు, శరీరము బరువెక్కుట నేలపై పడుట, శ్వాస, ప్రశ్వాసలు వేగముగా నడుచుట, చమట పట్టుట, కన్నీరుకారుట, లాలాజలము ఊరుట, శరీరము కృశించిపోవుట పొట్టగట్టిపడి మలమూత్ర విసర్జన జరుగుట, స్వల్ప నిద్రలేక అతినిద్ర కలుగుట, లేక నిద్ర లేమి, చలిపుట్టుట లేక అధికోష్ణము కలుగుట, శరీరములో అణగియున్న రోగములు వెలికివచ్చుట, కడుపునొప్పి కామోత్తేజము వలన వీర్యము నష్టపోవుట లేక నీళ్ళ విరోచనములు కలుగుట, లేక మూత్రవిసర్జన జరుగుట, జ్వరము వచ్చుట ఎక్కిళ్ళు మరియు శ్వాస సంబంధ వ్యాధులు మునుపటి కన్నా పెరుగుట వంటి క్రియలను క్రియాశక్తి చేయిస్తుంది. దీనివలన సాధకుని వ్యాధులన్నీ వెంటనే నశిస్తాయి.

**స్వర వికృతి :** నోరు, ముక్కు గొంతు ద్వారా అనేకరకములయిన శబ్దములు చేయుట, పశుపక్ష్యాదులు, కప్ప, కుక్క పిల్లి, సింహము, పులి అరపులవంటి శబ్దములను చేయుట, గర్జన, హుంకారము, చీత్కారము వంటి భయంకర శబ్దములను చేయుట, పనికిమాలిన మాటలు మాట్లాడుట, అద్భుతముగా సంభాషణలు చేయుట, అనేకవిధములైన స్వరములతో విలపించుట, అనేక విధములైన భావములతో నవ్వుట, పాటలు పాడుట, కీర్తనలు చేయుట, నోటితో వాద్యసంగీతములను పలికించుట అనగా మృదంగము, తాన్‌పురా వంటి ధ్వనులను నోటితో పలకించుట నియమబద్ధముగా తాళము వేయుచూ చప్పట్లు కొట్టుట, గద్య, పద్యగానములు చేయుట, ఉపన్యాసములు ఇచ్చుట, వంటి స్వర సంబంధమైన క్రియలను సాధకుని చేత క్రియాశక్తి చేయిస్తుంది.

**ఆసనము :** సిద్ధ, పద్మ, భద్ర, ముక్త, సింహ, గోముఖ, వీర, ధను, శవ, మత్స్య, పశ్చిమోత్తాన, మత్స్యేంద్ర, గోరక్ష, ఉత్కట, మయూర, కుక్కుట, కూర్మ, మండూక, వృక్ష, గరుడ, వృషభ, శలభ, మకర, ఉష్ట్ర, భుజంగ ఆసనముల వంటి



విధ ఆసనములు సంభవించి శారీరక స్థిరత ప్రాప్తిస్తుంది. శరీరములో అగ్ని యొక్క పాచన శక్తి పెరిగి రజోగుణ తమోగుణములు అణగిపోయి శరీరము రోగ విముక్తిని పొందుతుంది.

సాధకునికి అనేక విధములైన జీవజాలములకు సంబంధించిన ఆసనములు సంభవించును. ఎందుకంటే అతడు 84లక్షల జీవజాలములకు సంబంధించిన యోనుల యందు జనన మరణములను పొంది యుంటాడు. అంటే అతడిలో ఆ యోనులకు సంబంధించిన సూక్ష్మ సంస్కారములు బీజరూపములో నిలిచి వుంటాయి. ఇవి కుండలినీ శక్తి జాగరణవలన స్మృతి పథములోనికి వచ్చి వెళ్ళిపోతాయి. స్వప్నములో మాదిరి ఇది సాధకునకు ధ్యానావస్థలో కనపడుతాయి. వాటికారణము చేతనే సాధకుడు అసాధారణముగా ప్రవర్తిస్తూ ఉంటాడు. ఏయోగి ఎటువంటి సంస్కారములను కలిగివున్నాడు అనేది, అతడి శారీరక, మానసిక, ప్రాణిక క్రియలద్వారా తెలుసుకొనవచ్చును. లేక సాధకునికి స్మృతి శుద్ధమయినప్పుడు అతడు తన అనుభవమవుతున్న జన్మాంతర సంస్కారములను చక్కగా అనుభవములోని తెచ్చుకొనగలడు. అంటే సాధకుని సంభవించే ఆసనములు కూడా అతడి సంస్కారముల యొక్క ఫలస్వరూపము కావున 84 లక్షల యోనులకు సంబంధించిన వేలాది ఆసనములు సాధకులు తమంతట తాము చేయగలుగుతారు. వృక్షయోనులకు సంబంధించిన పద్మ, తాళ, వృక్ష ఆసనములు, జలయోనులకు సంబంధించిన కూర్మ, మత్స్య, మకర ఆసనములు, కీటక యోనులకు సంబంధించిన శలభ, వృశ్చిక, భుజంగ ఆసనములు పక్షియోనులకు సంబంధించిన మయూర, గరుడ, కుక్కుట, ఆసనములు, పశుయోనులకు సంబంధించిన, సింహ, వృషభ, ఉష్ట్ర ఆసనములు తమంతట తాము సిద్ధిస్తాయి.

**బంధములు, ముద్రలు :** మహాముద్ర, మహాబంధము, మహావేధ, ఖేచరీ, ఉడ్యాన, మూలబంధ, జాలంధర బంధ, విపరీత కరణి, వజ్రోళి మరియు శక్తి చాలన వంటి దశ ముద్రలు వృద్ధాప్యమును మృత్యువును నాశనము చేస్తాయి. ఇవికూడా ఆసనములలో భాగముగా సంభవిస్తాయి.

మహాముద్ర, నభోముద్ర, ఉడ్యాన, జాలంధర, మూల బంధ, మహాబంధ, మహావేధ, ఖేచరీ, విపరీత కరణి, యోని ముద్ర, వజ్రోళి, శక్తిచాలినీ, తాడంగీ, మాండుకీ, శాంభవీ, పార్థివీ, వైశ్వానరీ, వాయవీ, ఆకాశీ, అశ్వనీ, పాశినీ, కాకీ, మాతంగీ మరియు భుజంగినీ వంటి 25 ముద్రలు యోగులకు సిద్ధిని చేకూర్చును.

ఇవికూడ యోగ ఆసనములతోపాటు చేయబడుతాయి. ఆసనముల యొక్క ముఖ్యకార్యము శరీరమును స్థిరపరచి దశ ప్రాణవాయువులను శరీరములో చక్కగా ప్రసరింపజేయుట అయివున్నది. ముద్రలు, బంధములు శరీరమును దృఢపరచి ప్రాణవాయువును ప్రత్యేక అంగములో స్థిర పరచుతాయి. వీటివలన మనస్సునకు ధారణాసామర్థ్యము కలుగును. మలద్వారము మరియు యోనిస్థానమువద్ద అశ్వనీముద్ర, మూలబంధము, మహాబంధము కలుగుతాయి. వీటి క్రియలు గుదమును సంకోచపరచి, వ్యాకోచ పరచుట ద్వారా జరుగుతాయి. నాభి మరియు ఉదరములో ఉడ్యానబంధ, తాడంగీముద్ర మరియు సారంగీ ముద్రలు ఏర్పడుతాయి. ఇవి ఉదరములోని వాయువు పూరించుటకు మరియు ఖాళీచేయుట ఏర్పడుతాయి. కంఠ సంకోచకారణముగా జాలంధర బంధము మరియు కళ్ళయందు త్రాటక స్థితి ఏర్పడి శాంభవీముద్ర ఏర్పడును. చెవులలో నాదము, శ్రవణము వంటి క్రియలు షణ్ముఖీ ముద్ర మరియు భ్రామరీ ముద్రలవల్ల కలుగుతాయి. జిహ్వాద్వారా ఖేచరీ, నభో ముద్ర, మండూకీ ముద్రలు ఏర్పడుతాయి. నోటిద్వారా, భుజంగీ, కాకీ, మరియు యోనిముద్రలు ఏర్పడుతాయి. మస్తకములో విపరీత కరణి సర్వాంగ ఆసనములో మహాముద్ర, మహావేధ ముద్రల యొక్క క్రియలు కలుగుతాయి. ఈ విధముగా సాధకునికి శాస్త్రానుసారము తనకు తానుగా ప్రకృతిమాత అయిన కుండలినీదేవి సమస్త క్రియలను చేయిస్తుంది. ఈ బంధములు, ముద్రల కారణముచే సాధకునికి ఆనందము ఉత్సాహము పెరుగుతుంది. వీటిని నిత్యము అభ్యసించుట వలన జఠరాగ్ని ప్రజ్వలితమవుతుంది. 20 రకములైన శ్లేష్మ వ్యాధులు వీటివల్ల నశిస్తాయి.

**ప్రాణాయామము** : యోగశాస్త్రములో కుండలినీ శక్తి జాగరణ కొరకు ప్రాణాయామమే ముఖ్య సాధనముగా చెప్పబడినది. యోగశాస్త్రములో ఉల్లేఖించిన విధముగా ఉత్తమ ప్రాణాయామము వలన ప్రాణ ఉత్థానము జరిగి కుండలినీ జాగృతి జరుగుతుంది. ఈ ప్రాణాయామమును అయితే చాలా శ్రమపడి చేయవలసి వుంటుంది. కాని కుండలినీశక్తి జాగృతమయి క్రియలను చేయించుతున్నప్పుడు స్వయముగా ప్రాణాయామము కంటే కూడా ఉత్తమమైన ప్రాణాయామమును జాగృతశక్తి ఎటువంటి శ్రమ లేకుండా చేయిస్తుంది. దీనివల్ల సాధకునకు ఆ మహా ఆనంద సూచకములైన యోగనిద్ర, రోమాంచము వంటి క్రియలు కలుగుతాయి. సాధకుడు ఆనందావేశములో ఓమ్ వంటి ధ్వనిని చేస్తాడు. అతడికి శరీరము



మెలికలు తిరుగుట, కంపము, భ్రమణము, శ్వేదము, ఆవులింతలు వంటి క్రియలు కలిగి ఆనందాశ్రువులు ప్రవహిస్తాయి. సాధకునికి జ్ఞానయుక్త వృద్ధి జరిగి యోగార్థము తెలియబడుతుంది. ఇదియే సర్వోత్తమ ప్రాణాయామము అయివున్నది. కుండలినీ శక్తి సుషుమ్న మార్గములో నుండి బ్రహ్మరంధ్రము వరకు వెళ్ళునప్పుడు, ఆ మహాదేవి సాధకుని చేత యోగశాస్త్రంలో చెప్పిన విధముగా అనేక విధములైన క్రియలతోపాటు ప్రాణాయామముకూడా చేయించటం వల్ల సాధకునియొక్క మనస్సు ప్రాణము, శరీరము, స్వస్థత చెంది సంఘటిత మవుతాయి. సాధకుడు శ్రమలేకుండా తన అభీష్ట సిద్ధిని పొందగలడు.

ఈ విధముగా కుండలినీశక్తి సాధకుని చేత అనేక విధములైన ప్రాణాయామములు చేయిస్తుంది. సూర్యభేదన, ఉజ్జాయి, శీతలీ, శీత్కారీ, భస్త్రిక, భ్రామరి, మూర్ఛ, ప్లావినీ అను ఎనిమిది విధములైన కుంభక ప్రాణాయామములు కలవు. ఇవికాకుండా బాహ్యాభ్యంతర ప్రాణాయామము, స్తంభవృత్తి మరియు కేవల కుంభక ప్రాణాయామము అనునవి కూడా కలవు. ఇవి ఆవశ్యకతానుసారము స్వతః సిద్ధముగా సాధకునకు సిద్ధిస్తాయి. వీటన్నిటియొక్క వాస్తవిక జ్ఞానము యోగ సాధన చేయుటద్వారా తెలియబడుతుంది. వీటితోపాటు సాధకునికి పంచభూతముల తత్వజ్ఞానము స్వయముగా స్ఫురిస్తుంది. ఏ సాధకుడు పూర్వజన్మలో జ్ఞాన, యోగ, భక్తి, మంత్ర, జప, దేవీ దేవతల పూజలు చేసిఉంటాడో అతడికి ఈ జన్మలోకూడా కుండలనీశక్తి జాగరణవలన తన పూర్వజన్మలోని సంస్కారానుగతముగా వచ్చిన జ్ఞాన సాధనలు అనగా అందరిలో ఆత్మతత్వము యొక్క ఏకత్వ అనుభూతిని పొందగలడు. పూర్వజన్మలో యోగసాధనలు చేసినట్లయితే యమనియమాలకు సంబంధించిన అష్టాంగ యోగక్రియలు జరుగుతాయి. భక్తి సాధనచేసినట్లయితే భగవత్ ప్రేమలక్షణములైన చిత్తచాంచల్యము, చిత్త క్షోభ, సంశయము, అనుమానము, ఉగ్రత, సంతోషము విషాదము మరియు స్వప్నముతో కూడిన నిద్ర అనగా సుషుప్తి, మూర్ఛ మరియు భావసమాధి వంటివి కలుగుతాయి. మంత్రజపమును చేయువారిలో కూడా పైన ఉదహరించిన లక్షణములతో పాటు దేవీదేవతల దర్శనము కలుగుతుంది. ప్రతి ఒక్కమనుష్యుని ప్రకృతి ననుసరించి క్రియలలో తారతమ్యము లుంటాయి. సాధకులలోని సంచిత సంస్కారములోని విభిన్నత కారణముగా అందరికి ఒకేరకమయిన క్రియలు కలుగవు. కాని అన్ని సాధనల అంతిమ ఫలమొక్కటే. అది సమాధి లేక జ్ఞాన, మోక్షములు పొందుట అయివున్నది.

**నవరసములు :** రౌద్ర-తీక్షణభావము, **అద్భుత**-విస్మయమును కలిగించెడి భావము, శృంగార- కామప్రేరణలు కలిగించెడి భావము. హాస్య-నవ్వుతో కూడిన ఆనంద భావము. వీర-ఉత్సాహముతో కూడిన భావము. దయ-కరుణతో కూడిన భావము, భయానక-భయమును కలిగించెడి భావము, బీభత్స-ఏవంగిపుతో కూడిన భావము. **శాంతి** అనగా ప్రేమతో కూడిన భక్తియుక్త శాంత భావము అనగా వినయభావము, ఈ తొమ్మిదింటిని నవరసము లందురు. కుండలినీ శక్తి మేల్కొనుట వలన ఎప్పుడూ వినని శాస్త్రముల జ్ఞానము మరియు అజ్ఞాత భావ సమూహ మంతయు వెలుగులోనికి వస్తాయి. ఆ భావావేశములోనే సాధకుడు మహా సంతోషమును పొందుతాడు. మనస్సులోని భావములు క్రియారూపములో తమసంస్కారాను గతముగా ప్రకటింపబడుతాయి. ఈ వెలికివచ్చే భావములకు ఒక పద్ధతి గాని క్రమముగాని ఉండదు. ఏ సమయములో ఎటువంటి భావము, వృత్తి ఉదయించునో ఆసమయములో అటువంటి కార్యములలో జాగృతశక్తి వల్ల కలుగుతాయి. అవ్యక్త చైతన్యశక్తివల్ల సాధకుని మనస్సులో అప్పుడప్పుడు సూక్ష్మాతి సూక్ష్మమైన మరియు తీవ్ర భావములతో కూడిన ప్రేరణలు ఉదయిస్తాయి. వీటిని చర్చించవలసిన పనిలేదు. వాటిని వెలికి రానీయవలసి ఉంటుంది. అందువల్ల సాధకులు నిస్సందేహముగా, నిర్భయముగా తన ఇచ్ఛాశక్తిని క్రియాశక్తిగా మార్పు చెందుటకు అవకాశ మీయవలెను.

సాధకునిలో రౌద్రభావము ఉత్పన్నమైనపుడు సాధన సమయములో సాధకునకు క్రోధము మరియు కర్కశ భాషతో తన రౌద్రరూపము ప్రకటింపజేస్తాడు. అద్భుత రససంబంధమైన క్రియలు సాధకునిలో కలిగినపుడు అతడు విస్మయము ప్రకటింప జేస్తాడు. అతడికి కలిగే అనుభవమే విస్మయకరముగా వుంటుంది. సాధకునిలో శృంగార రస సంబంధమైన భావము జనించినపుడు అతడు తన ఉపాస్య దేవతను భర్తరూపములో చూస్తాడు లేక ఆత్మరతిలో నిమగ్నమవుతాడు. సాధకునిలో హాస్యరస వికాసము జరిగినపుడు అతడికి సాధన కాలములో స్మిత, హసిత, విహసిత, అవహసిత, అపహసిత, అతిహసిత అను ఆరు రకముల హాస్యములలో ఏదో ఒక హాస్య సంబంధ క్రియ కనిపించును. సాధకుడు గంటల కొద్దీ అనేక విధములుగా నవ్వుతూనే ఉంటాడు. సాధకునికి తన సాధన సమయములో వీర రసభావము ఉదయించినపుడు అతడు ఆవేశములో శరీరమును కొట్టుకొనుట వంటి క్రియలతోపాటు కఠినాతి కఠినమైన కార్యములను కూడా సులభముగా చేయగలడు.



ఆ స్థితిలో అతడు అత్యంత బలిష్ఠమైన వస్తువులను కూడా విరిచి వేయగలడు. అనగా సాధన కాలములో అతడు వీరుని మాదిరిగా ఉత్సాహ భరితముగా ఉంటాడు. సాధన కాలములో ఎక్కువమంది సాధకులు కరుణారసమును కలిగి వుంటారు. ఆ సమయములోవారు కరుణ కలిగించెడి స్వరముతో విలపిస్తారు. చాలామంది సాధకులు సాధనకు ఉపక్రమించగానే తమ అంతరములో భయానుభూతిని పొందుతారు. అందువల్ల సాధకుడు భయభీతుడవుతాడు. అతడు భయమును సూచించెడు శబ్దములను పలుకుతాడు. ఎందరో సాధకులు సాధన సమయములో నింద మరియు ద్వేషముతో కూడిన శబ్దములను పలుకుతూ వుంటారు. తిరస్కారమును సూచించెడు శరీర క్రియలను చేస్తారు. అదేవిధముగా శాంత భావముతోనున్న సాధకులు సాధన కాలములో నిశ్శబ్దముగా శరీర, మన, ప్రాణ, ఇంద్రియ సంబంధిత క్రియాకలాపములను నిలిపి యుంచుతారు, తన అంతరాత్మలో నిలిచి వుంటాడు. దానివలన వారికి పరమశాంతితో కూడిన మహాసుఖ అనుభూతి కలుగుతుంది. ఈ ప్రకారముగా మహాయోగ సాధనలో అంతరాత్మ ప్రేరణతో సాధకునిలో శారీరక మానసిక ప్రాణ సంబంధ క్రియలు జరుగుతాయి. అన్ని తత్వముల మరియు భౌతిక విషయముల యొక్క జ్ఞానము కలుగుతుంది. అంటే ప్రాకృతిక తత్వములు సాధకునికి అనుకూలిస్తాయి. వాటియొక్క స్థానము, కార్యము, స్థితి మరియు స్వరూపముల గురించి సాధకుడు స్వయముగా తెలుసుకొనగలడు. వాటిలో తన ఆవశ్యకతానుసారము భౌతిక, ఆధ్యాత్మిక సహకారమును సాధకుడు తీసుకొంటాడు. ఆ ప్రాకృతిక తత్వములు కూడ ఎప్పుడూ సాధకునికి ప్రతికూలతను కలిగించవు.

**క్రియలు అర్థ శూన్యమైనవికావు :** అనగా సాధకునికి కుండలినీశక్తి జాగృతమగుటచే మంత్ర, యంత్ర, జప, తప, పూజలు లేక మరేదయినా ఇతర అనుష్ఠానములు శుభ ప్రదముగా ఫలవంతమవుతాయి. దేవీదేవతలందరు ప్రసన్ను లవుతారు. క్రియా సమయములో సాధకుడు చేసే శుభ, అశుభ కర్మలు అన్నీ ఆత్మదేవునికి ప్రీతికరమవుతాయి. అందువలన క్రియలుచేసే సమయములో సాధకుడుచేసే వ్యర్థప్రలాపములు, వాగుడు మొదలగునవి కూడా జపము యొక్క ఫలితాన్ని ఇవ్వగలవు. ఆ సమయములోని మత్తు నిద్ర వంటివి సమాధిస్థితి యొక్క ఫలితమును ఇస్తాయి. శరీర అంగముల ద్వారా జరుపబడే క్రియలు పూజాఫలమును ఇవ్వగలవు. రేచక, పూరక, కుంభక ప్రాణాయామములు 'బలి' యొక్క ఫలితాన్ని

ఇస్తాయి. దానివలన పాపములు నశిస్తాయి. ఇదేవిధముగా ఆ సమయములో కలిగిన కుండలినీ శక్తి యొక్క సంయోగము ముక్తి రూప ఫలమును ఇస్తుంది. క్రియాసాధన సమయములో వెలువడిన మాటలు స్తోత్రపాఠ సదృశముగా మారి ఫలితాన్ని ప్రసాదిస్తాయి. ఆ సమయమున చేతితో చేసెడి అవయవ సంస్పర్శలు, మర్దనల వంటివి మంత్రన్యాస ఫలితాన్ని ఇస్తాయి. క్రియాశక్తి ప్రేరణతో ఏదిక్కునకు సాధకుని దృష్టి ప్రసరణ జరుగుతుందో అది ధ్యాన రూప ఫలితాన్ని ఇస్తుంది. క్రియాశక్తి ఆవేశములో నున్నప్పుడు తిన్న ఆహారము హవన ఫలితాన్ని ఇస్తుంది. క్రియాశక్తి నడుస్తూవున్నప్పుడు సాధకుడు పడుకొనినా అది ఈశ్వరునికి సాష్టాంగ ప్రణామము చేసిన ఫలితాన్ని ఇస్తుంది. ఈ విధముగా కుండలినీ జాగరణ జరిగిన తరువాత సాధకునికి తన సంస్కారముల ననుసరించి కలిగిన శుభ, అశుభ సంస్కారములకు సంబంధించిన క్రియలన్నీ ఆధ్యాత్మిక జ్ఞాన రూపముగా పరిణతి చెంది మహా మంగళమును కలుగజేస్తాయి.

**యోగక్రియల ద్వారా కర్మ నివృత్తి :** త్రితాపములతో పీడించబడే మానవులకు ఆధ్యాత్మిక విద్య శాంతి నొసంగి పరమ సుఖమును, ముక్తిని ప్రదానముచేస్తుంది. అది ప్రాప్తించిన తరువాత సాధకుని ధర్మ కర్మములు, పూజా పాఠములు, జపతపాదులు తమంతట తాముగా వదలిపోతాయి. సాధకుడు అన్ని విధి విధానముల నుండి నివృత్తిని పొందుతాడు. శ్రీమహేశ్వరుల కృపాకారణముచే ప్రసాదించబడిన క్రియాశక్తి ద్వారా శుద్ధిని పొందిన సాధకునికి శాస్త్రములలో చెప్పిన వర్ణాశ్రమ ధర్మములను పాటించుట కష్టముతో కూడిన పని అవుతుంది. అందువలన వారు వర్ణాశ్రమ ధర్మములను పాటించలేరు. పాటించవలసిన అవసరము కూడాలేదు. ఎందుకంటే వారు శ్రీ మహేశ్వరుల ద్వారా పొందిన శక్తి కారణముచేత మరియు శ్రీ మహేశ్వరుల పట్ల భక్తి కారణముచేత శ్రీ మహేశ్వరులవలె విధినిషేధములకు సంబంధించిన అతీతులుగా వుంటారు. అనగా వారికి విధి నిషేధములకు సంబంధించిన బంధనములేవీ వుండవు.

అంటే ప్రధమముగా యోగసాధన ద్వారా జ్ఞానము ఉదయిస్తుంది. దీనివలన సాధకులు కామ్య కర్మలను త్యజిస్తారు. జ్ఞాన ప్రకాశము తరువాత సాధకుని మనస్సులో సాంసారిక సుఖములను పొందవలెననెడి కోరికలు నశిస్తాయి. అందువలన వారు కామ్యకర్మలేవీ చేయరు. ఈ విధమైన జ్ఞానస్థితి కలుగగానే సాధకుడు కామ్యకర్మలు



త్యజిస్తాడు. రెండవది సాధన ద్వారా లభించిన జ్ఞానము సాధకుని బుద్ధిలో నిలిచి వుంటుంది. ఈ విధమైన సమ్యక్ జ్ఞానము బుద్ధిలో నిలిచి వుండుటచే సాధకుడు నిమిత్త కర్మలను కూడా త్యజిస్తాడు. అతడు దేనికొరకు కర్మలు చేయడు. మూడవది సాధనద్వారా సాధకునకు పూర్ణజ్ఞానము ప్రాప్తించి అతడు నిత్యకర్మలను వదిలివేస్తాడు. నాల్గవది సాధకునికి అద్వైత జ్ఞానప్రాప్తి జరిగి అతడు వర్ణాశ్రమ ధర్మములను త్యజిస్తాడు. ఈ విధముగా శ్రీ మహేశ్వరుల కృప కారణముగా క్రియాశక్తి, జ్ఞానము లభించిన సాధకులు నిత్య, నైమిత్తిక, కామ్య, ప్రాయశ్చిత్త, నిషిద్ధకర్మలను వదిలివేసి అద్వైత జ్ఞానమును పొంది శివస్వరూపుడవుతాడు. అప్పుడు అతడిని కర్మలేవీ బంధించలేవు.

# సిద్ధమహాయోగము

## పన్నెండవ ప్రకరణము

**దీక్ష ద్వారా కుండలినీశక్తి యొక్క మంత్రసృష్టి :** గురుదీక్షతో సాధకునికి జ్ఞానప్రకాశమును కలుగజేసే జ్ఞానశక్తి అయిన కుండలినీదేవి తన స్వరూప జ్ఞానమును అవగతము చేయటానికి విశేష గుణములతో క్రియాశీలమవుతుంది. అప్పుడు శబ్దబ్రహ్మమయమయిన శక్తికి సంబంధించిన అనేక చమత్కారములు గుణవతీశక్తి వెలువరిస్తుంది. ఆశక్తి ధ్వని, నాదము, నిరోధికా, అర్ధేందు, బిందు, పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాణిని ఉత్పన్నము చేస్తుంది. ఈ కుండలినీ శక్తియే తేజః స్వరూపముతో గుణములను ఆశ్రయించి ఇచ్ఛా, జ్ఞాన, క్రియా రూపములతో వెలువడి పైన ఉదహరించిన క్రమములో వాక్కును మరియు వర్ణమాలను సృష్టిస్తుంది. వాటియొక్క అనుభవము సాధన కాలమునందు సాధకునిలో కలుగు క్రియల లక్షణములద్వారా తెలుసుకొనవచ్చును.

కుండలినీ శక్తియొక్క మొట్టమొదటి స్వరూప పరిచయ స్థితిలో సాధకునికి తన శరీర, మనః, ప్రాణములు శక్తి హీనమయినప్పటికి చేతన నిలిచి యుంటుందని తరువాత రెండవ స్థితిలో కుండలినీ శక్తి రూపములో వికాసము చెందినపుడు అనుభవమవుతుంది. సాధకుని తన మనః ప్రాణముల యొక్క క్రియాశక్తి అనుభవములోకి వస్తుంది. తరువాత ధ్వని ఉత్పన్నమయి సాధకునియొక్క అంతరములో అవ్యక్త ధ్వని విశేషములను శ్రవణము చేయగలడు. కాని నాదమును

గురించి స్పష్టముగా చెప్పలేదు. కాని కుండలినీ నాద స్వరూపమును ధారణ చేయగానే సాధకుడు తన అంతరములో ప్రభవించే సూక్ష్మాతి సూక్ష్మనాదమును స్పష్టముగా వినగలడు. దీని తరువాత సాధకునికిని **నిరోధికా స్థితి** అనుభవ మవుతుంది. ఈ స్థితిలో జ్యోతులయొక్క దర్శనము కలుగుతుంది. తరువాత కలిగే **అర్ధేందు స్థితిలో** చంద్రుని దర్శనమవుతుంది. తరువాత బిందురూపములో జ్యోతిప్రకాశము దర్శనమవుతుంది. వీటివల్ల అన్ని వివిధములైన నాదములు, సుస్పష్టమై వీణ, మురళీ, భ్రమరాది రూపములలో పరా, పశ్యంతి, మధ్యమా స్థితుల అనుభవము కలుగుతుంది. తరువాత వైఖరీద్వారా వర్ణమాలలోని వివిధములైన క్రియాశబ్దముల యొక్క రూపములతో వ్యక్తమవుతుంది.

ఈ పరమ దేవతా స్వరూపమైన ఈశ్వరీయశక్తి జాగృతమయి చక్కని క్రియలను చేసినపుడు సాధకుని శరీరమంతటా వ్యాపించి మంత్రమయ ప్రపంచమును సృష్టించుట మొదలు పెడుతుంది. దీనితో సాధకుడు వేదాది శాస్త్రముల బీజ మంత్రములకు సంబంధించిన ప్రణవశబ్దములను ఉచ్చరించుట మొదలు పెడతాడు. వెనువెంటనే శక్తి ఆవేశముతో శివ, శక్తి, విష్ణు, సూర్య, గణపతి, దుర్గా, భైరవ, నృశింహ, వరాహ, వాసుదేవ, హయగ్రీవ, పురుషోత్తమ మొదలగు దేవీదేవతల యొక్క ఓం, హ్రీం, శ్రీం, క్లీం వంటి బీజమంత్రములు ఉచ్చరించి జపించుట మొదలుపెడతాడు. ఈ ప్రకారముగా కుండలినీ శక్తి ప్రేరణతో ఎప్పుడూ చూడని, వినని, నేర్చుకొనని వివిధ మంత్ర శబ్దములు సాధకుని ముఖతః వెలువడుతాయి. సాధకుని పేరు ఫలములకు ప్రతికూలముగా నుండు అనిష్టమును కలిగించే మంత్రములు కూడా అనుకూలముగా సిద్ధిస్తాయి. దీనివలన మంత్ర ప్రతిపాద్యమైన కుండలినీశక్తి మరియు మంత్ర చైతన్యము యొక్క ఏకత్వము సిద్ధిస్తుంది.

**స్వతః సిద్ధ ప్రణవ మంత్రము :** ఈ ప్రకారముగా కుండలినీ శక్తి యొక్క వ్యక్త, అవ్యక్త, వ్యాపక స్థితిలో ప్రథమముగా వేదములయొక్క బీజమంత్రము ఓంకారము ప్రకాశ మానవమవుతుంది. ఓంకారము తరువాత దేవీ దేవతల మంత్రములు అందువలన కుండలినీ జాగరణతో సాధకునికి ప్రథమధ్వని రూపశబ్దమైన ఓంకారము యొక్క స్ఫురణ పరావాణిలో జరుగుతుంది. ఎందుకంటే ఓంకారము తోడనే మంత్రసృష్టి జరుగుతుంది. ఈ ఓం అను అక్షరమే బ్రహ్మము అయివున్నది. ఈ ఓంకార శబ్దము తన అంతః కరణలో ఎవరికి స్వతః సిద్ధముగా



స్ఫురిస్తుందో వారి కోరికలన్ని వెంటనే తీరుతాయి. ఈ ఓంకారమే పరమశ్రేష్ఠ అలంబనము. యోగ సాధనతో ఈ పరమ ఆశ్రయమును తెలుసుకోవటం వల్ల బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది.

అనగా ఈ బీజరూప ఓం మంత్రమే బ్రహ్మమని వేదములు చెప్పినవి. బ్రహ్మము, మనో, వాక్కులకు అతీతము. వేదములలో చెప్పబడిన ఈ ఓం అనునది మనో వాక్కులకు అతీతముగా వుండి లక్ష్యార్థమై వున్నది. ఏవిధముగా బ్రహ్మముయొక్క రూపమును వాక్కుతో వ్యక్తపరచలేమో అదేవిధముగా ఓంకారమును కూడా సాధారణ వాక్కు ద్వారా వ్యక్తము చేయలేము. కాని దీనిని అంతరములో పరబ్రహ్మముగా స్ఫురణను పొందగలము. వ్యవహారికముగా ప్రస్తుతము 16 అచ్చులు, 31 హల్లులు వ్యాప్తిలో ఉన్నాయి. ఇవి వ్యాకరణ పరముగా ఉదాత్త, అనుదాత్త, స్వరిత భేదములతో అనేకవిధములుగా హ్రస్వ, దీర్ఘ, ప్లుతాది స్వరములతో ఉచ్చరించబడుతాయి. కానీ బ్రహ్మ స్వరూపమైన ఓంకార రూపమైన అక్షరము వీటిలో ఎక్కడా కనిపించదు. దీని ఉచ్చారణ కూడా ఆ అక్షరముల సహాయముతో చేయబడదు. శాస్త్రములలో వైదిక మంత్రములను జపించుటద్వారా లభించే ఫలము చెప్పబడినది. సామవేదమంత్రములు షడ్జ్యమము రిషభము, గాంధారము వంటి స్వరములో ఉచ్చారణ చేసి హవనము చేయుట ద్వారా వెంటనే ఫలితము లభించును. సామవేద ఉపాసనలో వేద స్వరములలో 'ఓం' అను ధ్వని విశేషము కూడా చేర్చబడినది. ఈ స్వరము కూడా సామవేద మంత్రముల అంతర్గతమైనది. ఈ 'ఓం' అనునది స్వతః సిద్ధమైనది. దీనియొక్క విచిత్ర స్వరముల కూర్పు కుండలినీ శక్తితో జరుగుతుంది. దీని ఉచ్చారణ హ్రస్వముగా చేసినట్లయితే పాపములు నశిస్తాయి మరియు దీర్ఘముగా చేసినపుడు మోక్షము లభిస్తుంది. ప్లుత స్వరముతో ఉచ్చరించుటవలన శరీరమునకు, మనస్సునకు, ప్రాణమునకు తృప్తి లభిస్తుంది.

సిద్ధ మహాయోగమును లభింపజేసెడి యోగమాయ అయిన కుండలినీ శక్తి వైదికమంత్రములలో సమస్త స్వరములను ప్రాప్తింపజేయును. అప్పుడు ఈ ఓంకారమే పరావాణిలో ఉద్భవించి పశ్యంతి, మధ్యమా స్థితుల ద్వారా వైఖరీ రూపములో వ్యక్తమవుతుంది. వైఖరీ క్రియా రూపములో వ్యక్తముకాగా సాధకుని యొక్క మూలాధారములో మరియు తాలు మూలములో కంపనము ప్రారంభమవుతుంది. కంపనముతోపాటు షడ్జ్యమ, రిషభ, గాంధారములతో కూడిన విచిత్ర స్వరములతో

దీర్ఘ ప్రణవము ఉచ్చరింపబడుతుంది. ఈ ప్రణవ ధ్వని యొక్క ఉచ్ఛారణకు వర్ణమాలలోని అచ్చులు హల్లులతో ఎటువంటి సంబంధము లేదు. మూలాధారములోని కుండలినీ శక్తి ప్రేరణ ద్వారా సాధకుడు స్వయముగా దీనిని ఉచ్ఛరిస్తాడు. అప్పుడు సాధకుడు తన హృదయాకాశములో అనేక నాదములను కూడా శ్రవణము చేయగలడు. కాని అతడు ఈ నాదముల గురించి చెప్పలేడు. ఆవేశ స్థితిలో తాను బిగ్గరగా ఉచ్చరించుచున్నానను స్ఫురణ కూడా లేకుండా ధ్వనులను ఉచ్ఛరిస్తాడు. ఈ ధ్వనులు రాత్రి సమయములో మైదాన ప్రాంతములలో చేసినట్లయితే రెండు, మూడు మైళ్ళ పర్యంతము వినిపించ గలవు. వినటానికి ఇటువంటి శృతితో కూడిన శబ్దములు మధురముగా ఉంటాయి. కాని ధ్వని తీవ్రత కారణముగా దానిలోని స్వరములు అర్థముకావు. అంటే అది అనేక స్వరములతో కూడిన అద్భుత స్వరముగా అనిపిస్తుంది. ఏవిధముగా సామవేదమును ఉచ్ఛరించినపుడు శ్రోతలు అందులో లీనమవుతారో అదేవిధముగా ఈ స్వతః సిద్ధ ప్రణవ మంత్రము అర్థముకాకున్నా ఆశ్చర్య పరుస్తుంది. ఈ ప్రణవ శబ్దములో కొంతభాగము 'హుంకార' శబ్దములో కలుస్తుంది. కాని దానిని పూర్తిగా హుంకారము అని చెప్పలేము. ఎందువలనంటే ఆశబ్ద విచిత్రతను వర్ణించలేము.

వైఖరీ క్రియద్వారా ప్రణవ జపము యొక్క ధ్వని వెలువడి లయమయిన తరువాత అటువంటి ధ్వనినే సాధకుడు తన ఇచ్ఛానుసారము తిరిగి చేయగలడు. కాని మానసిక ఆనందమును పొందలేడు. ఐదు, పది పర్యాయములు అటువంటి ధ్వనిని చేయగానే చిత్తము చేయవద్దని కోరుకుంటుంది. కాలము గడచిపోతూ ఉంటుంది. తిరిగి గొంతులో స్వరభంగము కలుగుతుంది. స్వభావ సిద్ధముగా క్రియా ఆవేశములో ఒకానొక సాధకుడు ప్రతినిత్యము నాలుగైదు గంటలు దీర్ఘప్రణవ ధ్వనిని చేస్తూ వుంటాడు. ఆసమయములో అతని స్వరము ఎక్కువ శక్తిమంతముగా స్ఫూర్తి ప్రదముగా వుంటుంది. మహామాయ యొక్క ఈ యోగక్రియా కౌశలము యొక్క సామర్థ్యమును పుస్తకములలో వర్ణించి వివరించలేము. ఈ దీర్ఘప్రణవము తరువాత ఏదో ఒక అదృష్టవంతుడైన సాధకునకు ఆధ్వనియే సూక్ష్మమవుతుంది. మహా యోగములో దీని పేరు స్వతః సిద్ధ ప్రణవ జపము. పైన చెప్పిన దీర్ఘజపము కాకుండా ఈ సూక్ష్మజపములో మనస్సు వందరెట్లు అధిక సుఖమును అనుభవిస్తుంది. దీనికి ఈ జపము యొక్క క్రియలు 24 గంటలలో ఎప్పుడైన జరుగుతాయి. ప్రారంభము, అవధి అను నియమములులేవు.



సూక్ష్మ ప్రణవ జపము ప్రారంభము అయిన తరువాత మనస్సు యోగము ద్వారా ప్రాప్తించే ఐశ్వర్యమును వాంఛింపరాదు. ఈ జపమువల్ల మనస్సు అంతర్ముఖ మవుతుంది. విషయ వాసనలు తగ్గిపోతాయి. మనస్సు ఆత్మతత్వములో ఎక్కువ నిష్ఠను పొందుతుంది. కామక్రోధములచే బాధింపబడదు. ప్రాణ ప్రవాహస్పందన వుంటుంది గాని శ్వాస ప్రశ్వాసలు దీర్ఘముగా వుండవు. సాధకుడు క్రియలకు కూర్చున్నప్పుడు ఇతర క్రియలు తక్కువగా వస్తాయి. ఈ పైన చెప్పిన క్రియలే ముఖ్యమవుతాయి. దీనితోపాటు సాధకునికి సూక్ష్మ నాదములు వినిపిస్తాయి. అవి అప్పుడప్పుడు దూరము నుండి మరియు దగ్గర నుండి వస్తున్నట్లు అనుభవ మవుతుంది. కాని ఈ స్థితిలో కూడా సాధకునకు అంతరములో దృశ్యములు ఏవీ కనిపించవు. అతడి మనస్సు శూన్యముగా వుండి శాంతముగా ఏకాగ్రతను పొంది వుంటుంది. అప్పుడప్పుడు బాహ్యావిస్మృతి కలుగుతుంది. కాని ఈ స్థితిలో కూడా సాధకుని మనస్సు బాహ్యావిషయములను గ్రహించే సామర్థ్యమును కలిగి వుంటుంది. ఈ స్వతః సిద్ధ ప్రణవ జపములో మనస్సు పూర్తిగా నిలబడిపోతుంది. దీనితో సాధకుడు సోమరితనము మరియు నిద్రను జయిస్తాడు. శరీరములో సత్వగుణ సంచారము సదానిలిచి వుంటుంది.

యోగమాయ ద్వారా వైఖరీ క్రియగా వ్యక్తమయ్యే స్వతః సిద్ధ ప్రణవమైన ఈ 'ఓం' అను శబ్దముయొక్క అక్షర రూపమును చెప్పలేము కాని ధ్వని రూపముగా చెప్పవలసిన ఆవశ్యకత వున్నది. ఎందుకంటే **షడ్జ్యమ, రిషభ, గాంధార, మధ్యమ,** పంచమ, **దైవత, నిషాదములనెడి** సప్త స్వరములతో ఈ ఓంకారము సంబంధము కలిగినట్లుగా వుంటుంది. కాని ఫలానా స్వరము అని ప్రత్యేకించి చెప్పలేము. అందువల్ల ఈ ప్రణవమును అద్భుతము మరియు ప్రత్యేకము అను చెప్పుటలో అతిశయోక్తి లేదు. అనగా స్వతః సిద్ధ ప్రణవ జపములోని మనః స్థితి మనస్సుకు మాత్రమే తెలియబడుతుంది. సూక్ష్మప్రణవ జపము యొక్క ధ్వనిని వర్ణించి చెప్పుటము ఏ సాధకునికి ఇంతవరకు సాధ్యపడలేదు. సాధకుడు ఈ క్రియను అనాహత నాదము, ఓం శబ్దము అని, నాదాను సంధానము అని చెప్పి మౌనముగా వుంటాడు. కాని అనాహత ధ్వనికి స్వతః సిద్ధ ప్రణవ జపము యొక్క ధ్వని విశేషమునకు విశేష తారతమ్యము కలదు. అనాహతధ్వని దశవిధములుగా వుంటుంది. ప్రాణవాయువు బ్రహ్మ రంధ్రములోనికి పోవునపుడు భేరీనాదములు వినపడతాయి. చివరికి ప్రాణము బ్రహ్మ రంధ్రములో స్థిరమైన తరువాత కింకిణీ, వేణువు, వీణా, భ్రమరము మొదలగు

శబ్దములు వినవచ్చును. అనగా నాదానుసంధానము మరియు స్వతః సిద్ధప్రణవ జపములో తారతమ్యము తప్పక ఉన్నది. ఎందుకంటే నాదానుసంధానము స్థిరముగా, చిరస్థాయిగా వుంటుంది. కాని స్వతః సిద్ధ ప్రణవజపము అస్థిరముగా వుండి కొంతకాలము మాత్రమే వుంటుంది.

**ప్రణవ నామమైన "ఓం" లక్ష్యార్థమై వున్నది :** సమస్త వస్తువుల పేర్లు వాచ్యార్థమై వుంటాయి. కాని వాటిరూపము లక్ష్యార్థమై వుంటుంది. ఇటువంటి పరమ పవిత్ర బ్రహ్మయొక్క రూపమైన 'ఓం' అను జపము చేసెడి సాధనాకాలములో అది ప్రణవము పేరుతో వాచ్యార్థముగా వుంటుంది. జపము స్థిరమైనప్పుడు బ్రహ్మరూపమైన 'ఓం' లక్ష్యార్థమవుతుంది. ఎలాగంటే, ఒక వ్యక్తి పేరు హరి అనుకొందాము. హరిశబ్దముతో హరియొక్క రూపజ్ఞానము కలుగదు. కాని పేరు తెలయబడుతుంది కాబట్టి అది వాచ్యార్థమవుతుంది. హరిని కలుసుకొనటం వల్ల అతడి రూపము తెలియబడుతుంది. అప్పుడు అతడి రూపము లక్ష్యార్థమవుతుంది. అందువలన యోగదర్శనములో చెప్పేదేమంటే ప్రణవము, ఈశ్వరుని యొక్క నామమును తెలియజేస్తుంది. అది అప్పుడు వాచ్యార్థమై వుంటుంది. యోగసాధన ద్వారా లేదా జపసాధన ద్వారా ఈశ్వరుని కలిసుకొన్నప్పుడు "ఓం" లక్ష్యార్థమవుతుంది అనగా ప్రణవము నామము అవుతుంది. 'ఓం' వస్తువు అవుతుంది. అందువలన మళ్ళీ చెప్పబడేది ఏమంటే ప్రణవమును జపించే సమయములో దానియొక్క అర్థమును కూడా చింతన చేయవలసి వుంటుంది. ఇందుమూలముగా మనకు ప్రణవము నామము అని "ఓం" అనునది వస్తువు అని ధృవపడుతుంది. ఈ "ఓం" శబ్దము అచ్చులకు గాని హల్లులకు కాని సంబంధించినదికాదు. వర్ణముల పరిధిలోనికి రాని ఈ ఓం అనుశబ్దము హ్రస్వము, దీర్ఘము ఫ్లుతము ఎట్లా అవుతుంది? అనగా ఈ వర్ణరూపమైన ప్రణవ శబ్దము యొక్క పేరు వాచ్యార్థమై వున్నది. ధ్యాన రూపములో ఈ "ఓం" శబ్దము లక్ష్యార్థమైవున్నది. హృదయ గ్రంథి భేదనము చేసెడి ఈ 'ఓం'ను గురించిన జ్ఞానము యోగసాధన ద్వారా తెలియబడుతుంది.

చిద్రూపమై నమస్కారయోగ్యమై, సకల సిద్ధులకు మూలమైన మరియు, జనన మరణ బంధములను తొలగించే సామర్థ్యముగల 'ఓం' అను అక్షర ధ్వనియొక్క పరమ నాదమును శబ్దబ్రహ్మమంటారు. మూలాధార చక్రములో కొలువైయున్న బిందురూపములో వున్న శక్తి నుండి ఈ ధ్వని రూపమైన 'ఓం' ప్రకటింపబడుతుంది ఏవిధముగా బీజమునుండి అంకురము ఉద్భవిస్తుందో అదే విధముగా ఓంకారము



వెలుగులోనికి వస్తుంది. ఇది సాధకునికి మూలాధారములో పరావాణిగా, నాభిస్థానములో పశ్యంతిగా తెలియబడుతుంది. హృదయ స్థానములో మధ్యమాగాను, వాణిలో వైఖరిగా మేఘగర్జన సదృశముగా ఈ ఓం అనునాదము వినిపిస్తుంది. హృదయస్థ ప్రాణము యొక్క సహయోగముతో తాలు మూల స్థానము నుండి వికాసము పొంది వైఖరీ వాణిగాను 'అ'కారమునుండి 'క్ష' కారము వరకు అక్షరములతో కూడిన శబ్దముగాను వెలువడుతుంది. అక్షరములు కలిసి పదములుగాను, పదములన్నియు కలిసి వాక్యములుగాను తయారవుతాయి. మంత్రములు, వేదములు, శాస్త్రపురాణములు దేశవిదేశములకు సంబంధించిన అన్నిభాషలలోని కావ్యములు అన్నీ ఈ వాక్యములతో నిర్మితమయినాయి.

అదేవిధముగా సప్తస్వరములు మరియు కీర్తనలు అన్ని ఈ ధ్వని రూపనాదముతో ఉత్పన్నమయినాయి. వీటిని ఉత్పన్నము చేసెడి సరస్వతీదేవి అందరి హృదయములలో నిలిచి వుంటుంది. కుండలినీశక్తి కారణముతో ప్రాణ, అగ్నిల ప్రేరణతో సాధకునికి క్రమముగా ఇవి అనుభవములోనికి వస్తాయి. ఈ వైఖరీశక్తి మార్పుచెంది వాక్యముగా మారుతుంది. ఏ సాధకుడు యోగసాధన ద్వారా తనలోని ఈ వైఖరీశక్తిని చూడగలడో అతడికి సరస్వతీమాత కృపతో వాక్ సిద్ధి లభిస్తుంది. అనగా అతడి నుండి స్వయముగా వేదములు శాస్త్రములు ఉద్భవిస్తాయి.

**దివ్యరూప దర్శనము :** కుండలినీశక్తి సాధకునకు క్రియారూపములో ప్రకటితమవగానే అతడికి అన్నమయ, ప్రాణమయ, మనోమయ సహిత పంచకోశములలో భగవానుని యొక్క జ్యోతిర్మయ తేజము నిశ్చయముగా అనుభవములోనికి వస్తుంది. ధ్యాన సమయములో సాధకుడు అంధకారమయమయిన అంతరాకాశములో జ్యోతి స్వరూపమైన ఈశ్వరుని దర్శిస్తాడు. ఆ జ్యోతి స్వరూపము, ఎఱుపు, పసుపు, నలుపు, ఇంద్రధనుస్సులోని రంగుల మాదిరి అనేక విధములైన రంగులను కలిగి వుంటుంది. ఆ జ్యోతి భ్రూమధ్యములో అనగా లలాట ప్రదేశములో ఉదయించే సూర్యుని మాదిరిగా కనిపిస్తుంది. అప్రయత్నముగా లభించే ఈ దర్శనమునే దివ్యదర్శన మంటారు.

ఈ విధముగా కుండలినీ ప్రేరణతో క్రియలు చేసే సాధకులు శరీర, మనః ప్రాణముతో ఉత్తమ సాధన చేసినపుడు మనస్సు నిర్బంధమునకులోనై విషయవతిగా ప్రవృత్తి పరముగా వుంటుంది. అప్పుడు సాధకుల చిత్త స్థిరత కొరకు అంతరములో

దివ్యవస్తువు లేక దివ్య జ్యోతి స్వయముగా ప్రకటితమవుతుంది. ఈ జ్యోతిని సందర్శించిన మనస్సు అందులోనే లగ్నమవుతుంది. సాధకుడు శోక రహితుడు అవుతాడు. ప్రకాశవంతమైన జ్యోతిదర్శనము లభించిన తరువాత సాధకుని చిత్తము అందులోనే మహాసుఖ అనుభవమును పొందుతుంది.

ఈ జ్యోతి దర్శనము అనేక విధములుగా కలుగవచ్చు. విద్యుత్‌కాంతి సదృశముగా, మెరుపుల ప్రకాశముగా, నక్షత్ర దర్శనముగా, చంద్ర, సూర్య, అగ్ని సదృశముగా, వెలుగు మాదిరిగా, కోటి సూర్యప్రకాశముతో అనుగ్రహ సూచకముగా కలుగుతుంది. ఆజ్యోతియొక్క రంగులు కూడా అనేక విధములుగా వుండవచ్చును. ఇవికాకుండా వెలుగుతున్న అగ్నిశిఖమాదిరిగా బిందు సదృశముగా, స్ఫటికమణివలె అనేక రూపములలో కనిపించును. అప్పుడప్పుడు నక్షత్రములతో నిండిన ఆకాశముగా, నీలాకాశముగా, పొగ ఆవరించినట్లుగాను, బిందు తుంపరలతోను, అంధకారముగా, మహాఘోర అంధకారముగాను దర్శనమవుతుంది. సాధనచేస్తున్న సాధకుల మనస్సు ఎంత సూక్ష్మగ్రాహి అవుతుందో అంతగా సూక్ష్మాతి సూక్ష్మదర్శనములు కలుగుతాయి.

జ్ఞాన యోగ భక్తి మార్గములలో తపస్సు చేస్తున్నప్పుడు కుండలినీ శక్తి జాగృతమయి లేక ఈశ్వరుని యందు మనస్సు లగ్నమయి చిత్తము శుద్ధమయినప్పుడుగాని సాధకుడు కోరకుండానే పైన ఉదహరించిన ఫలితములేగాక సిద్ధ పురుషుల దర్శనము, తన గురుదేవుల దర్శనము, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల దర్శనము లేక ఇష్టదేవతా దర్శనము, గంధర్వ, అప్సరసల, విద్యాధరుల, నాగ, యక్ష, కిన్నెరాదులతో కూడిన దేవతల దర్శనము కలుగుతుంది. యోగ, జ్ఞాన, పరాయణులైన సాత్విక సాధకులకు తరచుగా సన్యాసి, బ్రహ్మచారి, శివలింగము లేక ఇతర దేవతలయొక్క ప్రతిమా దర్శనము, ధ్యాన సమయములో అమనస్క స్థితిలోగాని జాగృతిలో లేక స్వప్నములో కలుగుతుంది. ప్రత్యేకించి సాకార ఉపాసన చేసే భక్తి పరాయణులైన సాధకులకు ఈ దర్శనములు అధికముగా కలుగుతాయి. ఏ సాధకుడు కార్యసిద్ధి కొరకు దేవతల చైతన్యమంత్రములను జప, తపములతో లేక గురు ప్రదత్త మంత్రములతో సాధనచేస్తాడో అతడి కోర్కెల సిద్ధి సూచకముగా పైవిధములయిన దర్శనముల పాటుగా ఈ క్రింది ఉదహరించిన దర్శనములు కలుగుతాయి. అవి బాలుడు, కుమారీ కన్యామణులు, గొడుగు, రథము, దీపము, గుర్రము, ప్రసాదము, దేవమందిరము, రాజగృహము, పద్మము, నది, ఏనుగు,



వృషభము, సముద్రము, పండ్లతో కూడిన వృక్షము, పర్వతము, జ్వలించే అగ్ని, పచ్చిమాంసము, గ్రహములు, నక్షత్రములు, చంద్ర, సూర్యులు, రత్నములు, అలంకారములు, సింహాసనము, ఆకాశములో పయనించు విమానము, ధ్వజము, రాజ్యాభిషేకము, తెల్లని చందనము, శుభ్రవస్త్రములు, ధాన్యము, కుంకుమ, తేనె, తెల్లనువ్వులు, రాజు, అనేక మంది స్త్రీల వంటి మంగళకరమైన వస్తువులు సాధకుల స్వప్నములో లేక ధ్యానసమయములో స్వప్న స్థితివంటి స్థితిలో కనిపించినప్పుడు అతడికి మంత్రసిద్ధి అతిశీఘ్రముగా కలుగుతుంది.

ఇవి కాకుండా క్రొత్త పాత్రలు, పాయసము, ఫలములు, సిద్ధాన్నము, పెరుగు, పాలు, వాద్యయంత్రములు, సుందరమైన స్త్రీలు, బ్రాహ్మణుడు, గోవులు, హంస, పావురము, నీలకంఠముతో నెమలి, ముంగీస, మృగము, కప్ప, పుష్పము, సత్‌వాక్యము, అంజనము, జలముతో నిండిన కలశము, దర్పణము, మద్యము చెరకుగడ, వేదధ్వని, గజ అశ్వాదివాహనములు, మంగళ గీతములు, సైనికుడు తన ప్రియజనుల దర్శనము, సూర్యోదయము, చంద్రగ్రహణము, సూర్యగ్రహణము వంటివి స్వప్నములో చూచినప్పుడుగాని లేక పెద్ద పెద్ద ఇండ్లు, శ్రీమంతుల గృహములు, రాజమహలునకు లేక దేవమందిరములకు వెళుతున్నట్లుగా, ఏనుగు నెక్కినట్లుగా, గుర్రమునెక్కినట్లుగా, ఎద్దునెక్కినట్లుగా, పర్వతము నెక్కునట్లుగా, అగ్నిలో ప్రవేశించినట్లుగా స్వప్నములలో కనిపించినప్పుడు కామ్యసిద్ధి జరుగునని శాస్త్రములలో ఉల్లేఖించి యున్నారు.

ఇవి కాకుండా భయానకములైన స్వప్నములు అనగా అనేకమంది స్త్రీలతో భోజనములు చేసినట్లుగా, వండిన మాంసము భుజించినట్లుగా శరీరమునకు క్రిములు పట్టినట్లుగా చూచినను, మలమును లేపనము పూసుకొన్నట్లుగాను, రక్తముతో, స్నానము చేసినట్లుగాను రక్తపానము చేసినట్లుగాను, మద్యపానము చేసినట్లుగా పచ్చిమాంసము తిన్నట్లుగా వచ్చిన మంత్ర సిద్ధి జరుగబోతున్నట్లుగా భావించవలెను. ఈ విధముగా నిష్కామముగా లేక కోర్కెలతో కుండలినీ జాగరణ మాధ్యమముగా క్రియలను చేసే సాధకులకు సాధారణముగా స్వప్నములో దేవతా ప్రతిమల దర్శనము దేవతల ఉత్సవములు, సంకీర్తనములు, శంఖ, ఘంటా వాద్యములు, ఉత్తమ, కథాశ్రవణము అతి రమణీయ దివ్యప్రదేశముల దర్శనము కలుగుతుంది. సాధకుడు తననుతాను ఆకాశములో ఎగురుతూ శూన్యములో ప్రయాణిస్తున్నట్లుగా స్వప్నములో చూచినట్లయితే శుభము కలిగి సిద్ధి కలుగుతుంది. ఎందుకంటే కుండలినీశక్తి

జాగరణతో సాధకుని అంతరములోని ద్వారములు తెరువబడుతాయి. అందువలన మనస్సు అంతర జగత్తులోనికి వెళ్ళినప్పుడు నడుస్తున్నట్లుగాను, తిరుగుతున్నట్లుగాను కూర్చొనట్లుగాను, క్రియలను చేస్తూ నిద్రించినప్పుడు తమతమ సంస్కారానుగుణముగా, విశేషముగా శ్రద్ధాభక్తులు గల సాధకులకు సాధారణముగా పైదర్శనములు కలుగుతాయి.

**దివ్యశబ్ద నాదోత్పత్తి :** అంతరములో జ్యోతిరూప ఆత్మప్రకాశమునకు ముందుగాని, తరువాతగాని సాధకునికి అనేక విధములైన నాదములు విన్పిస్తాయి. ఈనాద ధ్వనులు వ్యక్తము లేక అవ్యక్తము అను రెండు విధములుగా వుంటాయి. బాహ్యముగా ఉన్న ధ్వనులతో పోల్చిచెప్పగల నాదమును అవ్యక్త నాదము అని అందురు. ఘంటానాదము వంటి స్పష్టముగా వినుపించు ధ్వనులని వ్యక్తనాదములుగా చెప్పవబడినవి. ఈ శబ్దము వర్ణాత్మకముగా, ధ్వన్యాత్మక రూపములో అనేక విధములుగా వుండును. తాడనము లేకుండా, ఉచ్చరింపకుండా అంతరములో స్వతః సిద్ధముగా కలిగే ధ్వనులను మంగళదాయకమైన శబ్దబ్రహ్మముగా చెపుతారు. అందువలన శబ్దబ్రహ్మమైన అనాహత నాదమును ఉపాసించే యోగులు నాదమును తొమ్మిది విధాలుగా వర్ణించారు. కాని యోగ శాస్త్రములో నాదములు అసంఖ్యాకములుగా చెప్పియున్నారు. కాని యోగసాధనచేసే సాధకులు వీటిని సంఖ్యా రూపములో విని అనుభవిస్తారు.

యోగసాధనలో మనస్సు ఆకాశ తత్వములోనికి వెళ్ళినప్పుడు సూక్ష్మ ఆకాశము నుండి నాదము వెలువడుతుంది. ఆ సమయములో సాధకుడు అంతరములో సూక్ష్మశూన్య రూపమైన జ్యోతిదర్శనమును పొందుతాడు, అనగా శబ్దమును వింటాడు. బ్రహ్మరంధ్రములో ప్రాణవాయువు వెళ్ళినప్పుడు మేఘగర్జన లేక శంఖ నాదమువంటి శబ్దములను వింటాడు. అంతర ఆకాశములో ప్రాణము వెళ్ళినప్పుడు ఈ మహానాదముతోపాటు ఘంటాది వాద్యనాదములుకూడా మ్రోగుతాయి. ఈ శబ్దములు యోగసిద్ధికి సూచకములు. ఈ విధముగా ఉన్నప్పుడు యోగసిద్ధి అత్యంత సమీపములో ఉన్నదని సాధకుడు గమనించాలి.

**దివ్యనాదములలోని రకములు :** ఈ నాదములలో జలశబ్దమును పోలిన నాదములు, మేఘగర్జన వంటినాదములు, జలపాతధ్వనులవంటి నాదములు, బండి కదులుతున్నట్లు శబ్దములు, మండుతున్న అగ్ని చేసే ధ్వనులవంటి శబ్దములు అనేకము



కలవు. భేరీ, కాహళ, దుందుభి, మృదంగ, శంఖ, ఘంటా, కింకిణీ, కాలి అందెలు, చేతాళములు, వీణా, వేణువు మొదలగు వాద్యయంత్రములను బోలిన శబ్దములు, వృషభ, మయూర, భ్రమర, మధుమక్షికా, పశుపక్ష్యాదుల ధ్వనులవంటి శబ్దములు, కీటకములు, మిడుతల వంటి శబ్దములు, స్త్రీల పాటలు లేక అసంఖ్యాకమైన జనులుచేసే కోలాహలముతో కూడిన ధ్వనులు వంటివి వినిపిస్తాయి. అప్పుడప్పుడు అవ్యక్త బ్రహ్మము అయిన ఓంకారధ్వని కూడా వినబడుతుంది. వీటిలో చిణ, చించిణీ, ఘంటా, శంఖ, వీణా, చేతాళ, వేణు, మృదంగ, భేరీ, మేఘగర్జన అను దశవిధ నాదములు ముఖ్యముగా చెప్పబడ్డాయి.

**దివ్యనాద శ్రవణ ఫలితము :** మొదటిగా చిణ నాదము కలుగగానే శరీరములోని చేతులు కాళ్ళలో తిమ్మిరి అనుభవమవుతుంది. చించిణీ నాదము కలుగగానే శరీరము విరుచుకు పడుతుంది. ఘంటానాదము వినగానే శరీరమునకు చెమటపడుతుంది. శంఖ నాదము విన్పించగానే శిరస్సు కంపిస్తుంది. తంత్రీనాదము విన్పించగానే అంగిలిలో అమృతము ప్రవిస్తుంది. చేతాళశబ్దము విన్పించగానే అమృత ఆస్వాదనము జరుగుతుంది. వేణువు శబ్దము వినగానే గూఢార్థ జ్ఞానమును గ్రహించ గలుగుతాడు. దానితోపాటు వాక్ సిద్ధి కలుగుతుంది. భేరీనాదము వినగానే శరీరము సౌందర్యవంతముగా మారి అదృశ్య సిద్ధి మరియు దివ్య దృష్టి కలుగుతుంది. మేఘనాదము వినిన సాధకుడు సమాధి స్థితిని పొంది బ్రహ్మైక్యమును పొంది బ్రహ్మమే అవుతాడు.

సాధకుడు పైనచెప్పిన తొమ్మిది విధములైన నాదములను వదలివేసి మేఘ సదృశమైన ఓంకారమును ఆశ్రయించాలి అనగా స్వతః సిద్ధముగా అనుభవములోనికి వచ్చిన ఓంకార నాదముపై మనస్సును లగ్నము చేయాలి. ఇతర నాదములపై లక్ష్యము నుంచవలసిన పనిలేదు. ఓంకారమునే నాదరూపములో ధ్యానించే యోగసాధకులు పాపపుణ్యములకు అతీతముగా వుండి మోక్షమును పొందగలరు. ఎందుకంటే అనేక కోట్లనాదములు, వందల కోట్ల బిందురూప జ్యోతి స్వరూపములన్నియు ఓంకారనాదములో లయమవుతాయి.

ఏకైక శబ్దబ్రహ్మ స్వరూపమైన ఓంకారమును ఆశ్రయించి యోగిజనులు అతిశీఘ్రముగా సత్యలోకమును పొందగలరు. ఇందులో సందేహములేదు. వైదిక కర్మలను ఆచరించే సనాతన ధర్మపరాయణులైన మహాత్ములు కూడా ఓంకారమును

ఆశ్రయించి దేవయాన మార్గములో మోక్షమును పొందగలరు. అందువలన పునరావృత్తి రహితమైన మోక్షధామము కోరుకొనే సాధకులు ఓంకారమును ఉపాసించి మోక్షమును పొందవలసి ఉంటుంది.

**దివ్యస్పర్శ జ్ఞానము :** అనంత జ్ఞానరాశికి నిలయమై యుండి మూలాధారములో నిద్రించు కుండలినీ శక్తి సాధకులను రక్షిస్తూ వుంటుంది. అందువలన మోక్షమును కాంక్షించే సాధకులు ప్రాణాయామము ద్వారా ఈ శక్తినే ఉపాసన చేస్తారు. ఆ కుండలినీశక్తి సాధకుల ప్రాణాయమముతో జాగృతమయి క్రియాశీల చైతన్యమును పొంది సిద్ధి నొసంగ గలదు. సాధకులకు ఆనంద స్వరూపమైన ఆత్మజ్ఞానమును ప్రసాదంచగలదు. ఎందుకంటే బ్రహ్మజ్ఞానము ద్వారానే మోక్షము లభిస్తుంది. అందువలన సాధకులు కుండలినీశక్తిని గురించి తెలుసుకొనవలసి వుంటుంది.

కుండలినీశక్తిని ఆశ్రయించితే ఆ జాగృతశక్తి అగ్ని, మనస్సు, ప్రాణములతో పాటు సుషుమ్నలో ప్రవేశించి పైకివెళుతుంది. సూది వస్త్రమును ఛేదించుతూ ముందుకు వెళ్ళినట్లుగా కుండలినీశక్తి మూలాధారము నుండి సుషుమ్నలో చక్రవేధ చేస్తూ బ్రహ్మరంధ్రములోనికి ప్రవేశించినపుడు, సాధకునికి శరీరములో ఆ శక్తి యొక్క స్పర్శానుభవము కలుగుతుంది. ఈ విధముగా కుండలినీశక్తి జాగృతమయి శరీరములో క్రియలను చేయుస్తూవున్నడు భ్రమరము కమలముపై మృదువుగా తిరుగాడు తున్నట్లుగా సాధకుని శరీరములో జ్ఞానప్రకాశమును, మృదువైన మహాసుఖకరమైన దివ్యస్పర్శను కలిగిస్తుంది. ఈ స్పర్శ ఆవశ్యకతానుసారము కోమలముగా వుండవచ్చును లేక కఠోరముగా నుండవచ్చును.

**దివ్యరసములు :** యోగసాధన చేసే సాధకులలో కుండలినీశక్తి ప్రేరణతోగాని లేక ప్రాణాయామ అభ్యాసముతో రేచక పూరక స్థితులను దాటిన తరువాత వచ్చు కేవల కుంభకము స్థితిద్వారా ప్రాణము స్థిరమయినప్పుడు నానా విధములైన నాదములు విన్పిస్తాయి. శిరస్సునున్న చంద్రమండల స్థానమునుండి సుధారసము స్రవించి, ఆత్మశక్తి ప్రేరణతో ఖేచరీక్రియ సంభవించి సాధకుని జిహ్వాపైకి వెళ్ళి తాలుమూలములో నిలిచి పోతుంది. అనగా పైకిలాగ బడుతుంది. ఆ సమయములో ఇంకను కంఠములో క్రియలు సంభవించి ఈ జిహ్వా, ఉపజిహ్వాలు గొంతులో ఇంకాపైకి లాగబడుతాయి. అప్పుడు అకస్మాత్తుగా సాధకుడు సుధారసమును పానము చేస్తాడు. ఈ జిహ్వా ఆంతరిక క్రియాశక్తి కారణముగా తాలువునందు నిలిచి యుంటుంది. అప్పుడు సహస్రారము నుండి చల్లని చంద్రామృతము కురుస్తుంది. దానిని పానముచేసిన సాధకుడు నఖ శిఖపర్యంతము కొద్ది సమయము వరకు



చేష్టలుడిగి ఆశ్చర్య మగ్నుడవుతాడు. దీనిని నిత్యము అభ్యసించి సుధారసమును పానముచేసినపుడు సాధకుడు నిశ్చయముగా అమరత్వ లాభమును పొందగలడు.

**దివ్యరసములోని రకములు :** ఈ విధముగా ఖేచరీముద్ర ద్వారా జిహ్వాతో అమృతపానము జరుగుతుంది. ఈ రసముయొక్క రుచి ప్రథమముగా ఉప్పగాను, క్షారయుక్తముగా, పులుపుగా, ఘాటుగాను వుంటుంది. తరువాత స్థితులలో వెన్న, నేయి, పాలు, పెరుగు, మజ్జిగ మాదిరి రుచులను పోలివుంటుంది. చివరగా తేనె, ద్రాక్షరసము మాదిరి అమృత సమానముగా వుంటుంది. యోగసాధన చేస్తున్నప్పుడు సాధకుని మనస్సు ఆజ్ఞాచక్రములో లయమయినప్పుడు జిహ్వామూలములో భ్రుకుటిలో ఆత్మదర్శనమయినప్పుడు జిహ్వామూలములో అమృతము స్రవించి సాధకుడు రసపానము చేస్తాడు.

**దివ్యరసము యొక్క గుణములు :** లవణాది క్షారరసపానము వలన సమస్త రోగములు నశిస్తాయి. ఘాటుగా నున్న రసపానముతో కుష్ఠ రోగము కూడా నశిస్తుంది. పుల్లని రసపానమువల్ల చర్మము మెరుపును సంతరించుకొంటుంది. కేశముల నెరుపు ఆగిపోతుంది. మధుర రసపానముతో శాస్త్రజ్ఞానము తెలియబడుతుంది. ఘృతరసపానముతో అమరత్వము, మోక్షము సిద్ధిస్తుంది.

**దివ్యగంధము :** పైన చెప్పిన విధముగానే సాధకునికి సాధనలో దివ్య గంధము అనుభవమవుతుంది. ఈ దివ్యగంధ స్థానము భ్రూమధ్యము నుండి నాసాగ్రము వరకు వుంటుంది. ఈ దివ్యగంధములో మనస్సు లీనమయితే నిస్సందేహముగా మనస్సు స్తంభించిపోయి బంధింపబడుతుంది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అను ఐదు విషయములతో ఈ ప్రపంచములో మనస్సు బంధింపబడి వుంటుంది. వీటిపట్ల ఆసక్తి కలిగితే మానవుడు సర్వనాశనమవుతాడు. ఎందుకంటే ఈ అయిదు విషయములు మనస్సును బాహ్యముగా బంధించి వుండటం వల్ల దుఃఖ కారక మవుతాయి. ఈ విషయమును అన్ని శాస్త్రములు చెపుతున్నాయి. కాని ఈ అయిదు విషయములు యోగసాధన ద్వారా అంతరములో అనుభవమయినప్పుడు మనస్సు పతనము చెందకుండా ఊర్ధ్వగామి అవుతుంది. అందువలన శాస్త్రములు చెప్పిన వాస్తవ జ్ఞానమును తెలుసుకొనకుండా అజ్ఞానులైన మనుష్యులు విషయ సుఖములను అనుభవించుట కూడా దుఃఖకారకమవుతుంది. కాని ఈశ్వర పరాయణులైన బుద్ధిమంతులైన సాధకులు అనుభవించే విషయ భోగములు అన్ని స్థితులందు కూడా సుఖకరముగా వుంటాయి.

# సిద్ధమహాయోగము

## పదమూడవ ప్రకరణము

### బ్రహ్మము యొక్క మూడు శరీరాలు

**యోగశిఖోపనిషత్** : అయిదవ అధ్యాయములో పరమేశ్వరుడు నాడీ చక్రములను వర్ణించుతూ మూడు శరీరాలు అనగా బ్రహ్మముయొక్క జ్యోతిస్వరూప స్థూల, సూక్ష్మ కారణ, శరీరాలను వర్ణన చేసాడు. అవి బ్రహ్మముయొక్క జీవరూప స్థూల శరీరము, జ్యోతిరూప బిందు శరీరము, తెల్లని అనగా శుద్ధమైన దేదీప్యమానమైన జ్యోతి శరీరము అయివున్నవి. వీటినే యోగసాధన చేసే సాధకులు ధ్యాత, ధ్యాన, ధ్యేయరూపములలో తమ అంతరములో ప్రత్యక్షముగా చూస్తారు. రెండవది అయిన బ్రహ్మముయొక్క సూక్ష్మశరీరము పంచాగ్ని స్వరూపముగా చెప్పబడుతుంది. అవి స్థూలరూపములో కాలాగ్ని, బడబాగ్ని, పార్థివాగ్ని మెరుపులలో మరియు సూర్య, చంద్ర, నక్షత్రములలో భౌతికముగా బ్రహ్మాండములో వ్యాపించిన అగ్నులు గాను, సూక్ష్మరూపముతో అంతర్జగత్తు నందు పిండ బ్రహ్మాండములో వ్యాపించిన అగ్నిగాను చెప్పబడుతాయి. భూగోళమునకు దిగువగానున్న పాతాళలోకములో ఉన్న అగ్ని కాలాగ్నిగా చెప్పబడుతుంది. అదియే సూక్ష్మరూపములో శరీరములో మూలాధార చక్రములోగల కుండలినీ శక్తిగా నుండి అగ్నియొక్క తేజః పుంజ రూపముగా నున్న మూలాగ్నిగా చెప్పబడుతుంది. అక్కడ నుంచే నాదము ఉత్పన్నమవుతుంది. సముద్రములో, జలములో వున్న అగ్నిని బడబాగ్ని అందురు. అది శరీరములో ఎముకలందు నివాసముంటుంది. దానినుండి శుక్రము, ఎముకలలో నుండు మజ్జ మొదలగునవి ఏర్పడుతాయి. కట్టెలు, పాషాణములు మొదలైన వాటియందు నివాసముండే అగ్నిని దావానల పార్థివ అగ్నిగా చెప్పబడింది. ఇది శరీరములో కఠిన పదార్థములైన ఎముకలు, దంతములలో నివాసముండుటచే శరీరము దృఢముగా బలముగా నుండి మనము తిన్న ఆహారము తేలికగా జీర్ణమవుతుంది. నాలుగది అయిన మెరుపుల రూపములో నుండు అగ్ని అంతరిక్షములో మేఘములలో ఉంటుంది. అది శరీరములోని హృదయాకాశములో ఆత్మరూపమున నిలిచి వుండి, ధ్యానములో మెరుపుల మాదిరి దృష్టి గోచరమవుతుంది. అయిదవది ఆకాశములో సూర్యాగ్నిగా చెప్పబడుతుంది. ఇది శరీరములో నాభి స్థానములో ఉండి శారీరక



క్రియలను నడుపుతూ ఉంటుంది. ఇదియే పరబ్రహ్మము యొక్క వ్యాపక రూపమైన మహావిష్ణు రూపముగా సూక్ష్మశరీరములో భ్రూమధ్యమందు శుద్ధస్ఫటిక రూపములో నీలజ్యోతిర్మయ రూపముగా ధ్యానింపబడుతుంది. మూడవది బ్రహ్మముయొక్క పరారూపమైన కారణ శరీరము ఇది సోమాత్మకము. ఇది సహస్రారములో నుండి చంద్రామృతముతో పరిపూర్ణముగా నున్న నిత్య తృప్త, సదానిర్వికార, సాక్షీభూత పరబ్రహ్మము యొక్క జ్యోతీ స్వరూపము అయివున్నది. ఈ రూపమునే యోగిగణములు సమాధి స్థితిలో ధ్యాత, ధ్యాన, ధ్యేయాకారముగా దర్శిస్తారు.

అనగా బ్రహ్మముయొక్క స్థూలశరీరము జ్యోతిర్మయ, శుక్రాత్మక శుభ్రబిందు, శుక్ల రూపధారణతో ఉత్పన్నమయినది. ఇది బుద్ధితో ధ్యాత, ధ్యాన, ధ్యేయ రూప త్రిపుటి సహితముగా చూడబడుతుంది. బ్రహ్మము యొక్క సూక్ష్మశరీరము అనగా పంచాగ్ని రూపములో నున్న జ్యోతిర్మయ నీలబిందు రూపములోనున్న మహావిష్ణువు స్వరూపము ధారణలో పరిపక్వత లభించగానే ధ్యానముద్వారా ధ్యాన మరియు ధ్యేయ రూపముగా కనపడుతుంది. బ్రహ్మముయొక్క పరారూప కారణ శరీరము మరియు సోమాత్మక సచ్చిదానంద రూపము ధ్యానపరిపక్వత లభించగానే సమాధిస్థితిలో ధ్యేయాకారముగా అనుభవగమ్యమవుతుంది.

యోగ, జప, తప, పూజా, భక్తి, శ్రద్ధలతో సత్కర్మానుష్ఠానము చేసే సాధకులకు తమ అంతరములో బ్రహ్మముయొక్క జ్యోతిర్మయ, స్థూల, సూక్ష్మ రూపములు స్వతః సిద్ధముగా కనిపిస్తాయి. వాటినే శాస్త్రములలో కొందరు శివునిగా, కొందరు విష్ణువుగా మరికొందరు శక్తిగా, ఇంకొందరు ఆత్మగా, మరికొందరు పరమాత్మగా ఇంకొందరు 'ఓం'కారముగా మరియు పరబ్రహ్మ పరతత్వముగా కొందరు కుండలినీ మహాశక్తిగా, మరికొందరు తాము ఉపాసించే దేవీదేవతలుగా వివిధ రకాలుగా వర్ణిస్తారు. వీటిలో దేనిని సందేహించవలసిన పనిలేదు. ఎందుకంటే పరబ్రహ్మమైన శివుడే అన్నింటిలోను విరాజమానమై వున్నాడు. అందువలన ద్వైతభావన చేయుట అనుచితము. సమాధి స్థితిలోనే వాస్తవిక జ్ఞానము కలుగుతుంది. కాని సాధన చేసేవారికి సమాధి స్థితికి పూర్వము ధారణ మరియు ధ్యానమువలన పాపక్షయము జరిగి మనస్సుకు ఏకాగ్రత లభించి నాదబిందు, కళా, జ్యోతిరూపములలో బ్రహ్మముయొక్క దర్శనము అవశ్యము కలుగుతుంది.

**కళారూపబ్రహ్మజ్యోతి దర్శనము** : అగ్ని, సూర్య, చంద్ర, తటిల్లత (మెరుపు) అను నాలుగు బ్రహ్మము యొక్క జ్యోతి స్వరూపాంశములు అయివున్నవి. వీటినే

వేదములు బ్రహ్మముయొక్క జ్యోతి స్వరూప కిరణములుగా వర్ణించాయి. అందువలన యోగసాధన చేసే సాధకులు బ్రహ్మము యొక్క అంశరూప జ్యోతిస్వరూపములైన అగ్ని, సూర్య, చంద్ర, మెరుపులను జ్యోతిర్మయముగా అంతరములో దర్శిస్తారు. ఈ బాహ్య జ్యోతీదర్శనములు అన్నీ కూడా కల్పనలు ఏమీచేయకుండానే సాధకులకు అంతరములో ప్రకాశమాన మవుతాయి. ఈ స్వయం ప్రకాశమైన జ్యోతిదర్శనము అకస్మాత్తుగా కనపడుతుంది. సాధారణముగా ధ్యాన, భజనలు చేసే సాధకులకు కల్పన చేసిన తరువాత మాత్రమే దేవీ దేవతల మరియు జ్యోతిదర్శనమును పొందగలరు. కాని ఈ ఆత్మజ్యోతి ధారణ, ధ్యాన మరియు కల్పనలను ఏమీలేకుండా తనకు తాను దర్శమానమవుతుంది. ఈ విధముగా తనకు తానుగా కల్పనలు ఏమీ లేకుండా ధ్యానములో కనిపించే జ్యోతి, పరమాత్మలో నిలిచి వుంటుంది. అంటే తన శరీరములో తనకు తానుగా కనిపించే జ్యోతి ప్రకాశమును నిజముగా బ్రహ్మ స్వరూపముగా చెప్పవచ్చును. తపస్సు ద్వారా ఎవరి పాపరాశి దగ్ధమవుతుందో అటువంటి పుణ్యాత్ములైన మనుజులు మాత్రమే ఆ జ్యోతి స్వరూపమును దర్శించగలరు. కాని మాయతో కప్పబడిన పాపకర్మలు చేసే తపోహీనులైన మనుజులు ఈజ్యోతి స్వరూపమును దర్శించలేరు.

**బిందురూప బ్రహ్మ జ్యోతిదర్శనము :** శరీర అంతర్భాగములో అగ్ని, మెరుపు, సూర్య, చంద్ర మరియు శ్వేత స్ఫటిక సదృశముగా ప్రకాశించే బిందువు ఉన్నది. ఈ అయిదు జ్యోతులను బ్రహ్మముయొక్క సూక్ష్మరూపముగా శాస్త్రములలో చెప్పబడింది. యోగసాధన ద్వారా వీటి దర్శనము అంతరములో తప్పక కలుగుతుంది. అందువలన బిందురూప బ్రహ్మమును దర్శించి అందులోనే మనస్సును లగ్నము చేయాలి. దానినే ధ్యానము చేయాలి. ఇతరమైనవి చూడాలనే ఆకాంక్షను సాధకులు వదలి వేయవలసి వుంటుంది. జ్యోతీ స్వరూప బిందువునే సాధకులు ఇష్టదేవతగా భావనచేసి దర్శించాలి. ఎందుకంటే తనలోని బిందురూప బ్రహ్మమును సాధకుడు స్వయముగా దర్శించగలడు. అందువలన ఎటువంటి దేవీదేవతల యొక్క కల్పనను సాధకుడు చేయవలసిన పనిలేదు. భ్రూమధ్యముపైన సచ్చిదానందమయమైన తేజోరాశి ఉంది. దానినే పరబ్రహ్మమందురు. దానిని దర్శించి, సాధకుడు తద్రూపముగా మారుతాడు. ఆ కారణముగా సాధకుడు జన్మ, జరా, మృత్యుభయముల నుండి విముక్తిని పొందుతాడు. అందువలన దీనిని ఉపనిషత్తులలో తారకబ్రహ్మము లేక తారక యోగముగా ఉల్లేఖించబడినది.



**ఆత్మరూప బ్రహ్మజ్యోతిదర్శనము :** ఆత్మ అంతరములో జ్యోతిరూపముగా ప్రకాశిస్తూ వుంటుంది. దానిని తత్వజ్ఞులు లింగ దేహములతో కూడిన సూక్ష్మశరీర మంటారు. ఆత్మను ప్రత్యక్షముగా దర్శించినట్లయితే ముక్తి లభిస్తుంది. అంటే తమ అంతః కరణములో జ్యోతి స్వరూపమైన ఆత్మదర్శనము కానంతవరకు కోటిజన్మ లెత్తినా ముక్తి లభించదు. ధ్యానపరాయణులైన యోగిజనులు బాహ్యనేత్రములను మూసుకొని అంతః చక్షువులైన దివ్యనేత్రములతో ఆత్మను దర్శిస్తారు. సాధకుడు ఆ తేజస్సును క్షణమాత్రమైనా స్పష్టముగా నిర్మలముగా దర్శిస్తే అతడు సమస్త పాపములనుండి విముక్తి పొంది జ్ఞాన లాభముతో పరమగతి అయిన జ్ఞానలాభమును పొందగలడు.

పొగలేకుండా అగ్నివలె ప్రజ్వలించు ప్రకాశించు సూర్యునివలె, లేక మెరుపుల కాంతివలె సాధకుడు తన అంతరాకాశములో ఆత్మను దర్శిస్తాడు. ధ్యానించే వ్యక్తి తన అంతరములో నక్షత్రముల మాదిరి ప్రకాశించే జ్యోతిని దర్శిస్తాడు. అదే సమస్త ప్రాణులలో నుండెడి జీవాత్మ స్వరూపము. అది దీపశిఖ మాదిరి సర్వదా హృదయములో నిలిచి వుంటుంది. ఆత్మ శరీరములో ప్రజ్వలిత కాంతిగా ప్రకాశమాన మయినపుడు సాధకుని పాపకర్మలు అన్ని క్షయమయి జ్ఞానము ఉత్పన్నమవుతుంది.

ఈజ్యోతి స్వరూప అవ్యయమైన ఆత్మ హృదయకమలములో చలనములేని దీపశిఖ మాదిరి స్థిరముగా ఉండి, మణి మాదిరి తేజోవంతమై ప్రకాశిస్తుంది. దానిని ధ్యానించే యోగిజనులు తప్పక ముక్తిని పొందుతారు. ధ్యాన యుక్తులైన వారికి మాత్రమే ఆత్మ సర్వదా సూర్యచంద్రుల మాదిరి కనిపించును. కాని సత్వగుణము ఉత్పన్నము కానంత వరకు ఆత్మదర్శనము కలగదు. అందువలన సాధకులు సర్వదా సత్వగుణమును ఆశ్రయించి ఆత్మదర్శనమును పొందాలి.

ప్రకృతికి అతీతముగా నిర్గుణుడు, నిరాకారుడైన పరమాత్మను యోగిజనులు నిరాకార స్వరూపముగా సర్వదా ధ్యానించుతూ ఉంటారు. అందువలన సాధకులు కూడా భగవానుని సత్, చిత్, ఆనంద లక్షణములతో కూడిన తేజోమయ స్వరూపమును ధ్యానము చేయాలి.

**తొమ్మిది చక్రములలో విభిన్న రూపములలో బ్రహ్మజ్యోతి దర్శనము :** మూలాధారమను పేరుగల ప్రథమ చక్రమునందు ధ్యానము చేయుటచే ఆత్మ జ్యోతిర్మయ స్వరూప అగ్నిరూపముగా భాసిస్తుంది. మూలాధారముపైన ఉండే

స్వాధిష్ఠాన చక్రమునందు ధ్యానించటంచేత ఆత్మజ్యోతి మొలకెత్తుతున్న అంకురము మాదిరి ప్రకాశమానమవుతుంది. మూడవదిఅయిన మణిపూర లేక నాభి చక్రమును ధ్యానించుటచేత ఆజ్యోతి స్వరూపము మెరుపుల మాదిరి కనపడుతుంది. నాలుగవది అయిన అనాహత చక్రము లేక హృదయ చక్రమునందు ధ్యానించుటచేత ఆత్మస్వరూప జ్యోతిదర్శనము లింగాకృతిలో కలుగుతుంది. అయిదవది అయిన విశుద్ధ చక్రమందు ధ్యానించుట చేత ఆ జ్యోతీస్వరూపము సుషుమ్నలో ధవళకాంతితో ప్రకాశమానమవుతుంది. చిత్తము లయమయ్యే ఆరవస్థానము అయిన అంగిటిలో నుండి తాలుచక్రములో ధ్యానించటం చేత బ్రహ్మజ్యోతి శూన్యాకార స్థితిలో తనకు తానుగా అనుభవమవుతుంది. ఏడవచక్రమైన భూచక్రమందు ధ్యానించటంచేత, గాలిలేనిచోట వెలుగుతున్న దీప శిఖవలె అంగుష్ట ప్రమాణములో ప్రకాశమానమవుతుంది. ఎనిమిదవది అయిన ఆజ్ఞాచక్రములో ధ్యానించటం చేత ఆ జ్యోతీ స్వరూపము వస్తువులు మండుతున్నప్పుడు వెలువడే పొగతోకూడిన అగ్నిశిఖాకృతివలె ఊర్ధ్వగామిగా ప్రకాశమానమవుతుంది. తొమ్మిదవది అయిన ఆకాశ చక్రములో ధ్యానించటంచేత ఆత్మరూప జ్యోతి ఆకారము ఒక శస్త్రము మాదిరి ప్రకాశమానమవుతుంది. పైనచెప్పిన విధముగా ఆత్మజ్యోతి తొమ్మిది చక్రములలో వివిధ రూపములలో ధ్యాన గోచరమవుతుంది.

పై విధముగా తనకు తానుగా ధ్యాన స్థితిలో కనిపించే ప్రతి ఒక్కజ్యోతి దర్శనము వల్ల ఆనందము కలుగుతుంది. అందువలన ఆత్మ జ్యోతి స్వరూపములన్నీ ఒక్కటిగా భావించాలి. అనేక విధములుగా ఉన్న ఆత్మజ్యోతి స్వరూపములు అఖండ స్వరూపములయినప్పటికి ఉపాధి భేదముతో విభిన్న రూపములను ధారణచేస్తాయి. విద్యాశక్తి అయిన కుండలినీదేవి ప్రేరణతో అఖండజ్యోతీ స్వరూపమైన బ్రహ్మము నుండి వివిధములైన జ్యోతిప్రకాశ ఆకృతులు నిప్పు నుండి వెలువడే విస్ఫులింగాల మాదిరి వెలువడతాయి. అందువలన జ్యోతిస్వరూప ప్రత్యగాత్మ అను ఈ ధ్యేయ వస్తువు అచేతనము కాదు. అనగా ధ్యానముతో ఆత్మయొక్క ప్రత్యక్ష దర్శనమును పొందే సాధకులకు బాహ్యముగా కనిపించే సూర్య, చంద్ర, అగ్ని, మెరుపులు అంతరములో జ్యోతీదర్శనములుగా కనిపించినపుడు స్వప్నములో కూడా వాటిని అచేతనములుగా భావించకూడదు.

**అకార బ్రహ్మజ్యోతి దర్శనము :** పైన ఉదహరించిన జ్యోతులకు భిన్నముగా ఇంకనూ చేతనాత్మక ఆకారముగల జ్యోతిర్మయ దృశ్యములు యోగసాధన చేసే



యోగి పుంగవులు ధ్యానములో చూస్తారు. వారు చెప్పేదేమంటే, మర్రిచెట్టు బీజములు మాదిరి సూక్ష్మమైన చిన్నవైన దృశ్యములు మరియు ధాన్యము వాటిలోని బియ్యపు గింజల మాదిరి ఇంకను వాటికంటే సూక్ష్మమైన అంటే కేశములలో నూరవవంతుతో సమానమైన అతిసూక్ష్మ ప్రకాశవంతమైన రూపములను అంతరములో చూస్తారు. ఈ అంతరములోని జ్యోతిదర్శనములు ప్రకాశవంతమైన శుక్రగ్రహము మాదిరిగా జ్యోతిర్మయ స్వరూపులైన సూర్యునివలెగాని, చంద్రునివలెగాని పరమాణువంటి బ్రహ్మనాడి అయిన సుషుమ్న మధ్యలోగల అంతర ఆకాశములో అతిసూక్ష్మ ప్రదేశములో మహాజ్యోతిర్మయ రూపములుగా కనపడుతాయి.

ఈ విధములైన మహా ఆత్మజ్యోతి స్వరూపములు వటబీజముగా స్ఫటిక సదృశముగా, ముత్యముల మాదిరి ప్రకాశవంతముగా కన్పిస్తాయి. వీటిరంగులు కూడా నీలము, ఎరుపు, అప్పుడప్పుడు మెరుపులవలె శ్వేత వర్ణములో కూడా వుంటాయి. ఈ వివిధములైన అనేక రంగులతో కూడిన జ్యోతిస్వరూపములు కలిసిపోయి మహాస్వరూపమైన ఆత్మజ్యోతిగా దర్శనమిస్తాయి. ఎందుకంటే ఈ వివిధరంగులతో కూడిన జ్యోతిదర్శనములన్నీ కూడా ఆత్మజ్యోతివల్ల మాత్రమే ప్రకాశమానమవ్వుతాయి. అనగా ఏయోగిపుంగవులు యోగసాధనద్వారా తమ మనస్సును ప్రాణములను, ఇంద్రియములను జయిస్తారో అటువంటి వారి ధ్యానములో ఈ చిదాకార చైతన్య స్వరూపములైన జ్యోతి స్వరూపములు అనేక పర్యాయములు కనపడుతాయి.

**సాధన దశలలో జ్యోతిదర్శనములు :** కుండలినీశక్తి జాగరణవలన ఎవరి అంతరములో ఈ జ్యోతీరూపములు ప్రకటింపబడుతాయో వారికి యోగసాధనను ఆచరించే సమయములో కాకుండా నిత్యజీవితములో కర్మలను ఆచరించేటప్పుడు ఎక్కడ మనస్సునకు ఏకాగ్రత కుదురుతుందో అక్కడ ఈ అఖండ జ్యోతులు కనిపిస్తాయి. ఏ ఏ పదార్థముపైన సాధకుని దృష్టి పడుతుందో వాటిలో అదే క్షణము మెరుపుల మాదిరి చిన్మయజ్యోతి స్పష్టముగా కనిపిస్తుంది. ఆ జ్యోతియే పరబ్రహ్మము అయివున్నది. ఆ బ్రహ్మజ్యోతి పరమసుఖము నిచ్చునది మరియు శాంతి దాయకమైనది. ఈ ఆత్మజ్యోతియే పరమపదము అయివున్నది. ఏ సాధకుడు యోగసాధన ద్వారా తొమ్మిది చక్రములలో లేక ఏదో ఒకస్థానములో జ్యోతిరూప ప్రత్యగాత్మ దర్శనము చేసుకొంటాడో అతడు చివరకు బ్రహ్మలోకమును పొందుతాడు.

ఏ జనులు వేదాంతము, జ్ఞానమునకు అధికారులుగానుండి జ్ఞానలాభమును పొందవలెనను కొంటారో వారు సద్గురువు ద్వారా ఇంతకు ముందు చెప్పిన జ్యోతిరూప కూటస్థ ఆత్మయొక్క విషయమును విని యోగసాధన రూప తపస్సును ఆచరించి ధ్యానము మరియు శాంభవిముద్రతో తనలోని జ్యోతి స్వరూప ఆత్మను దర్శించి నట్లయితే చిత్తశుద్ధి జరుగుతున్నట్లుగా తలచాలి. అనగా ప్రత్యగాత్మను చిత్తశుద్ధి కొరకు ప్రత్యేకమైన చక్రస్థానములో దర్శించాలని నియమ మేదీలేదు. ఏదో ఒక చక్ర స్థానములో ధ్యానము ద్వారా జ్యోతిర్మయ ఆత్మను దర్శించినట్లయితే చిత్తశుద్ధి కలుగుతుంది. చిత్తశుద్ధి కలిగిన తరువాత గురువు చెప్పిన మహావాక్యముల జ్ఞానమును పొందే అధికారమును సాధకునికి కలిగి యోగసాధనద్వారా సమాధిస్థితిలో జ్ఞాన లాభమును పొందుతాడు.

ఈ విధముగా ఈశ్వరుని అనుగ్రహముతో గురుకృపారూపమైన శక్తి పాతమును పొందిన సాధకులకు శాస్త్రములలో పైన ఉదహరించిన ఆధ్యాత్మిక అనుభవములు కలుగుతాయి. వాటిని యధాతథముగా వర్ణించలేము. వాటి యొక్క అనుభవములను పొందుటయే జ్ఞానము అయివున్నది.

**శక్తిపాత విధానములు వాటి ఫలములు :** శ్రీ శంభుని ద్వారా పరంపరాను గతముగా ప్రాప్తించే శైవీశక్తి అయిన ఈ శక్తి పాతములో అతితీవ్ర, మధ్యమతీవ్ర, మందతీవ్ర, నికృష్ట తీవ్ర లేక మృదు, మధ్యమ తీవ్ర, తీవ్రతర, తీవ్రతమము అను అనేక భేదములున్నాయి. వీటి ఫలితము దేశ, కాల, పాత్రతాను సారముగా ఆలస్యముగా క్రమముగా వెంటనే గురుశిష్యుల యోగ్యతానుసారముగా కోరినా కోరకపోయినా సహజముగా సిద్ధిస్తుంది.

గురువుద్వారా తీవ్రశక్తి పాతము జరిగినప్పుడు అప్రయత్నముగా అకస్మాత్తుగా శిష్యునిలో ఈ క్రింది లక్షణములు కనిపిస్తాయి. ప్రథమముగా సాధకునికి శ్రీమహేశ్వరునిపైన దృఢభక్తి కలుగుతుంది. రెండవది అతనికి విశ్వాసము కలిగించు నట్లుగా వెంటనే మంత్రసిద్ధి కలుగుతుంది. మూడవ లక్షణము ప్రాణులన్నింటిని తన వశములోనికి తెచ్చుకొనే సామర్థ్యము ప్రాప్తిస్తుంది. నాలుగవది అతడి ప్రారబ్ధ కర్మసమాప్త మవుతుంది. అంటే అతడికి సుఖదుఃఖాలను సమానముగా పరిగణించి ఆనందముగా అనుభవించే సమర్థత వస్తుంది. అయివదవ లక్షణము సాధకునికి కవితలు రచించే యోగ్యత, శాస్త్ర విషయములను అర్థము చేసుకునే శక్తి వస్తుంది.



ఏ శక్తి ప్రభావముతో సాధకుడు దివ్యజ్ఞానమును పొంది మోక్షమును పొందగలడో ఆ శక్తిపాతము యొక్క వాస్తవిక జ్ఞానమును శ్రీమహేశ్వరులు మాత్రమే కలిగి ఉన్నారు. ఆయన ఎవరి పైన కృపచూపితే వారికి మాత్రమే కొంత తెలియబడుతుంది. కాని వాస్తవముగా పరమ దుర్లభమైన రుద్రశక్తి యొక్క సంపూర్ణ ప్రకాశము మానవాళియందు ఉన్నదో లేదో చెప్పలేము కాని శక్తిపాత గురువులైన శ్రీమన్నారాయణ తీర్థ గురుదేవుల పరమ కృపకారణముగా ఈ విషయములో తెలుసుకున్న విజ్ఞానము యొక్క ఫలస్వరూపమే ఈ గ్రంథ రూపముగా వెలువడినది.

మానవుల పూర్వజన్మ సుకృతమువలన ఈ జన్మలో తత్వజ్ఞానము పొందే అధికారము ప్రాప్తిస్తుంది. అప్పుడు దైవీశక్తిని పొందే యోగ్యత ప్రాప్తిస్తుంది. తరువాత ఆత్మకు పరమ శాంతినిచ్చే, ముక్తి రూప ఫలమును అనుగ్రహించే శివశక్తితో సంబంధము గురువు ద్వారా కలుగుతుంది. ఆ సంబంధమువలన కొందరికి వెంటనే మోక్షప్రాప్తి కలుగుతుంది. కొందరికి అజ్ఞాన నివృత్తి కలిగి జ్ఞానము ప్రాప్తిస్తుంది. అంటే కొందరిలో శక్తిపాతము కాగానే పూర్ణజ్ఞానము కలుగుతుంది మరికొందరిలో జ్ఞానసిద్ధికొరకు మార్గము ప్రశస్తమవుతుంది. ఎప్పుడైతే యోగ, జ్ఞాన, ధ్యాన, జప, తప సాధనలు సాధకుడు చేస్తూ వుంటాడో అప్పుడు సాధకునిలో ఈ మంగళకర మహాశక్తి ఆవిర్భవిస్తుంది. అప్పుడు రుద్రశక్తి ప్రేరితుడైన జిజ్ఞాసువు మహేశ్వరుల ఇచ్ఛానుసారము మోక్షప్రాప్తి కొరకు దీక్షార్థిగా గురువు వద్దకు ప్రేరేపించబడతాడు. ఎందువల్లనంటే సాధకునికి భుక్తి ముక్తుల నివ్వగల మరియు శక్తిని సక్రమముగా ప్రసరింపజేయగల సామర్థ్యము గురువునకు మాత్రమే వున్నది. అందువలన భక్తితో గురువును ప్రసన్నులను చేసుకొని వారివద్దనుండి శాంకరీ దీక్షను పరిగ్రహించిన సాధకుడు క్షణకాలములో సమాధి ద్వారా అన్ని కర్మబంధములను త్రెంచుకొని మోక్షలాభమును పొంది జీవన్ముక్తుడవుతాడు. లేక భోగములను అనుభవించి దేహపతనము తరువాత శివపదమును ప్రాప్తించుకొంటాడు.

పైన చెప్పిన విధముగా శక్తిపాతములో అనేక భేదములున్నాయి. దీని ఫలితము శక్తివంతుడైన గురువుయొక్క యోగ్యతపై ఆధారపడివున్నది. ఎందుకంటే దివ్యజ్ఞానము మోక్షమును అనుగ్రహించగల శక్తి సామాన్యమైన వస్తువుకాదు. ఈ శక్తిని సక్రమముగా ఉపయోగించినట్లయితే అత్యంత కల్యాణకారి అవుతుంది. దీనిని అనుచిత కార్యములకు ఉపయోగించినట్లయితే గొప్ప అనర్థములు కలుగుతాయి. గురుపరంపర ద్వారా లభించిన సిద్ధశక్తిని సక్రమముగా ఉపయోగించకపోయినట్లయితే ఆ శక్తి,

గురుశిష్యులిద్దరికి అమంగళము కలుగజేస్తుంది. అందువలన శక్తిపాతము యొక్క రహస్య విజ్ఞానము తెలియని గురువుద్వారా లేక శక్తిపాతము అనుగ్రహించ గల సమర్థత వుండి నిగ్రహసామర్థ్యములేని గురువుద్వారా మరియు శక్తిపాతములోని తారతమ్యములు అనగా తీవ్ర, తీవ్రతర, తీవ్రతను, ఉత్కృష్ట, అధమము వంటి భేదములు తెలియని గురువుద్వారా మరియు తన గురుపరంపర క్రమమును వదలిపెట్టి వేరొక విధముగా మార్పుచేసి ప్రతి ఒక్క శిష్యునికి తన ఇష్టము వచ్చిన విధముగా నికృష్ట పద్ధతిలో శక్తిపాతము చేసిన గురువుద్వారా పొందిన శక్తిపాతము వలన సాధకునికి ఇష్టప్రాప్తి కలుగక పోగా అరిష్టము కలుగుతుంది. ఎందుకంటే ఏ గురువు శివశక్తిని సామాన్యముగా తలచి తన ఇష్టానుసారముగా ప్రవర్తిస్తాడో అటువంటి గురువు నుండి ప్రాప్తించిన శక్తివలన శిష్యునికి జ్ఞానసిద్ధి కలుగదు.

**యోగసాధనను గుప్తముగా ఉంచవలెను :** నిశ్చల మనస్సుతో స్థిరచిత్తముతో చేసిన తపస్సు వలన కాని భగవత్ భజనవలన కాని సాధకులకు దివ్యదర్శనములు కలుగుతాయి. వాటితోపాటే ఈశ్వరుని అనుగ్రహమువలన దివ్యశక్తి ప్రాప్తిస్తుంది. దివ్య దర్శనములు, సామర్థ్యసిద్ధి లక్షణముగా చెప్పవచ్చును. ఇవి కలుగకపోతే గురుకృప మరియు ఈశ్వరుని గొప్పతనమునకు విలువేమున్నది? చేసిన తపస్సుకు ఫలితము లేకుంటే తపస్సు ఎందుకు చేస్తారు? కాని విషయము అదికాదు, భగవంతుడు పరమకృపాళువు. సాధకుల యొక్క సాధనాఫలము వ్యర్థముగా పోదు. సాధకుడు కోరినా కోరకపోయినా ఈశ్వరుడు అతడి యోగ్యతానుసారముగా ఫలితములను ఇస్తాడు. అందువలన ఈ విషయములో ఆశ్చర్య పడవలసిన పనిలేదు. తపస్సు మరియు యోగసాధన ద్వారా సాధకులలో స్వాభావికముగా దివ్యశక్తియొక్క లక్షణములు ప్రాప్తిస్తాయి. ఇందులో కించిత్తు కూడా సందేహములేదు.

సామర్థ్యముగల గురువులద్వారా దీక్షితులైన శిష్యులకు గురు కృపద్వారా యోగ ఆరంభస్థితి నుండి అనేకవిధములైన ఆంతరిక దివ్యదర్శనము కలుగుతాయి, వాటివల్ల మానసిక శక్తి ఉత్పన్నమవుతుంది. కాని విస్మితులయిన అనేకమంది సాధకులు కుతూహలముతో తమ అనుభవములను భిన్నప్రకృతిగల ఇతరులతో చర్చిస్తారు. ఇంకొంత ముందుకు వెళ్ళి తమ గొప్పతనము చాటుకోవటానికి తమపేరుతో వార్తాపత్రికలలో ముద్రణను కూడా చేస్తారు. తత్ఫలితంగా అతడి విజ్ఞానము నశించి మనస్సు ముందుకు పోలేదు. మరల అటువంటి అనుభవములు అతడికి కలుగవు. అందువలన తపస్సు మరియు యోగసాధన చేసెడి సాధకులు యోగసాధ



ద్వారా లభించిన దివ్యదర్శనములు ప్రాప్తించినపుడు లేక ఈశ్వరుని అనుగ్రహముతో ప్రాపంచిక వ్యవహారములలో తన సంకల్పానుసారము కార్యసిద్ధి జరిగినపుడు ఆశ్చర్యచకితులు కాకుండా శాంత చిత్తముతో వాటిని తనమనస్సులోనే నిలుపుకోవాలి. నిశ్చల మనస్సుతో యోగసాధన చేసినట్లయితే నిశ్చయముగా మోక్షప్రాప్తి కలుగుతుంది. కాని దీనిని అపక్వస్థితిలో బయటకు చెప్పినందువల్ల సాధకునకు హాని కలుగుతుంది. యోగసాధన ద్వారా ప్రాప్తించిన సిద్ధులను ప్రలోభములో పడి ఇతరులకు చెప్పకూడదు. యోగము ద్వారా అత్యున్నతమైన మోక్షము ప్రాప్తించేటప్పుడు భోగములు కలుగకుండా ఎందుకు వుంటాయి? కాని వాటిని బయటకు చెప్పినపుడు మోక్షము లభించదు. భోగము మిగిలిపోతుంది. అందువలన సమాధి ద్వారా దివ్య ఆత్మజ్ఞానము లభించనంత వరకు ప్రాణము పోయినా దివ్యదర్శనములను గురించి బయటకు చెప్పకూడదు. దుర్బుద్ధితో భోగములందు ఆసక్తితో వాటిని జనులముందు ప్రదర్శించి నేర్పించటానికి ప్రయత్నిస్తే సాధకుని సాధన నాశనమవుతుంది. అందువలన ఎప్పటివరకు అభీష్ట సిద్ధి కలుగదో, లేక గురువు ప్రసన్నులై అనుమతించేవరకు సాధకుడు తన యోగసాధనను ఎవరి ముందు ప్రదర్శించకూడదు. లేదా ఇతరులకు నేర్పకూడదు.

కాని ఎవరైతే గురువువద్ద నుండి దీక్షాగ్రహణము చేసి గురువు ఆజ్ఞ లేకుండా ఇతరులలో శక్తి సంచారము చేసి గురుపదమును అధిష్ఠించుతారో వారు విష సర్పముతో ఆటలాడుటవలన కలిగే ఫలితమును పొందుతారు. ఎందుకంటే ఈ శివశక్తి పరంపరాగత నియమములను పాటింపక స్వేచ్ఛగా ప్రదానము చేసేవారికి, తీసుకొన్నవారికి అనర్థమును కలుగజేస్తుంది.

**యోగ సాధనా రహస్యములను వెలువరించకూడదు :** గురు ప్రదత్తమైన శాస్త్ర విహితమైన యోగసాధన చేసే సాధకుడు ఆద్యంతము యోగసాధనా రహస్యములను గుప్తముగా ఉంచాలి. ఎవరికి చెప్పకూడదు. చెప్పినట్లయితే సాధన నుండి దిగజారిపోతాడు. అందువలన ఆరంభ కాలములో ఏదర్శనాది అనుభవములు కలుగుతాయో వాటిని ఇతరులకు తెలియజేసినా లేక ఇతరులకు మంత్రోపదేశము చేసినా సాధకుని ఆత్మసామర్థ్యము లేక గురుకృపయొక్క ఫలము నశిస్తుంది. అందువలన వివిధములైన వ్యాధులు కలిగి ఆయుక్షీణము కలుగుతుంది మరియు సాధకుడు సాధనను కూడా నష్టపోతాడు. అందువలన ఏదైనా విశేష ప్రయోజనము లేకుండా యోగరహస్యములను యథాతథముగా వెల్లడించకూడదు. కాని ఏ సాధకుడు

దుష్టబుద్ధితో లోభ, మోహ, ధన, కీర్తి, ప్రతిష్ఠ పొందే ఉద్దేశ్యముతో లేక మోహవశుడై గర్వముతో తాను గొప్పయోగినని, తనను ఎవరూ ఏమీ చేయలేరని భావించి నేనెందుకు గురువును కాకూడదు అని తలచి లేక గురుజనులను అకారణముగా ద్వేషించి, యోగసాధనను తిరస్కార దృష్టితో చూచి గాని యోగరహస్యములను వెలువరించినపుడు అతడు పూర్తికాలము జీవించక ఆయుధముల ద్వారాగాని లేక విషప్రయోగముద్వారాకాని అకాల మృత్యువును పొందుతాడు.

అందువలన సాధకులు తన యోగసాధనను దానిద్వారా ప్రాప్తించిన సామర్థ్యమును ఎవరికి తెలుపకూడదు. మహాయోగులుకూడా ఆత్మజ్ఞాన మహాసిద్ధి మినహా మిగిలిన అన్యయోగ ఐశ్వర్యములన్ని విఘ్నములని గుర్తుంచుకోవాలి. అందువలన సాధకయోగి వీటియందు ఆసక్తి చూపక తన సామర్థ్యమును గుప్తముగా ఉంచుకోవాలి. సామర్థ్యమును గుప్తముగా నుంచుటకు ప్రపంచ జనులతో వ్యవహరించేటప్పుడు మూఢునిగా మూర్ఖునిగా, ఏమీ వినపడని చెవిటివానిలా వ్యవహరించాలి. సామర్థ్యము చూపినట్లయితే జనులు తమను శిష్యునిగా స్వీకరించమని వెంటపడతారు. వారిపై కృపచూపినందువల్ల తన నిత్యయోగాభ్యాసము ఆగిపోతుంది. గురువాక్యమును ఉల్లంఘించినట్లవుతుంది. మనస్సు కూడా మునుపటి స్థాయిలో వుండదు. అందువలన గురువు ఉపదేశించిన విధముగా అభ్యాసము చేయవలసి వుంటుంది. దీనివలన ఈ జన్మలోనే యోగము ద్వారా దివ్యబ్రహ్మజ్ఞానమును పొంది జీవన్ముక్తి దశ శీఘ్రముగా ప్రాప్తిస్తుంది. గుప్త అనుభవములను వెలువరించుట వలన మహా అనర్థము కలుగుతుంది. అందువలన మనుష్యులు తన వయస్సును నిల్వయున్న ధనమును, ఇంటి గుట్టుమట్లను, మంత్రములను, శృంగార విషయములను, ఔషధములను, తపస్సును, యోగసాధనను, దానధర్మములను, అవమానములను గుప్తముగా వుంచవలెననిశాస్త్రములు చెప్పుచున్నవి. వీటిని బయటపెడితే మహా అనర్థము కలుగుతుంది. లేక విఘ్నములు సంభవిస్తాయి.

**యోగసాధనలో అంతరాయములు :** వ్యాధి, అకర్మణ్యత, సంశయము, ఉదాశీనత, సోమరితనము అవిరతి (మనస్సు విషయములపై నిలిచి వుండుట), భ్రాంతిదర్శనము అలభ్య భూమికత్వము, అనవస్థిత్వము అను తొమ్మిది అంతరాయములను యోగశాస్త్రములో చిత్త విక్షేప కారణములుగాను, యోగ విఘ్నములుగాను చెప్పియున్నారు.



**1) వ్యాధి :** నియమబద్ధమై ఆహారమును గ్రహించక పోవుటవలన వాత, పిత్త, వ్యాధులు ప్రబలి రోగములు వచ్చుటచే యోగసాధనలో ఆటంకము కలుగును.

**2) స్త్యానము (అకర్మణ్యత) :** యోగము చేయవలెనను కోరిక వున్నా తమోగుణ కారణముచే యోగము చేయలేక పోవుటను స్త్యానము లేక అకర్మణ్యత అంటారు.

**3) సంశయము :** యోగము సిద్ధిస్తుందా లేదా లేక దాని ఫలితము సత్యమా లేక కల్పనా అని ఆలోచింపజేసి సాధకుని సర్వానాశనము చేసే మానసిక స్థితిని సంశయము అంటారు.

**4) నిర్లక్ష్యము లేక ఉదాశీనత :** సమాధి స్థితి కొరకు ప్రయత్నించక పోవటము, యోగసాధనపట్ల ఉదాశీనతగా ఉండటము నిర్లక్ష్య లక్షణములుగా చెప్పబడ్డాయి.

**5) సోమరితనము :** కఫాది దోషములతో శరీరము, తమోగుణముతో చిత్తము బరువెక్కి యోగసాధన చేయలేకపోవటాన్ని 'ఆలస్యము' లేక సోమరితనమని అంటారు.

**6) అవిరతి :** ధ్యానమునకు కూర్చొనగానే మనస్సు విషయ వ్యాపారములందు లగ్నమవుతుంది. విషయాసక్తి కారణముగా ధ్యానమును వదిలి వేయుటను అవిరతిగా చెప్పబడినది.

**7) భ్రాంతి దర్శనములు :** యోగసాధనలో విపర్య జ్ఞానమును భ్రాంతి దర్శనముగా చెప్పవచ్చును. సాధకుడు మనస్సులో ధారణచేసిన విషయములు సాధనా కాలములో భ్రాంతి దర్శనములుగా కనిపిస్తాయి.

**8) అలభ్య భూమికత్వము :** సమాధి స్థితి కొరకు అభ్యసించుతూ వున్నప్పుడు ఏదో ఒక కారణముచేత పొందవలసిన ప్రయోజనము పొందక పోయినపుడు దానిని అలభ్య భూమికత్వ మందురు. ఈ విఘ్నము వలన సాధకునికి ఆనందము లోపిస్తుంది.

**9) అనవస్థిత్వము :** మొట్టమొదట యోగములో ఉన్నత స్థితివున్నదిగాని ఇప్పుడు లేదు. అనే భావనను మనస్సునందు ఉత్పన్నము చేసి సాధకుని నిరుత్సాహపరచి సమాధిస్థితి కలుగనీయక పోవుటను అనవస్థిత్వము అందురు.

పైన పేర్కొనిన విఘ్నములు కాకుండా వీటికి సహకరించే దుఃఖము, దౌర్మనస్యము, అంగమేజయత్వము శ్వాస, ప్రశ్వాసలు వంటి విఘ్నములు కూడా కలవు.

దుఃఖము : ఇది అధిభౌతిక దుఃఖములవంటివిగా పిలవబడుతుంది.

దౌర్మనస్యము : కోరిక తీరనపుడు మనస్సునకు కలిగే బాధను దౌర్మనస్యము అంటారు.

అంగమేజయత్వము : సంకల్పము ఏమీ లేకుండా శరీరక కంపనములు కూడా యోగ విఘ్నముగా చెప్పబడినది.

శ్వాసప్రశ్వాసలు : ధ్యాన సమయములో అధికముగా శ్వాస ప్రశ్వాసలు నడచుటను కూడా యోగవిఘ్నముగా చెప్పబడినది. సాధకుడు వీటినుండి విముక్తి పొందుటకు ఏదో ఒక తత్వమును అభ్యసించాలి. యోగదర్శనములో దీనిని విపులీకరించి చెప్పారు.

**యోగ విఘ్నములకు నివారించుటకు చేయవలసిన సాధన :** భగవానులైన శ్రీకృష్ణులు చెప్పిన విధముగా యోగసాధనచేసే సాధకులలో యోగసిద్ధికి ముందు ఏవైనా శారీరక, మానసిక, ఆధ్యాత్మిక వ్యాధి రూప విఘ్నములు ఎదురైనట్లయితే, కొందరికి యోగధారణ ద్వారా, మరికొందరికి ఆసన ప్రాణాయామముల అభ్యాసము ద్వారా, ఇంకొందరికి జప, తప, మంత్ర, ఔషధముల ద్వారా శాంతింప జేయాలి. ఈ విధముగా కొందరికి ధ్యానము ద్వారా, ఇంకొందరికి నామసంకీర్తన ద్వారా మరికొందరికి మంగళకరులైన యోగీశ్వరుల ధ్యానము ద్వారా వ్యాధి రూప విఘ్నములను నెమ్మదిగా తొలగించాలి. ప్రమాదవశాత్తు లోకనింద కలుగజేసే పనులను సాధకుడు చేసినప్పుడు కూడా యోగసాధనద్వారా వాటిని నివృత్తి చేయాలి. వాటికి ఏరకమైన ఇతర ఉపాయములు లేవు. కొందరు యోగులు శరీరమును మంత్రపూరిత ఔషధముల ద్వారా దృఢపరచి అనేక విధములైన కాయకల్ప పద్ధతులను అనుష్ఠించి శరీరమును యవ్వనస్థితిలో నుంచి యోగసాధనను చేస్తారు. కాని వారు ఆ విధముగా చేయవలసిన పనిలేదు. ఇది వ్యర్థ ప్రయాస మాత్రమే. ఎందుకంటే చెట్టునకు పండిన ఫలము ఏదోఒక రోజు రాలిపోవలసినదే. ప్రతిదినము హఠయోగము చేసి కాయకల్ప పద్ధతులలో శరీరమును దృఢపరచుటకు సాధన చేయవలసి వుంటుంది. ఇది యోగసాధనకు విఘ్నముగా పరిణమిస్తుంది. అందువలన ఏ సాధకయోగి నిష్కాముడై యోగసాధనద్వారా నిత్యము భగవంతునిలో నిలిచి వుంటాడో అతడికి ఎటువంటి యోగ విఘ్నములు కలుగవు. ఒకవేళ వచ్చినా అతడిని బాధించవు.



**యోగసిద్ధి కొరకు ఉపాయములు :** యోగసాధన చేసే సాధకులకు భయము, క్రోధము మరియు సోమరితనము, ఎక్కువగా నిద్రించుట, ఎక్కువగా మేల్కొనుట, ఎక్కువగా భుజించుట మరియు ఉపవాసములు చేయుట నిషిద్ధము. ఎందుకంటే ఎక్కువగా ఆహారము, ఎక్కువగా శ్రమపడుట, వృధాగా మాట్లాడుట, ప్రతిజ్ఞచేసి నియమబద్ధుడగుట, యోగసాధన పట్ల విముఖత ఉన్న జనులతో సహవాసము చేయుట, చంచలత అనునవి యోగసాధనను నాశనము చేస్తాయి. అందువలన వాటిని వదలి వేయాలి. ఉత్సాహము, సాహసము, ధైర్యము, తత్వజ్ఞానము, శాస్త్రజ్ఞానము ద్వారా కల్యాణ కారక విషయములందు దృఢనిశ్చయము కలిగి వుండటం యోగ వ్యతిరేక జనులతో స్నేహ పరిత్యాగము అనే ఆరుగుణములు సాధకునికి సిద్ధిని కలుగజేస్తాయి. కనుక సాధకుడు వీటిని పాటించాలి. ఏ సాధకుడు పరిమిత ఆహారమును, నియమిత విహారములను చేస్తూ తగిన సమయములో నిద్రించి, మేల్కొంటాడో మరియు ఆవశ్యకతానుసారము కర్మలను అనిష్ఠించుతాడో అతడికి సర్వ దుఃఖములను నశింపచేసే యోగసిద్ధి కలుగుతుంది.

# సిద్ధమహాయోగము

## పదునాల్గవ ప్రకరణము

**షట్ చక్ర జ్ఞానము :** మన శరీరములోనున్న '6' చక్రములు, 16 ఆధార స్థానములు, 3 లక్ష్యములు 5 వ్యోమముల గురించి సాధకులు తెలుసుకోవలసి వుంటుంది. వీటిని గురించి తెలియకుండా యోగసాధన చేసేవారు పేరుకు మాత్రమే యోగులుగా పిలవబడుతారు. వారికి యోగసాధనా ఫలితము లభించదు. అనగా ఎవరు వీటిని గురించి తెలుసుకొని, అనుభవమును పొంది, ఇతరులు పొందేటట్లు చేయగలరో వారినే సిద్ధిని పొందిన వాస్తవిక యోగులుగా చెప్పవచ్చును.

**ఆరు చక్రముల పేర్లు వాటి స్థానముల వివరణ :** మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా అనునవి 6 చక్రములుగా పిలవబడుతాయి. మూలాధార చక్రమును గుదచక్రమని, స్వాధిష్ఠాన చక్రమును లింగచక్రమని, మణిపూర చక్రమును నాభీ చక్రమని కూడా పిలుస్తారు. అనాహత చక్రమును హృదయ చక్రమని, విశుద్ధ చక్రమును కంఠ చక్రమని, ఆజ్ఞాచక్రమును భ్రూమధ్య చక్రమని కూడా పిలుస్తారు. సహస్రార చక్రమును శిరః చక్రమని పిలుస్తారు. ఈ

షట్‌చక్రములను దాటి పైనవున్న సహస్రార చక్రములో నిరంజనుడైన పరమాత్మ కొలువై ఉన్నాడు.

శరీరము మధ్యలోనున్న వెన్నుపాము నందు సుషుమ్ననాడి కలదు. ఇది అన్ని నాడులకు తల్లివంటిది. అది తామరతూడువలె అతిసూక్ష్మమయినది. ఈ సుషుమ్న మధ్యలో శుభములు కలిగించే వజ్రనాడి కలదు. ఈ వజ్రనాడి మధ్యలో దానికంటె సూక్ష్మముగా నున్న చిత్రిణీనాడి కలదు. దీనిలో కుండలినీశక్తి వస్తూ పోతూ వుంటుంది. ఈ చిత్రిణీ నాడిలో మనోహరమైన ఆరు పద్మములు ఏర్పడి వున్నాయి.

లింగమునకు దిగువగా గుదమునకుపైగా మూలాధార కమలమని 4 దళముల చక్రముకలదు. లింగస్థానమున పైన నాభి స్థానమునకు క్రింద ఆరుదళముల స్వాధిష్ఠాన చక్రము కలదు. నాభిస్థానమందుగల మణిపూర చక్రము 10 దళములను కలిగి యుండును. హృదయ స్థానమందుగల అనాహత చక్రమునకు 12 దళములు కలవు. కంఠస్థానమందుగల విశుద్ధి చక్రము 16 దళములు కలిగి యుండును. (భృకుటియందు గల ఆజ్ఞాచక్రమునకు 2 దళము లుండును. ఏడవది అయిన సహస్రార చక్రము తలపైన గల బ్రహ్మ రంధ్రమందుండును. పైన ఉదహరించిన 7 చక్రములు సుషుమ్న అంతర్గతమై ఉంటాయి. అజ్ఞానులకు, ప్రవృత్తి పరాయణులకు ఈ కమలములు క్రింది వైపునకు తిరిగి వుంటాయి. మోక్షమార్గావలంబులకు, యోగసాధనా పరులకు ఇవి ఊర్ధ్వ ముఖమై వుంటాయి. అప్పుడు యోగ సిద్ధులు కలుగుతాయి. జ్ఞానము లభిస్తుంది. వీటితత్వము అత్యంత ఆశ్చర్యజనకమై యుండి మోక్షమును ఇవ్వగలదు. అందువలన వీటి రహస్యమును ప్రతి ఒక్క సాధారణ మానవునికి తెలుపకూడదు.

**షట్‌చక్రములలో పంచమహాభూతములు :** మూలాధార చక్రములో భూతత్వమున్నది. స్వాధిష్టానములో జలతత్వము, మణిపూరములో తేజః తత్వము, అనాహతములో వాయుతత్వము, విశుద్ధి చక్రములో ఆకాశతత్వము వ్యాపించి యున్నవి. భ్రూమధ్యములోని ఆజ్ఞాచక్రము సర్వకార్యములు సాధించగల మనస్సుకు నివాసస్థానము. భూతత్వముయొక్క బీజాక్షరము 'లం', జలతత్వ బీజము 'వం' అగ్నితత్వ బీజాక్షరము 'రం' వాయుతత్వనకు 'యం', ఆకాశతత్వ యొక్క బీజాక్షరము 'హం' అయివున్నవి.

పృధ్వీ తత్వము పసుపు వర్ణములోను, జలతత్వము తెల్లని వర్ణములోను, తేజః తత్వము ఎర్రని వర్ణములోను, వాయుతత్వము నీలమేఘవర్ణమును పోలి ఉంటుంది.



ఆకాశతత్వము అనేక రంగులలో వుంటుంది. ఆకాశ మండలము యొక్క ఆకారము వర్తులాకారమని అన్ని శాస్త్రములు ఒప్పుకొంటాయి. వాయుమండల ఆకృతి 6 కోణములను కలిగి వుంటుంది. కొందరు దానిని అర్ధచంద్రాకారమని కూడా చెప్తారు. తేజః తత్వము త్రికోణాకారముగా మరియు జలతత్వముయొక్క ఆకృతి అష్ట కోణాకారములో వుంటుంది. పృధ్వీ తత్త్వముయొక్క ఆకృతి చతుష్కోణమయి వున్నది.

**షట్‌చక్రముల యొక్క అధిష్ఠాన దేవతలు :** బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు, పరమశివుడు వీరి ఆరుగురిని శివులంటారు. ఢాకినీ, రాకినీ, లాకినీ, కాకినీ, శాకినీ మరియు హాకినీ దేవతలను ఆరు శక్తులుగా పిలుస్తారు. ఇవి క్రమముగా షట్‌చక్రములయొక్క అధిష్ఠానదేవతలు. యోగశాస్త్రములో కార్యకారణ భేదముతో వీరిని గురించి అనేక విధములుగా వ్యాఖ్యానించారు. ఎప్పుడైతే సాధకుల మనస్సు, ప్రాణము సుషుమ్ననాడిలో ప్రవేశించి బ్రహ్మరంధ్రము వరకూ వస్తూ పోతూ ఉంటుందో అప్పుడు స్థాన విశేషము ననుసరించి శివ, శక్తుల రూపములో సాధకులకు పరమాత్మ దర్శనమిస్తాడు. అందువలన షట్‌చక్రముల గురించిన వివరణలో సహజముగా శివశక్తుల గురించి ఉల్లేఖిస్తూ వుంటారు. వీటిని గురించి యోగశాస్త్రములో బాగా వర్ణించారు. ఇక్కడ మాత్రము సంక్షిప్త వివరణ ఇవ్వబడినది. మూలాధారము నుండి బ్రహ్మరంధ్రమువరకు ప్రాణశక్తి సంచారముతో పైన చెప్పిన దేవీదేవతల సాక్షాత్కారము కలుగుతుంది. ఈ దేవతలే సాధకుని ఈశ్వరునితో కలుపుతారు. మొదట చెప్పినవిధముగా సుషుమ్ననాడి మధ్యలో వజ్రానాడి, వజ్రానాడి మధ్యలో చిత్రానాడి, ఆచిత్రానాడి అంతర్గతముగా ఏడు పద్మాలు, ఆపద్మసమూహములలో పంచ భూతములయొక్క సూక్ష్మతత్వముల అధిదేవతలైన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు వున్నారు.

ఏవిధముగా ఈ బ్రహ్మాండ సృష్టికి, లయమునకు శాస్త్రములలో చెప్పిన విధముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను కర్తవ్య-బ్రహ్మలుగాను, నిరాకార పూర్ణ బ్రహ్మమును కారణ-బ్రహ్మముగాను వివరించినట్లుగానే అంతర్ జగత్తులో అయిదుగురు కర్తవ్య-బ్రహ్మలుగా మరియు పరమశివుని కారణ-బ్రహ్మగా చెప్పియున్నారు. బాహ్యజగత్తులో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, మాయాశక్తి సహాయముతో కర్తవ్యమును నిర్వహించి మహాప్రళయ కాలములో కారణబ్రహ్మములో లీనమయినట్లుగానే అంతర్ జగత్తులో కూడా ఢాకినీ, రాకినీ మొదలగు మాయాశక్తి స్వరూపిణుల ద్వారా కర్తవ్యము నిర్వహించబడుతుంది. ఏ విధముగా మహా ప్రళయ సమయములో పరబ్రహ్మము

కాకుండా మరేతత్వము మిగిలివుండదో అదేవిధముగా సాధకునికి నిర్వికల్ప సమాధి స్థితి తరువాత శివ మరియు శక్తిరూప కర్తవ్య బ్రహ్మలు, కారణ బ్రహ్మమైన పరమశివునిలో లయమవుతారు. మూలగ్రంథములలో ఈ విషయమును గురించి విస్తారముగా లిఖించబడివున్నది. ఆ గ్రంథాలు వ్యాప్తిలో లేనందున వాటిని అర్థము చేసుకొనుటగాని, వివరించుటగాని అంత సులభముకాదు. ఎందుకంటే ఈ తత్వములు చెప్పటానికి, వినటానికి కాదు, ఇవి స్వమముగా ఆచరించుట వల్లనే తెలియబడుతాయి.

**అధిష్ఠాన దేవతల స్థానములు :** మూలాధార కమలములో బ్రహ్మ, స్వాధిష్ఠానములో విష్ణువు, మణిపురములో రుద్రుడు నివాసముంటారు. అనాహతములో ఈశ్వరుడు, విశుద్ధిలో శక్తి సహిత సదాశివుడు విరాజమానమై వుంటారు. ఆజ్ఞాచక్రములో జ్యోతిర్మయ శివుడు, సహస్రార చక్రములో నిరామయుడైన పరమశివుడు ఉంటాడు. ఆధార చక్రములో ఢాకినీ దేవి, స్వాధిష్ఠాన చక్రములో రాకినీదేవి, మణిపురములో లాకినీ దేవి కొలువై వుంటారు. అనాహతములో కాకినీదేవి, విశుద్ధములో శాకినీ దేవి, ఆజ్ఞా చక్రములో హాకినీదేవి మరియు సహస్రార చక్రములో అన్ని కోరికలకు ఫలితమును ఇచ్చే యాకినీ మహాదేవి నివాసముంటారు.

భూలోకము బ్రహ్మ నివాస స్థానము, భువర్లోకము విష్ణువు నివాసస్థానము మరియు సంహార కర్త అయిన శివుని నివాస స్థానము స్వర్లోకము. అదేశివుడు బ్రహ్మాది దేవతలందరిని నియంత్రించే ఈశ్వరుడుగా నుండి మరియు వారికి అధిపతిగా ఉంటాడు. ఆ సర్వకర్త దేవతలందరికి ఈశ్వరుడు, ఆశివుడే సృష్టియొక్క స్థితిలయలను చేసే పరమేశ్వరుడు. అతడు బ్రహ్మరూపముతో లోకములను సృష్టించి, విష్ణురూపములో పాలించి, రుద్ర రూపములో సంహారము చేస్తాడు.

**షట్చక్ర విజ్ఞానము :** షట్ చక్రముల విజ్ఞానము, ధ్యాన ఫలము ఈ క్రింది విధముగా వుంటుంది. గుదస్థానమునకు పైగా కొద్ది అంగుళముల దూరములో, లింగస్థానమునకు ఒక అంగుళము క్రిందుగా పక్షి గ్రుడ్డుమాదిరి కందము అను ఒక గ్రంధి ఉన్నది. ఇది నాలుగు అంగుళముల పరిమాణములో వుంటుంది. దీనిపేరు కందము. గుదస్థానము మరియు లింగస్థానమునకు మధ్యలో సమాంతరముగా పశ్చిమాభి ముఖముగా యోనిస్థానమున్నది. పైన చెప్పిన కందము, ఆయోని మండలములో నున్నది. అక్కడనే కుండలినీశక్తి నిరంతరము విరాజమానమై వుంటుంది. అది అన్ని నాడులచే పరివేష్ఠితమై సర్పము మాదిరి చుట్టలు చుట్టుకొని



నోటితో తోకను పట్టుకొని బ్రహ్మరంధ్రమును మూసి, సుషుమ్న నాడియందు నిలిచి వుంటుంది. ఆ కుండలినీశక్తి నిద్రించుచున్న సర్పము మాదిరి స్వయం ప్రభలతో వెలుగొందుతూ వుంటుంది.

**మూలాధార చక్రవర్ణన :** మూలాధార కమలములో యోని మండలమున్నది. ఆ యోని మండలములో పైన చెప్పిన కందములోపల ఎర్రని కాంతులలో కామబీజమైన 'క్లీం' విరాజ మానమై వుంటుంది. అందువలన యోగసాధన సమయములో స్వర్ణ కాంతు లీనుతూవున్న 'క్లీం' బీజమును స్మరిస్తూ ధ్యానించాలి. ఎందుకంటే సుషుమ్న వున్న మూలాధార కమలములోనే కుండలినీ శక్తి విరాజమానమై వున్నది. కుంలినీ శక్తి పరమశ్రేష్ఠ కామబీజమైన 'క్లీం' మరియు శరత్చంద్ర శోభలతో దేదీప్య మానమైన మూలాధార కమలములో నున్న 'వ', 'శ' 'ష', స అక్షరములయొక్క తేజస్సు కోటి సూర్యప్రకాశము మాదిరిగా కోటి శరత్చంద్ర కాంతులతో సమానముగా నుండి స్నిగ్ధ మనోహారముగా, సుశీతలముగా వుంటుంది. కుండలినీశక్తి మరియు 'క్లీం' బీజ శక్తిని మరియు 'వ' 'శ', 'ష', 'స'ల యొక్క వర్ణాక్షరశక్తిని కలిపి త్రిపుర భైరవీదేవిగా వర్ణించారు. అందువలన ఇక్కడే శ్రేష్ఠ బీజశక్తి తేజః త్రయము జ్ఞానశక్తి, క్రియాశక్తి సహితముగా సుషుమ్నలోగల మూలాధార కమలములో గల యోని మండలములో పరిభ్రమణ చేస్తూ వుంటుంది. ఈ మహాతేజము తామరతూడులోని తంతువు మాదిరి సూక్ష్మము మరియు అగ్ని శిఖాసదృశముగా రక్తవర్ణ జ్వాలలతో కూడి వుంటుంది. ఇది యోని మండలములో గల స్వయంభూ లింగమును ఆశ్రయించి వుంటుంది.

దీనిని మూలాధారమని అంటారు. దీనిలోనే గల యోని మండలములో స్వయంభూలింగము, కుండలినీశక్తి విరాజమానమై వున్నాయి. ఇక్కడే అన్ని ఆధ్యాత్మిక శక్తులు భౌతిక శక్తులకు సంబంధించిన పరమజ్ఞానము నిక్షిప్తమై ఉన్నది. ఈ మూలాధార కమలము నాలుగు దళములతో కూడివున్నది. ఈ నాలుగు దళములపై క్రమముగా 'వ', 'శ', 'ష', 'స' అను నాలు అక్షరములు తేజః స్వరూపములో ప్రకాశిస్తూ వుంటాయి. ఈ ఆధార చక్రములో స్వయంభూ లింగమును పరివేష్ఠించి స్వర్ణ సమానమైన కాంతులతో దేదీప్యమానముగా శైవీశక్తి ఐన కుండనీ దేవి ప్రతిష్ఠితమై వున్నది. ఇదియే ద్విరాండ నామముతోగల సిద్ధ దేవునికి మరియు ఢాకినీ నామముగల దైవీశక్తికి నివాస స్థానము అయివున్నది. ఈ చక్రమునకు అధిపతి బ్రహ్మదేవుడు.

దీని స్థానము భూలోకము, పసుపు వర్ణము, నాలుగు కోణములతో కూడిన పృధ్వీతత్వము. బీజాక్షరము 'లం' దీని రక్షకుడు గజారూఢుడైన ఇంద్రదేవుడు మరియు గణాధిపతి అయిన గణేశుడు ఈ పద్మయోనిలో ఎక్కడైతే కుండలినీ శక్తి వున్నదో దానికి పైభాగములో మహాతేజః శక్తిగల భ్రమణశీలమైన 'క్లీం' బీజము విరాజమానమై వున్నది. ఈ ప్రదేశములోనే సృష్టిలోని దేవీ దేవతలందరు నివాసముంటారు. ఈ స్థానములోనే పరమకల్యాణమును కలిగించే శివశక్తి విజ్ఞానము అన్ని విధములైన సిద్ధులకు సంబంధించిన జ్ఞానమున్నది. ఇది అంతర్జగత్తు యొక్క ద్వారముగా నుండి అన్ని తత్వములకు ఆధారముగా నున్నది కాబట్టి ఇది మూలాధార చక్రముగా చెప్పబడినది.

**మూలాధార చక్ర జ్ఞాన ధ్యానముల ద్వారా లభించు ఫలము :** సాధకుడు ఈ మూలాధార కమలములో నున్న ఆధ్యాత్మిక తత్వమును ధ్యానము చేసినపుడు అతని ప్రాణశక్తి ఉత్థానము చెంది సుషుమ్నలో ప్రవేశిస్తుంది. ప్రాణజయము క్రమముగా కలుగుతూ వున్నప్పుడు అతడి ఆసనము కూడా శూన్యములో ఆధారము లేకుండా నిలబడగలదు. శరీరకాంతి పెరుగుతుంది. జఠరాగ్ని పెరుగుతుంది. అందువలన సాధకయోగియొక్క రోగములన్నీ తొలగిపోతాయి. శరీరము ఆరోగ్యముగా, సుందరముగా, దృఢముగా పరిపక్వ మవుతుంది. ఇంద్రియముల శక్తికూడా దివ్యరూపమును ధారణ చేస్తుంది. ఫలితముగా అతడు త్రికాలజ్ఞానమును కారణ సహితముగా సహాతెలుసుకొనగలడు. ఎప్పుడూ చూడని, వినని శాస్త్రముల అత్యంత నిగూఢ విషయములను కూడా నిశ్చయముగా చెప్పగలడు. సరస్వతీదేవి ఎల్లప్పుడు ఆయోగి నాలుకపై నర్తిస్తూ వుంటుంది. అతడి వాక్కులను నెరవేరుస్తుంది. అతడు ఏ విషయమును చెప్పినా అది సాక్షాత్తు సరస్వతీ దేవి కథనముగా చెప్పుకోవాలి. ఆసాధకయోగి ఏమంత్రము జపిస్తే ఆ మంత్ర సిద్ధి వెంటనే కలుగుతుంది. ఇందులో సందేహము మేమీలేదు. జరా, మృత్యువులవంటి దుఃఖ నివారణకొరకు యోగసాధన చేసే ప్రాణాయామ పరాయణులైన యోగులు సర్వదా ప్రథమముగా మూలాధార కమలమును ధ్యానించవలసి వుంటుంది. దీని ధ్యానము వలన నిస్సందేహముగా యోగి జీవన్ముక్తుడవుతాడు. మూలాధార కమలములో వున్న కుండలినీశక్తితో కూడిన స్వయంభూలింగమును ధ్యానము చేసినపుడు నిశ్చయముగా సాధకుని పాపరాశి దగ్ధమవుతుంది. ఆయోగి మనస్సులో కోరిన కోరికలు వెంటనే నెరవేరుతాయి. అన్ని కామనలను వదలివేసి నిరంతరము అభ్యాసము చేయటంవలన ఆసాధక



యోగి ముక్తిదాత అయిన ఈశ్వరుని దర్శనము పొందుతాడు. ఆత్మరూప ఈశ్వరుడు అంతరములో ధ్యానము ద్వారా, బాహ్యముగా జ్ఞానముగా ప్రత్యక్షముగా కనిపిస్తాడు. ఆపరమేశ్వరుని లోపల, బయటా ప్రయత్న పూర్వకముగా ధ్యానించాలి. ఆత్మదేవుని మించిన అన్యశ్రేష్ఠదేవత లెవరూ లేరు.

అవివేకులైన మనుషులు తన దేహములో మూలాధార కమలమునందు విరాజమానమైన శివుని పరిత్యజించి బాహ్యముగా వున్న ఇతర దేవతలను పూజిస్తుంటారు. క్షుదార్తులు ఎదురుగావున్న మృష్టాన్నమును గుర్తించక అటూ ఇటూ పరిగెత్తుతున్నట్లుగా వీరు బాహ్యముగా వున్న దేవీదేవతలను ఆరాధన చేస్తూ జనన మరణ చక్రములో పరిభ్రమిస్తూ వుంటారు. వారికి ఎన్నడూ పరమ సుఖశాంతి లభించదు.

అందువలన జనులు సోమరితనము వదలిపెట్టి తమ శరీరములోగల మూలాధారకమలములో కొలువైయున్న స్వయంభూలింగ స్వరూపుడైన ఆత్మదేవుని ప్రతినిత్యము పూజించవలయును. వారికి అవశ్యము అన్నిరకములైన సిద్ధులు ప్రాప్తిస్తాయి. గురు ఉపదేశము ప్రకారము ప్రాణాయామము ద్వారా నిరంతరము ఆధార చక్రములో కొలువైయున్న ఆత్మదేవుడైన శివుని పూజించటంచేత 3 మాసములలో సిద్ధి కలుగుతుంది. ఈ విధముగా నిత్యము నియమిత రూపములో యోగాభ్యాసము చేసే సాధకయోగి యొక్క ప్రాణవాయువు నిశ్చయముగా సుషుమ్నలో ప్రవేశిస్తుంది. అంటే మనస్సు వశములోనికి వస్తుంది. ప్రాణజయము కలుగుటచేత బిందు జయము కూడ సహజముగా కలుగుతుంది. మనస్సు, ప్రాణము మరియు బిందు జయముతో సాధక యోగికి అన్ని విధములైన సాంసారిక పారమార్థిక సిద్ధులు నిస్సందేహముగా కలుగుతాయి.

**స్వాధిష్ఠానచక్ర జ్ఞాన, ధ్యాన ఫలము :** రెండవది అయిన స్వాధిష్ఠాన చక్రము లింగమూలములో ఉంటుంది. ఇది ఆరుదళము కలిగివుండి రక్త వర్ణములో ఉంటుంది. ఈ పద్మముయొక్క రెక్కలపై 'బ' భ 'మ', 'య', 'ర', 'ల' అను అక్షరములు ప్రకాశిస్తూ ఉంటాయి. ఇక్కడ బాల అను పేరుగల సిద్ధ దేవుడు రాకినీ పేరుగల సిద్ధి దేవీ శక్తి నివాస ముంటుంది. ఈ చక్ర అధిష్ఠాన దేవత విష్ణువు. ఈ స్థానము భువర్లోకమునకు సంబంధించినది. శ్వేతవర్ణముతో అష్టకోణాకారముగా జలతత్వమును కలిగి వుంటుంది. చక్ర బీజాక్షరము 'దం'. జల దేవత వరుణుడు చక్ర సంరక్షకుడుగా వుంటాడు.

ఏ సాధకయోగి దివ్యస్వాధిష్ఠాన కమలమును సదా ధ్యానిస్తూ వుంటాడో అతడిని ధ్యానములో దేవాంగనలు కామార్తులై వరించుటకు సిద్ధముగా వుంటారు. అనగా కామినులు మోహితులై అతడిని కొలుస్తారు. ఇది కాకుండా ఈ చక్రధ్యానమును నిత్యము చేసే యోగులకు ఎప్పుడూ వినని అనేక విధములైన శాస్త్రముల జ్ఞానము కలుగుతుంది. అతడు అన్ని రోగముల నుండి విముక్తిని పొంది నిర్భయముగా జనులలో తిరుగాడుతాడు. సర్వభక్షకుడైన యముని గురించి అందరూ భయపడతారు. కాని స్వాధిష్ఠాన చక్రమును ధ్యానించే యోగి ఆకాలుని కూడా భక్షించగలడు. ఎందుకంటే ఇక్కడ సాధకునికి అణిమాది అష్టసిద్ధులు కలుగుతాయి. మనస్సు ప్రాణము బిందు జయమువల్ల యోగి శరీరము దృఢపడుతుంది. సహస్రారము నుండి సుధారసము స్రవిస్తుంది. దానిని పానము చేయుటవలన శరీరము తేలికపడుతుంది. ఇటువంటి యోగి, ఇచ్ఛానుసారము ప్రాణత్యాగము చేయగలడు. ఈ విధముగా ఆయోగి అమరుడవుతాడు.

**మణిపూర చక్ర జ్ఞాన, ధ్యానఫలము :** నాభిస్థానములో గల మణిపూర చక్రము పదిదళములు కలిగి ఉంటుంది. ఈ దళములపై క్రమముగా 'డ', 'ఢ', 'ణ', 'త', 'థ', 'ద', 'ధ', 'న', 'ప', 'ఫ' అను అక్షరములు ప్రకాశిస్తూ వుంటాయి. ఈ వర్ణములు స్వర్ణము మాదిరి బంగారు వర్ణముతో శోభిల్లుతూ ఉంటాయి. ఈ కమలములో సర్వమంగళ ప్రదాతగా రుద్రుడు అను సిద్ధ దేవత మరియు పరమధార్మిక శక్తి లాకినీ పేరుగల దైవీశక్తి కొలువై వుంటారు. ఇక్కడ అధిపతి ఇదివరలో చెప్పిన ఆరుగురు శివులలో మూడవ వాడైన రుద్రదేవుడు. ఈ స్థానమును స్వర్లోకమని కూడా అంటారు. అగ్నితత్వముతో ఇది రక్తవర్ణ త్రికోణకారములో ఉంటుంది. ఈ చక్ర బీజము 'రం'. ఈ చక్ర రక్షకుడు హుతాశనుడైన అగ్నిదేవుడు.

ఏ యోగి మణిపూర చక్రములో ఈ దేవతలను ధ్యానిస్తాడో అతడికి నిరంతర సుఖాలనిచ్చే పాతాళ సిద్ధి కలుగుతుంది. ఆ సిద్ధివలన భూగర్భములో దాగి ఉన్న సమస్త వస్తువుల సమాచారమును తెలుసుకో గలుగుతాడు. పాతాళమునకు వెళ్ళగలిగే శక్తికూడా కలుగుతుంది. ఈ లోకములో కూడా యోగి మనోవాంఛిత ఫలములను పొందగలడు. పరకాయప్రవేశ శక్తికూడా కలుగుతుంది. ఈ యోగి కాలుని కూడా ఎదిరించకలడు. ఏ వస్తువునైనా అతడు స్వర్ణముగా మార్చే శక్తి లభిస్తుంది. అతడికి సిద్ధుల దర్శనమవుతుంది. భూమిపైన, లోపలవున్న సమస్త ఓషధుల జ్ఞానాన్ని పొంద గలడు. భూగర్భములో లేక భూమిపైన ఉన్న ఓషధులన్ని యోగి చూడగలుగుతాడు.



**అనాహత చక్రము జ్ఞాన, ధ్యానఫలము :** హృదయములో అనాహతమను చతుర్థ కమలము ఉంటుంది. ఇది 12 దళములను కూడి వుంటుంది. రక్త వర్ణములో వుంటుంది. ఈ కమలములోని రేకులపై వరుసగా 'క' నుండి 'ఠ' వరకు 12 అక్షరములు ప్రకాశిస్తూ వుంటాయి. అవి పరమతేజః స్వరూపముతో ప్రకాశిస్తూ వుంటాయి. ఈ హృదయకమలము ఆత్మదేవుని నివాస స్థలముగా అందరికి పరమ ప్రసన్నతనిచ్చే స్థానముగా చెప్పబడుతుంది. మూలాధారములో స్వయంభూలింగమున్నట్లుగానే ఈ కమలములోకూడా పరమ తేజోమయ జ్యోతీ స్వరూపమైన బాణలింగము ప్రతిష్ఠితమయి వుంటుంది. ఆ జ్యోతిస్వరూప బాణలింగమును స్మరించగానే దృశ్యాదృశ్య సమస్త విషయముల యొక్క జ్ఞానఫలము లభిస్తుంది. ఇది పినాకుడు అనుపేరుగల సిద్ధదేవునికి కాకినీ అనుపేరుగల దైవీశక్తికి నివాసస్థానము. ఈ చక్ర అధిపతి దేవత సాక్షాత్తు ఈశ్వరుడు. ఈ మహర్లోక స్థానము షట్కోణాకారముగా వుండి. మేఘసమానమైన నీలవర్ణముతో వాయుతత్వమును కలిగి ఉంటుంది. దీని బీజాక్షరము 'యం'. చక్రరక్షక దేవత ప్రాణవాయువు అయివున్నది.

ఈ హృదయ పద్మమును ఏ యోగి సతతము ధ్యానము చేస్తాడో అతడి కొరకు దేవతలు, స్త్రీలు కామార్తులై వ్యధితులవుతారు. అనగా యోగిని వరించుటకు ఆత్రుత పడతారు. ఆ యోగికి భూత, భవిష్య, వర్తమాన కాల జ్ఞానము కలుగుతుంది. సుదూరములో జరుగుచున్న విషయములను చూడగలడు, వినగలడు, ఆకాశగమన సామర్థ్యము కలుగటం చేత అతడు దేవగణములను జయిస్తాడు. హృదయ కమలములో వున్న రెండవ పరంజ్యోతిర్మయ బాణలింగమును నిత్యధ్యానము చేసే యోగులకు ఈ విధమైన ఖేచరీ మరియు భూచరీ సిద్ధి కలుగుతుంది. ఇందులో సందేహమేమీ లేదు. ఈ హృదయకమల జ్ఞాన, ధ్యాన, ఫలమును వర్ణించలేము. ఎందుకంటే ఎక్కడ సాక్షాత్తు ఈశ్వరుడుంటాడో అతడియొక్క దివ్యవిభూతులను అనగా ఐశ్వర్యమును ఎవరూ వర్ణించలేరు. అందువలన బ్రహ్మాది సకలదేవతలుకూడా దీనిని గుప్తముగా ఉంచుతారు.

**విశుద్ధిచక్ర జ్ఞాన, ధ్యాన ఫలము :** కంఠస్థానములో విశుద్ధి అనే పేరుగల ఐదవ కమలముఉన్నది. ఇది 16 దళములు కలిగి వున్నది. ధూమ్రవర్ణములో ఉంటుంది. దీని ఒక్కొక్కదళములపై వరుసగా 'అ' నుండి 'అః' వరకు అక్షరములు

ప్రకాశిస్తూ వుంటాయి. ఇక్కడ ఛగలాండుడు అనుపేరుగల సిద్ధదేవుడు, శాకినీ అను పేరుగల దైవీశక్తి విరాజమానమై వుంటారు. ఈ చక్ర అధిపతి సదాశివుడు. ఇది జనో లోకమునకు సంబంధించి వుంటుంది. ఆకాశతత్వమును కలిగి వుంటుంది. ఇది మండలాకారములో అనేక వర్ణములు కలిగి వుంటుంది. దీని బీజాక్షరము 'హం'. ఏ సాధకయోగి నిత్యము ఈ చక్ర ధ్యానమును చేస్తూ ఉంటాడో అతడే పండితుడు మరియు యోగీశ్వరుడు అని పిలువబడుతాడు. అతడికి విశుద్ధ కమల ధ్యానము చేతనే సమస్త వేదముల యొక్క రహస్యజ్ఞానము ప్రాప్తిస్తుంది.

ఈ కంఠచక్ర ధ్యాన పరాయణులైన యోగీశ్వరుడు ఏకాగ్ర మనస్సుతో ఎప్పుడైన క్రోధితుడైతే అప్పుడు అతడి క్రోధ భయముతో ముల్లోకములు కంపిస్తాయి. ఇందులో సందేహము మేమి లేదు. ఏ యోగి యొక్క మనస్సు ఈ స్థానములో లయమయి సమాధి స్థితిని పొందుతుందో అతడు బాహ్య విషయములన్ని మరచి అంతరములోనున్న ఆత్మయొక్క పరమశాంతిని అనుభవిస్తాడు. విశుద్ధి చక్రమును యోగి నిరంతరము ధ్యానిస్తూ సమాధి స్థితిని పొందుతూ అందులోనే లయమును పొందితే వెయ్యి సంవత్సరముల వరకు అతడి శారీరక శక్తి క్షయముకాదు. అతడి శరీరము వజ్రముకంటే కఠినముగా మారుతుంది. సమాధిస్థితి నుండి లేవగనే వెయ్యి సంవత్సరముల కాలము అతడికి క్షణమాత్రములో గడచినట్లుగా అనిపిస్తుంది.

**ఆజ్ఞాచక్ర జ్ఞాన, ధ్యానఫలము :** ఇది ఆరవచక్రము. ఇది భ్రూమధ్యములో ఉంటుంది. ఈ చక్రమునకు రెండు దళములుంటాయి. తెల్లని వర్ణముతో జ్యోతిర్మయ స్వరూపమును కలిగి వుంటుంది. రెండుదళములపై 'హ' 'క్ష' అను తేజః స్వరూప అక్షరములు కలిగి వుంటుంది. ఇక్కడ మహాకాలుడు అనుపేరుగల సిద్ధదేవుడు, హాకినీ అనుపేరుగల దైవీశక్తి విరాజమానమై ఉంటారు. శరశ్చంద్ర కాంతులతో దేదీప్యమానమైన బీజాక్షరము 'ఓం' ఇక్కడ వెలుగొందుతూ వుంటుంది. ఈ కమల ధ్యానముచేసే పరమహంస యోగీశ్వరునకు ఇంక ప్రత్యేకించి తెలుసుకోవాల్సిన విషయములు లేవీ ఉండవు. అతడు కృతార్థుడవుతాడు. ఇది తపోలోకమునకు సంబంధించిన చక్రము. ఇది మనస్సు నివాస స్థానము. ఇక్కడ అధిపతి ఆరుగురు శివులలో ఆరవవాడైన పరమశివుడు. ఇక్కడివర్ణము తెల్లని బీజాక్షరమైన 'ఓం' మరియు చక్ర రక్షకుడు మనస్సు అయివున్నది.

ఆజ్ఞాచక్రముతో కూడివున్న పరమతేజోమయ మహామంత్రము 'ఓం' సర్వ శాస్త్రములలో అత్యంత నిగూఢము. ఈ చక్రధ్యానమువలన సిద్ధి, జ్ఞానలాభము



అవశ్యము కలుగుతుంది. మూలాధారములో వున్న స్వయంభూలింగము హృదయ కమలములో వున్న బాణలింగమును ఆజ్ఞాచక్రలోనున్న ఇతర లింగమును ధ్యానించి మనస్సు, ప్రాణజయముతో యోగి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి రుద్రగ్రంథి భేదనము చేసి షట్చక్రముల భేదనముచేస్తూ సమాధి స్థితిద్వారా నాలుగవధామమైన బ్రహ్మ రంధ్రమును చేరతాడు. అప్పుడు ఆ యోగి ముక్తుడవుతాడు. అనగా ఈ ఆజ్ఞా చక్రమును ధ్యానించే యోగి నిశ్చయముగా ఈశ్వరునితో సమానమైన ఐశ్వర్యమును పొంది శివస్వరూపుడవుతాడు.

యోగశాస్త్రములో ఇడ, పింగళనాడులు వరుణ, అసి అనే పేర్లతో ప్రసిద్ధము. ఈ రెండింటి మధ్య ప్రదేశమును వారణాసి కాశీక్షేత్రముగా పిలుస్తారు. ఇచ్చట సాక్షాత్తు కాశీవిశ్వనాథుడైన శివుడు విరాజమానమై వుంటాడు. అందువల్ల ఈ ఆజ్ఞాచక్రమును, తత్వదర్శులయిన యోగీశ్వరులు శాస్త్రములలో తీర్థరూపములో అనేక విధములుగా వర్ణించారు. ఎందుకంటే ఆజ్ఞాచక్రము నందు శ్రీమహేశ్వరుడు నిత్యము నివాసముంటాడు. త్రికాలదర్శులైనయోగుల కథనానుసారము ఆజ్ఞాచక్రము యొక్క ఊర్ధ్వభాగములో బిందుపీఠము, నాదపీఠము, శక్తిపీఠము ఉన్నాయి. లలాట స్థానములోగల ఈ మూడు మహాపీఠములు సాధకుని అన్ని కామనలను తీరుస్తాయి. ఇక్కడే త్రివేణీ స్థానమైన ప్రయాగ తీర్థమున్నది. (ఇడ, పింగళ, సుషుమ్న లేక గంగా, యమున, సరస్వతి నదుల యొక్క సంగమ స్థానము) ఇచ్చట అనుష్ఠించిన ధ్యాన ఫలితమును వర్ణించుటకు ఎవరికీ సాధ్యముకాదు. ఇంతకుముందు చెప్పిన విషయములను అనగా భూతకాలములో జరిగిన విషయములు, చెప్పబోయే విషయములను అనగా భవిష్యత్ కాలములో జరుగబోవు విషయములు మరియు భౌతిక, ఆధ్యాత్మిక తత్వములన్నింటియొక్క జ్ఞానము ఆజ్ఞాచక్రములో ఉంది.

మేరుదండములో వున్న సుషుమ్న నాడి యందున్న షట్చక్రములందే మూడు గ్రంథుల వర్ణనవున్నది. నాభియందు బ్రహ్మగ్రంథి, హృదయములో విష్ణుగ్రంథి, భ్రూమధ్యములో రుద్ర గ్రంథి ఉన్నవి. మూడు గుణములకు సంబంధించిన ఈ మూడు గ్రంథులు దుర్భేద్యములని చెప్పబడ్డాయి. కాని కుండలినీ శక్తిని మూలాధారము నుండి బ్రహ్మరంధ్రము వరకు తీసుకొని పోవుటకు అనుష్ఠించే యోగసాధన ప్రాణాయామముద్వారా లేక ధారణ, ధ్యాన, సమాధి సాధనల ద్వారా మూడు గ్రంథుల భేదనము క్రమముగా జరుగుతుంది. కుంభక ప్రాణాయామము చేసి మూలాధారములో మనస్సును ప్రాణమును నిరోధించి అక్కడవున్న

స్వయంభూలింగమును ధ్యానించుటవలన బ్రహ్మగ్రంధి భేదనము జరుగుతుంది. అదేవిధముగా హృదయకమలములో మనస్సును ప్రాణమును నిరోధించుట ద్వారా విష్ణుగ్రంధి భేదనము జరుగుతుంది. భ్రూమధ్యములో గల ఆజ్ఞాచక్రములో మనస్సును ప్రాణమును లయముచేసి అక్కడవున్న జ్యోతిర్మయ ఇతరలింగమును ధ్యానము చేయుటవలన రుద్రగ్రంధి బేధనము జరుగుతుంది. ఈ మూడు గ్రంథుల బేధనము జరిగిన తరువాత యోగి శ్రమ లేకుండవా కుండలినీ శక్తిని సహస్రారము వరకు తీసుకొని పోగలడు. అక్కడ అతడి యోగాభ్యాసము సఫలమై సంపూర్ణమవుతుంది. ఈ సహస్రారమే తురీయస్థానము, కైలాస ధామము లేక గురుస్థానము అయివున్నది. ఇదే విష్ణుధామము, విష్ణువుయొక్క నిత్య నివాస స్థానముగా చెప్పబడుతుంది. ఇదియే పరంధామము, ఆనందధామము లేక కైవల్యపదము అయివున్నది. దీనినే శాస్త్రములలో ప్రకృతి పురుషుడుగా, శివశక్తి స్థానమైన పరమవ్యోమముగా చెప్ప బడినది. ఇదే నిర్వాణప్రద మోక్ష ద్వారముగా చెప్పబడినది. ఈ చక్ర అనుభవమును తన శరీరమునందే పొందిన పురుషుడు నిస్సందేహముగా జీవన్ముక్తిని పొందుతాడు.

**సహస్రారచక్ర జ్ఞాన, ధ్యాన ఫలములు :** ఆజ్ఞాచక్ర పైభాగములో తాలుమూలములో సప్తమ పద్మమైన సహస్రారచక్రము శోభిల్లుతూ వుంటుంది. సుషుమ్నానాడి యొక్క అంత్యభాగము బ్రహ్మరంధ్రమువద్ద అనగా సహస్రార చక్రమువద్ద ఆగిపోతుంది. సుషుమ్నానాడి తాలుమూలము నుండి అధోముఖముగా మూలాధార పర్యంతము వెళుతూ వుంటుంది. లేక మూలాధారము నుండి తాలుమూలము వరకు వ్యాపించి వుంటుంది. మూలాధారములోగల సుషుమ్న యొక్క ప్రథమ ముఖ్యద్వారము నిద్రాస్థితిలో వున్న కుండలినీశక్తి ద్వారా నిరోధించబడి వుంటుంది. కానిపైనున్న బ్రహ్మరంధ్రము తెరుచుకొని వుంటుంది. ఈ సుషుమ్న నాడియే శరీరములో మూలాధారము నుండి వెలువడే అన్ని నాడులకు ఆశ్రయమిచ్చి బ్రహ్మాండ జ్ఞానమును బీజరూపములో నిలిపి వుంచుతుంది. దీనియందే బ్రహ్మాండమంతా వున్నది. ఈ సుషుమ్నాయే మూలాధారము నుండి సహస్రారము వరకు అధ్యాత్మ తత్వమును వెలువరించి బ్రహ్మమార్గముగా పిలువబడుతుంది.

తాలుమూలములో గల దేదీప్యమానమైన సహస్రదళ కమలములో కూడా మూలాధారములో నున్న కందమువలె పశ్చిమాభిముఖముగా ఒకయోని మండలమున్నది. ఆ యోని మండలములో సుషుమ్న యొక్క రెండవ చివర తెరువబడి వుంటుంది. ఈ సుషుమ్నానాడియొక్క ముఖద్వారమైన మూలాధారములో కుండలినీశక్తి



వుంటుంది. నిద్రాస్థితిలోని ఆశక్తి ప్రాణాయామము ద్వారా షట్చక్ర భేదనము చేసి బ్రహ్మరంధ్రము వద్ద అనగా సహస్రారకమలములో నున్న శివునిలో ఐక్యమవుతుంది. అప్పుడు ముక్తి లభిస్తుంది. అందువలన పరమేశ్వరుని అభిప్రాయము ప్రకారము మూలాధారము నుండి తాలుమూల పర్యంతము మేరుదండములో సుషుమ్న నాడి వ్యాపించి వుండును. సుషుమ్న నాడి మధ్యలోని శూన్యప్రదేశమును బ్రహ్మరంధ్రమంటారు. ఈ బ్రహ్మరంధ్రములో సూక్ష్మమైన వజ్రనాడి ఉంది. వజ్రనాడి మధ్యలో అంతకంటె సూక్ష్మమైన శక్తిరూపిణి అయిన చిత్రనాడి ఉంది. ఆ చిత్రనాడిలో ఇంకా సూక్ష్మతరమైన మనోహరమైన షట్చక్రములు ఉన్నాయి. అవి దివ్య ప్రకాశమును కలిగివుండి బృహత్ బ్రహ్మాండమును దర్శింపచేస్తాయి. అనగా సుషుమ్నలో వజ్రనాడి, వజ్రానాడి మధ్యలో చిత్రిణి నాడిని, చిత్రిణినాడి మధ్యలో బ్రహ్మరంధ్రమును అందుగల షట్చక్రములను కల్పన జేయాలి.

అన్నిటికంటే పైన ఉన్న సహస్రార చక్రమును సహస్రదళ పద్మమని కూడా అంటారు. దీనికి జీవన్ముక్తిని కలిగించగల సామర్థ్యము ఉంది. దీనిని కైలాసమని కూడ పిలుస్తారు. ఇక్కడ భోగ, ఐశ్వర్య, ముక్తి నొసంగే శివుడు విరాజమానమై వున్నాడు. ఈ స్థానమును సత్యలోకమని కూడా అంటారు. ఇక్కడకు చేరిన యోగులు జనన మరణ చక్రమునుండి విడివడుతారని వేదములు ఘోషించాయి. ఇక్కడ ఆనంద స్వరూపుడైన నకులుడు అనిపేరుగల సిద్ధదేవుడు, అన్ని కామనలను తీర్చగల మహాదేవీ స్వరూపమైన యాకినీదేవి ప్రతిష్ఠితమైవుంటారు. ఈ సప్తమ పద్మములో పరమ తేజోమయుడైన, దేదీప్యమానమై దివ్యతేజో స్వరూపమైన దేవాది దేవుడు మహాదేవుడు విరాజమానమై వున్నాడు. ఈ స్థానము గురుతత్వమునకు సంబంధించినది. ఇది అమృతమయ సుధాసాగరముతో పరిపూర్ణమయి వుంటుంది. గురుతత్వమును మించిన తత్వము ఏదిలేదు. అందువలన దీనిని గురించి మరియు దీనికి ఆవల వర్ణించలేము. సహస్రారములోని సుషుమ్న అంతర్గతమై బ్రహ్మరంధ్రములో వున్న సహస్రార చక్రములోగల గురుతత్వము ధ్యానించగానే, స్మరణమాత్రముచేత బ్రహ్మ జ్ఞానము కలుగుతుంది. పాపక్షయము జరుగుటవలన ధ్యానించే యోగి తిరిగి జన్మించడు.

సాధకయోగి ఎవరైన మనోయోగముతో బ్రహ్మరంధ్రమునందు క్షణమాత్రము నిలిచివుంటే అతడు సర్వపాపముల నుండి విముక్తిని పొంది ముక్తిని పొందుతాడు. ఏయోగి యొక్క మనస్సు సహస్రార కమలములో లీనమవుతుందో అటువంటి

శ్రేష్ఠుడైన పురుషుడు స్వేచ్ఛా పూర్వకముగా అణిమాది సిద్ధులతో మహదైశ్వర్యమును అనుభవించు ననుటలో సందేహమేమీలేదు. యోగశాస్త్రములో ఈ ఏడుచక్రముల గురించి విశేష వర్ణన ఉంది. ఇవి కాకుండా మనోచక్రము, బుద్ధిచక్రము ఇత్యాది పేర్లతో ఇతర చక్రముల గురించి వర్ణన కూడా కనిపిస్తుంది. పైన చెప్పిన ఆవశ్యక విషయములను యోగశాస్త్రము యొక్క సర్వోత్తమ గ్రంధమైన **శివసంహిత** నందుగల షట్చక్ర విజ్ఞానము నుండి సేకరించటం జరిగినది. దీనికి సంబంధించి పరమహంస యోగీ మహరాజ్ పూర్ణానందగిరి స్వాములుచే వ్రాయబడిన **షట్చక్ర నిరూపణము** అను ప్రాచీన మరియు అత్యుత్తమ గ్రంధము కూడా ఉంది.

**షోడశాధారములు :** యోగశాస్త్రములో శక్తి కేంద్రములను ఆధార స్థానములుగా చెప్పబడినది. ఎందుకంటే ఆధారము లేకుండా శక్తి పనిచేయలేదు. ఈ శక్తులు విద్యుత్ రూప ప్రాణకళను ఆశ్రయించి శరీరములో భిన్నరూపములైన పనులను చేస్తాయి. ఇవి సహజముగా శరీరము, మనస్సు, ప్రాణములయొక్క ఆవశ్యకతాను సారము పనిచేస్తాయి. కాని యోగసాధన ద్వారా ఈ శక్తులకు ఒకేచోట ఏకత్రితము చేయవచ్చు. ధారణ, ధ్యాన, సమాధి అను మూడింటి ద్వారా ఆధారశక్తులను సాక్షాత్కరింపజేసుకొనవచ్చు. దీనిపేరు సంయమనము. సంయమన సిద్ధి కొరకు యోగశాస్త్రములో మొదట ధారణను అభ్యసించాలి. ధారణ కొరకు 16 ఆధార స్థానములు చెప్పబడ్డాయి. షట్చక్రములు మరియు బిందు, కళ, పద, నిరోధిక, అర్ధేందు, నాదాంత, ఉన్మనీ, విష్ణువక్త్ర, ధృవమండల, శివమను 16 స్థానములు అతిసూక్ష్మమయిన ఆధారస్థానములు. వీటియందు అత్యంత ఆశ్చర్య జనక మరియు పరమశాంతి దాయకముగా పనిచేసే అలౌకిక అద్భుతశక్తులు ఉంటాయి. ఈ 16 స్థానముల జ్ఞానలాభమును పొందిన యోగి దొరుకుట దుర్లభము.

ఈ ఆధార స్థానములు సమాధి స్థితిలో పరమజ్ఞాన లాభమును పొందటానికి సూక్ష్మాతి సూక్ష్మమైన మహాశక్తితో కేంద్రములు లేక భాండాగారములు అయివున్నవి. సమాధి సాధనకొరకు, ఆత్మజ్ఞానము కొరకు చేసే యోగసాధన చిట్టచివరి స్థితులలో ఈ మహాశక్తి స్థానములు ఉపకరిస్తాయి. యోగశాస్త్రము ప్రకారము ఈ పదహారు ఆధారస్థానములలోని శక్తి సమూహమంతయు పరమశివునిలో ఏకీకృతమవుతుంది. పరమశివునిలో శక్తి తిరిగి చేరుటయే యోగసాధనయొక్క అంతిమ లక్ష్యము. వీటిని ఆధ్యాత్మ జ్ఞానముగా పరివర్తనముచేయుటానికి సూక్ష్మమైన మనస్సు మరియు ప్రాణముయొక్క క్రియలు అవసరమవుతాయి. మనస్సును ప్రాణమును



నిరోధించకుండా ఈ షోడశ ఆధారముల తత్వజ్ఞానమును తెలుసుకొనలేరు. వీటిని గురించి తెలుసుకొనటానికి యోగసిద్ధి, ప్రాణముపై అదుపు మరియు షట్చక్రవేధ జరుగవలసి వున్నది. ప్రాణజయము కొరకు స్థూల ఆధారస్థానములలో యోగక్రియలు జరుగవలసి వున్నది. వాటి అనుభవము సాధకునికి కలుగుతుంది.

ఆధార స్థానములలో లలాట ప్రాంతమున బిందుస్థానమున్నది. సాక్షాత్తు బోధినీశక్తి వున్నది. దానిపైన 'నాద' స్థానము ఉన్నది. అది అర్ధచంద్రాకారములో ఉంటుంది. దానిపైన ఉజ్వల మహానాద స్థానమున్నది. దీనిపైగా కళాస్థానమున్నది. ఈ స్థానము యోగులకు అత్యంత ప్రియమైనది. దానిపైన ఉన్మనీ స్థానమున్నది. అక్కడికి చేరిన యోగులు తిరిగి రావలసిన పనిలేదు. యోగశాస్త్రములో ప్రాణాయామము ద్వారా ప్రాణ నిరోధముచేసి ప్రతి ఒక్క ఆధార స్థానములో మనస్సు, ప్రాణము యొక్క గతిని నిరోధించటాన్ని ధారణగా చెప్తారు. పైన చెప్పబడిన స్థానములలో వున్న శక్తి భండాగారములను మరియు వాటియొక్క ఆధ్యాత్మికతత్వ జ్ఞానములను తెలుసుకోవటానికి ఆశక్తి సమూహమును ఒక చోటకు చేర్చి సమాధిలాభమును పొందటానికి 'ధారణా' స్థితి లభించవలసి వున్నది. మనస్సును ఏకాగ్రపరచి ఏదో ఒకస్థానములో చిత్తమును నిలిపి వుంచటం ధారణగా చెప్పబడినది. మనస్సును ప్రాణమును నిరోధించి బంధించగల ప్రథమ స్థానము మూలాధార స్థానము. ఈ ఆధార స్థానముతో మొదలుపెట్టి క్రమముగా స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధ చక్రముల గుండా భ్రూమధ్యములోగల ఆజ్ఞాచక్రమునకు మనస్సును ప్రాణమును తీసుకొనివచ్చి బిందు, కళాపద, నిరోధికా, అర్ధేందు, నాద మరియు నాదాంత స్థానముల వరకు మనస్సును ప్రాణములను నిరోధించవలసి వుంటుంది. ఇదే విధముగా పై ఆధార స్థానములైన ఉన్మనీ, విష్ణువక్త్ర, ధృవమండల స్థానములద్వారా వెళుతూ మనస్సును ప్రాణమును పరమశివునిలో లయము చేయాలి. దీనిని షట్చక్ర వేధగా చెప్పబడినది. దీనివల్ల సమాధిస్థితి కలిగి తత్వజ్ఞానము కలుగుతుంది.

ఈ సూక్ష్మ షోడశ ఆధార స్థానముల వర్ణన కార్య, కారణ భేదముతో యోగశాస్త్రములో అనేక విధములుగా వర్ణించబడినది. అందువలన వాటి గురించిన వ్యాఖ్య నిష్ప్రయోజనము మరియు అనావశ్యకము. ఎందుకంటే వీటి గురించిన సాధన గురువుద్వారా, వాటియొక్క జ్ఞానము సమాధి స్థితి ద్వారా మాత్రమే కలుగుతుంది.

పైన ఉదహరించిన సూక్ష్మ షోడశాధారముల జ్ఞానముతోపాటుగా, స్థూల షోడశాధారముల యొక్క భేదములు వాటి సాధనవల్ల కలిగే ఫలితమును తెలుసుకోవటం చేత శరీరములో వున్న శక్తి సమూహములను సంచయము చేయవచ్చును. అందువలన కార్యసిద్ధి త్వరితగతిని కలుగుతుంది. కాలి వ్రేళ్ళు, చీలమండ, మోకాలు, తొడలు, సీవనీ, లింగ, నాభి, హృదయ, గ్రీవ, కంఠ, కంఠ మూలము (గంగడోలు), జిహ్వామూలము, నాశిక, భ్రూమధ్యము లేక తల, తలపైన మూర్ధము అను పదహారు స్థానములను యోగశాస్త్రములో మర్మస్థానములుగా లేక స్థూల ఆధారస్థానములుగా చెప్పబడ్డాయి. ఇక్కడ మనస్సును ప్రాణమును నిరోధించుట వలన ధారణా స్థితి కలుగుతుంది. ఎందుకంటే ఈ స్థానములలో శక్తి కేంద్రములున్నవి. ఒక్కొక్క స్థానములో ఒక్కొక్క రకమైన శక్తి ఉంటుంది. యోగసాధన ద్వారా ప్రాణవాయువును నిరోధించి ఇచ్ఛానుసారము శరీరములో ఏదో ఒకస్థానములో కేంద్రీకరణ చేయవచ్చును. వీటియొక్క సిద్ధి, భౌతికము రూపములో శారీరకముగా, ఆధ్యాత్మిక ఫలితము మానసికముగా ఉంటుంది.

**షోడశాధార స్థానముల సాధనలయొక్క భేదము :** మొదటి ఆధారస్థానము కాలివ్రేళ్ళు ఇక్కడ శక్తి రూపములో తేజస్సు వున్నది. ఆ తేజస్సు లక్ష్యముగా త్రాటకక్రియ ద్వారా రెండు కాలివ్రేళ్ళపై దృష్టిని స్థిరము చేయాలి. ఈ పనిని శవాసనములో పడుకొని చేయవచ్చు. అంటే మృతుని మాదిరిగా పడుకొని రెండు కాళ్ళవ్రేళ్ళపై దృష్టిని వుంచి త్రాటక క్రియద్వారా మనస్సును స్థిరము చేయటం ప్రథమ ఆధారసోపానముయొక్క యోగతత్వమై యున్నది. తరువాత స్థానము చీలమండలు. దీనిని ఒక పాదమును గుదస్థానము క్రింద వుంచి రెండవ పాదమును లింగము పైననుంచి మహాబంధ ఆసనములో అభ్యాసము చేయవలసి వుంటుంది. దీనిద్వారా ప్రథమ ఆధార స్థానములైన కాలివ్రేళ్ళపై కూడా వత్తిడి పడుతుంది. రెండవ ఆధార స్థానములైన కాలిమడమలపై కూడా వత్తిడి పడుతుంది.

మూడవ ఆధార స్థానము అయిన గుదస్థానమును సంకోచ వ్యాకోచముల ద్వారా అనగా మలద్వారము నుండి అపాన వాయువును పైకిలాగి వదులుతూ వుండాలి. ఈ క్రియ మహాబంధముతో కూడిన మూల బంధముతో మాత్రమే సిద్ధిస్తుంది. దీనివలన ప్రాణవాయువు స్థిరమవుతుంది. సాధకుడు మృత్యువును కూడా జయించగలడు. నాలుగవ ఆధారక్రియను వజ్రౌళి అంటారు. ఇందులో అనేక



పర్యాయములు లింగము సంకోచ వ్యాకోచములు చేయబడుతుంది. ఈ క్రియ మహాయోగ సాధనను చేసే సాధకులలో అనేక విధాలుగా జరుగుతుంది. ఇది వజ్రోళి, సహజోళి, అమరోళి పేర్లతో కూడా పిలువబడుతుంది. దీని సత్వర సిద్ధి స్త్రీ మైథునము ద్వారా కూడా కలుగుతుంది. దీనిద్వారా కూడా సుషుమ్న మార్గము తెరవబడుతుంది. మహాబంధము ద్వారా మూలబంధముతో గుదమును సంకోచ, వ్యాకోచ పరచి అపానవాయువును ఆకర్షించి వజ్రోళిముద్రయొక్క క్రియ అనగా లింగమును సంకోచ వ్యాకోచములను నిత్యము అభ్యసించుట ద్వారా మూలాధార చక్రము, మరియు లింగచక్రమైన స్వాధిష్ఠాన చక్ర మార్గము సరళమవుతాయి. దీనివలన మేరుదండములోనున్న సుషుమ్ననాడి అంతర్గత నాడులైన వజ్రనాడిలో ప్రాణ, మన, బిందువుల యొక్క సంచారము జరుగుతుంది. అప్పుడు మనః ప్రాణములు సుషుమ్నలో లయమవుతాయి. బిందువు స్వస్థానములో భస్మమయి ఓజస్సుగా మారుతుంది.

ఈ విధముగా నాల్గవ ఆధారస్థానమైన వజ్రోళి క్రియ నిత్యానుష్ఠానము ద్వారా మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూర చక్రస్థానముల గ్రంథభేదన జరుగుతుంది. ఈ చక్రము వేధసుషుమ్నలో ప్రాణవాయు నిరోధము ద్వారా కలుగుతుంది. దీనివలన సాధకునికి మూలాధారములో ప్రాణవాయువును నిలిపి వుంచే సామర్థ్యము సిద్ధిస్తుంది. వీర్య స్తంభన జరుగుతుంది. స్త్రీ సంభోగము చేస్తూ వున్నప్పుడు కూడా బిందు పతనముకాదు. నిరంతరము సాధనచేయుట ద్వారా సాధకుడు యువకుని సామర్థ్యమును కలిగి వుంటాడు. అతడు మూలాధారములో స్వాధిష్ఠానములో ఇచ్ఛానుసారము మనః ప్రాణములను నిరోధించగలడు.

ఐదవ ఆధారస్థానము జఠరాధారము అయివున్నది. ఈ క్రియను మహాబంధ ఆసనములో నుండి మూలబంధముతో పాటు ఉడ్యానబంధము ద్వారా సాధించవలసి వుంటుంది. అందువల్ల బుద్ధిమంతులైన సాధకులు క్రమముగా మహాబంధము, మూలబంధముతోపాటుగా ఉడ్యాన బంధము ద్వారా సుషుమ్నలో ప్రాణవాయును పైకి తీసుకొని వెళ్ళవలసి వుంటుంది. ఈ పంచమ ఆధారస్థానము ద్వారా మృత్యువును కూడా జయించవచ్చు. ఇక్కడ మనః ప్రాణ, బుద్ధులు బంధింపబడతాయి. దీనివలన నిశ్చయముగా మృత్యుక్షయమై ఆయువు పెరుగుతుంది. సాధకయోగి కాలుడిని జయిస్తాడు.

ఆరవ ఆధార స్థానము నాభిస్థానము అయివున్నది. ఇక్కడ ప్రాణ నిరోధమువలన తనకుతానుగా నాదము ఉద్భవిస్తుంది. ఈ నాదములో మనః ప్రాణములు లయమగుటచే ఇది ముక్తిదాయకమయివున్నది. ఏడవ ఆధార స్థానము హృదయస్థానమై వున్నది. ఇక్కడ ప్రాణవాయువును నిలిపి వుంచుట వల్ల ఆ ఆధార కమలము ఊర్ధ్వముఖమవుతుంది. సాధకునికి అలౌకిక ఐశ్వర్యము ప్రాప్తిస్తుంది.

అష్టమ ఆధారస్థానము కంఠము అయివున్నది. ఈ ఆధార స్థానము యొక్క క్రియ కంఠమును సంకోచ పరిచే జాలంధరబంధమై వున్నది. ఈ బంధ సిద్ధి ద్వారా ప్రాణవాయువును దృఢముగా నిలిపి వుంచవచ్చు. తొమ్మిదవ ఆధార స్థానము ఘంటిక అనునది. దీనిని సాధించుముద్ర ఖేచరీ ముద్ర అయివున్నది. నాలుకను వెనుక త్రిప్పి తాలువునందు కొండనాలుకకు పైన నిలుపుటచేత ఖేచరీముద్ర సిద్ధిస్తుంది. దీనిద్వారా అమృత రసపానము జరుగుతుంది. ఈ అమృతసేవనము ద్వారా యోగి మృత్యువును జయిస్తాడు. అంటే ఖేచరీసిద్ధి కలిగిన యోగి ఇచ్ఛానుసారము జీవించగలడు.

పదవ ఆధారస్థానము తాలుమూలముగా చెప్పబడినది. ఇక్కడ నుండి ఘంటికా స్థానపైన నాలుక అగ్రభాగమునుంచుట చేత అమృత పానము జరుగుతుంది. అమృతపానమునకు ఖేచరీముద్ర అవశ్యకమవుతుంది. ఈ ఖేచరీముద్ర, నాలుకను పొడిగించుట ద్వారా సిద్ధిస్తుంది. మామూలుగా నాలుకను మడచుటద్వారా అది తాలుమూలమునకు చేరుకొనలేదు. తాలుమూలములో నాలుకను చేర్చుటకు ఛేదన, చాలన, ఘర్షణ, లాగుట వంటి నాలుగు క్రియల ద్వారా నాలుక పొడవు పెరిగి తాలుమూలమునకు వెళ్ళగలుగుతుంది.

దీని తరువాత నాశిక యొక్క అగ్రభాగము త్రయోదశ ఆధారస్థానముగా చెప్పబడినది. త్రాటకముతో దృష్టిని స్థిర పరచుటయే దీని క్రియ అయివున్నది. ఈ త్రయోదశ ఆధారస్థానము మనస్సును ప్రాణమును స్థిరపరచును. నాసాగ్రముపై దృష్టిని స్థిరముచేసిన తరువాత వచ్చే చతుర్దశ ఆధారస్థానము నాసాపుటము (అనగా ముక్కు యొక్క పైభాగము) అయివున్నది. నాశికాగ్రభాగములో త్రాటకము ద్వారా దృష్టి స్థిరపడిన తరువాత, ముక్కు యొక్క పైభాగముపై దృష్టిని నిలిపి త్రాటక క్రియను అభ్యసించవలయును. ఈ విధముగా స్థిరముగా 3 లేక ఆరుమాసములు అభ్యసించినపుడు పార్థివ బంధనములన్నియు శీఘ్రముగా తొలగిపోతాయి. శరీర, మనః, ప్రాణముల జడత్వము నశిస్తుంది. అనగా అతడికి ఆత్మ స్వరూపము



ప్రత్యక్షమవుతుంది. కనుబొమల మధ్యస్థానము పంచాదశ ఆధారస్థానమై యున్నది. త్రాటక అభ్యాసము పరిపక్వమయి మనస్సు ఏకాగ్రతను పొందిన తరువాత, కనుపాపలు కదలిక లేకుండా స్థిరముగా నున్నప్పుడు పంచాదశ ఆధారస్థానమైన అనగా రెండు కనుబొమ్మల మధ్య ప్రదేశమును లక్ష్యముగా చేసుకొని కనుపాపలను పైకి త్రిప్పి శాంభవీముద్ర ద్వారా మనః ప్రాణములను స్థిరపరచినపుడు నిశ్చయముగా అంతరాత్మయొక్క శతకోటి కిరణములు ప్రతిఫలించి దివ్య, మహాదివ్య పరమ సుఖదాయకమైన ఆత్మజ్యోతి దర్శనమవుతుంది. దీనితరువాత వచ్చే షోడశ ఆధార స్థానము నేత్రము అయివున్నది. శాంభవీ ముద్రతోపాటు, షణ్ముఖీ ముద్ర దీనిక్రియ అయివున్నది. రెండు చేతుల వ్రేళ్ళలో ముక్కు, చెవి, నేత్రము మూసివుంచి కుంభక ప్రాణాయామము ద్వారా మనః ప్రాణములను ఆజ్ఞాచక్రమునందు నిలుపుదల చేయటంచేత షణ్ముఖి లేక యోని ముద్ర కలుగుతుంది. దీనిని అభ్యసించి పొందిన ఆత్మ ప్రకాశము ద్వారా భూగర్భములో దాగుకొనివున్న వస్తువులను ప్రత్యక్షముగా దర్శించగలము. అంతర్జ్యోతి ప్రకాశము వలన దివ్యబ్రహ్మజ్ఞానము కలుగుతుంది. ఈ విధముగా షోడశ ఆధార స్థానములను అభ్యసించు యోగి సర్వజ్ఞుడవుతాడు. ఇందులో సందేహములేదు.

**త్రిలక్ష్యములు :** త్రిలక్ష్యముల ద్వారా యోగ ఐశ్వర్యములైన పరమశాంతి, జ్ఞానము, ముక్తిల యొక్క స్థితి మరియు సిద్ధి కలుగుతాయి. ఆధారస్థానము, హృదయమందు, విశేషించి భ్రూమధ్యములో వరుసగా స్వయంభూ, బాణ మరియు ఇతరలింగములు కలవు. వీటినే త్రిలక్ష్యములు అని అంటారు. అందువలన పైన చెప్పిన స్థానములలో ప్రధానముగా ఈ మూడు లింగములను చింతన చేయవలసి వుంటుంది. ఎందుకంటే స్వయం భూలింగము మూలాధారములో, బాణలింగము అనాహత చక్రములో, ఇతర లింగము ఆజ్ఞాచక్రములో వుంటాయి. వీటిని లక్ష్యముగా చేసుకొని ధ్యానిస్తే అన్ని కామనలు సిద్ధిస్తాయి.

సాధనాకాలములో సాధకుల అంతరములో మనస్సు నందు ఏఏ స్థానముల నుండి ఎక్కడెక్కడకు వెళ్ళి రావలసి వుంటుందో ఆయా స్థానములలో నిలిచి వుండటం అవసరము. శరీరము, మనఃప్రాణములు సంఘటితం కానంత వరకు ఇచ్ఛానుసారముగా మనః ప్రాణములు లయమయి సమాధి స్థితి లభించదు. అప్పటివరకు యోగశాస్త్రములో చెప్పిన విధముగా ఆయాప్రదేశములలో విశేషముగా మనః ప్రాణములను నిలిపి యుంచటం అవసరము. ఎందుకంటే శరీరములో

మనః ప్రాణములు చేసే పని అత్యంత సూక్ష్మము. వీటియొక్క కార్యశీలతను ఇచ్ఛానుసారము నడపుటకే ఈ ప్రయత్నములు అన్నీ చేయబడుతున్నాయి. ఎప్పటివరకు శరీరములో వున్న భిన్న, భిన్న తత్వముల విభిన్న రూపములు తెలియబడవో, అప్పటివరకు శ్రీమహేశ్వరులద్వారా చెప్పబడిన తత్వ లక్ష్యములన్నీ బుద్ధినందు నిలుపుకొని అంతరాకాశములో మనస్సును ప్రతిష్ఠింప జేయాలి. అందువలన ప్రయత్నము చేసి శరీర, మనః ప్రాణములను ఆయాస్థితుల ననుసరించి ఒక స్థానమునుండి మరియొక స్థానమునకు మార్చుకొనవలసి ఉన్నది. ఎన్నిలక్ష్యములందు ధారణ చేయవలెనని మొట్టమొదట చెప్పబడినదో ఆ అన్ని లక్ష్యములన్నింటియందు త్రిలక్ష్యములు ప్రధానమైనవి.

ఈ లక్ష్యములు స్థూల, సూక్ష్మ, పరా మరియు ఆది, మధ్య, అంత్య అనగా బాహ్య, అంతర, మరియు అధో, ఊర్ధ్వ భేదములతో అనేక విధములుగా ఉంటాయి. వీటి అన్నింటిని గురించి వివరించటం అంత సులభముకాదు. తెలుసుకొనుటకూడా అత్యంత కష్టమైన విషయము. ఇవి అందరికి ఘటించుట కూడా చాలా కష్టతరమైన విషయము. అయినప్పటికి బుద్ధి మరియు జ్ఞానముచే పరంపరాగతముగా చెప్పబడిన, వినిన మరియు అనుసరిస్తూ వచ్చిన ఆచార్యుల ఉపదేశానుసారము ఈ బృహత్ యోగశాస్త్రముయొక్క అత్యంత కఠినమైన నిగూఢ జ్ఞానమును గురు కృపద్వారా ప్రాప్తించుకొని, అతిసరళమైన తత్వములను గురించి సంక్షేపముగా వివరించటం జరిగింది. ఆధ్యాత్మిక జగత్తుయొక్క అలౌకిక, అద్భుత, ఆశ్చర్య జనకమైన రచనారీతులు ఎంత విచిత్రముగా, ఆనంద ప్రదముగా శాంతి దాయకముగా ఉంటాయో సాధకులు దీనివలన తెలుసుకొంటారు.

అందువలన ఈ తత్వములను యోగశాస్త్రములో అనేక విధములుగా చెప్పబడ్డాయి. అనేక ఉపమానములతో వివరించటం జరిగింది. వీటిని గురించి స్థిరచిత్తము ప్రఖర ప్రజ్ఞగల సాధకుడు మాత్రమే అర్థము చేసుకొనగలడు. అస్థిర మనస్సు, అపరిపక్వబుద్ధి గల సాధకులు ఈ విషయములను అర్థము చేసుకొనలేరు. సాధకులు వీటిని గురించి శంకించక, చింతించక సాధన చేయవలసి వుంటుంది. శ్రీమహేశ్వరులు చెప్పిన విషయములన్ని సత్యములు మరియు సాధనద్వారా ప్రాప్తించుకొను యోగ్యత గలవి. ప్రతినిత్యము దృఢ అభ్యాసముతో గురుకృపతో ఈ విషయములన్ని సహజముగా తెలియబడుతాయి. ఇందులో సందేహములేదు.



**లక్ష్యయోగము ఆది, మధ్య అంతర్లక్ష్యము :** యోగశాస్త్రములో పరమశాంతి దాయకమైన సులభముగా సాధ్యమైన లక్ష్యయోగ లక్షణము, సాధనా విధానము దానిని అనుష్ఠించుట వలన కలిగే ఫలితము ఈ క్రింది విధముగా వర్ణించబడినది. ఈ లక్ష్యయోగము ఊర్ధ్వ లక్ష్యము, అధోలక్ష్యము, బాహ్యలక్ష్యము, మధ్యలక్ష్యము మరియు అంతర్లక్ష్యము అను ఐదు విధములుగా ఉంటుంది.

తేలికగా సహజముగా సాధ్యపడే ఈ సాధనల ద్వారా మనస్సు సహజసిద్ధముగా వశీభూతమవుతుంది. అభీష్టసిద్ధి సత్వరమే కలుగుతుంది.

ఆకాశమునందు దృష్టిని నిలిపి మనస్సును అక్కడ ఏకాగ్రతము చేయుటను ఊర్ధ్వ లక్ష్యయోగము అంటారు. దానివల్ల పరమేశ్వరుని యందు చిత్తము ఏకాగ్రతను పొందుతుంది. నాశికకు పైన 12 అంగుళ ప్రమాణ ప్రదేశములో దృష్టిని స్థిరము చేయటాన్ని రెండవది అయిన అధోలక్ష్య యోగముగా చెప్పవచ్చును.

నాశికాగ్రమున దృష్టిని స్థిరము చేయుటను మూడవది అయిన బాహ్యలక్ష్య యోగముగా చెప్పబడినది. దీనివల్ల సాధకుడు దీర్ఘాయుష్కుడవుతాడు. ఈ యోగములోనిని గూఢరహస్యమును సాధకుడు సాధనద్వారా స్వయముగా తెలుసుకొన గలడు. అందువలన కోరికలతో చింతాగ్రస్తులయిన సాధకులకు ఈ బహిర్దృష్టి యోగము శీఘ్రముగా సిద్ధిని కలుగజేస్తుంది. బాహ్యమధ్య లక్ష్యయోగమును సాధనచేసే సాధకుల మనోకామనలు అన్నీ ఈడేరుతాయి. విషయ వ్యాపారముల సంకల్పములను త్యజించి అటునిటు చూడకుండా పరిపూర్ణ శూన్య ఆకాశముపై మనస్సును ఏకాగ్రముచేసి నిర్విషయము చేయుట అన్నింటికంటే శ్రేష్ఠతమమైన అంతర్లక్ష్య యోగముగా చెప్పబడినది. ఈవిధానములో నడుస్తున్నా తిరుగుతున్నా, లేచినా, కూర్చున్నా, తింటున్నా, త్రాగుతున్నా, మేల్కొన్నా, నిద్రిస్తున్నా సర్వావస్థలయందు మనస్సును శూన్యమందు ఏకాగ్రము చేయాలి. ఎందుకంటే చేసేది, చేయించునది కూడా శూన్యమే అయి వున్నది. సాక్షాత్తు ఈశ్వరుడు కూడా శూన్యమే అయివున్నాడు.

దేహములలో వశించే ఆత్మకూడా నిరాకారశూన్య రూపములో ఉంటుంది. ఆ మనస్సు విషయ చింతనాయుక్త మగుటచేత ఆశరీరస్థమయిన ఆత్మ హర్ష శోకములను అనుభవించి జననమరణ దుఃఖమును పొందుతుంది. అందువల్ల ఏ పురుషుడు విషయ వాసనలను త్యజించి తన స్వరూపమును శూన్యముగా తెలుసుకొని

శూన్యముపై మనస్సును ఏకాగ్రము చేస్తాడో అతడు పాప, పుణ్య ఫలముల నుండి విముక్తుడవుతాడు.

ఈ ప్రకారముగా బాహ్యములో, అంతరములో, శూన్యమును లక్ష్యముగా చేసుకొని ధ్యానము చేయుట అంతర్లక్ష్యముగా చెప్పబడినది. ఈ ప్రకారముగా శూన్య ఆకాశమును సదా ధ్యానించుటచే సాధకునికి కించిత్ మాత్ర దుఃఖము కూడా కలుగదు. సాధకుడు సాక్షాత్తు శివరూపుడవుతాడు. శూన్యమే సచ్చిదానంద నిశ్శబ్దబ్రహ్మముగా, శూన్య ఆకాశము సశబ్ద బ్రహ్మముగా చెప్పబడినది. ఈ ప్రకారముగా శూన్యరూపమైన బ్రహ్మములో కూడా రెండు భేదములు ఉన్నాయి.

ఐదవది పరమసిద్ధి కారకమయిన మధ్యలక్ష్యయోగము. మేరు దండములో నున్న సుషుమ్న నాళమునందుగల శూన్యమనోమయ ఆకాశములో గల తెలుపు, ఎరుపు, పసుపు మరియు ధూమ్రాకార నీలప్రభలలో కూడిన బిందువుగా మరియు అగ్నిజ్వాలల మాదిరి జ్వాజ్వల్యమానముగా, విద్యుత్ కాంతుల మాదిరి ప్రకాశించు సూర్యమండలాకారముగా మరియు పూర్ణచంద్రమండల సదృశ్యముగా లేక వెలుగుతున్న నిప్పుమాదిరి ఆత్మను భావించి ధ్యానించాలి. ఈ విధముగా అగ్ని, విద్యుత్, సూర్య, చంద్రాది మరియు నాదబిందు కళలలో కూడిన బిందు రూపముగా దివ్యజ్యోతిర్మయ ఆత్మరూపమును సుషుమ్న లక్ష్యముగా ధ్యానించటంచేత సాధకులకు అన్నివిధాల దుఃఖముల నుండి నివృత్తి కలుగుతుంది. మనోమాలిన్యములు పాప సంస్కారములన్ని తొలగిపోయి మనస్సు నిర్మలమవుతుంది. సర్వదా మనస్సునకు మహదానందము ప్రాప్తిస్తుంది.

**పంచ వ్యోమములు :** సుషుమ్న నాళములో ఉన్న అనగా అంతరాకాశములో ఉన్న పంచవ్యోమముల వర్ణన ఈ క్రింద నివ్వబడినది. మొదట ఆకాశము, దానిపైన రెండవది అయిన మహాకాశము ఉంది. దానిపైగా మూడవది పరాకాశము, నాల్గవది తత్త్వాకాశము, ఐదవది సూర్యాకాశముగా చెప్పబడినది. ఈ ప్రకారముగా ఈ శరీరములో ఒకదానిపై ఇంకొకటిగా సూక్ష్మము నుండి అతిసూక్ష్మమైన ఐదు విధములైన ఆకాశములు ఉన్నాయి.

ప్రథమముగా వున్న ఆకాశము నిరాకార నిర్మల స్వరూపము. మనస్సును సంకల్ప వికల్ప రహితముగా చేసి నిరాలంబన భావముతో దానియందు నిలిపి వుంచాలి. అందువలన అప్రయత్నముగా మనోలయము సిద్ధిస్తుంది. దీనిని అదే



విధముగా నిరంతరము అభ్యాసము చేయాలి. రెండవది అయిన పరాకాశము దట్టమైన మేఘములతో కూడిన ఆకాశము మాదిరి అంధకారమయముగా ఉంటుంది. దీనిలోకూడా సంకల్ప, వికల్పములు లేకుండా తన్మయులై ధ్యానించాలి. మూడవది అయిన మహాకాశము అగ్ని రూపజ్యోతులతో ప్రకాశిస్తూ ఉంటుంది. కల్పాంతములో బ్రహ్మాండమంతా అగ్నితో నిండి అగ్ని స్వరూపముగా కన్పించినట్లుగానే అగ్నియొక్క ప్రకాశరూపమును స్మరించి అందులో మనస్సును లగ్నముచేసి తదాకారులు కావలసి వుంటుంది. నాల్గవది తత్త్వాకాశము. ఇది కోట్ల కొలది అసంఖ్యాకమైన ప్రజ్వలించే ప్రకాశజ్యోతులుగా భావించి మనోలయ మొనరించి తద్రూపులుగా మారాలి. ఐదవది సూర్యాకాశము విశ్వములో కోటి సూర్యుల కలయికలో ఎంతటి ప్రకాశము కలుగుతుందో అది అంతటి ప్రకాశమును కలిగి వుంటుంది. ఇందులో సాధకుడు తన మనః ప్రాణములను లయము చేయవలసి వుంటుంది. ఈ విధముగా సాధనచేసే సాధకులు పాప, పుణ్య రహితులై శివునివలె యధేచ్ఛగా విహరింపగలరు. ఈ పంచవ్యోమముల విజ్ఞానమును యాజ్ఞవల్క్యుడు సూర్యభగవానుడి నుండి పొందివున్నాడు.

బాహ్యములో, అంతరములో ఘోర అంధకారమయ ఆకాశమున్నది. బాహ్యములో, అంతరములో కాలానల సహితమైన అగ్ని సదృశ పరాకాశమున్నది. బాహ్యములో, అంతరములో అపరిమితమైన విద్యుత్ ప్రకాశములతో కూడిన తత్త్వరూప పరాకాశమున్నది. బాహ్యముగా, అంతరములో సూర్యప్రకాశముతో కూడిన పరిపూర్ణ సూర్యాకాశము ఉన్నది. అనిర్వచనీయమైన జ్యోతిరూప, సర్వవ్యాపక, నిరతిశయానంద పూర్ణ లక్షణముగల పరమాకాశము కూడా ఉన్నది. ఈవిధముగా మనలోనే పంచవ్యోమములు ఉన్నాయి. వాటిని ఆరూపములలో భావించి దర్శించటం ద్వారా సాధకుడు తద్రూపుడు కాగలడు. ఈ కథనమంతయు యజుర్వేదములో చెప్పబడినది.

# సిద్ధమహాయోగము

## పదిహేనవ ప్రకరణము

**సిద్ధిని ఉత్పన్నము చేసే ఐదు విధానములు :** సిద్ధులు అనేక విధములుగా వుండి అనేక ప్రకారములుగా ఉత్పన్నమవుతాయి. అవి ఉత్పన్నమయ్యే విధానములు ముఖ్యముగా ఐదుగా వుంటాయి. అవి పుట్టుకతోడను, ఔషధాల వల్లను, మంత్రముల వల్లను, తపము వల్లను, యోగ సమాధి ద్వారా ఏర్పడుతాయి.

ఎక్కడో ఒక యోగ భ్రష్టుడైన వ్యక్తి పూర్వజన్మ పుణ్య సంస్కారమువల్ల ప్రస్తుత జన్మలో కూడా గురువు, సాధన లేకుండా అలౌకిక సామర్థ్యముతో మరియు ఆశ్చర్యపడే విధముగా జన్మాంతర స్మృతులను జ్ఞానమును కలిగి వుంటాడని అప్పుడప్పుడు అందరకు అనుభవానికి వచ్చే విషయమే. ఆ ప్రభావముతో అతడు భూత, భవిష్యత్, వర్తమాన కాలములకు సంబంధించిన విషయములను సునాయాసముగా చెప్పగలడు. అతడు అలౌకిక సామర్థ్యమును కనపరుస్తాడు. దీనిని జన్మజా సిద్ధిగా చెప్పవచ్చును. ఈ స్థితి బాల్యావస్థ నుండే అతడిలో కనపడుతుంది.

ఇంకొందరు వ్యక్తులు పాదరసాది ఔషధములతో అసాధ్య రోగములను కూడా సత్వరము నయము చేయగలరు. ఎలాగంటే ఏదో ఒక దివ్యవనౌషధి సహాయముతో ప్రతి ఒక్క రోగమును నయము చేసే జ్ఞానము వారికి సహజముగా ప్రాప్తించి వుంటుంది. ఈ విధముగా ఏదైనా ఔషధముతో రోగ నివారణ చేయగల సామర్థ్యము ఔషధిజ సిద్ధిగా చెపుతారు.

చాలామంది జనులు; సాధువులు, సన్యాసులు, బ్రహ్మచారులు, త్యాగులు విరాగులుగా మారి ఉపవాస, వ్రత, జప, తప, పునశ్చరణల ద్వారా తపస్సు చేసి శక్తిని సంచయము చేస్తారు. తమ తపోబలముద్వారా జనుల రోగ, శోక, దుఃఖ దైన్యములను తొలగించే ప్రయత్నము చేస్తారు. ఇంకా ప్రసన్నులయితే ధన, పుత్ర సంపదలు ప్రాప్తించుగాక అని వరదానములు ఇస్తారు. వారే ఇంకేదయినా కారణములో అసంతుష్టులు అయితే అనిష్టము కలగాలని శాపములు కూడా పెడతారు. వీటివల్ల జనులకు తదుపరి కాలములో ఇష్టకార్యసిద్ధి లేక అనర్థములు కలుగవచ్చును. ఈ సిద్ధిని తపఃసిద్ధి అని అంటారు. ఈ సిద్ధులు సమయాను కూలముగా అకస్మాత్తుగా వస్తాయి. అదేవిధముగా తపస్సు క్షీణించగానే లేక పుణ్యఫలము క్షీణించగానే నశిస్తాయి. జన్మతో వచ్చే సిద్ధులు, ఔషధుల కారణముగా వచ్చే సిద్ధులు, మంత్ర, తపస్సుల చేత వచ్చే సిద్ధులకంటే సమాధి స్థితి ద్వారా వచ్చే సిద్ధులు ఉన్నతమైనవి. అవి ఎప్పటికి నిలిచి వుంటాయి. మంత్ర, ఔషధ తపస్సుల ద్వారా లభించే సిద్ధులవల్ల జననమరణ రూప భవ వ్యాధి తొలగి పరమశాంతి లభించదు. అవి ఇవ్వలేవు కూడా. కాని సమాధి సిద్ధి అత్యున్నతమైనది. సమాధి సిద్ధించిన యోగి మాత్రమే తన ఇచ్ఛానుసారము జనహితము చేయగలడు. తాను స్వయముగా జనన మరణ చక్రమునుండి విడివడి ఇతరులను కూడా విడిపించగలడు.



**రెండు విధములైన సిద్ధులు :** ఈ లోకములో ఈ సిద్ధులు కల్పిత మరియు అకల్పిత మను నామ భేదముతోను సామాన్యము మరియు విశేషమను రెండు విధములుగా వున్నాయి.

కొన్ని క్రియా విశేషముల ద్వారా పాదరసము సర్వరోగ నివారకమై శారీరక సిద్ధి నివ్వగలదు. మరియు గుళిక రూపములో ఆకాశగమన సిద్ధి ఇవ్వగల మూలికతో కలిసి దివ్యౌషధ రూపములో సిద్ధి ప్రదమవుతుంది. ఈ విధముగా ఈ పాదరసమును ఔషధముగా ప్రయోగించుట ద్వారాకాని మరియు వైదిక, తాంత్రిక వివిధ కర్మ, మంత్ర పూజలలో జప, తపాది క్రియాకర్మల సాధనల ద్వారా కాని ఏ సిద్ధులైతే కలుగుతాయో అవి కల్పిత సిద్ధులు. మంత్ర, ఔషధ, రసాది సాధన ద్వారా ఉత్పన్నమయ్యే సిద్ధులు ఎక్కువ కాలము నిలిచి వుండని కారణముచేత వాటిని కల్పిత సిద్ధులుగా చెప్పారు. ఇవి సామాన్యమైనవి. ఇవి కల్పిత కామ్యకర్మల వలన ఏర్పడుతాయి.

రెండవ రకమైన సిద్ధులు అకల్పితమయినవి. ఇవి మంత్రము, తపస్సు, రసాది సాధనలేవీ లేకుండా నిష్కామకర్మ ద్వారా తమంతట తాముగా ఉత్పన్నమవుతాయి. సాధకయోగి సాంసారిక కామనలను త్యజించి మాయాబంధములను తొలగించు కొన్నప్పుడు సహజముగా జీవాత్మను పరమాత్మలో కలిపి పొందగలడు. అప్పుడు అణిమాది సిద్ధులు సమాధి స్థితి ద్వారా సాధకయోగిని స్వయముగా వరిస్తాయి. ఇవి కల్పన లేమీ లేకుండా సంకల్ప వికల్పములేమీ లేని సమాధి స్థితి వల్ల ప్రాప్తిస్తాయి. ఈ అకల్పిత సిద్ధులు జప, తప, మంత్రాది సాధనల ద్వారా ప్రాప్తించవు. నిష్కామబుద్ధి ద్వారా, ఈశ్వర ప్రణిధానయోగ సాధన ద్వారా సమాధి స్థితిలో తన ఆత్మబలమువల్ల సాధకునిలో స్వయముగా ఆవిర్భవిస్తాయి. ఇటువంటి నిత్యమైన అనంతకాలము నిలిచియుండే సంకల్పమాత్రముచే సమస్త కార్యములు చేయగల మహాఐశ్వర్య ప్రదమైన ఈశ్వరత్వమును ఇవ్వగల ఈ మహాసిద్ధులు, అన్ని సంస్కారముల నుండి విముక్తులై చిరకాలము యోగాభ్యాసము చేసిన యోగుల యొక్క యోగబలము ద్వారా మాత్రమే ప్రాప్తిస్తాయి.

అణిమ, మహిమ, లఘిమ వంటి మహాసిద్ధులు యోగాభ్యాసము లేకుండా సాధన లేకుండా లభించవు. ఇవి కేవలము మహాయోగము ద్వారా సాధకులకు సమాధి స్థితి ద్వారా స్వయముగా ప్రకటితమవుతాయి. అందువలన మహాయోగముతో

ప్రకటింపబడే అణిమాది మహాసిద్ధులను ప్రయోజనమేమీ లేకుండా ఉపయోగించకూడదు. ఎందుకంటె ఈ మహాసిద్ధులు ఈశ్వరుని యొక్క ఐశ్వర్య రూపశక్తికి ప్రతిరూపాలు. వీటిద్వారా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టిని నియంత్రణ చేస్తుంటారు. ఈ మహాసిద్ధులు మానవ మాత్రులు ఉపయోగించే వస్తువులుకావు. వీటిని ఉపయోగించుట వలన ప్రాప్తించుకోవలసిన పరమపదము కూడా లభించదు. అవ్యయుడైన పరమాత్మ యొక్క పరమపదమును చేరుకొనుటకు వీటిని రక్షించుకొనవలసి వుంటుంది. ప్రలోభనములో పడి ఆధ్యాత్మిక పధమును యోగసాధనను వదలివేయకూడదు. ఈ సిద్ధులను ప్రయోజనము లేకుండా వెలుగులోనికి తీసుకొనిరాకూడదు. వీటిని గుప్తముగా ఉంచుటయే మహాయోగ సిద్ధుని లక్షణము. వీటిని ప్రాప్తించుకొనే యోగి జీన్ముక్తుడవుతాడు. బ్రహ్మాండము నంతటకు శుభమును కాంక్షిస్తూ స్వయముగా ఈశ్వర రూపుడవుతాడు.

తనకు ప్రాప్తించిన అధికారమును దురుపయోగము చేయని యోగికి బ్రహ్మాండములో సర్వకార్యములను చేయగల సామర్థ్యమున్ననూ, ఆ ఈశ్వరత్వ అధికారమును దురుపయోగము చేయడు. భారత చక్రవర్తియొక్క ప్రతినిధి వైస్రాయి స్వయముగా రాజుకానప్పటికి అతడిపై చక్రవర్తి యొక్క కృపకారణముచే అతడి పరిపాలనను అందరూ శిరసావహించవలసి యుంటుంది. అతడు తనశక్తి సామర్థ్యములతో తాను కోరుకున్న సర్వకార్యములు చేయగలడు. కాని అతడు కూడా రాజ్య పరిపాలన చక్రవర్తి ఇచ్ఛానుసారమే చేస్తాడు. అతడి ఇచ్ఛకు విరుద్ధముగా ఏ పనీచేయడు. అదేవిధముగా యోగి స్వయముగా ఈశ్వరుడు కానప్పటికి, ఈశ్వరుని అనుగ్రహమువల్ల, ఈశ్వరునితో సమానమైన అణిమాది మహాసిద్ధులను ప్రాప్తించుకొని జగన్నియంత అయిన ఈశ్వరుని రాజ్యమైన ఈ బ్రహ్మాండములో తన ఇచ్ఛానుసారము ప్రవర్తింప గలడు. కాని ఆ యోగి ఈశ్వరునిచే ఏర్పరచబడిన ప్రకృతి నియమములకు విరుద్ధముగా ఎటువంటి కార్యమును చేయడు.

**యోగమార్గములో సిద్ధులు సహజముగా కలుగుతాయి :** ఆకాశ మార్గములో విమాన ప్రయాణము చేయుచున్న యాత్రికుడు భూమిపై నున్న అన్ని మార్గములు, తీర్థములు, పర్వతములు వంటి ప్రదేశములను స్పష్టముగా చూడగలడు. అదేవిధముగా యోగసాధన చేసే సాధకుడు భగవత్ ప్రాప్తికొరకు అంతర్ మార్గమైన సుషుమ్నలో గల **ఆకాశ, మహాకాశ, సూర్యాకాశ** మరియు **పరాకాశము** అను పంచవ్యోమములు లక్ష్యముగా చేసుకొని సాగిపోతున్నప్పుడు అతడికి మార్గములో



ప్రలోభన సూచకమైన సిద్ధి ప్రదమైన దివ్యభావమును ఉత్పన్నముచేసే నానావిధములైన తీర్థములు, నదులు, సరోవరములు, పర్వతములు, సముద్రములు మరియు ఋషి ముని, సిద్ధచారణ, యక్ష, గంధర్వ, కిన్నెర, పన్నగ, విద్యాధర మరియు అప్సరసలు మొదలుగాగల సిద్ధ దేవతల దర్శనము కలుగుతుంది.

దేవతాగణములు సాధకుని గౌరవిస్తూ "ఓ సాధకుడా నీవు ధన్యుడవు. మనుష్య జన్మను పొంది మాకంటే పైనగల మహాతీర్థమైన మోక్షధామమునకు వెళుతున్నావు. సాధనచేసే మీ మనుష్యజాతి పరమశాంతిమయ, అఖండ సుఖస్వరూప ఆనందప్రద మోక్షమును పొందగలరు కాని మా వంటి కర్మ దేవతలు పొందలేరు. అందువలన మేమంతా నిన్ను సత్కరిస్తున్నాము. నీవు కావాలంటే ఇక్కడ ఉండగలవు. ఈ దివ్యభోగములను అనుభవించవచ్చును." అని పొగుడుతారు. కాని బుద్ధిమంతుడైన సాధకుడు తన సాధనాబలముతో ముందునకు వెళ్ళినట్లయితే సూర్యచంద్రఅగ్ని, విద్యుత్ కాంతులకంటె మిన్నగా నుండే అనంతజ్యోతిర్మయ ఆత్మ ప్రకాశమును దర్శించగలడు. ఆ సమయమున దారిలో అణిమాది మహాసిద్ధులు అత్యంత ఉత్సుకతో సాధకుని వరించుటకు వస్తాయి. ఈ విధముగా వివిధ మార్గములలో అనుష్ఠించు జప, తప, జ్ఞాన, ధ్యాన, భక్తి యోగాది కర్మముల వలన అనేకవిధములైన సిద్ధులు ఆధ్యాత్మ మార్గములో వస్తాయి. సాధకులందరికి అవి అనుభవమవుతాయి. ఎందుకంటే ఉన్న వస్తువు వచ్చుట స్వాభావికము. యోగమార్గములో ఈ సిద్ధులవలన లాభముకాని నష్టము కానిలేదు. వాటిపై ఆసక్తి కలిగి వుండటము లేకపోవటము సాధకుని కోరికపై ఆధారపడి వుంటుంది.

**సిద్ధులద్వారా సిద్ధయోగుల పరిచయము :** ఈ మహాసిద్ధుల ద్వారా సిద్ధయోగుల సామర్థ్యమును గుర్తించుట జరుగుతుంది. కంసాలి గీటురాయి ద్వారా అసలు, నకిలీ బంగారమును గుర్తించినట్లు ఈ సిద్ధుల చమత్కారముచేత సిద్ధయోగి మరియు జీవన్ముక్తుని గుర్తించవచ్చును. యోగిజనులు సహజముగా తమ సామర్థ్యమును బయటకు ప్రదర్శించరు. అయినప్పటికి అప్పుడప్పుడు వారియొక్క అలౌకిక గుణములు వెలుగులోనికి వస్తాయి. ఏవిధముగానంటే, ఒక కోటీశ్వరుడైన వ్యక్తి తన యధార్థ పరిస్థితిని దాచిపెట్టి సామాన్యునిగా ప్రవర్తించినను, బుద్ధిమంతుడైన వ్యక్తి అతడి సద్గుణముల ద్వారా నిజస్థితిని తెలుసుకొనగలడు. అదేవిధముగా సిద్ధపురుషుడైన యోగి తన నిజస్థితిని ఎంత దాచిపెట్టినప్పటికి, అర్థము చేసుకొనేవారు

తెలుసుకొనగలరు. సిద్ధులు అనునవి సిద్ధయోగులను గుర్తించే సాధనములు. సిద్ధులులేని వ్యక్తి ఎంత తపస్వి, త్యాగి, జ్ఞాని, ధ్యాని, యోగి, మహాత్ముడయినా అతడిని బద్ధ జీవిగానే తలచవలెను. ఎందుకంటే జీవన్ముక్తుడైన వ్యక్తి యొక్క శక్తి సామర్థ్యములను మరియు జ్ఞానప్రాప్తిని సూచించేవి సిద్ధులు. ఎవరివద్ద శక్తిసామర్థ్యములతో కూడిన జ్ఞానము లేదో అతడు ఇతరులకు ఏమి ఇవ్వగలడు. దరిద్రుడిని ధనము యాచించటము, సిద్ధత్వము లేని అజ్ఞాన స్థితిలో నున్న బద్ధజీవినుండి పరమార్థమును యాచించటము వ్యర్థము.

**సిద్ధ పురుషుడు జీవన్ముక్తుడయి వుంటాడు :** ఈ మహాసిద్ధులను కలిగి వుండటమే యోగసిద్ధి మరియు జీవన్ముక్తి స్థితిగా చెప్పబడుతుంది. వీటిద్వారా జ్ఞాన, ధ్యాన, జప, యోగ పరాయణులైన జీవన్ముక్త సిద్ధ పురుషుల పరిచయ మేర్పడుతుంది. సిద్ధులు అంత అవశ్యకమైనవి కావు అని కొందరి అభిప్రాయము. సిద్ధులువున్నా లేకపోయినా జప, తప, పూజా పాఠములు, భక్తి – సేవలద్వారా ధర్మపరాయణులై బ్రహ్మజ్ఞానమును విచారణ చేస్తుంటే, మరణానంతరము నిశ్చయముగా ముక్తిని పొందవచ్చును అని వారి యభిప్రాయము. కాని వాస్తవిక మార్గమును పాటించకుండా, తన సాధనల ద్వారా ఎటువంటి ఫలితమును పొందకుండా, తమను తాము బ్రహ్మజ్ఞానులుగా, జీవన్ముక్తులుగా తలచేవారు పశు, పక్షులు, కీటకముల మాదిరి చనిపోయి ముక్తిని పొందలేరు. శరీర పతనము ద్వారా లభించే ముక్తిని ముక్తి అనరు. దానిని మృత్యువు అంటారు. ఈ విధముగా చనిపోయే వ్యక్తులు ముక్తిని పొందలేరు. వారు మరల జన్మించి మరణిస్తారు. మృత్యువు ఎవరి ఆధీనములో వుంటుందో వారు ముక్తిని పొందుతారు. వారికి మృత్యువు కలుగదు. వారు అమరులు, జీవన్ముక్తులు అయి వుంటారు.

ఎవరు యోగసాధన ద్వారా తన శరీర మనః ప్రాణములను వశపర్చుకొంటారో, ఎవరి ప్రాణశక్తి శరీరమును వదలి బయటకు రాదో వారికి దేహపతనమెట్లు కలుగుతుంది. ఎవరికి తమయోగబలము ద్వారా పంచత్వ స్థితి లభించి ఒక తత్త్వమును ఇంకొక తత్త్వములో విలీనము చేయగల సామర్థ్యము లభిస్తుందో వారికి మరణము ఎక్కడుంటుంది? దేహమునకు బ్రహ్మత్వము ప్రాప్తించిన తరువాత, లవణము నీటిలో కరిగి జలరూపమును పొందినట్లుగా, అగ్నిలో వేసిన ఇంధనము అగ్నిరూపమును పొందినట్లుగా, బ్రహ్మజ్ఞానము పొందిన దేహము కూడా బ్రహ్మరూప స్థితిని పొందుతుంది. అప్పుడు యోగి జీవన్ముక్తుడవుతాడు. అటువంటి జీవన్ముక్త



పురుషుడి శరీరము అతడి సంకల్పానుసారముగా ప్రవర్తిస్తుంది. అతడి యొక్క సిద్ధుల ప్రభావముతో స్థూల మరియు సూక్ష్మపంచభూతములు వశమగుటచే అతడి ఇచ్ఛానుసారము ఒక తత్త్వము ఇంకొక తత్త్వములో విలీనము చేసి పంచత్వము ప్రాప్తించుకొనగలడు. అతడు ఇచ్ఛానుసారము శరీరమును నిలుపుకొనగలడు.

**సిద్ధులద్వారా ఈశ్వరత్వ సిద్ధి ప్రాప్తించును :** యోగియొక్క యోగసాధన పరిపక్వము పరిపూర్ణము అయిన తరువాత యోగికి పరమజ్ఞానము యొక్క ఐశ్వర్యము ప్రాప్తించిన తరువాత, ఈశ్వరుని యొక్క ఈశ్వరత్వమునకు సంబంధించిన అణిమాది మహాసిద్ధులు ప్రాప్తిస్తాయి. సిద్ధులు ప్రాప్తించినయోగి ప్రకృతిపై విజయమును సాధిస్తాడు. అతడు వేడుకగా తన యోగబలముతో వేలకొలది శరీరములను సృష్టి చేయగలడు. అతడు భూమిపైన మరియు బ్రహ్మాండములో తన ఇచ్ఛానుసారము తిరుగాడగలడు. ఈ విధముగ శక్తి సామర్థ్యములు, ప్రకృతిపై నియంత్రణను పొందిన యోగీశ్వరుడు తన శరీరమునకు భిన్నముగా అనేక శరీరములను సృష్టించగలడు. లేక సృష్టించకపోవచ్చును. అతడికి చేయవలసిన కర్తవ్యము, హేతువు ఏమీవుండదు. తన సత్య సంకల్పమును ప్రదర్శించి శరీరముల ద్వారా స్వర్గాది దివ్యభోగములను అనుభవించగలడు. అప్పుడప్పుడు కైలాసము, సుమేరు, హిమవంతము, మందరాచలము, మలయాచలము వంటి పర్వతములపైన మరియు తీర్థస్థానములలో అనేక శరీరములతో ఉగ్రతపస్సును కూడా చేయగలడు. అతడు తిరిగి ఆశరీరములను తనలో లయముచేసుకొనగలడు.

తన గొప్పతపస్సు మరియు యోగసాధనా బలమువల్ల సాధకుడు మొదట యోగిగా తరువాత ఈశ్వరుడిగా మారతాడు. అప్పుడు ప్రకృతిపై ఆధిపత్యమును పొందగలడు. ఈ విధమైన ఈశ్వరత్వమును పొందిన సాధకునకు, జగత్తును సృష్టించి నాశనము చేయగల సామర్థ్యమును లభిస్తుంది. ఈశ్వరుడు నిర్వహించే పనులను చేయగల సామర్థ్యము అతడికి లభిస్తుంది. ఈశ్వరునిలోగల దివ్య గుణములన్నియు సమాధి స్థితిలో ఈశ్వర సాక్షాత్కారము తరువాత సాధకునికి ప్రాప్తిస్తాయి. అందువల్ల అతడు కూడా ఈశ్వర సదృశుడవుతాడు. ఏ మహాపురుషుల మనః ప్రాణములు తపస్సు ద్వారా ఉన్నత సాధనను చేసి వుంటాయో వారికి సమాధిస్థితి ద్వారా ఈశ్వర సాక్షాత్కారము లభించినపుడు, ఈశ్వరుని యొక్క దివ్యగుణములు లైన జ్ఞాన, వైరాగ్య, త్రికాల దర్శన, అణిమాది మహాఐశ్వర్యములు అనగా ప్రకృతిపై ఆధిపత్యమును స్వయముగా లభిస్తాయి. వీటివలన ఆ యోగికి ప్రకృతిపైన తన

అధిపత్యమును స్థాపించుకొని సృష్టిలోని వైషమ్యములు తగ్గించే సామర్థ్యము లభిస్తుంది. అందువల్ల ఈశ్వరునివలె విశ్వకార్యములలో అనుగ్రహ, నిగ్రహ సామర్థ్యమును పొందిన ఆ యోగి స్వయముగా ఈశ్వరుడే అవుతాడు.

సమాధి విషయములో సాక్షాత్తు శివస్వరూపుడైన గురుదత్తాత్రేయుని అభిప్రాయ మేమంటే, "యోగ, జ్ఞానముల ద్వారా సమాధి సిద్ధి ఫలము ఈశ్వరపదము అను మహాఐశ్వర్యమును పొందటము." సమాధిస్థితి యోగ అభ్యాసము ద్వారా ప్రాణ నిరోధము చేయుటవలన కలుగుతుంది. ప్రాణాయామము ద్వారా మనః ప్రాణములను జయించిన సాధనసిద్ధుడు, కృపాసిద్ధుడు అయిన యోగి మాత్రమే ఈ యోగ ఐశ్వర్యమును ప్రాప్తించుకొని నిశ్చయముగా జీవన్ముక్తుడు కాగలడు. సమాధి స్థితిలో జీవాత్మ, పరమాత్మ ఐక్యత సిద్ధిస్తుంది. జీవబ్రహ్మైక్యము సిద్ధించిన తరువాత సామ్యస్థితి వస్తుంది. దీనిద్వారా జీవుడు తన అల్పజ్ఞతను జీవత్వమును వదలివేసి పరమకల్యాణకరమైన శివరూపమును పొంది సర్వజ్ఞుడు, జ్ఞానమయుడైన ఈశ్వరుడే అవుతాడు.

ఈ సమాధి స్థితి ప్రాప్తించిన యోగి దేహమును త్యజించాలి అను కోరిక కలిగినపుడు స్వయముగా పరబ్రహ్మములో లీనమవుతాడు. అతడి శుభాశుభ కర్మబంధములన్నియు వదలిపోతాయి. అతడి స్థూలదేహతత్వములు పంచభూతములలో కలిసిపోతాయి. అతడి శరీరమునకు సంబంధించిన ఏ అంశమూ ఈ భూమిపైన వుండదు. యోగి తన ఇచ్ఛానుసారము జీవన్మరణములను పొందగలడు. కాని యోగి తన శరీరమును పంచతత్వములలో కలుపకుండా, విదేహముక్తిని పొంది బ్రహ్మములో లయము చేయకుండా నిలుపుకొనుటకు ఇష్టపడితే అతడు జీవన్ముక్త స్థితిద్వారా లభించిన అణిమాది ఐశ్వర్యముల యొక్క బలముతో బ్రహ్మాండములోని లోకములన్నింటి యందు విహరించగలడు.

ఇటువంటి యోగి తన ఇచ్ఛతో క్షణకాలముతో సంకల్పానుసారము శరీరములను ధరించగలడు. దేవతగా స్వర్గానికి వెళ్లగలడు. ఇంకొకసారి యక్షునిగా మారి అంతరిక్షములో తిరుగాడగలడు లేక మనుష్య రూపములో పృథ్విపై తిరుగాడగలడు. ఆ యోగి కోరుకుంటే అతడు మనుష్య, దేవతా శరీరములకు భిన్నముగా పశు, పక్షి, కీటక, శలభాది దేహములుగాని, వ్యాఘ్రము, సింహము, ఏనుగువంటి దేహములుగా గాని రూపధారణను చేయగలడు. ఈ ప్రకారముగా



అన్నింటిని చేయగల సమర్థత సిద్ధించిన మహాజ్ఞాని అయిన యోగి ఈశ్వరునివలె ప్రవర్తించ గలడు. శివరూపుడై సర్వదా నిర్లిప్తుడై వుంటాడు.

**సిద్ధులను ప్రాప్తించుకొనే మార్గములు :** ఈ సిద్ధులు, మనః ప్రాణములపై జయమును పొందినవారికి, ధారణ, ధ్యాన సమాధి స్థితులను పొందిన సంయముడైన సాధకునకు, అనన్యభక్తి పరాయణులయిన యోగులకు మాత్రమే సిద్ధిస్తాయి. సిద్ధులు ఎన్నివిధములగా వుంటాయో ఏ ప్రకారము సిద్ధిస్తాయో ఈ దిగువన విస్తారముగా చర్చించబడినది.

భగవానుడైన ఈశ్వరుడు చెప్పిన సిద్ధులు అనేక విధాలుగా ఉన్నప్పటికి వాటిలో 18 సిద్ధులను ముఖ్య సిద్ధులుగా చెప్పవచ్చును. వీటిలో వరుసగా అణిమ, లఘిమ మహిమ, ప్రాప్తి, ప్రాకామ్య, ఈశత్వ, వశిత్వ, కామవసాదిత్వ సిద్ధి అను ఎనిమిది విధములైన మహాసిద్ధులు ప్రధానమైనవి. ఇవి భగవానుని పై అనన్య భక్తిని కలిగి యున్న యోగులకు కూడా ప్రాప్తిస్తాయి. ఇవి కాకుండా దశవిధములైన గౌణ సిద్ధులు కూడా వున్నాయి. ఇవి సత్వగుణాధిక్యతా స్థితియందు ధారణ ద్వారా ప్రాప్తిస్తాయి.

అణిమా సిద్ధి ద్వారా యోగి సూక్ష్మము నుండి అతి సూక్ష్మమునకు మారగలడు. లఘిమా సిద్ధి ద్వారా వాయువువలె తేలికపడి వేగముగా చరించగలడు. అతడికి త్వరితగతిన కార్యములను చేయగల సమర్థత వస్తుంది. మహిమా సిద్ధి ద్వారా మహాత్ముడుగా మారి అందరికి పూజనీయుడవుతాడు. ప్రాప్తి సిద్ధి ద్వారా మహాదుర్లభమైన అప్రాప్య వస్తువులను పొందగలడు. ప్రాకామ్య సిద్ధి ద్వారా సర్వవ్యాపకత్వ గుణము ప్రాప్తిస్తుంది. ఈశత్వా సిద్ధి ద్వారా ఈశ్వర సమానమైన శక్తిని పొందగలడు. వశిత్య సిద్ధి ద్వారా సర్వప్రాణులను వశపర్చుకునే సామర్థ్యము మరియు ఇచ్ఛానుసారము ప్రవర్తించగల సామర్థ్యము వస్తుంది.

ఈ వశిత్వ మనునది సప్తమ సిద్ధి అయివున్నది. బ్రహ్మాండములో ఇచ్ఛానుసారము ఎక్కడికైనా వెళ్ళగల సామర్థ్యమును కలిగి వుండుటను కామ వసాదిత్య అష్టమసిద్ధిగా చెప్పబడినది. యోగులయొక్క యోగబలమే సిద్ధుల ప్రాప్తికి కారణమవుతుంది. యోగులయొక్క అష్టవిధ మహాసిద్ధులయొక్క యోగ ఐశ్వర్యమే ఈశ్వరత్వముగా మరియు యోగబలమే యోగ సిద్ధికి కారణముగా చెప్పవచ్చును.

ఈ అష్టమహాసిద్ధులలో అణిమ, మహిమ, లఘిమ, అనునవి శారీరక సిద్ధులు. ప్రాప్తి అనబడే నాల్గవ సిద్ధి ఇంద్రియ సిద్ధి అయివున్నది. వినిన మరియు చూచిన

విషయముల గురించి తన ఇచ్ఛానుసారము తెలుసుకొనే సిద్ధిని ప్రాకామ్య సిద్ధిగా చెప్పవచ్చును. తనశక్తిని ఇతరులలో ప్రేరేపించే ఆరవసిద్ధి ఈశత్వ సిద్ధిగా చెప్పబడినది. త్రిగుణముల ప్రభావమునకు లోనుకాకుండా ఉండటము అనగా అనేక భోగములను అనుభవిస్తూ వాటియందు ఆసక్తిని చూపకపోవటమును వశిత్వమను ఏడవ సిద్ధిగా చెప్పబడినది. కోరికలన్నింటిని ప్రాప్తించుకొనే సిద్ధి కామవశ్యాదిత్య సిద్ధిగా పేర్కొనబడినది. ఈ అష్టమహాసిద్ధులు, ఈశ్వరత్వమును పొందిన తరువాత సాధకునికి ప్రాప్తిస్తాయి.

సత్వగుణ ఆధిక్యత వలన ధారణ, ధ్యాన, సమాధి మరియు సంయమ స్థితుల ద్వారా దశ విధములై సిద్ధులు ప్రాప్తిస్తాయి. మొదటి సిద్ధి ఉర్మిత్వము అనగా ఆకలి, దప్పులు, మోహ, శోక, జనన, మరణముల యొక్క నివృత్తి అనగా శరీర ప్రకృతిపై విజయమును పొందుట అయివున్నది. రెండవది మనోజవ సిద్ధి. అనగా మనోవేగముతో ప్రయాణించుట, మూడవ సిద్ధి దూరశ్రవణము, నాల్గవ సిద్ధి దూరదర్శనము చేయుట, ఐదు కామరూప సిద్ధి అనగా ఇచ్ఛానుసారము రూపధారణ చేయగల శక్తి, ఆరవ సిద్ధి పరకాయ ప్రవేశము అనగా అన్యశరీరము లందు ప్రవేశించగల శక్తి, ఏడు స్వచ్ఛంద మృత్యువు అనగా తాను కోరినప్పుడు శరీరము వదిలివేసే శక్తి మరియు దేవకాంతలతో క్రీడించే శక్తిని కలిగి వుండుట. ఎనిమిది సంకల్ప ఫలసిద్ధి అనగా సంకల్పించిన మాత్రమునే కోరిక నెరవేరే సిద్ధి, తొమ్మిదవ సిద్ధి అప్రతిహత ఆజ్ఞాసిద్ధి. అనగా బ్రహ్మాండములో ఆ యోగి ఆజ్ఞను ఎవ్వరూ ఉల్లంఘించలేరు. పదవసిద్ధి అనవరోధగతి అనగా అవరోధములు లేకుండా అన్ని ప్రదేశములకు వెళ్ళగలిగే సిద్ధి. వీటినే దశ విధములైన సిద్ధులుగా పేర్కొన్నారు. పైన పేర్కొనిన అష్టాదశ మహాసిద్ధులు కాకుండా త్రికాలజ్ఞత అనగా భూత, భవిష్యత్ వర్తమాన కాల జ్ఞానము పొందుట, నిర్ద్వందత అంటే శీత, ఉష్ణ, సుఖ, దుఃఖములు, రాగ, ద్వేషములకు వశము కాకుండుట, పరచిత్త అభిజ్ఞత, అనగా ఇతరుల మనస్సులోని విషయములను తెలుసుకొనుట, అగ్ని, సూర్య, జల, విషములు మొదలుగాగల శక్తులను వశపర్చుకొనుట నిరోధించుట, సహించుట ఆ శక్తులకు వశ్యుడు గాకుండుట, ఎవరివల్ల పరాజితుడు కాకుండుట అను మరియొక ఐదు సిద్ధులు కలవు. ఎటువంటి ధారణవల్ల ఇవి లభిస్తాయో, దిగువన చెప్పబడినది.

ఏ యోగి సూక్ష్మభూతములైన శబ్ద, స్పర్శాది స్వరూప తన్మాత్రల యందు మనస్సును లగ్నముచేసి ధారణ చేస్తాడో అతడికి అణిమా సిద్ధి లభిస్తుంది. పరమాత్మ



యందు మనస్సు నిలిపి భూమి ఆకాశము, నీరు, తేజస్సు, వాయువు వంటి స్థూల పంచ మహాభూతములందు మరియు శబ్ద, స్పర్శ, రూప, రస గంధముల వంటి సూక్ష్మ భూత సమూహములందు ధారణ, ధ్యాన, సమాధి మరియు సంయమము చేసిన యోగికి మహిమా సిద్ధి లభిస్తుంది.

స్థూలమహాభూతములందు పరమాణు వంటి ఉపాధి కలిగిన పరమాత్మ స్వరూపమును ధారణ చేయుటచే లఘిమాసిద్ధి లభిస్తుంది. ఈ సిద్ధివల్ల యోగి అతిసూక్ష్మ స్థితిని పొందగలడు. సాత్విక అహంకార రూపమైన పరమాత్మ స్వరూపము నందు మనస్సును దృఢముగా ధారణ చేయుటచే ఇంద్రియములపై అదుపును సాధిస్తాడు. అతడి ఇంద్రియములు దివ్యభావమును ప్రాప్తించుకొంటాయి. దీనిని ప్రాప్తి మహాసిద్ధిగా చెప్పవచ్చును.

ఏ యోగి తన మనస్సును సూత్రాత్మ స్వరూపమైన బ్రహ్మముపై స్థిరము చేస్తాడో అతడు అవ్యక్త బ్రహ్మము అయిన నారాయణుని పరమోత్కృష్టమైన ప్రాకామ్య సిద్ధిని పొందుతాడు. ఏ యోగి త్రిగుణాత్మకమైన మాయపై ఆధిపత్యముగల కాల స్వరూపుడైన విష్ణుభగవానునిపై సంయమనము చేసి చిత్తమును ధారణ చేస్తాడో అతడికి ఈశత్వ సిద్ధి ప్రాప్తిస్తుంది. ఆ సిద్ధి ప్రాప్తించుటచే అతడు సమస్తజీవ సమూహములపై అనగా సమస్త ప్రాణుల శరీరములపై ఆధిపత్యము సంపాదిస్తాడు. అహేతుక కరుణాభావముతో ఏ యోగి నారాయణునియై మనస్సు నిలిపి భగవానునివలె కర్తృత్వ భావము లేకుండా సాధన చేస్తాడో అతడికి వశిత్వమను సిద్ధి ప్రాప్తిస్తుంది. ఈ విధముగా భగవానుని నిర్గుణ సచ్చిదానంద బ్రహ్మరూపమును తన నిర్మల పవిత్ర మనస్సులో సంయమముచేసి ధారణ ధ్యాన సమాధి పొందిన యోగికి ప్రాకామ్య సిద్ధి లభిస్తుంది. ఈ సిద్ధి లభించుటచే కోరికలు సంపూర్ణముగా తీరిపోతాయి. అవి నిశ్శేషము కూడా కావచ్చును. భగవానుని యొక్క ధర్మమయ శుద్ధ స్వరూపమును శుక్లాత్మకతతో పరిపూర్ణ మయిన సచ్చిదానంద స్వరూపమును ధారణ చేయు యోగి జనన, మరణ, క్షుధా, తృష్ణ, శోక, మోహ రూప శరీరక ధర్మముల నుండి విముక్తుడై పవిత్ర మవుతాడు.

ఏ యోగి సుషుమ్న నాళములో నున్న సూక్ష్మ అంతరాకాశములో గల ప్రాణరూప పరమాత్మునిపై మనస్సును స్థిరముచేసి అనాహత నాదమును వింటాడో అతడికి దూర శ్రవణ సిద్ధి కలుగుతుంది. ఆ అంతరాకాశము నందు ధారణ చేయుటచే

ప్రాణుల భాషను వినగలడు. అర్థము చేసుకొనగలడు. నేత్రములకు సూర్యునితో, మరియు సూర్యరూప నేత్రములకు గోలోకముతో సంబంధము కలదు. ఆ సంబంధముయొక్క సంయోగ్రరూపమైన బ్రహ్మనాడి సుషుమ్న ద్వారములో భగవానుని సూర్య రూపములో ధారణ చేయు సూక్ష్మదర్శి అయిన సిద్ధయోగికి దూర దర్శనము చేసే సామర్థ్యము సిద్ధిస్తుంది. ఆ శక్తితో అతడు విశ్వములోని సూక్ష్మ పదార్థములను కూడా తన దివ్య దృష్టితో చూడగలడు.

దేహమును స్థిరము చేసి ప్రాణవాయువును సుషుమ్న నాళమునందుగల హృదయకమలములో నిరోధించుటవలన యోగికి "మనోజయ" సిద్ధిలభించును. ఆ సిద్ధి బలముతో యోగి మనస్సు ఎక్కడికి వెళితే శరీరము కూడా అక్కడకు చేరగలుగుతుంది. భగవానుని వివిధ రూపములపై సంయమనము చేయు యోగి తన యోగబలముతో తనుకోరిన రూపములను పొందగలడు. యోగికి పరకాయ ప్రవేశము చేయవలెనను కోరిక వుంటే సుషుమ్న మార్గము నుండి మనః ప్రాణములను భ్రూమధ్యమున గల ఆజ్ఞాచక్రమునకు తెచ్చి సంయమశక్తి ద్వారా రెండవ శరీరములో తన ఆత్మను ప్రబలముగా భావించి తన దేహము నుండి ప్రాణవాయువును సూక్ష్మ శరీరముతో పాటు వెలికి తెచ్చి భ్రమరము మాదిరి అన్య శరీరములో ప్రవేశించగలడు. యోగికి శరీరము త్యజించ వలననెడి కోరిక కలిగినపుడు మహాబంధము వేసి మూలబంధము ద్వారా పశ్చిమ మార్గమైన సుషుమ్న యందు మూలాధారము మొదలు షట్చక్రములను దాటి మనః ప్రాణములను బ్రహ్మరంధ్రము వరకు తెచ్చి స్థూల పంచమహాభూతములను నష్టము కావించి బ్రహ్మములో లయము అవుతాడు. అనగా సహస్రారమును పగుల గొట్టుకొని పరబ్రహ్మములో విలీనమవుతాడు. యోగికి దేవతల విహార స్థానమునందు క్రీడించవలనను కోరిక కలిగినపుడు, భగవానుని గుణములైన శుద్ధ సాత్విక భావమును మనస్సునందు నిలుపుకొని సాధనచేయుటచే దేవతా స్త్రీలు అతడి సన్మానార్థము విమానముతోపాటు ప్రత్యక్షమవుతారు.

ఏ మహాత్ముడయిన యోగి పరాయణుడు, భగవానుని సత్యస్వరూపము నందు మనస్సును స్థిరముచేసి సదాభగవానుని ధ్యానిస్తూ వుంటాడో అతడు తన స్థిరబుద్ధి ద్వారా చేసిన సంకల్పములు వెంటనే సిద్ధిస్తాయి.

ఏ యోగి తన తపోబలముతో ఈశ్వరుని ఐశ్వర్యమయిన ఈశ్వరత్వమును ప్రాప్తించుకొంటాడో అతడి ఆజ్ఞను భగవానుని ఆజ్ఞతో సమానముగా భావించి ఈ



బ్రహ్మాండములో ఎవరూ దానిని ఉల్లంఘించరు. ఏ యోగి తన సాధనా బలముతో శుద్ధ సత్వమును ఆశ్రయించి ధారణ, ధ్యాన, సమాధి లేక సంయమ శక్తిని ప్రాప్తించుకొంటాడో అటువంటి పరమభక్తుడైన యోగి యొక్క బుద్ధి సహజముగా త్రికాలదర్శి అవుతుంది. దానిద్వారా అతడు జన్మ, మృత్యువుల గురించిన జ్ఞానమును, భూత, భవిష్యత్, వర్తమాన కాలముల గురించిన జ్ఞానమును చక్కగా తెలుసుకొన గలడు. ఏ యోగికి యోగసాధనము ద్వారా సిద్ధి ప్రాప్తించి, భగవానుని అనుగ్రహము ద్వారా శరీర, ఇంద్రియ, మనః ప్రాణములకు దివ్యభావ ప్రాప్తి కలుగుతుందో, అతడి దివ్యశరీరమును అగ్నివంటి భౌతిక పదార్థములు నాశనము చేయలేవు.

యోగసాధన ద్వారా భగవానుని ఉపాసించే ముని జనులకు ధారణ ధ్యాన, సమాధి మరియు సంయమరూప యోగ ధారణ ద్వారా పైన ఉదహరించిన సమస్త సిద్ధులు సంపూర్ణముగా ప్రాప్తిస్తాయి. ఇందులో సందేహములేదు.

ఏ యోగి యొక్క మనస్సు సర్వోత్తమ యోగసాధన ద్వారా భగవానుని యందు లగ్నమవుతుందో అతడికి ఈ సిద్ధులన్నీ అంతరాయములుగా విఘ్నములుగా చెప్పబడ్డాయి. ఇంతకు ముందు చెప్పబడిన కల్పిత సిద్ధులన్ని సమాధి ద్వారా యోగికి సహజముగా ప్రాప్తిస్తాయి. కాని యోగము యొక్క చరమ ఉద్దేశ్యము దివ్య బ్రహ్మ జ్ఞానమును మరియు ముక్తిని పొందుట అయివున్నది. ఈ సిద్ధులు బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి నిదర్శనములు. వీటియందు ఆసక్తిని చూపితే అవి బాధాకరములు అవుతాయి. అందువలన ఇవి విఘ్నములుగా చెప్పబడ్డాయి.

# సిద్ధమహాయోగము

## పదహారవ ప్రకరణము

**అష్టాంగ యోగము :** ఏ యోగము యొక్క గొప్పతనము సాక్షాత్తు మహేశ్వరులచే కీర్తించబడినదో, ఏ యోగమును అనుష్ఠించుటవలన రోగ, శోక, దుఃఖ, దైన్యములు నశించి, పరమానంద ప్రాప్తి కలిగి జనన మరణ చక్రభ్రమణము నుండి విముక్తి కలుగుతుందో అటువంటి త్రితాప నాశకమైన యోగమునందు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అను అష్టాంగములు కలవు.

**యమము పది విధములు :** అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, ఆర్జవము, క్షమ, ధృతి మితాహారము మరియు శౌచములను కలిపి యమము అని చెప్పబడినది.

**అ) అహింస :** ఏ ప్రాణికి తన మనస్సుతో, వాక్కుతో, శరీరముతో దుఃఖమును కలిగించకుండా వుండుట లేక ఎటువంటి పరిస్థితులందు కూడా ప్రాణులను వధించకుండుటను మహర్షులు అహింసగా చెప్పారు. సమస్త ప్రాణులు కూడా మనుష్యులవలె తమ శరీరముపై మహాప్రేమను కలిగి వుంటాయి. అవి ఈశ్వరేచ్ఛ ప్రకారము తమ కర్మ ఫలములను భోగిస్తూ వుంటాయి. వాటిని తమ కర్మ ఫలములను అనుభవించకుండా చేసి ఈశ్వరుని శాసనమును ఉల్లంఘించుట మహాపాపము.

**ఆ) సత్యము :** ఈ ప్రపంచములో దృశ్యాదృశ్యములన్నియు సత్య స్వరూపుడైన ఈశ్వరుని యందు నిలిచి వుంటాయి. అందువల్ల సత్యము తోడనే అన్నీ ప్రాప్తిస్తాయి. సత్యస్వరూపుడైన పరమాత్మను ప్రాప్తించుకొనుటకు, సత్యమునే ఆచరించే యోగి, జనులకు హితము చేస్తూ ప్రియమును కలిగించే సత్యమును మాత్రమే చెప్పాలి. ఎందుకంటే అంతరములో ఏ సత్యస్వరూప జ్యోతిర్మయ ఆత్మను పాపరహితులైన యోగులు దర్శిస్తారో ఆ నిత్యమైన ఆత్మ, బ్రహ్మచర్యముతో చేసెడి తపస్సువలన, యదార్థ జ్ఞానము ద్వారా మాత్రమే లభించును. మనోవాక్కాయ కర్మలచే ఎటువంటి పరిస్థితులందుకూడా మిథ్యాచరణమును చేయకుండుటయే సత్యముగా చెప్పబడినది. సత్యమును మించిన తపస్సులేదు. అందువలన సత్యమును తప్పక ఆచరించవలెను.

**ఇ) అస్తేయము :** ఇతరుల ద్రవ్యమును, వస్తువులను, ధన ధాన్యములను ఇంకా ఇతర వస్తువులను దొంగిలించటము లేక దౌర్జన్యముతో హరణము చేయుటను అస్తేయము అనగా దొంగతనము చేయుటగా చెప్పబడినది. అటువంటి అధర్మ ఆచరణము చేయకుండుటను అస్తేయముగా చెప్పబడినది. అందువలన ఎప్పుడు, ఎక్కడైనా తనకు సంబంధించని ఇతరుల వస్తువులను అనగా తృణము నుండి బంగారు, వెండి, వజ్రము, ముత్యము, ఆభరణములు, వంటి ఎంతటి అమూల్య రత్నములనైనను అన్యాయముగా పొందాలని మనోవాక్కాయ కర్మలచే కోరుకొనక పోవుటను అస్తేయమందురు. దొంగతనమును త్యజించుటను జ్ఞానులు అస్తేయముగా వర్ణించారు.



**ఈ) బ్రహ్మచర్యము :** బ్రహ్మచర్య వ్రతమును పాటించే బ్రహ్మచారులలో నైష్ఠిక, ఉపకుర్వాణమను రెండు భేదములు కలవు. పూర్వకాలములో ఋషి, మునుల యందు ఈ ఆచారము కలదు. బ్రహ్మచారి విద్యను ఆర్జించి గృహస్థుడుగా మారితే అతడిని ఉపకుర్వాణుడుగా చెప్పారు. గృహస్థులు కాకుండా యావజ్జీవితము బ్రహ్మచర్యమును పాటించే వారిని నైష్ఠిక బ్రహ్మచారులుగా చెప్పారు. నైష్ఠిక బ్రహ్మచర్యము మరణ పర్యంతము అనుష్ఠించబడుతుంది. అందువలన యతులు, సన్యాసులు లేక జీవన పర్యంతము బ్రహ్మచర్యము అనుష్ఠించే వారు మనోవాక్కాయ కర్మలచే ఎనిమిది విధములైన మైథునములను వదిలివేయుటనే బ్రహ్మచర్య మందురు. కామవశులై స్త్రీరూపములను ధ్యానించుట, స్మరించుట, పొగడుట, కాముక దృష్టితో స్త్రీలను చూచుట, వారితో సరససల్లాపములాడుట, వారిని ఏకాంతముగా కలుసుకోవాలి అనుకోరికను కలిగి వుండుట, వారితో భోగించుట అనునవి ఎనిమిది విధములైన మైథునములుగా చెప్పబడ్డాయి. వీటినుండి విముక్తులయిన వారు మాత్రమే బ్రహ్మచారులుగా చెప్పబడ్డారు. అనగా యతులు సన్యాసులు, బ్రహ్మచారులు ఎటువంటి పరిస్థితులందైనా కూడా స్త్రీ సంసర్గము లేకుండా వుండటమును బ్రహ్మచర్యమందురు. సంతానము కొరకు ఋతు కాలములో స్త్రీ సహవాసము చేయుటను గృహస్థుల బ్రహ్మ చర్యముగా చెప్పబడినది.

**ఉ, ఊ) దయ, ఆర్జవము :** దీన దుఃఖితులపట్ల సానుభూతి, సర్వప్రాణులను తనకు మాదిరిగా తలచి మనోవాక్కాయ కర్మలచే ప్రేమించుటను వేదాంతవేత్తలు దయగా చెప్పారు.

పుత్రులతో, మిత్రులతో, బంధుమిత్రులతోనే కాకుండా శత్రువుపట్ల కూడా కుటిలత్వము వదలివేసి సరళ స్వభావమును కలిగి వుండుట, మనోవాక్కాయ కర్మలతో ప్రవృత్తి నివృత్తిలలో సమభావము కలిగి వుండి ఒకే విధముగా ప్రవర్తించుటను ఆర్జవము అందురు.

**ఋ, ౠ) క్షమ, ధైర్యము :** శక్తివంతుడైనప్పటికి తనకు అహితము చేసిన వారికి దండన ఇవ్వకుండా ఉదారముగా క్షమించి వదలివేయుటను మరియు సత్కారమునందు తిరస్కారమందు, మాన–అవమానములందు, ప్రియ – అప్రియము లందు ఓర్పును కలిగి వుండుటను క్షమ అందురు. అనగా శత్రువులద్వారా కష్టములు పొందినప్పటికి మనోవాక్కాయ కర్మలద్వారా తన బుద్ధిలో ఎటువంటి క్షోభ కనపర్చకుండుటను క్షమగా చెప్పబడినది.

ప్రపంచములో జ్ఞానము లభించకుండా శాంతి లభించదు మరియు మోక్షము కలుగదు అని వేదములు ఉద్ఘోషించాయి. పైన చెప్పిన వేదవాక్యములకు అనుగుణంగా ఏ లక్ష్యమును సాధకులు మనస్సులో నిలుపుకొన్నారో దానిని ఎన్ని వేల ఆపదలు కలిగినా వదలి పెట్టకపోవుటను ధైర్యము అందురు. ద్రవ్యనష్టము కలిగినపుడు కాని, తన కుటుంబీకుల వియోగము వల్లకాని, మరల సంపదలు ప్రాప్తించినపుడు కాని, ఎల్లవేళలా చిత్తమును సమస్థితిలో నుంచుటయే ధైర్యమని చెప్పవచ్చును.

**ఎ) మితాహారము :** నియమిత ఆహారమును తీసుకొనకపోయిన ఎడల యోగసాధనలు ప్రారంభించినప్పటికి అనేక విధములైన వ్యాధులు కలిగి సిద్ధి లభించదు. అందువలన యోగ సాధనలో ఆహార నియమములు పాటించుట అత్యావశ్యకము అని సాధకులు తెలుసుకొనవలసి వుంటుంది. బ్రహ్మచర్యము మరియు ఆహార నియమములను పాటించ కుండా ఎంతగా జ్ఞాన, ధ్యాన, యోగ, జప, తపములు చేసినప్పటికి పరమార్థ సిద్ధి లభించదు. అందువలన యోగ శాస్త్రముతో పాటు అనేక కల్యాణకారక శాస్త్రములన్నియు అనేకసార్లు మైథునము మరియు ఆహార నియమములపట్ల జాగరూకత వహించ వలసినదిగా బోధించాయి.

తక్కువగా ఆహారము స్వీకరించుటవలన శరీరము శుష్కించిపోయి పనికిరాకుండా పోతుంది అని చాలామందికి గల అభిప్రాయము కేవలము భ్రమాత్మకము. అమితముగా భుజించే జనులు పూర్తి ఆయుర్దాయమును భోగించక అల్పాయువులై మరణిస్తారు. ఎంతమంది ఎక్కువగా తిని మరణిస్తారో అంతమంది తక్కువ తినటం వల్ల మరణించరు. ఈ ప్రపంచములో అజ్ఞానులైన జనులు సర్వ సుఖములకు మూలము మైథున, ఆహారములే అని అనుకొంటారు. కాని విచారించి చూచినట్లయితే వీటి పరిణామము అత్యంత భయానకముగా వుంటుంది.

మానవులు ఈ జగత్తులో అన్ని పదార్థములను భోగించవచ్చును. కాని నియమిత రూపములో వీటిని అనుభవించినట్లయితే శరీర, మనః ప్రాణములకు మరియు ఇంద్రియములకు శక్తి పెరుగుతుంది. దీని ద్వారా తుష్టి, పుష్టి కలిగి అర్థ మరియు పరమార్థ సిద్ధి కలుగుతుంది. మానవుల కర్తవ్యము ధర్మార్థ కామ మోక్షములను పొందుట అయినప్పటికి వారికి స్థూల దేహముతో ఎటువంటి ఆహారమును స్వీకరించవలెనో తెలియదు. ఆహార నియమములను వారు పాటించరు.

వారి శరీరము, మనస్సు, ప్రాణము, ఇంద్రియములు భోగములను అనుభవించి, అనుభవించి నియంత్రణ కోల్పోయి వుంటాయి. వారికి భోగించుట ద్వారా లభించు



వాస్తవిక సుఖముకూడా లభించదు. ఏ విధముగా అజీర్ణములో నున్న వ్యక్తికి మంచి భోజనము, మైథునము ద్వారా బలహీనపడిన వ్యక్తికి స్త్రీ సంగము వినాశన హేతువులవుతాయో అదే విధముగా జనులు భోగములను అనుభవించలేరు. భోగములే వారిని అనుభవిస్తాయి. పరమార్థము సంగతిని ప్రక్కనపెట్టి, సంసార సుఖములనుండి కూడా వారు వంచితులు కావలసి వుంటుంది. అందువలన అభ్యుదయమును కాంక్షించే వ్యక్తులు మితాహారమును స్వీకరిస్తూ బ్రహ్మచర్యమును తప్పక పాటించాలి.

తక్కువగా తింటే త్వరగా మరణిస్తారు అని చాలామంది అభిప్రాయము. ఎక్కువగా తిని ఎంతగా స్థూల శరీరమును పెంచుతారో అంతగా సూక్ష్మశరీరము నిర్బలమవుతుంది. పహిల్వానులు ధ్యాన, ధారణలు చేయలేరు. యోగసాధనలు చేయకుండా అస్వాభావిక రూపములో స్థూల శరీరమును పెంచినట్లయితే సూక్ష్మశరీరము దుర్బలమవుతుంది. బుద్ధికూడా స్థూలమవుతుంది. అందువలన మెదడు, సూక్ష్మమైన విషయములను గ్రహించలేదు. ఎక్కువగా భుజించేవారు మనస్సును ఏకాగ్ర పరచుటచేత నిద్ర ఆవహిస్తుంది. తమోగుణ ఆధిక్యతవలన మనస్సు సూక్ష్మతను కోల్పోతుంది. మితాహారము తీసుకొనే వ్యక్తికి స్థూల శరీరము దుర్బలమయినప్పటికి, సూక్ష్మశరీరము బలముగా వుంటుంది. అందువల్ల అతడు తన మనస్సును ఇచ్ఛానుసారము ఏకాగ్రము చేయగలడు.

స్వల్ప భోజనము వలన అతడి స్థూల శరీరములోని నాడులన్నియు శుభ్రపడుతాయి. అందువలన రజోగుణము, తమోగుణము అణచి వేయబడుతాయి లేక నశించిపోతాయి. సత్వగుణము పెరుగుతుంది. శరీరములో స్ఫూర్తి, మనస్సులో ఉత్సాహము కలుగుతుంది. శరీరములో మాంసము, మజ్జ అవసరమును మించి లేకపోవుటవలన వాత, పిత్త, కఫ దోషములు సమతుల్య స్థితిలో వుంటాయి. ఫలితముగా జీర్ణాశయము, అమాశయము మరియు మూత్రాశయమునకు సంబంధించిన శారీరక క్రియలు నియమ బద్ధమై దీర్ఘాయువు ప్రాప్తిస్తుంది. అతడి ఆయువు బుద్ధి, తేజము పెరుగుతాయి. మితాహారము భుజించు వారికి వైద్యము మరియు వైద్యుని అవసరము వుండదు. వారు తిన్న ఎటువంటి స్వల్ప ఆహారమువల్లనైనను జఠరాగ్ని ప్రజ్వలించి అది అమృతప్రాయమై అతడి మనః ప్రాణములను మరియు శరీరమును దృఢపరుస్తుంది.

ఆహారము శుద్ధముగా, మధురముగా, తేలికగా వుండి పాలు పెరుగు వంటి రసవంతమైన పదార్థముతో కూడి వుండాలి. సగము పొట్ట ఖాళీగా వుండే విధముగా భోజనము చేయాలి. పొట్టనంతా నింపకుండా సగభాగము ఆహారముతో నింపి మూడవభాగమును జలముతోడను నాల్గవ భాగమును వాయుసంచారము కొరకు ఖాళీగా వుంచాలి. దీనినే మితాహారము అంటారు. సదా ఈశ్వర ఆరాధన పరాయణులైన మునులు, సన్యాసులు ఎనిమిది కబళముల ఆహారమును మరియు అరణ్యములలో నివసించే వాన ప్రస్థులు లేక తపస్విలు 16 కబళములు ఆహారమును మాత్రమే తీసుకోవాలి. గృహస్థులు 32 కబళములు ఆహారముగా స్వీకరించాలి. విద్యను అభ్యసించే విద్యార్థులు, బ్రహ్మచారులు తమ ఇచ్ఛానుసారము భోజనము చేయవచ్చును. ఈ మితాహారము నిర్దిష్టమైనది. ఈ వ్రతమును పాటించ లేకపోతే వారు ఇప్పుడు తీసుకొనే ఆహారముకన్నా తక్కువగా ఆహారము స్వీకరించాలి.

**ఏ) శౌచము :** శౌచము బాహ్య, అంతరమను రెండు విధములుగా వుంటుంది. మృత్తిక మరియు జలముతో శరీరమును శుద్ధి చేసుకొనుటకు బాహ్య శౌచముగా చెపుతారు. రాగ, ద్వేషములు లేకుండా ధార్మిక కర్మలను అనుష్ఠించుతూ ఆధ్యాత్మిక జ్ఞానముద్వారా చిత్త శుద్ధి కొరకు ప్రయత్నించుటయే ఆంతరిక శౌచము అని చెప్పవచ్చును.

**2) నియమములోని పది అంగములు :** యోగశాస్త్ర విదులైన ఋషి, మునులు చెప్పిన ప్రకారము నియమమునందు తపము, సంతోషము, శాస్త్రములందు దృఢవిశ్వాసము, దానము, ఈశ్వర పూజనము శాస్త్ర వాక్య శ్రవణము, లజ్జ, బుద్ధిమత్వము, జపము, హవనము అను పది అంగములను కలవు.

**అ) తపము :** శాస్త్రములలో కాయిక, వాచిక, మానసికమను వివిధ తపస్సులు చెప్పబడ్డాయి. తమ యోగ్యత ననుసరించి కృచ్ఛ, చాంద్రాయణ, ప్రాజాపత్య వంటి తమకు అనుకూలమైన పద్ధతులను అనుసరించి తపస్సును చేయవలసినదిగా భగవద్గీతలో చెప్పబడినది. కోరికలు లేకుండా, ఈశ్వరార్పణ బుద్ధితో ఈ వ్రతములు అనుష్ఠించితే మనస్సు, ప్రాణము శరీరములకు సత్వర శుద్ధి కలుగుతుంది. అందువలన ఉపవాసములు, జప, తప, వ్రతముల ద్వారా శరీర శోషణ చేయుటనే తపస్సు అని ఋషి, మునులు ఉల్లేఖించారు. తపస్సు ద్వారా మనుషులు దేవతలు అవుతారు. సృష్టి ఆరంభములో దేవతలు కూడా తపస్సుద్వారా ఈశ్వరత్వ లాభమును పొందారు. స్వయముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు తపస్సు ద్వారానే ఈశ్వరత్వమును పొందగలిగారు.



ఎవరు అజేయులో వారి ఆజ్ఞను ఎవ్వరూ అతిక్రమించలేరు. ఇది తపస్సు ద్వారా మాత్రమే సాధ్యపడుతుంది. తపస్సును ఎవ్వరూ అతిక్రమించలేరు. ఈ ప్రపంచములో మోక్ష ప్రాప్తికి శ్రేష్ఠమయిన మార్గము తపస్సు. తపస్సు లేకుండా ఏ జీవి కృతార్థతను పొందలేదు. తపస్సు లేని జ్ఞాన, ధ్యాన, భక్తి యోగములు ఎప్పటికి ఫలీభూతము కాలేవు. తపస్సు మాత్రమే బ్రహ్మాండమునంతయు జయించుటకు సహాయపడుతుంది. తపస్సు ద్వారా సాధించలేని కార్యములు లేవు. యోగశాస్త్రములో ప్రాణాయామమును మించిన గొప్ప తపస్సు లేదు. అందువలన యోగసాధనయే గొప్ప తపస్సుగా చెప్పబడినది.

**ఆ, ఇ) సంతోషము, ఆస్తిక్యము :** తమ ప్రారబ్ధానుసారము దైవేచ్ఛవల్ల ప్రతినిత్యము తనకు ప్రాప్తించిన దానితో సంతుష్టులయి వుండుటను సంతోషమని చెప్పబడినది. ఎవరి మనస్సు బ్రహ్మలోక పర్యంతముగల సుఖములను గురించి ఆలోచన చేయదో, ఎవరి మనస్సు విషయ సుఖములపట్ల విముఖత చెంది వుంటుందో, ఎవరు ఆసక్తి లేకుండా ఎప్పుడు సంతోషముగా వుంటారో వారు సుఖముగా వుంటారు. ప్రతి ఒక్క పరిస్థితి యందు సర్వదా ప్రసన్నులై శాంతిని కలిగి వుండుటనే సంతోషమని చెప్పబడినది. వేద, ఉపనిషత్, స్మృతి, దర్శన శాస్త్రములలో చెప్పబడిన ధర్మా ధర్మ ఫల నిర్ణయములందు దృఢవిశ్వాసమును కలిగి వుండుటను ఆస్తిక్యము అని అందురు. సర్వశక్తులు కలిగియున్న ఈశ్వరుని యందు విశ్వాసముంచుటను ఆస్తిక్యమని అందురు.

**ఈ) దానము :** న్యాయముగా ఆర్జించిన అధిక లేక అల్ప ధనమును శ్రద్ధాయుక్తులై పాత్రత కలిగిన వారికి ఇచ్చుటయే దానముగా చెప్పబడినది. ఈ పవిత్రవ్రతము మానవుల కర్తవ్యము అయివున్నది. తనకంటే హీనస్థితిలో నున్న వారికి అన్న, వస్త్ర, ధన, ధాన్యములతో సహాయపడుటను దానమందురు. దేశ, కాల, ప్రాతతా భేదముతో, శుద్ధమనస్సుతో, కోర్కెలేమీ లేకుండా చేయబడిన దానము మహా శుభ ఫలితమును ఇస్తుంది. మానసిక, శారీరక తపస్సును ఆచరించలేని శ్రీమంతులైన జనులు పాపముల నుండి విముక్తులగుటకు ఏకైక ఉపాయము దానము మాత్రమే అయివున్నది. మాయా మోహితులైన జీవుల పాపము దానముతోపాటు నశిస్తుంది. దురవస్థలో నున్న దానగ్రహీత దానము చేసిన వారి వద్ద నుండి పాపములనే గ్రహిస్తాడు. దానము ఇచ్చేవారు తీసుకొన్నవారికి పాపములను ఇచ్చి పునీతులవుతారు. దానము తీసుకొన్న దురదృష్టవంతులైన గ్రహీతలు కూడా దానము ద్వారా ద్రవ్య లాభమును పొందుతారు.

శాస్త్రములు దాన మహిమను శ్లాఘించాయి. ప్రతిఫలము ఆశించకుండా ఇవ్వబడిన దానము దాతకు ఉన్నత స్థితిని కలుగజేస్తుంది. సాధారణముగా దానము అనుపదమును ఇతరులకు ఉపకారము చేసినపుడు మాత్రమే ఉపయోగిస్తారు. సేవలో ప్రతిఫలము ఆశించకుండా ఇతరులకు లాభమును కలుగజేస్తారు.

గోవులకు, బాలకులకు, వృద్ధులకు, సాధువులకు, బ్రాహ్మణులకు, మాతాపితరుల, గురువు ఇత్యాదుల పట్ల ఆచరించిన కర్తవ్యమును సేవగా చెప్పవచ్చును. ఎందుకంటే దీనిలో ప్రతిఫలము ఆశింపబడదు. వీరికి సేవచేయుట మన ధర్మము. వీరి ఆశీర్వాదము వలన మంగళము కలుగుతుంది.

**ఉ, ఊ) ఈశ్వరపూజనము, సిద్ధాంత శ్రవణము :** మనో వాక్కాయ కర్మలచేత ఈశ్వరుని స్తుతించుట, పూజించుట, స్మరించుటను మరియు భగవానుడైన శివునిపట్ల అచంచల భక్తిని కలిగి వుండుటను ఈశ్వర పూజనముగా చెప్పబడినది. ప్రసన్న చిత్తముతో, భక్తితో యధాశక్తి ఇష్టదేవతలైన శ్రీవిష్ణు, మహేశ్వర, శక్తి మొదలుగాగల ఉపాస్య ఇష్టదేవతలను శ్రద్ధాపూర్వకముగా పూజించుటను లేక మాతా పితృలను గురువు ఇత్యాదులను ప్రసన్నతతో సేవించుటను ఈశ్వర పూజనముగా చెప్పబడినది. వేదాంతము, శతరుద్రము వంటి గ్రంధములను పఠించుట, గాయత్రి, ప్రణవము వంటి మంత్రాలను జపించుట ద్వారా మానవులకు సత్వసిద్ధి కలుగుతుంది. దీనిద్వారా జ్ఞానము కలుగుతుంది. దీనినే స్వాధ్యాయము అనికూడా అంటారు. ప్రామాణిక గ్రంధములైన వేదములు, ఉపనిషత్తులు, దర్శన శాస్త్రములు, వేదాంత గ్రంథములు, ధర్మశాస్త్రములు వంటి గ్రంథములు పఠించుటను, వినుటను సిద్ధాంత శ్రవణముగా చెప్పవచ్చును.

**ఋ ౠ) లజ్జ, బుద్ధిమత్వము :** లౌకిక వ్యవహారములలో ఏ పనులు కుత్సితములని వేదములలో చెప్పబడినదో వాటిపట్ల సిగ్గును బిడియమును కలిగియుండుటను లజ్జగా చెప్పబడుతుంది. లౌకిక వ్యవహారములలో చేయగూడని పనులు అనగా నగ్నముగా వుండుట, ప్రయోజనము లేకుండా పరిహాసములాడుట, వృద్ధులను అగౌరవపరచుట, వారిని హేళన చేయుట, ఇతరులను అవహేళన చేయుట వంటివి చేయకుండుటనే లజ్జ అని అందురు. ఏ పనిచేసిన బాగా ఆలోచించి చేయుట, విహితకర్మలు అనుష్ఠించుట, నిషిద్ధ కర్మలను త్యజించి విధి విహితమైన అన్ని కర్మలయందుగల శ్రద్ధను, బుద్ధిమత్వముగా చెప్పబడినది.



**ఎ) జపము :** శాస్త్ర విహితముగా విధిపూర్వకముగా గురువు నుండి పొందిన మంత్రమును మననము చేయుటను జపము అందురు. ఈ జపము అన్ని ఉపాసనలందు ఆవశ్యకము. అనగా మంత్ర జపము నియమముతో జరుగవలెను. ఈ జపము వాచిక, ఉపాంశు, మానసమను మూడు విధములుగా ఉండును. కల్పసూత్ర, వేద, వేదాంత, దర్శన, ధర్మశాస్త్ర పురాణాది శాస్త్రములను అనేక పర్యాయములు మననము ద్వారా ధ్యానించినపుడు దానిని వాచిక జపమని అందురు. తన నాలుకను మరియు పెదవులను కలుపుతూ ఇతర శబ్దముల నేమీ వినకుండా చేసెడి జపమును ఉపాంశు జపమందురు. ఇది వాచిక జపముకంటె వెయ్యిరెట్లు, మేలైనది. నాలుక మరియు పెదవులు కొంచెము కూడా కదుపకుండా మంత్రపదములను, అక్షరములను మనస్సులోనే ఉచ్చారణ చేయుటను మానస జపమందురు. మానసజపము ఉపాంశు జపము కంటె వెయ్యి రెట్లు ఫలదాయకము.

**ఏ) హవనము :** యోగ సాధనలో బాహ్య ఉపకరణముల అవసరములేదు. యోగిజనులు సాధన రూప యజ్ఞము యొక్క బ్రహ్మాగ్నియందు సంస్కారములు అనే ఆహుతులను ఇస్తారు. ఇంద్రియ విషయ వ్యాపారములను హవనము చేస్తారు. వీటిద్వారా జ్ఞానరూప అగ్ని ప్రజ్వలితమవుతుంది. దానికి ప్రాణరూప ఘృతమును ఆహుతులుగా ఇచ్చి ప్రాణాయామము ద్వారా సాధకుడు తాను స్వయముగా యోగాగ్నియందు ప్రవేశించి స్వాహా అవుతాడు. ఎవరైతే యోగ శాస్త్రములో చెప్పబడిన ఆధ్యాత్మిక జ్ఞాన యజ్ఞమును చేయలేరో వారు ధర్మశాస్త్రములలో చెప్పబడిన భౌతికముగా చేయబడే పంచయజ్ఞములను నిత్యము చేస్తూ వుండాలి. ఏ గృహస్థుడు దేవతల, పితృదేవతలకు సంబంధించిన పంచ యజ్ఞమును చేయకుండా ఆహారమును తీసుకొంటాడో వారు పాపమును భుజించినట్లగునని, ధర్మశాస్త్రములలో ఉల్లేఖించిరి. అందువలన ధర్మశాస్త్రములలో చెప్పిన ప్రకారము సాధకుడు గృహస్థాశ్రమమునకు విధించబడిన పంచ యజ్ఞములను చేసి భోజనము చేయవలయును.

యోగదర్శనములో యమనియమముల గొప్పతనము వర్ణించబడినది. వీనిలోని ప్రతి ఒక్క అంగము యొక్క సాధనా ఫలితమును కళ్ళకు కట్టినట్లు వర్ణించబడినది. వాటిని అనుసరించుట వలన శరీర, మనః ప్రాణములకు అలౌకిక, అద్భుత శక్తి ప్రాప్తిస్తుంది. యోగములో తరువాత వచ్చే ఆరు అంగాలైన, ఆసన, ప్రాణయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి స్థితులద్వారా సాధన సహజమవుతుంది. అందు వలన ఎప్పటివరకు సాధకులు యమ, నియమములను దృఢముగా పాటింపరో

అప్పటివరకు యోగసిద్ధి అయిన సమాధి స్థితి లభించదు అని శాస్త్రములలో చెప్పబడినది.

**3) ఆసనములు :** యోగము యొక్క మూడవ అంగము ఆసనములు. ఎన్ని రకముల జీవజాలములున్నాయో అన్ని రకములైన ఆసనములు కలవు. జీవ జంతువులు అసంఖ్యాకముగా ఉన్నాయి. కావున ఆసనములుకూడా అసంఖ్యాకముగా వుంటాయి. వాటిని మనము కల్పన కూడా చేయలేము. అది ఒక్క పరమేశ్వరునికి మాత్రమే తెలియును. కాని ప్రతి ఒక జీవి తనకు నిర్దిష్టమైన ఆసనములో కూర్చొని, పండుకొని, లేదా నిద్రించి విశ్రాంతిని పొందును. అందువలన ప్రతి ఒక్క ప్రాణి కూర్చొనే విధానమే ఆసనముగా చెప్పవచ్చును.

ప్రాణులు ఆసనములో కూర్చొని తన శరీర, మనః ప్రాణములకు విశ్రాంతి నిస్తాయి. శరీరమును ధరించిన జీవుడు తన ఉదర నిమిత్తము పరిశ్రమించి అలసిపోయినపుడు, తన అలసటను పోగొట్టుకొనుటకు ఆసనములో కూర్చుంటాడు లేక నిద్రిస్తాడు. ఆ విధముగా చేసి సుఖమును పొందుతాడు. అందువలన దేనిలో సుఖము ప్రాప్తిస్తే అదే ఆసనముగా చెప్పబడినది. శివపరమాత్మచే 84 లక్షల ఆసనములు చెప్పబడ్డాయి. ఈ 84 లక్షల ఆసనములలో పదహారువేల ఆసనములు ప్రత్యేకించి చెప్పబడ్డాయి. ఇవి మానవుల వ్యాధులను తగ్గించుటకు ఉపయోగపడుతాయి. కుండలినీ శక్తి జాగృతమయిన తరువాత ఒక్కొక్క సాధకునికి ఆవశ్యకతానుసారము ఈ ఆసనములన్నియు స్వతః సిద్ధముగా కలుగుతాయి. ఈ ఆసనములన్నింటిని వివరించాలి అంటే అది మానవ ప్రజ్ఞకు అతీతమయిన విషయముగా ఉంటుంది.

శ్రీ మహేశ్వరులు, కృపతో సాధారణ మానవుల హితము కొరకు తాను చెప్పిన 84 లక్షల ఆసనములలో 1600 ఆసనములను ఆ 1600 లలో కూడా 84 ఆసనములను ముఖ్యమయినవిగా ఉల్లేఖించారు. అవి కూడా చేయలేనివారికి, ఉపయుక్తముగా నుండి వ్యాధి నివారకమైన, జ్ఞానకారకమైన, సుఖదాయకమైన 32 ఆసనములను చెప్పారు. అవి వరుసగా సిద్ధాసనము, పద్మాసనము, భద్రాసనము, వజ్రాసనము, స్వస్తికాసనము, సింహాసనము, గోముఖాసనము, వీరాసనము, ధనురాసనము, శవాసనము, గుప్తాసనము, మత్స్యాసనము, మత్స్యేంద్రాసనము, గోరక్షాసనము, పశ్చిమోత్తానాసనము, ఉత్కటాసనము, సంకటాసనము,



మయూరాసనము, కుక్కుటాసనము, కూర్మాసనము, ఉత్థాన కూర్మాసనము, ఉత్థాన మండూకాసనము, వృక్షాసనము, మండూకాసనము, గరుడాసనము, వృషాసనము, శలభాసనము, మకరాసనము, ఉష్ట్రాసనము భుజంగాసనము, యోగాసనము మొదలగునవి. ఇవికూడా చేయలేనివారికి సిద్ధాసనము, పద్మాసనము, స్వస్తికాసనము, ఉగ్రాసనము అను నాల్గు తప్పక వేయవలసినదిగా చెప్పబడినది.

కుండలినీ శక్తిని మేల్కొలిపి ప్రాణశక్తిని సుషుమ్న మార్గములో ప్రవేశ పెట్టుటకు ఈ ఆసనములతోపాటు క్రమముగా మహాముద్ర, మహాబంధము, ఉడ్యాన బంధము జాలంధరబంధము, మూలబంధము మరియు నానా విధములైన ప్రాణాయామములతోపాటు నేతి, ధౌతి, వస్తి, నౌళి, త్రాటక మొదలగు క్రియాకర్మలు అనుష్ఠించబడుతాయి. కుండలినీ శక్తిని మేల్కొలిపి బ్రహ్మరంధ్రములోనికి తెచ్చుటకు ఖేచరీముద్ర, శాంభవీముద్ర, శక్తిచాలన ముద్ర వంటి హఠయోగమునకు సంబంధించిన క్రియలు చేయబడతాయి. అందువలన కుండలినీశక్తి త్వరగా జాగృతమయి మనః ప్రాణ శరీరములను సంఘటితపరచి సమాధిస్థితి ద్వారా జీవ బ్రహ్మైక్యతను సిద్ధింప జేస్తుంది. నానావిధమైన ఆసన, బంధ, ముద్ర మరియు ప్రాణాయామాది అనేక ప్రకారములైన క్రియాకర్మలవల్ల కుండలినీశక్తి జాగృతమయి ప్రాణాలు బ్రహ్మరంధ్రములోని శూన్యాకాశములో లయమవుతాయి. అప్పుడు సాధకునకు సమాధి స్థితి కలుగుతుంది. దానివలన సాధకునకు కోట్ల కొలది జన్మల శుభాశుభకర్మల సంస్కారములు పాపపుణ్యకర్మ ఫలములు నష్టమవుతాయి. అతడికి తిరిగి జన్మను కలుగజేసే బంధనములు తొలగిపోయి అతడు జీవన్ముక్తుడవుతాడు.

పైన చెప్పిన ఫలితాలు యోగ సాధనద్వారా లభించే ఆధ్యాత్మిక ఫలము. కాని యోగసాధన ద్వారా భౌతిక, శారీరక లాభము కూడా కలుగుతుంది. ఈ ఆసనములలో కొన్నింటి ద్వారా జఠరాశయ, జీర్ణాశయ, మూత్రాశయ దోషములు కూడా తొలగిపోతాయి. ఈ మూడు సక్రమముగా పనిచేయనపుడు రోగములు ఉత్పన్నమవుతాయి. ఒక్కొక్క దోషమును పోగొట్టుటకు ఒక్కొక్క ఆసనము, ముద్ర, బంధములు, ప్రాణాయామము వంటి క్రియలు వున్నాయి. వాటిని యోగ్య గురువు వద్ద అభ్యసించుటవలన గ్రహణి, గుల్మము, భగంధరము, మేహము, ప్రమేహము, శ్వాసకోశవ్యాధులు, కడుపునొప్పి, వాతసంబంధమైన కఠినాతి కఠిన వ్యాధులు నశిస్తాయి. చాలా ఆసనములు, బంధములు, ముద్రలు, ప్రాణాయామములు ఎటువంటివంటే అవి నరముల దౌర్బల్య కారణముగా ఉత్పన్నమైన మస్తిష్క వ్యాధులను మరియు ధాతులోపమువలన జనించు అనేక వ్యాధులను తగ్గించును.

ఆసన, బంధ, ముద్ర, ప్రాణాయామాదులను క్రమము తప్పకుండా సక్రమముగా చేస్తూవుంటే అనతికాలములో యోగసిద్ధి కలుగుతుంది. కాని వీటిని ప్రాణ జయము సాధించిన మరియు యోగసాధనా విధానములు చక్కగా తెలిసిన గురువుల వద్దనే అభ్యసించవలయును. అప్పుడే పైన చెప్పిన శారీరక, మానసిక, ఆధ్యాత్మిక ఫలములు తప్పక లభించును. కాని యోగమార్గము తెలియని, ఆసన ప్రాణాయామాది క్రమమును గురించి తెలియని గురువుల నుండి నేర్చుకుంటే మహాఅనర్థము కలుగుతుంది. వైద్య విద్య నేర్చుకొనని అయోగ్యుడైన వైద్యుని వద్ద చికిత్స చేయించుకొనే రోగి, వ్యాధుల నుండి ఎలా విముక్తుడు కాలేడో అదేవిధముగా యోగమార్గము తెలియని, ప్రాణజయము కలుగని గురువులవద్ద నుండి అభ్యసించిన యోగాసనముల వల్ల అనర్థములు కలుగుతాయి. అయోగ్యుడైన వైద్యునివలన సరైన వైద్యము లభించకపోగా వ్యాధి వికటించే ప్రమాదమున్నది. అదేవిధముగా కేవలము శాస్త్రములు చదివి యోగవిజ్ఞానము నందు అనుభవ జ్ఞానములేని గురువుల వద్ద ఆసన, ప్రాణాయామ, నేతి, ధౌతి, వస్తి ఇత్యాది క్రియాకర్మలను నేర్చుకొని ఒక క్రమ పద్ధతిలో సాధనచేయని జనులకు రోగనిదానము సంగతి అటుంచి వారు అనేక వ్యాధులకు లోనవుతారు. వాటి నివారణ ఓషధులవల్ల కూడా సాధ్యపడదు.

చాలామంది యోగ విధానము వలన లభించే ఫలశృతి యొక్క గొప్పతనమును గురించి విని, యోగసాధనా గ్రంథములను చూచి యోగులవలె వేషధారణచేసిన అనుభవ జ్ఞానములేని గురువులవద్ద యోగసాధన ఉపదేశమును గైకొని ఆసన, ప్రాణాయామ, నేతి, ధౌతి, వస్తి వంటి క్రియలను చేస్తూ వుంటారు. దీనివలన కొద్దిరోజుల తరువాత శరీరములోనున్న అన్నివాయువులు ప్రకోపిస్తాయి. ధాతువులలో సమతుల్యత లోపించి వాత, పిత్త, కఫ వ్యాధులు కలుగుతాయి. ఫలితముగా ఆకలి నశించుట, అజీర్ణము, మలబద్ధకము వంటి వ్యాధులు కలుగుతాయి. దీనివలన జఠరాశయ వ్యాధులు, అర్శ, సంగ్రహణి వంటి వ్యాధులు కలుగుతాయి లేక మూత్రకోశవ్యాధులు, బహుమూత్రవ్యాధి, మధుమేహము, ప్రమేహము వంటివి కూడా కలుగవచ్చును. ఎక్కిళ్ళతో, దగ్గుతో శిరస్సు, చెవులలో వేదనలు కలిగి రక్తాధిక్యత (బి.పి) వంటి వ్యాధులకు లోనుకావటం మనము అందరము చూస్తూనే వుంటాము.

**4) ప్రాణాయామము :** యోగశాస్త్రములో నాలుగవ అంగము ప్రాణాయామము. యోగశాస్త్రములో యోగసిద్ధికి చెప్పబడిన ఏకైక ఉపాయము ప్రాణాయామము. యోగము ద్వారా ప్రాప్తించు సమస్త ఐశ్వర్యము ప్రాణాయామము



ద్వారానే ప్రాప్తించును. అందువలన ఎన్ని రకాలయిన యోగమార్గములు ఉన్నాయో అవి అన్నీ ప్రాణాయామమును ఆలంబన చేసుకొని సాధనమార్గమును నిర్దేశించాయి. అన్ని యోగమార్గములు ప్రాణనిరోధముతో అనగా సమాధి స్థితి ప్రాప్తించుటతో సమాప్తమవుతాయి. మనోనిరోధమునకు వ్రాయబడిన అన్ని గ్రంథములందు, ప్రాణాయామమును మనసును వశపర్చుకొనే సాధనముగా చెప్పబడినది. ప్రాణాయామమును గురించి వర్ణించని యోగ గ్రంథములేదు. పూజ, మంత్ర, జప, తప ఇత్యాది ధర్మకర్మలందు ప్రాణాయామము అనుష్ఠించబడుతుంది. ప్రాణాయామము చేయకుండా మనస్సును నిలుపుదల చేయలేము. అందువలన అన్ని సాధనలందు ప్రాణాయామము చేయవలసిన ఆవశ్యకత ఉన్నది.

మన శరీరములోనున్న వాయువు పేరు ప్రాణము. దానిని నిరోధించుటనే ప్రాణాయామముగా చెప్పబడినది. ప్రాణాయామమును రేచక, పూరక, కుంభకములుగా అన్ని శాస్త్రములలో యోగిజనులు చెప్పియున్నారు. శ్వాసను బయటకు వదలివేయుటను రేచకముగా, శ్వాసను లోపలికి లాగుటను పూరకముగా, శ్వాసను లోపలికి లాగి నిలిపి యుంచుటను కుంభకము అని అందురు. యోగశాస్త్రములో అనేకవిధములైన ప్రాణాయామములు చెప్పబడ్డాయి. వాటి గురించి విస్తారముగా **శివసంహిత, ఘేరండ సంహిత, యాజ్ఞవల్క్య సంహిత, హఠయోగ ప్రదీపిక** వంటి అనేక యోగోపనిషత్తు లందు వర్ణించబడినది. ఆసన, ప్రాణాయామ, బంధముద్రలు, నాడీశుద్ధి క్రియలు అయిన నేతి, ధౌతి, వస్తి, నౌళి, త్రాటక క్రియల నన్నింటిని పైన ఉదహరించిన గ్రంథములలో విస్తారముగా వర్ణించారు.

ప్రాణాయామము ద్వారా శాంతి, ప్రశాంతి, దీప్తి మరియు నిర్మలత్వము వంటి అనేక దివ్యగుణములు క్రమముగా సిద్ధిస్తాయి.

**శాంతి :** వర్తమానములో అకస్మికముగా వచ్చేటి పాపముల నివృత్తి.

**ప్రశాంతి :** అంతర మరియు బాహ్యములోని తమోనాశనము.

**దీప్తి :** సూర్యచంద్ర, గ్రహతారల వంటి ప్రకాశ దర్శనము, ఋషుల దర్శనము, భూత, భవిష్యత్, వర్తమానకాలములలో వున్న ప్రసిద్ధులయిన జ్ఞానులు, తత్వ దర్శులయొక్క దర్శన లాభము కలుగుట.

**నిర్మలత్వము :** ఆత్మబలము, ఆత్మధ్యానమందు బుద్ధి నిలిచిపోయి పరమశాంతి లభించుట.

ఇటువంటి అనేక దివ్యగుణములు ప్రాణాయామము ద్వారా సాధకునకు ప్రాప్తిస్తాయి.

**5) ప్రత్యాహారము :** యోగములోని ఐదవ అంగము ప్రత్యాహారము. సాధారణముగా ఇంద్రియములు విషయ వాంఛలయందు నిమగ్నమయివుంటాయి. మనస్సుకూడా వాటితో పాటుగా విషయ వాంఛలయందు లగ్నమయి వుంటుంది. వాటిని బలపూర్వకముగా నిరోధించుటను ప్రత్యాహారమని అందురు. బాహ్యజగత్తులో కనిపించే వాటినన్నింటిని బ్రహ్మస్వరూపముగా భావించి ఇంద్రియములను శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయములను అనుభవించకుండా నిరోధించుటనే జ్ఞానులు ప్రత్యాహారముగా చెప్పారు.

**6. ధారణ :** ఇది అష్టాంగములలోని ఆరవ అంగము. యమ, నియమ, ఆసన, ప్రాణాయామాది సాధనాయుక్తుడైన సాధకుడు ఆత్మయందు తన మనస్సును దృఢ పరచుకొంటాడు. ఈ స్థితినే మహర్షులు ధారణగా చెప్పారు. ఈ ధారణను యోగశాస్త్రములో అనేక విధములుగా చెప్పారు. వాటిలో పంచ మహాభూతముల యొక్క తత్త్వములందు ధారణ చేయుటయే ప్రధానముగా చెప్పబడినది. వీటి వివరణ పదిహేనవ ప్రకరణములో విస్తారముగా వ్రాయబడినది.

**7. ధ్యానము :** యోగములో ఏడవ అంగము ధ్యానము. ధ్యానమును గురించి యోగశాస్త్రములో అనేక విధములుగా చెప్పబడినది. సాకార లేక నిరాకార పద్ధతులలో సాధకుడు తన ఇచ్ఛానుసారము ధ్యానము చేయవచ్చును. ఏ ధ్యేయము యందు ఏకాగ్రత, తన్మయత ప్రాప్తిస్తుందో దానిని ధ్యానమందురు. ఈ ధ్యేయమందు నిమగ్నమయిన మనస్సు ఆ ధ్యేయ రూపమును అవిచ్ఛిన్నముగా భావించినపుడు లేక దానియందు తన్మయతను పొంది అన్య ఇతర విషయములను ఆ సమయములో వదలివేయుటనే ధ్యానమందురు. ధ్యానములుగా చెప్పబడే ఇతరము లన్నియు ధ్యానములుకావు. మనస్సును నిర్విషయము చేయుటయే ధ్యానమనబడును. ఈ ధ్యానము యొక్క సంతోషమువలన పరమసుఖము కలుగుతుంది. మోక్షముకూడా కలుగుతుంది. ధ్యానము ద్వారా మాత్రమే మోక్షము లభిస్తుంది. మోక్షముద్వారా పరమ సుఖము కలుగుతుంది. సుఖము ద్వారా ఆనందము వృద్ధి అవుతుంది. ఆనందమే బ్రహ్మస్వరూపము అయివున్నది.

**8. సమాధి :** రాజయోగము, సమాధి, ఉన్మనీ, మనోన్మనీ, అమరత్వము, లయత్వము, శూన్యశూన్యము, అమనస్కము, అద్వైతము, నిరాలంబము,



నిరంజనము, జీవన్ముక్తి, సహజావస్థ, తురీయావస్థ అనునవి దీనికి పర్యాయ పదములుగా చెప్పవచ్చును.

యోగశాస్త్రములోని ఎనిమిదవ అంగము ఐన సమాధి స్థితి వర్ణన అనేక విధములుగా చేయబడినది. ఆ స్థితులు, సవికల్పసమాధి, నిర్వికల్పసమాధి, సబీజసమాధి, నిర్బీజ సమాధి, సంప్రజ్ఞాతయోగము, అసంప్రజ్ఞాత యోగము ఇత్యాదిగా చెప్పబడ్డాయి. సమాధి స్థితియే యోగశాస్త్రములో చిట్టచివరగా లభించు అంతిమ జ్ఞానముగా చెప్పవచ్చును. యోగికి సమాధిస్థితి ప్రాప్తించిన తరువాతనే అన్ని సాధనలు సమాప్త మవుతాయి. సైంధవ లవణము జలములో కలిసిన తరువాత జలముగా మారినట్లే మనస్సు ఆత్మతత్త్వములో సంలగ్నమగుట వలన ఆత్మరూపముగా మారుతుంది. దీనినే సమాధిగా అభివర్ణించారు. ప్రాణప్రవాహములైన శ్వాసప్రశ్వాస క్రియలు నిలచిపోయిన తరువాత మనస్సు కూడా నిరుద్ధ మవుతుంది. ప్రాణము సుషుమ్న చివరలో గల బ్రహ్మ రంధ్రమునందు లయమవుతుంది. అప్పుడు సమాధి స్థితి లభిస్తుంది. జీవాత్మ, పరమాత్మలో ఐక్యమయినప్పుడు అన్ని సంకల్పములు నాశనమవుతాయి. ఈ స్థితిని సమాధి అని అంటారు.

సమాధి స్థితిని పొందిన యోగిని మృత్యువు ఏమీచేయలేదు. అతడికి కర్మ బంధములుకూడా ఏమీవుండవు. అతడు ఎవరి ఆధీనము ఉండడు. సమాధి స్థితి కలిగిన వ్యక్తికి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాది విషయముల గురించిన జ్ఞానము ఉండదు. అతనికి కేవలము తన ఆత్మను గురించి మాత్రమే తెలియును. ఆ స్థితిలో అతడి చిత్తము జాగృత స్థితిలోగాని, సుప్తస్థితిలోగాని వుండదు. అతడికి స్మృతిగాని, విస్మృతిగాని వుండదు. అతడు నిశ్చేయముగా ముక్తుడయి వుంటాడు. సమాధి స్థితుడైన యోగికి శీతోష్ణములు, సుఖదుఃఖములు, మాన అవమానము లేవీ వుండవు. ఏ యోగి జాగ్రదావస్థలో కూడా సుప్త స్థితిలో వుంటాడో, ఎవనియందు శ్వాస క్రియలు జరుగవో, నిశ్చయముగా అతడు ముక్తుడే. సమాధి స్థితిలోనున్న యోగిని ఏ శస్త్రముతో కూడా వధించలేరు. దేహధారి అయిన ఏవవ్యక్తికూడా అతడిపై ఆధిపత్యము వహించలేడు. అతడిని మంత్ర, యంత్రముల ద్వారా వశపర్చుకోలేరు. అతడు తన స్వస్వరూపములో నిలిచి వుంటాడు. సమాధియొక్క ప్రభావములో అతడి దేహమునకు కూడా దివ్యత్వము సిద్ధిస్తుంది. అతడు ఎవరికి లోబడి ఉండడు.

రాజయోగసమాధి గురించి గురు కృపద్వారా జ్ఞానయుక్త స్థితి, సిద్ధి పొందిన కొద్ది మందికి మాత్రమే తెలియును. గురుకృప కలిగిన వెంటనే ప్రథమముగా సిద్ధి

కలుగుతుంది. తరువాత స్థితి కలుగుతుంది, స్థితి కలిగిన తరువాత జ్ఞానము కలుగుతుంది. జ్ఞానముదయించగానే నిశ్చయముగా ముక్తి లభిస్తుంది. సద్గురు కృప లేకుండా విషయపరిత్యాగము దుర్లభము. గురుకృప లేకుండా సమాధి స్థితి లభించుట కూడా దుర్లభము. ఇవి అన్నియు గురు కృపద్వారా సిద్ధించును.

పైన ఉదహరించిన అష్టాంగయోగ సాధన ఫలము ఈ దిగువనుదహరించబడినది.

ఆసనముల ద్వారా వ్యాధులు నశిస్తాయి. ప్రాణాయామముద్వారా పాపములు నశిస్తాయి. ప్రత్యాహారము ద్వారా యోగి యొక్క మానసిక వికారములు తొలగిపోతాయి. ధారణవలన మనస్సునకు ధైర్యము లభిస్తుంది. ధ్యానమువలన అంతరములో అద్భుత చైతన్య ప్రకాశము కలుగుతుంది. సమాధి స్థితి ద్వారా శుభాశుభకర్మ త్యాగము కలిగి యోగికి మోక్ష ప్రాప్తి లభిస్తుంది.

యోగశాస్త్రములో ప్రతి అంగముయొక్క సాధనా ఫలితము చెప్పబడినది. 12 గంటలు ఆసనములను సాధన చేస్తే ఒక గంట కుంభక ప్రాణాయామ ఫలితము లభిస్తుంది. 12 గంటలు కుంభక ప్రాణాయామంతో లభించిన ఫలము ఒక గంట ప్రత్యాహార ఫలముతో సమానము. అదే విధముగా 12 గంటలు ప్రత్యాహారము అనుష్ఠించుటచే లభించు ఫలము ఒక గంట ధారణ ద్వారా లభిస్తుంది. 12 గంటల ధారణ ద్వారా పొందే ఫలితమును ఒక గంట ధ్యానము ద్వారా పొందవచ్చును. 12 గంటలు ధ్యానము చేసినపుడు ఒక గంట సమాధి ఫలితముతో సమానముగా ఫలితమును పొందగలము. ఆ సమాధి స్థితి ప్రాప్తించినపుడు పరమజ్యోతి స్వరూపమైన పరమేశ్వరుని సాక్షాత్కారము లభిస్తుంది. దాని ఫల స్వరూపముగా సర్వకర్మ బంధములు తొలగిపోయి సాధకుడు జననమరణ చక్ర భ్రమణము నుండి విముక్తుడవుతాడు.

**శరీరములోని నాడులు వాటి వివరణ :** శరీరములో లింగ స్థానమునకు పైన నాభి భాగమునకు క్రిందుగా పక్షిగ్రుడ్డు ఆకారములో కందము కలదు. దానినుండి 72 వేల నాడులు ఉత్పన్నమవుతాయి. వాటిలో 72 నాడుల గురించి మాత్రమే ముఖ్యముగా చెప్పబడినది. ఆ 72 నాడులలో ప్రధానముగా ప్రాణవాహినులైన దశవిధములైన నాడులు చెప్పబడ్డాయి. అవి ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తిజిహ్వా, పూష, యశస్విని, అలంబుసా, కుహు మరియు శంఖిని నాడులుగా చెప్పబడ్డాయి.



శరీరము యొక్క వామభాగములోని (ఎడమ) నాసాపుటమునందు ఇడా నాడికలదు. దక్షిణ (కుడి) భాగమునకు చెందిన నాసాపుటము నందు పింగళా నాడికలదు. రెండింటి మధ్యగా సుషుమ్నానాడి కలదు. పూషానాడి కుడిచెవి యందు యశస్విని నాడి ఎడమ చెవియందు, నోటియందు అలంబుసా నాడియు, లింగప్రదేశమునందు కుహూ నాడియు, గుదస్థానమందు శంఖినీ నాడియు కలవు. ఈ విధముగా శరీరములోని నవద్వారములను ఆశ్రయించి దశ విధములైన నాడులు కలవు. ఈ దశనాడులలో ఇడ, పింగళ, సుషుమ్న అనుమూడు నాడులు ప్రాణమార్గమునందు కలవు. వీటిద్వారా సర్వదా ప్రాణశక్తి ప్రవహిస్తూ వుంటుంది. ఈ దశనాడులలో పై మూడు నాడులు ప్రధానమైనవిగా పరిగణింపబడుతాయి. ఆ మూడు నాడులలో సుషుమ్న నాడి ముఖ్యమైన నాడిగా చెప్పబడినది.

సుషుమ్న నాడి ద్వారా మోక్ష ప్రాప్తి కలుగుతుంది. ఇడానాడికి చంద్రుడు, పింగళ నాడికి సూర్యుడు. సుషుమ్న నాడికి అగ్ని దేవతలుగా చెప్పబడ్డారు.

**ప్రాణముయొక్క దశనామములు వాటి స్థానములు :** ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన, నాగ, కూర్మ కృకర, దేవదత్త, ధనుంజయ మను పది విధములైన ప్రాణవాయువులు కలవు. ప్రాణము హృదయములో నుండును. అపాన వాయువు గుదము నందు, సమాన వాయువు, నాభియందు, ఉదానవాయువు కంఠ మధ్యమము నందు, వ్యానవాయువు శరీరమంతయు వ్యాపించి వుండును. ఈ విధముగా శరీరములో దశవిధములైన ప్రాణము కలవు. ఇందు మొదటి పంచ ప్రాణములు ముఖ్యమైనవిగా చెప్పబడ్డాయి. మిగిలిన పంచ ప్రాణములు గౌణములుగా చెప్పబడ్డాయి. ప్రాణము యొక్క క్రియ శ్వాస, ప్రశ్వాసలు, అపానము యొక్క క్రియ మలమూత్రములను విసర్జించుట, సమాన వాయువు క్రియ జఠరాగ్నిని ప్రజ్వలింపజేయుట అయివున్నది. ఉదానవాయువు మనము భుజించిన భోజనమును కంఠమునుండి క్రిందకు పంపును. వ్యాన వాయువు శరీరమంతటిని వ్యాపించి శరీరమునకు మనము భుజించిన ఆహారము యొక్క సారమును అందించి పోషణ చేస్తుంది. నాగ వాయువు ద్వారా త్రేన్పులు, కూర్మవాయువు ద్వారా కనురెప్పలు కదిలించుట జరుగుతుంది. కృకర వాయువు ద్వారా తుమ్ములు కలుగుతాయి. దేవదత్త వాయువు ద్వారా ఆవులింతలు కలుగుతాయి. శరీరము మృతిచెందిన తరువాత కూడా ధనుంజయ వాయువు శరీరమును వదిలిపోదు. ఈ విధముగా దశప్రాణ వాయువులు శరీరములో ఉండి తమతమ పనులను నిర్వహిస్తూ వుంటాయి.

**పంచభూతముల యొక్క గుణకర్మలు** : భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము అను ఐదు పంచభూతములుగా పిలువబడ్డాయి. మానవునిలోని ఎముకలు, మాంసము, చర్మము, గోళ్ళు, కేశములు పృథ్వీ మహాభూతమునకు సంబంధించినవి. శుక్రము, శోణితము, మజ్జ, మల మూత్రములు జలమహాభూతమునకు సంబంధించినవి. నిద్ర, ఆకలి, తృష్ణ, అలసట, సోమరితనము అను ఐదు గుణములు వాయు మహాభూతమునకు సంబంధించినవి. కామ, క్రోధ, లోభ, మోహ, లజ్జ అను ఐదు గుణములు ఆకాశ మహాభూతమునకు సంబంధించినవి. ఇవి బ్రహ్మజ్ఞానము ప్రాప్తించినపుడు తెలియబడతాయి.

**ఆత్మతత్వము, విద్యాతత్వము, శివతత్వము** : ఈ పాంచభౌతిక శరీరము మాతాపితలయొక్క రజస్సు, వీర్యము ద్వారా నిర్మాణమవుతుంది. ఆత్మయొక్క శక్తితో నడుపబడుతూ పనులను చేస్తూ వుంటుంది. అందువలన క్రిందనున్న పాతాళము నుండి పైనున్న స్వర్గపర్యంతము ఎన్ని శరీరాలు వున్నాయో వాటి అన్నింటియందు ఒకే ఆత్మ వుంటుంది. దీనిని తెలుసుకొనుటయే **ఆత్మ తత్వము** అంటారు. మూలాధారములోగల కుండలనీ శక్తి యొక్క జ్ఞానము సద్గురువు కృపద్వారా సాధకుని లభిస్తుంది. ఆ శక్తి మోక్షమును ప్రసాదించగలదు. ఈ విషయమును తెలుసుకొనుటయే **విద్యాతత్వముగా** చెప్పబడినది. ఆ సహస్రారములో నున్న అమృత సాగరము మధ్యలో సహస్రదళ కమలము కలదు. ఆ కమలము మధ్యలో నిలచియుండు తత్వమును **శివతత్వము** అంటారు.

**అపరావిద్య** : షడంగములతో కూడిన నాల్గువేదములయొక్క జ్ఞానమును అపరా విద్య అందురు.

**పరావిద్య** : బ్రహ్మము యొక్క తటస్థ లక్షణమును ప్రతిపాదన చేసే ఊర్ధ్వ అమ్నాయ మహావాక్యమును పరావిద్యగా చెపుతారు.

**మహావిద్య** : యోగసాధన ద్వారా సమాధి స్థితిని పొందుటను మహావిద్య అందురు.

**పరమావిద్య** : యోగసాధన యొక్క ఉద్దేశము, లక్ష్యము అయిన బ్రహ్మవస్తు తత్వమును ప్రాప్తించుకొనుటను పరమావిద్య అందురు. వేదాంతములో చెప్పబడిన ఆత్మతత్వము, విద్యాతత్వము, బ్రహ్మతత్వమును, పూర్ణతత్వమును తెలుసుకొనుటయే జ్ఞానమని చెప్పబడినది. తంత్రములలో చెప్పబడిన జీవతత్వము, విద్యాతత్వము,



శివతత్వము మరియు గురు తత్వమును గురించి తెలుసుకొనుటను పరమ జ్ఞానముగా చెప్పబడినది.

**జీవతత్వము** : ఒక్కడుగా ఉన్న పరమాత్మ శివుడే జీవునిగా రూపము ధరించాడు. ఇది చక్కగా అనుభవమునకు వచ్చుటయే జీవతత్వముగా చెప్పబడుతుంది. ఇది అర్థము కావలెనన్న సమాధి జ్ఞానమును పొందవలెను.

**ప్రకృతితత్వము** : బ్రహ్మయొక్క అనిర్వచనీయమైన మాయతో కూడిన ఇచ్ఛాశక్తిచేత ఈ సమస్త ప్రపంచ సృష్టి జరిగినది. ఈ సృష్టితోపాటు ఆ మాయా శక్తిని సమాధిజ ప్రజ్ఞద్వారా వాస్తవిక రూపములో తెలుసుకొనుటను ప్రకృతి తత్వమందురు.

**బ్రహ్మతత్వము** : సగుణ, నిర్గుణ (సాకార, నిరాకార) జ్ఞానము సమాధిజ ప్రజ్ఞ ద్వారా అనుభవమునకు వచ్చుటయే బ్రహ్మ తత్వము.

**పూర్ణతత్వము** : జీవుడు, బ్రహ్మము, ప్రకృతి ఈ మూడింటి యొక్క యధార్థ జ్ఞానము సమాధిస్థితిలో కలుగుతుంది. ఇదియే పూర్ణతత్వము.

**శక్తి** : శక్తిని ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి, చిత్తశక్తి మరియు అనందశక్తి అను ఐదు విధములు చెప్పవచ్చును. ఇచ్ఛాశక్తి మనస్సునకు, క్రియాశక్తి ప్రాణమునకు, జ్ఞానశక్తి బుద్ధికి, చిత్తశక్తి పరాబుద్ధికి (మహత్‌తత్త్వము), ఆనంద శక్తి ప్రకృతికి సంబంధించినవిగా చెప్పబడినవి. ఈ విధముగా చేతనత్వమును ఆధారముగా చేసుకొని ప్రకృతిదేవి అయిన మహామాయ క్రీడావినోదము చేస్తూ వుంటుంది. పైన పేర్కొన్నవిషయములన్నియు సమాధి స్థితిద్వారా కలుగుతాయి. సమాధి స్థితి లభించకుండా ఎవరికీ వీటికి సంబంధించిన జ్ఞానము కలుగదు. ఇది యోగ శాస్త్రములో చెప్పబడిన విషయము.

**యోగ చతుష్టయము** : వ్యవహార భేదములతో నాలుగు యోగములు కలవు. అవి వరుసగా మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగములు ఈ నాలిగింటిని కలిపి మహాయోగముగా ఉల్లేఖించారు. ఈ మహాయోగము కుండలినీశక్తి జాగరణవల్ల స్వతః సిద్ధముగా ప్రాప్తిస్తుంది. దీనియందు నాలుగు యోగములు ఆవశ్యకతానుసారము కలుగుతాయి. మహాయోగము అనుష్ఠించే సాధకులను అధికార భేదముతో మృదు, మధ్యమ, ఉత్తమ, అత్యుత్తమ సాధకులుగా వర్గీకరించవచ్చును. వీరిలో అత్యుత్తమ సాధకులు శ్రేష్ఠులుగా వుండి వారు

భవసాగరమును దాటగల సామర్థ్యమును కలిగి వుంటారు. అందువలన మృదు, మధ్యమ, ఉత్తమ, అత్యుత్తమ సాధకులకు వరుసగా మంత్రయోగము, లయయోగము, హఠయోగము, రాజయోగము నిర్దేశించబడ్డాయి.

**సాధకచతుష్టయము** : మృదు సాధక లక్షణములు ఈ క్రింది విధముగా వుంటాయి. ఉత్సాహము తక్కువగా ఉన్నవాడు, ప్రతిభా రహితుడు, వ్యాధిగ్రస్తుడు, గురునింద చేసేవాడు, లోభి, పాపబుద్ధి కలవాడు, ఎక్కువగా భుజించువాడు, స్త్రీల సాంగత్యము గలవాడు, చపలుడు, పరాధీనుడు, అతినిష్ఠూరము లాడువాడు, ఆచార హీనుడు, వీర్యనష్టము కలవాడిని మృదు సాధకునిగా చెప్తారు. మృదుసాధకుడు ప్రయత్న పూర్వకముగా సాధనచేసినట్లయితే అతడికి 12 సంవత్సరములలో యోగసిద్ధి కలుగుతుంది. ఇటువంటి వారికి గురువు మంత్రయోగ దీక్షనివ్వ వలసి వుంటుంది. ఎవరు సమబుద్ధిని కలిగివుంటారో అనగా ఎవరిబుద్ధి తీవ్రముగాగాని లేక మందముగాగాని ఉండక క్షమాశీలతను కలిగి వుంటుందో వారిని మధ్యమ సాధకులుగా పరిగణిస్తారు. మధ్యమ సాధకులకు పుణ్యకర్మలమందు ఆసక్తి వుంటుంది. వారు ప్రియభాషణ చేస్తారు. అన్ని కార్యములను నిర్లిప్తతతో చేస్తూ వుంటారు. ఇటువంటి మధ్యమ సాధకులు లయయోగమునకు అర్హులు వీరికి తొమ్మిది సంవత్సరములో సిద్ధికలుగుతుంది.

స్థిరబుద్ధి కలవానిని, స్వతంత్రుని, వీర్యవంతుని, ఉత్తమ ఆశయములు కలవానిని, దయార్ద్ర హృదయము కలవానిని, క్షమాశీలుని, సత్యనిష్ఠ గలవానిని, లయ యోగమును శ్రద్ధగా ఆచరించువానిని, గురుపాదములు పూజించువానిని, నిరంతరము యోగాభ్యాసములో నుండు వానిని ఉత్తమ సాధకులుగా పరిగణిస్తారు. వీరికి ఆరు సంవత్సరములలో సిద్ధి లభిస్తుంది. గురువు వీరికి క్షుణ్ణంగా హఠయోగ ఉపదేశము నివ్వవలయును. అతివీర్యవంతుడైనవాడు, ఉత్సాహము కలవాడు, మనోజ్ఞమైనవాడు, శౌర్యవంతుడు, శాస్త్రములు తెలిసినవాడు, అభ్యాసము చేయువాడు, మోహము లేనివాడు, నవయవ్వనుడు, మితాహారి, జితేంద్రియుడు, నిర్భయస్తుడు, పవిత్ర కార్యముచేయు దక్షత గలవాడు, దాత, స్థిరచిత్తము గలవాడు, తెలివి తేటలు కలవాడు, స్వతంత్రముగా ప్రవర్తించువాడు, క్షమాశీలుడు, సుశీలుడు, ధర్మమును అనుష్ఠించువాడు, ఏకాంతములో యోగసాధన చేయువాడు, ప్రియముగా మాట్లాడువాడు, శాంతస్వభావుడు, విశ్వాసపాత్రుడు, దేవతలను గురువును



పూజించువాడు, జన సంసర్గమును వర్జించినవాడు, ఎటువంటి వ్యాధులు లేని సాధకుని అత్యుత్తమ సాధకునిగా అభివర్ణించారు. అతడు అన్ని విధములైన యోగసాధనలు చేయగలడు. ఇటువంటి అత్యుత్తమ సాధకునికి 3 సంవత్సరాలలో సిద్ధి లభిస్తుంది. వీరు రాజయోగము అనుష్ఠించుటకు అర్హులు.

**మంత్రయోగము** : సాధకునిలో స్వతః సిద్ధముగా జరిగే మంత్ర జపమును అజపాగాయత్రి అందురు. ఇది భవబంధములను నశింపచేయును. మంత్రము గురువు ద్వారా తెలుసుకొని విధి పూర్వముగా జపించినపుడు శ్వాస, ప్రశ్వాసలు నిరోధింపబడి సమాధి స్థితి కలుగుతుంది. అప్పుడు జీవుని బంధనములు నశిస్తాయి. ఈ ప్రాణము శ్వాస ప్రశ్వాసలలో 'హంస' అను రెండు అక్షరములను నిరంతరము జపిస్తూ వుంటుంది. అందువలన ఈ ప్రాణమే ఆత్మరూపములో శరీరము నందు ఉన్నది.

ఈ ప్రాణము శ్వాస, ప్రశ్వాసల రూపములో 'హ'కార శబ్దముతో బయటకు వస్తుంది. 'స'కార శబ్దముతో లోపలకి వెళుతుంది. ఈ విధముగా హంస జపమును జీవుడు సర్వదా జపిస్తూనే వున్నాడు. దీనిపేరు అజపాజపము. దీనిని జీవుడు రోజుకు 21,600 సార్లు జపిస్తాడు. ఇది యోగులకు మోక్షము నిచ్చే అజపా గాయత్రి. గురువాక్యము ద్వారా సుషుమ్నలో జపించబడినపుడు హంస అనుమాట, వ్యతిరేక క్రమములో సోహంగా జపించబడుతుంది. దీనినే మంత్ర యోగము అందురు. మంత్రయోగము ద్వారా ప్రాణవాయువు సుషుమ్నలో నడుస్తుంది. ఆ సమయములో సోహం నుండి 'స' అను అక్షరము తీసివేయుట వలన ఓ అను అక్షరము. హమ్ నుండి 'హ' అను అక్షరము వదలివేయుటచే 'మ్' అను అక్షరము మిగులుతుంది. అనగా 'ఓమ్'గా మారుతుంది. ఈ ఓమ్ అను ప్రణవమే అన్ని మంత్రములకు మూలము. దీని ద్వారా అన్నీ ప్రాప్తిస్తాయి.

శరీరములోని శ్వాస ప్రశ్వాసలు బయటకు వచ్చి పోయే గతిపరిమాణము సాధారణముగా 12 అంగుళములు వుంటుంది. అదిపాటలు పాడినపుడు 16 అంగుళములు, భోజనము చేస్తున్నప్పుడు 20 అంగుళములు, నడుస్తూ వున్నప్పుడు 24 అంగుళములు, నిద్రలో 30 అంగుళములు, మైథునములో 36 అంగుళములు, వ్యాయామము చేస్తున్నప్పుడు దీనికంటే ఎక్కువ పొడవు వుంటుంది. కాని సాధారణముగా 12 అంగుళములకంటే ఎక్కువగా నడిచినపుడు ఆయు క్షీణత

కలుగును. తగ్గుటవలన ఆయువు పెరుగుతుంది. అజపా జపమువల్ల దీనిగతి తగ్గిపోయి త్వరగా యోగసిద్ధి లభించి ఆయువు పెరుగుతుంది.

**లయ యోగము :** శ్రీ మహేశ్వరులచే చిత్తము లయము చేసెడి ఒక కోటి 25 లక్షల మార్గములు ఉపదేశించబడ్డాయి. కాని వాటి అన్నింటి యందు మనస్సును లయము చేసే ముఖ్యమైన ఏకైక సాధనము నాదానుసంధానముగా చెప్పబడినది. లయ యోగములో సమాధి స్థితి కొరకు నాదమే శ్రేష్ఠ సాధనముగా చెప్పబడినది. గోరక్షానాధుని కధనము ప్రకారం ఏ జనులు అజ్ఞానులుగా, మూఢులుగా నుండి తత్వజ్ఞానము తెలుసుకొన లేకపోతారో వారికి నాదానుసంధానమను ఉపాసన అత్యుత్తమమైనదిగా చెప్పబడినది. నాదముతో మనస్సు సహజముగా వశీభూతమవుతుంది. అందువల్ల సాధకులందురు దీనిని అభ్యసించాలి.

యోగశాస్త్రములో లయయోగ క్రియ శాంభవీ ముద్రతో ప్రాప్తిస్తుంది. ముక్తాసనములో కూర్చొని శాంభవీ ముద్రద్వారా కండ్లను పైకి త్రిప్పి అంతరము దృష్టిలో నిలిపి కుడి చెవిలో వినిపించే నాదముపైన లక్ష్య ముంచి లోపల విన్పించే ధ్వనిపైన మనస్సును నిలపాలి. దీని కొరకు తర్జనీ వేలుతో రెండు చెవి రంధ్రములను మూసివేసి ప్రశాంత చిత్తుడై నాదమును ఉపాసించవలెను. అభ్యాసకాలము నందు మొదటగా అనేక విధములైన నాదములు చాలా పెద్దగా విన్పిస్తాయి. అభ్యాసము పెరుగుతున్న కొద్దీ నాదము సూక్ష్మమవుతుంది. ఒకసారి సూక్ష్మముగా నుండి దగ్గరగా విన్పించు శబ్దములపై మరియొక పర్యాయము దూరముగా విన్పించు శబ్దములపై లక్ష్యముంచిన మనోలయము కలుగుతుంది. ఏ విధమైన నాదమును మనస్సు ఇష్టపడుతుందో దానియందే మనస్సును లగ్నముచేసి తన్మయత ప్రాప్తించుకోవలసి వుంటుంది.

యోగశాస్త్రములో నాదశ్రవణ మహిమ గొప్పగా వర్ణించబడినది. భ్రమరము పుష్పములోని మకరందమును గ్రోలుతూ పుష్పముల వాసనను పట్టించుకొననట్లుగానే నాదములో ఆసక్తిని పొందిన చిత్తము విషయ సుఖములను కాంక్షింపదు. విషయ రూప ఉద్యానవనములో తిరుగాడు ఏనుగు వంటి మనస్సును నియంత్రణచేసే అంకుశమే నాదము. నాదముతో బంధింపబడిన మనస్సు తన చంచలతను వదలి వేస్తుంది. రెక్కలు తెగిన పక్షి ఏవిధముగా ఎగురలేదో అదే విధముగా అన్ని చింతలను వదిలివేసి సాధకుడు సావధాన చిత్తముతో నాదానుసంధానము చేయవలయును. ఎటువంటి తాడనముల వల్ల ఉత్పన్నము కాని ఈ అనాహత ధ్వని స్వయముగా



ఉద్భవిస్తుంది. ఆ తెలియదగిన స్వరూపమునకు అంతర్గతముగా తెలుసుకొనదగిన ప్రకాశమైన చైతన్యము వున్నది. ఆ చైతన్యము యొక్క అంతర్గతముగా మనస్సు కలదు. దానియందే మనస్సు నశిస్తుంది. దానినే విష్ణువుయొక్క పరమ పదము అంటారు. ఎప్పటివరకు నాదములుద్భవిస్తూ వుంటాయో అప్పటివరకు అంతరాకాశమునుండి శబ్దము యొక్క సంకల్పములు కలుగుతాయి. కాని నాదములో మనస్సు లయముకాగానే నిర్వికల్ప సమాధి సిద్ధిస్తుంది. నిశ్శబ్ద పరబ్రహ్మమే పరమాత్మగా పిలువబడినది. నాదరూపములో శక్తి వినిపిస్తుంది. దానియందు తత్వములన్నియు లయమవుతాయి. అదియే నిరాకార పరమేశ్వరుడు. సంపూర్ణ వృత్తి నిరోధరూపమైన రాజయోగము సిద్ధించుటకు ఈ ఆసనములు, బంధములు, ముద్రలు, ప్రాణాయామము, లయ యోగము వంటి సాధనలు చెప్పబడ్డాయి. అందువలన రాజయోగము ప్రాప్తించిన పురుషుడు మృత్యువును జయిస్తాడు.

**హఠ యోగము :** వ్యాధులను నాశనము చేసే వివిధములైన ఆసనములు, పూరక, రేచక, కుంభకములతో కూడిన ప్రాణాయామములు, నాడీశుద్ధి క్రియలు, నేతి, వస్తి ధౌతి వంటి షట్ కర్మలు హఠయోగము నందు చేయబడతాయి. హఠయోగములో ప్రధానమైనది ప్రాణాయామము. హకార నామముగల సూర్యనాడి ప్రాణమునకు సంబంధించినది. సకార నామముగల చంద్రనాడి అపానమునకు సంబంధించినది. ప్రాణ అపానముల ఏకత రూపమైన ప్రాణాయామమే హఠయోగముగా చెప్పబడినది. హఠయోగము ద్వారా శరీరములో జడత్వము నశిస్తుంది. రోగములు నశించి ప్రాణజయముద్వారా రాజయోగము ప్రాప్తిస్తుంది.

**రాజ యోగము :** రాజయోగము ప్రాప్తించిన తరువాత సాధకునికి సిద్ధి లభిస్తుంది. అతడి చిత్తము పరిపూర్ణ మవుతుంది. బాహ్యములో అంతరములో జ్ఞానముతో పరిపూర్ణుడయిన వ్యక్తి ఎప్పుడూ దుఃఖించడు. అతడికి జనన మరణములుండవు. ఈ జగత్తులోని సుఖదుఃఖములు అతడికి కలుగవు. అతడు నిరంతరము ఆత్మ స్వరూపములో నిమగ్నుడై వుంటాడు. అతడికి యోగ ఐశ్వర్యములైన అణిమాది సిద్ధులు ప్రాప్తిస్తాయి. ఫలస్వరూపముగా అతడు కృతార్థుడై జీవన్ముక్తుడవుతాడు. ఈ ప్రకారముగా నాలుగు యోగములలో చెప్పబడిన విషయములన్నికూడా ప్రాణ అపానముల కలయిక ద్వారానే సంభవించును. ఎందుకంటే ప్రాణ అపానముల కలయిక ద్వారానే నాల్గు యోగములు సిద్ధించును. అందువలన ప్రతి ఒక్క యోగములో ప్రాణజయము ఆవశ్యకము అయివున్నది.

**విశ్వవ్యాప్తమయిన ప్రాణము :** ఈ జగత్తులో రెండు తత్వముల గురించి తెలుసుకొనవలసి వుంది. వాటియొక్క క్రియాశక్తి కారణముగా ఈ ప్రపంచములోని కార్యకలాపములు నడుస్తూ వున్నాయి. మనస్సు మరియు ప్రాణము కారణముచేత జీవుడు కర్త మరియు భోక్తగా మారుతున్నాడు. అందువలన భగవత్ జ్ఞానమును పొందుటకు మనస్తత్వము మరియు ప్రాణతత్వము గురించి తెలుసుకొనవలసి వుంటుంది. వాటియొక్క జ్ఞానము తోడనే జీవునికి అభీష్ట సిద్ధి శీఘ్రముగా కలుగుతుంది. మనస్తత్వము కొరకు వేదాంత, ఉపనిషత్ గ్రంథములు పఠించవలసి వుంటుంది. ప్రాణతత్వము కొరకు యోగశాస్త్రములో చెప్పిన యోగసాధన చేయవలసి వుంటుంది. మనః ప్రాణముల రెండింటి క్రియల కారణము చేతనే జీవనయాత్ర సంపన్న మవుతుంది. ఈ రెండింటిలో ఏ ఒక్కటి లేకపోయినా జీవులు నిష్క్రియులు, నిర్జీవులు అవుతారు.

ప్రకృతి పరా మరియు అపరా అను రెండు విధములుగా వుంటుంది. పృథ్వి, జల, అగ్ని, వాయు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అనునవి అపర ప్రకృతికి సంబంధించినవి. వీనిలో ప్రాణము లేకుండా చైతన్యము కలుగదు. అందువలన రెండవది అయిన చేతనత్వము పరాప్రకృతికి సంబంధించినది. ఇదియే జీవులనన్నింటిని రక్షిస్తుంది. అన్ని జీవజాలములను రక్షించగల పరాప్రకృతి అయిన ప్రాణశక్తియే సమస్త కార్యములను చేయిస్తుంది. ప్రాణముయొక్క సహకారము లేనిదే మనము ఏపనీ చేయలేము. మనస్సు రూపములోని అపరాప్రకృతి జడమైనది. ప్రాణరూపములో నున్న పరాప్రకృతి చైతన్యవంతమయినది. దీని సహకారముతోడనే మనము భగవానుని కలువగలము.

**ప్రాణము వాయువు కాదు, శ్వాస ప్రశ్వాసలే ప్రాణము కాదు :** ప్రాణమే బ్రహ్మము యొక్క నాల్గవ పాదము. అది వాయుజ్యోతి ద్వారా అభివ్యక్తమవుతుంది. వేదములో ప్రాణమును వాయువు కంటె వేరుగా వర్ణించారు. ఇంద్రియ వృత్తుల నుండి కూడా ప్రాణము వేరుగా చెప్పబడినది. వాక్కు మొదలగు ఇంద్రియములు సుషుప్తిలో ఉన్నప్పుడు ప్రాణమొక్కటే మేల్కొని ఉంటుంది. ప్రాణము ఎటువంటిదంటే దానికి ఎన్నడూ మృత్యువు ప్రాప్తించదు. ప్రాణము తల్లివలె రక్షణ కల్పిస్తుంది. ఈ ప్రాణమే బ్రహ్మాండమంతయు వ్యాపించి ఉన్నది. ప్రాణము వాయువుకాదు. శ్వాస, ప్రశ్వాసలే ప్రాణముగా పరిగణించబడవు. ప్రాణము జీవకోటులన్నింటి యొక్క జీవశక్తి



అయివున్నది. శ్వాస ప్రశ్వాసల ద్వారా ముఖ్యప్రాణము యొక్క క్రియలు జరుగుతాయి. శరీరములో ప్రాణము మనకు క్రియలను చేస్తూ ఉంటుంది. శ్వాస, ప్రశ్వాసలద్వారా ఇది బోధపడుతుంది.

సృష్టి ప్రారంభములో పరమాత్మ నుండి ప్రథమముగా ప్రాణము ఉత్పన్న మయినది. తరువాత మనస్సు, ఇంద్రియములు, ఆకాశము, వాయువు, తేజము, జలము, పృథ్వి మొదలగునవి ఉద్భవించినవి. ప్రాణము వాయువు అయితే ఆకాశము తరువాత వాయువును సృష్టించవలసిన ఆవశ్యకత లేదు. అందువలన మనము అర్థం చేసుకోవలసినది ఏమిటంటే ప్రాణము వాయువు కాదు. కాని ప్రాణక్రియ చంచలతను పొందిన కారణముచేత వాయువుగా చెప్పబడినది. సూర్య, చంద్ర, నక్షత్రములలో జరిగే క్రియలు అన్నియు ప్రాణమునకు సంబంధించిన క్రియలే. అనగా ప్రాణము విశ్వవ్యాప్తము అయి వున్నది. ఆ మహాప్రాణము యొక్క స్వల్పశక్తి జీవుని శరీరములో పనిచేస్తుంది. ఆ క్రియాశక్తి కారణముగా ప్రాణులందు చలనము కనబడుతుంది. పరమాత్మ ప్రాణులన్నింటికి ప్రాణశక్తిని గ్రహించే సామర్థ్యమును సమానంగా ఇచ్చాడు. కాని ప్రాణులయొక్క కర్మానుసారం ప్రాప్తించిన శరీరములలో వాటి సామర్థ్యము ననుసరించి ప్రాణశక్తిని గ్రహించగలవు. ఏనుగు శరీరం చాలా పెద్దదిగా ఉంటుంది. దానియందు ప్రాణశక్తి కూడా ఎక్కువగా ఉంటుంది. మిగతా ప్రాణులకంటె ఎక్కువ శక్తిని కలిగి ఉంటుంది. చీమ శరీరము చాలా చిన్నదిగా ఉంటుంది. అందువలన దానిలో ప్రాణశక్తి కూడా తక్కువగా ఉంటుంది. కాని ఆత్మయొక్క శక్తి అన్ని ప్రాణులలో ఒకే విధముగా ఉంటుంది. మనుషుల మాదిరిగా ఇతర ప్రాణులకు వివేచనాశక్తి లేని కారణముచే తమ శరీర పరిమితికి మించి శక్తిని గ్రహించలేవు. కాని మనుష్యునిలో వివేకము ఉన్న కారణముచేత తన పురుషార్థముద్వారా యథేచ్ఛగా శక్తి సంచయము చేయుటలో కృతకృత్యుడవుతున్నాడు.

**ప్రాణమే మహాశక్తి అయివున్నది :** ప్రాణము యొక్క అనంతశక్తిని సంచయము చేయుటకు అష్టాంగ యోగమే ఏకైక మార్గము. శరీరములో ఉన్న ప్రాణము నిరోధించనంతవరకు ఇతర ఉపాయముల ద్వారా ఈ అలౌకిక ప్రాణశక్తిని గ్రహించలేము. సముద్రములో అనంత జలమున్నది. ఒకేసారి దానిని త్రాగుట అసంభవము. కాని అనంత సాగరమునుండి ఒక బిందువును పానము చేయుట ద్వారా సముద్ర జలము రుచిని తెలుసుకొనగలము. అదేవిధముగా విశ్వవ్యాప్తమైన ప్రాణమును గురించి ఒక్కసారిగా తెలుసుకోలేము. శరీరములో ఉన్న స్వల్పప్రాణము

గురించి తెలుసుకున్నట్లయితే విశ్వములో ఉన్న ప్రాణము గురించి సహజంగా తెలుసుకొనగలము. ఎందుకంటే ప్రాణమే మహాశక్తి అయివున్నది. ప్రాణమే జగత్తును రక్షించును. ప్రాణమును వశపర్చుకొనుటచే అన్నింటిపైన జయము లభించును. అనగా అన్నింటి గురించి తెలుసుకొనగలము. ప్రాణ అంతర్గతమైన ఈ బ్రహ్మాండంలోని దృశ్యాదృశ్యములన్నియు, శరీరములోనున్న ప్రాణమును గురించి తెలుసుకొనుటచే తెలియబడతాయి. ఈ విషయమును యోగిజనులందరు ముక్తకంఠముతో చెప్పారు.

ఈ ప్రాణము ఆత్మనుండి ఉత్పన్నమవుతుంది. ఇది ఆత్మయొక్క నీడవలె ఎల్లవేళలా ఆత్మతో కలిసి ఉంటుంది. అదేవిధముగా ఆత్మనుండి ప్రాణము వేరుగా ఉండలేదు. ప్రాణముతోపాటు ఆత్మకు ఎంత దగ్గర సంబంధమున్నదో అంతగా ఇంద్రియముల తోడనూ, మనస్సుతోడను లేదు. ఉపనిషత్తులలో ప్రణవ ఉపాసనతో పాటు, ప్రాణముయొక్క ఉపాసన చెప్పబడినది. ఋషులు ప్రాణముయొక్క ఉపాసన చేసి ఎక్కువకాలము జీవించారు. వారు అలౌకిక శక్తి సంపన్నతను పొంది అత్యంత ఆశ్చర్యకరమైన తత్వానుభవము పొందారు. ప్రాణశక్తి ఉపాసనకు రెండు మార్గములు ఉన్నాయి. పూర్వ మరియు పశ్చిమ మార్గములు. పూర్వమార్గావలంబులు జ్ఞానులుగా నుండి ముక్తులుగా పిలవబడుతారు. పశ్చిమ మార్గావలంబులైన యోగులు సిద్ధులుగా పిలువబడుతారు. ఈ రెండు మార్గముల ఫలితములో విశేషతారతమ్యము లేదు. కాని ఐశ్వర్యము ప్రాప్తిలో పెద్ద అంతరము కలదు. పూర్వ మార్గములో ప్రణవమును ఉపాసించే జ్ఞానులకు అణిమాది సిద్ధుల ప్రాప్తి సహజముగా కలుగదు. అష్టాంగ యోగమును సాధన చేయకుండా ప్రణవమును జపించుటచే మనస్సుకు ఏకాగ్రత వస్తుంది. ప్రకృతిపైన విజయము మాత్రము ప్రాప్తించదు. అందువలన శారీరక క్లేశములు కూడా ఈ మార్గముద్వారా కలుగుతాయి. బ్రహ్మలోక ప్రాప్తి జరిగి కల్పాంతములో పునరావృత్తి ఏర్పడుతుంది. అందువలన మోక్షము నిచ్చు బ్రహ్మనాడి అయిన సుషుమ్న మార్గము అత్యంత ప్రసిద్ధము. ఆ మార్గము ద్వారా యోగ సాధనాఫలితము త్వరగా లభిస్తుంది. ఎప్పటివరకు సుషుమ్నలో ప్రాణము మూలాధారమునుండి సహస్రారమునకు వెళ్ళదో అప్పటివరకు మోక్షము లభించదు. ఇది ముక్తి లభించుటకు గల ఏకైక మార్గము. ఈ మార్గములోనికి రాని వారికి ముక్తి ఎలా లభిస్తుంది? ప్రాణమునకు రెండు స్థితులు కలవు. అవి స్పందన మరియు లయము అనునవి. అదేవిధముగా మనస్సుకు కూడా ఏకాగ్రత మరియు నిరుద్ధము



అను రెండు స్మృతులు కలవు. ప్రణవ ఉపాసన ద్వారా మనస్సు ఏకాగ్రత మవుతుంది. కాని అప్పుడు ప్రాణస్పందన ఉంటుంది. ఈ స్థితిలో మనస్సునకు నిరుద్ధ స్థితి ప్రాప్తించదు. అందువలన ప్రాణము లయము కాదు. కాని ప్రాణాయామము వలన మనస్సు నిరుద్ధమయి అప్పుడు ప్రాణము కూడా లయమవుతుంది. ప్రాణము బ్రహ్మరంధ్రములో లయమగుటచేతనే యోగసాధన సఫలమవుతుంది. అప్పుడు యోగము యొక్క సమస్త ఐశ్వర్యము ప్రాప్తిస్తుంది. అందువలన మనస్సుపైన, ప్రాణముపైన జయము ప్రాప్తించుకొనుట అత్యంత అవసరము. కేవలము మనస్సుపైన జయము పొందుట ద్వారా ప్రకృతిపై ఆధిపత్యము లభించదు. కాని ప్రాణజయమువలన మనోజయము సహజముగా లభిస్తుంది. ప్రకృతికూడా వశమవుతుంది. ఇది యోగశాస్త్ర సిద్ధాంతము.

# సిద్ధమహాయోగము

## పదిహేడవ ప్రకరణము

**మంత్రముయొక్క ఆవశ్యకత :** మనకు ఎన్ని ధర్మ గ్రంథములున్నాయో అవి అన్నీ దేవతలను మరియు మంత్రములను ప్రతిపాదన చేస్తాయి. ధర్మగ్రంథము లన్నియు దేవతా మంత్రములతో ముడిపడివున్నాయి. దేవత మరియు మంత్రము లేకుండా ఎవరూ కూడా ధర్మ కర్మలు చేయలేరు. జప, తప, వ్రత, సేవా, పూజ పఠనము, యజ్ఞ, దాన, యోగ, జ్ఞాన, ధ్యాన, భక్తి మొదలగు క్రియాకర్మములన్నింటికి మంత్రము యొక్క ఆవశ్యకత ఉన్నది.

మంత్రము, దేవత లేకుండా కామ్యకర్మలు చేసినప్పటికి అది తామసిక మవుతుంది. మంత్రము ఉచ్చరించకుండా యజ్ఞములో హవనము చేయుట వ్యర్థము. దాని ఫలితముకూడా అజ్ఞానముతో కూడి దుఃఖదాయకముగా వుంటుంది. ధర్మశాస్త్రములో చెప్పినవిధముగా మంత్రము మరియు దేవత లేకుండా కామ్యకర్మలు చేసేవారి అన్ని కర్మలు నిష్ఫలమవుతాయి. ఎందుకంటే మంత్రశక్తి యొక్క అధిష్ఠాన దేవతయే కర్మను చేసిన వారియొక్క మంత్ర, క్రియా కర్మానుసారము ఫలితములనిస్తుంది.

తాము అనుష్ఠించిన ధర్మకర్మలయొక్క సత్వరఫలితమును కోరుకొనే జనులు మంత్రము ద్వారా దేవతల ఆరాధన చేస్తారు. ఎందుకంటే ఈ ప్రపంచములో ఒక్క

ఈశ్వరుడు మినహా అన్యదేవతలందరూ మానవుని యొక్క కామ్యకర్మలయిన యజ్ఞ క్రియా, హవన, జప, బలులతో సంతృప్తి చెందుతారు. కర్త అనుష్టించిన క్రియాకర్మల వల్ల దేవతలు ప్రసన్నులై మనోవాంఛిత ఫలితములను ఇస్తారు. సత్‌కర్మ యొక్క పుణ్యఫలముగా సుఖరూప భోగ ఐశ్వర్యములను, పాపకర్మల ఫలముగా దుఃఖరూప, రోగ, శోక, దైన్యము, దరిద్రములను దేవతలు అనుగ్రహిస్తారు. దేవతలు అనేకులు కలరు. వారి ఉపాసనా మంత్రములు, క్రియాకర్మలుకూడా వేర్వేరుగా ఉంటాయి. వాటి వర్ణన ధర్మశాస్త్రములలో మంత్ర శాస్త్రములలో విస్తారముగా వివరించబడినది.

**మంత్రశక్తి ద్వారా ప్రత్యక్ష ఫలము :** నిష్కాములైన యోగులకు పరమ శాంతి దాయకమైన ఆత్మతత్వముయొక్క యదార్ధ లాభమును పొందుటకు యోగశాస్త్రము ఉన్న విధముగానే అశాంతి దాయకమైన భోగ ఐశ్వర్యములను కోరుకొనే సకాములకు కూడా మంత్రశాస్త్రము కోరిన ఫలితముల నిస్తుంది. మొదట చెప్పిన విధముగా యోగశాస్త్రము చెప్పిన అష్టాంగ యోగసాధన యొక్క ఫలము ప్రత్యక్షముగా వుంటుంది. అదేవిధముగా మంత్రశాస్త్రములో చెప్పిన పూజా, పాఠనములు, జప, తప, హవన, బలులవంటి సాధనములద్వారా చేయబడిన మంత్రశక్తి ఫలితముగూడా ప్రత్యక్షము. ఇందులో సందేహములేదు. ఎంత నాస్తికుడైనా యోగ, మంత్ర, ఔషధముల ద్వారా లభించెడి సిద్ధిని తిరస్కరించలేడు. ఎందుకంటే ఈమూడింటి ద్వారా లభించెడి సిద్ధి ప్రత్యక్షముగా వుంటూవచ్చినది.

మంత్ర, ఔషధ, యోగముల శక్తి ద్వారా జరిగెడి కార్యములు ప్రత్యక్ష ఫలితముల నిచ్చినను వీటి యొక్క యదార్థ జ్ఞానము గుప్తముగా నుంచబడి అది తమ గురుపరంపర ద్వారా లభిస్తూ వచ్చినది. అందువలన వీరిచే రచించబడిన గ్రంధముల ద్వారా ప్రతిఒక్కరికి మేలుకలుగుట యనునది దుర్లభము. ఈ విషయములో శిష్యుడు యోగ్యగురువు నుండి దీక్షను గ్రహించి మంత్రము లేక యోగము అనుష్ఠించవలసి వుంటుంది. అప్పుడే సిద్ధిలభిస్తుంది. చాలామంది వీటి ఫలశ్రుతిపై ప్రలోభపడి గురువు లేకుండా గ్రంధములను పఠించి మంత్రము యొక్క అనుష్ఠానము మరియు యోగసాధన చేస్తూ వుంటారు. వాటియొక్క ఫలితము విపరీత ఫలితములనిస్తుంది. ఈ విధముగా మంత్రములను జపించిన చాలామంది పిచ్చివాళ్ళుగా మారి చిత్త చాంచల్యమును పొందియున్నారు. అదేవిధముగా గురువు లేకుండా యోగసాధన చేసినవారు చాలామంది రోగులుగా మారారు. వారు శారీరకముగా మానసికముగా తీవ్ర కష్టములకు లోనయినారు. అందువలన మంత్ర అనుష్ఠానము మరియు అష్టాంగ యోగసాధనను అర్థము చేసుకొని చేయవలసి వుంటుంది.



**మంత్రము యొక్క అర్థము :** ఈ మంత్ర విజ్ఞానమును తెలుసుకొన్న సాధకుడు సర్వసిద్ధులను పొంది ఈశ్వరతుల్యుడు కాగలడని సాక్షాత్తు శ్రీమహేశ్వరులు, మాతపార్వతీదేవితో చెప్పియున్నారు. దేనిని మననము చేయుటద్వారా విశ్వముయొక్క సమస్త విజ్ఞానము లభిస్తుందో అనగా విశ్వములో నున్న తత్వముల జ్ఞానము యధాతధముగా తెలుసుకొనబడి సంసారబంధనములు తొలగిపోయి సర్వవిధములైన సిద్ధులు లభిస్తాయో దానిని మంత్రము అంటారు. రోగ, శోక, దుఃఖ, దైన్య, పాప, తాపము మొదలుగాగల సాంసారిక భయముల నుండి మరియు పరమ దుఃఖదాయకమైన మృత్యువు నుండి మంత్రము సర్వదా రక్షించును. అందువలన కూడా ఇది మంత్రముగా చెప్పబడినది. దీనిద్వారా దివ్యజ్యోతిర్మయ, అమిత తేజః స్వరూపమైన ఆత్మతత్వము మననము చేయబడుతుంది. మనన హేతువుగా నుండి సర్వభయముల నుండి విముక్తి కలిగించుటచేత మరియు అన్ని పరిస్థితులలో సాధకునికి రక్షణ కల్పించుట చేత శాస్త్రములు దీనిని మంత్రముగా చెప్పియున్నాయి. దీనిని చింతనము, మననము మరియు ధ్యానము చేయుట ద్వారా భగవానుని శివస్వరూప జ్ఞానము కలుగుతుంది. వీనిని అనుష్ఠించే జ్ఞానులు భగవానునితో కలుస్తారు. లేక భగవంతుడే అటువంటి వారిని స్వయముగా కలుస్తాడు.

**మంత్ర స్వరూపము :** యోగ సామర్థ్యముగల మంత్రసిద్ధుడైన సద్గురువు ముఖతహా చెప్పబడిన మహామంత్రమును గ్రహించిన ఉత్తమ సాధకుడు దానిని మననము చేసినపుడు లేక జపించినపుడు అది ఏ దేవత యొక్క బీజమంత్రమో ఆ మంత్రబీజ అక్షరము నిశ్చయముగా ఆ దేవతా రూపమును ధరిస్తుంది. ఎందుకంటే దేవత శరీరము బీజమంత్రములద్వారా ఉత్పన్నమవుతుంది. ఒకబీజము నుండి మహావృక్షము వచ్చినట్లుగా బీజమంత్ర అక్షరమే శక్తివంతుడైన గురువు ఆజ్ఞానుసారము దేవతారూపమును ధరిస్తుంది. దానినే సాధకుడు చూస్తాడు.

మంత్రమును బీజాక్షరములంటారు. వృక్షము యొక్క బీజములలో అంకురము, పత్రములు, శాఖలు, ఉపశాఖలు, ఫల, పుష్పములతో కూడిన మహావృక్షముదాగి వుంటుంది. అదేవిధముగా బీజమంత్రములో సమస్త ఐశ్వర్యములు కలదేవత స్వరూపము దాగి వుంటుంది. ఈ బీజ మంత్ర వర్ణాక్షరములే దేవతయొక్క మొదటి శరీరము మరియు ప్రథమరూపము. ఇది దృష్టి గోచరముగా వుంటుంది. భూమిలో బీజస్థాపనచేసి నీటిని పోస్తూ వున్నప్పుడు పత్రపుష్ప, ఫలములతో కూడిన వృక్షమవుతుంది. ఈ వృక్షము బీజముయొక్క రెండవశరీరమవుతుంది. అదేవిధముగా

శిష్యుని హృదయ భూమిలో గురువుద్వారా బీజమంత్ర స్థాపన జరుగుతుంది. ఆ తరువాత శిష్యుడు జప, తపాదులనెడి నీటిని పోస్తున్నప్పుడు ఆబీజ మంత్ర అధిష్ఠాన దేవత ప్రత్యక్ష మవుతుంది. మంత్ర బీజము యొక్క అటువంటిరూపము దేవతయొక్క రెండవ శరీరము. ఇది జపము వలన సాధకునికి గోచరమవుతుంది.

మంత్రం యొక్క జపము, ధ్యానము, చింతనవల్ల బీజమంత్ర అక్షరమే క్రమముగా దేవత రూపముగా మారుతుంది. వృక్షము పుష్పించి ఫలించి తిరిగి బీజరూపములోనికి మారినట్లు, ఉపాసనాదేవత ధ్యానములో సాధకునికి దర్శనమిచ్చి మనోవాంఛలను తీర్చి మరల బీజ మంత్రములోనే లీనమవుతుంది. ఈ వర్ణాత్మక బీజమంత్రాక్షరమే దేవతయొక్క మూలరూపము మరియు ఆది శరీరమవుతుంది.

సాధకుడు ప్రతినిత్యము చేసెడి మంత్రజపము, ధ్యానము, స్తుతి, పూజాది ఆరాధనలతో దేవతలు సదా ప్రసన్నులవుతారు. ప్రసన్నులయి సాధకునకు నానా విధములైన భోగములతో కూడిన ఐశ్వర్యము ప్రసాదిస్తారు. చివరికి శాశ్వతముక్తిని కూడా అనుగ్రహిస్తారు.

గురువు కృపతో మంత్రశక్తి జాగృతమయిన తరువాత సాధకులు గురువు యందు, మంత్రమునందు, మంత్ర అధిష్ఠాన దేవతయందు ఏకత్వ భావన చేయాలి. గురువుద్వారా చైతన్యవంతమైన సిద్ధమంత్రములు ప్రాప్తిస్తాయి. చైతన్యమంత్రముల ద్వారా కుండలినీశక్తి జాగృతమవుతుంది. దేవతల దర్శనమవుతుంది. దేవతాదర్శనముల ద్వారా మనః ప్రాణములు లయమును సాధించవచ్చును. మనః ప్రాణము లయమగుటచే సాధకునికి సమాధి స్థితి ప్రాప్తిస్తుంది. ఈ విధముగా గురువు, మంత్రము, దేవతల యందు ఏకత్వభావన కలిగి వుండుటచేత భావసమాధి కలుగుతుంది. అనగా గురువు, మంత్రము, మరియు దేవతల యొక్క జపధ్యానముల యందు ఏకత్వ భావనవల్ల మనః ప్రాణములు లయమగుటచే సమాధి స్థితియందు సాధకుని ఆత్మ, పరమాత్మతో ఏకత్వమును పొందుతుంది.

**మంత్రముయొక్క గురువు :** ఎవరు కాశీక్షేత్రములో అనగా భ్రూమధ్యమందు నిత్య నివాసము ఉంటారో, ఎవరి చరణకమలములను స్పృశిస్తూ గంగామాత అనగా ఇడానాడి నిత్యము ప్రవహిస్తూ వుంటుందో ఆ విశ్వేశ్వరుడైన శివుడు నిశ్చయముగా అందరికి గురువు అయివున్నాడు. పరమశివుడే మహాకాలుడిగా ప్రసిద్ధి చెందాడు అనగా సర్వ మంత్రములకు, సర్వమంత్రాధిష్ఠాన దేవతలకు కూడా అతడే గురువు. ఈ ప్రపంచములో ఈశ్వరుడు మినహా మరి ఏ ఇతర దేవ గురువులు లేరు.



వేదములు మొదలగు ధర్మశాస్త్రములలో చెప్పబడిన ధర్మ, కర్మలయందు వాటి ఉపాసన పద్ధతులందు శివ, శక్తి, విష్ణు, సూర్య, గణపతిలతో కూడిన పంచాయతన ఆరాధన చెప్పబడినది. ఈ పంచదేవతలే ప్రధానముగా సర్వప్రాణుల కర్మఫలదాతలని సూక్ష్మ దర్శులయిన మునులు నిర్ణయించి చెప్పారు. వేదశాస్త్రములు చెప్పిన విధముగా జనులందరు వీరికొరకు మరియు వీరి నుండి ఫలమును పొందుటకు ధర్మకర్మలు చేస్తూ వచ్చారు. చేస్తూ వున్నారు. ఈ పంచదేవతలే మన భాగ్య విధాతలు మరియు కర్మఫల ప్రదాతలు అయివున్నారు. వీరియొక్క ఆది, అంత్యములు ఎవరికి తెలియవు. బ్రహ్మాండము యొక్క అధిపతులుగా వుండి అందరికి కర్మానుసారము ఫలములనిస్తూ వుండే ఈ అనాది దేవతలను మనము ఉపాసన చేయవలెను. శివుని ఉపాసన చేసేవారిని శైవులుగా, శక్తిని ఉపాసించే వారిని శాక్తులుగా, విష్ణువును పూజించే వారిని వైష్ణవులు అని, గణపతిని పూజించే వారిని గాణపత్యులని, సూర్యని పూజించే వారిని సౌరులంటారు. నిర్గుణ పరబ్రహ్మ ఉపాసన చేసేవారు మహాశైవులని పిలువబడుతారు. ఈ పంచదేవతలను ఉపాస చేసేవారికి మరియు మహాశైవులకు శివుడే ఏకైక గురువు. ఇందులో సందేహమేమీ లేదు. ఎందుకంటే శివునిచే అన్ని దేవతా మంత్రములు చెప్పబడ్డాయి. శివభగవానులు కాకుండా ఇతర గురువు లెవరూలేరు.

**శివరూపుడైన గురువు యొక్క పరిచయము :** నవమ ప్రకరణములో గురువు లక్షణములు చెప్పబడ్డాయి. శివుని ద్వారా లభించిన యోగశక్తి సామర్థ్యము గల పరంపరాగతులైన సిద్ధ పురుషుల శిష్యులు అనగా గురువుద్వారా గురుపదములో ప్రతిష్ఠించబడిన జప, తప, జ్ఞాన, ధ్యాన, యోగ పరాయణులు అయినవారు శిష్యునిపై ప్రసన్నులై కృపతోడ దీక్షను లేక చైతన్యవంతమైన సిద్ధ మంత్రమును ప్రదానము చేయునపుడు లేక ఏదైనా దేవతయొక్క మంత్రమును ప్రదానము చేయు సమయములో మంత్ర బలముతో పరమగురువు శివుని ఆవాహన చేస్తారు. అప్పుడు ఆ మనుష్య రూపగురువు మహాకాలుడైన శివుని ప్రభావమువలన శివస్వరూపుడవుతాడు. పరమ గురువు శివుని ప్రభావమును పొందిన గురువు, శిష్యునికి శక్తిని గాని, జ్ఞానము లేక ఏదైన మంత్రమును ప్రదానము చేసినపుడు ఆ మంత్రముతోపాటు శిష్యునిలో శైవీశక్తి ప్రసరణ జరుగుతుంది. చైతన్యమంత్రమును జపించగానే శిష్యుడు భావావేశుడై గురుశక్తి యొక్క మంత్రబలము వలన ఇష్టదేవతను దర్శిస్తాడు లేక గురువు యొక్క పూర్ణ కృపకారణముగా స్వయంసిద్ధ అష్టాంగయోగ సాధన ప్రారంభ మవుతుంది.

ఈ గురుత్వము మనుష్య గురువునకు సంబంధించినదికాదు. ఎందుకంటే ఈ కార్యము మానవశక్తి ద్వారా జరుగదు. శ్రీమహేశ్వరుల ప్రభావముతో మాత్రమే మానవ గురువులో గురుత్వము ఆవిర్భవిస్తుంది.

శివుని ప్రభావము చేత ఆయనను ఆశ్రయించిన పరమేశ్వరుని ప్రతినిధి అయిన మనుష్యగురువే మానవుల గురువు అవుతాడు. ఆ మనుష్యరూప గురువు నుండి యోగ్యులయిన పాత్రతగల మనుష్యులకు నిరంతరము జ్ఞాన, ధ్యాన దీక్షలు ధర్మ-కర్మములు, జప-తప, మంత్రములు లభిస్తూ వచ్చాయి. వారివలన ఉత్తమ అధికారులైన సాధకులకు తమ అభీష్టములైన ధర్మ, అర్థ, కామ మోక్షములు ప్రాప్తిస్తున్నాయి. అందువలన అన్ని శాస్త్రములలో మరియు సాక్షాత్తు భగవానుడు మనుష్య గురువు గొప్పతనమును శ్లాఘిస్తూ అతడిని భగవంతునికన్నా అధికునిగా కీర్తించారు. గురువు సాక్షాత్తు ఈశ్వరుని ప్రతిరూపమే. ఈశ్వరుడు అదృశ్యముగా నుంటే మానవ గురువును నేత్రములతో వీక్షించవచ్చును. భగవానునిగా పరోక్షముగా దర్శిస్తే మానవ గురువును ప్రత్యక్షముగా దర్శించవచ్చును. అతడి ద్వారానే సాధకుడు భగవానుని పొందుతాడు. అతడిని సేవించుట ఈశ్వర సేవతో సమానము. కాని గురుశక్తిని పొందకుండా గురువుగా మారినవారు పశుతుల్యులు. మంత్ర, జప, ధ్యానములు చేసే సాధకులు తెలుసుకోవలసినదేమంటే ఎవరు దేవతగా వుంటారో వారే మంత్రముగా వుంటారు. మంత్రమే గురువుగా దేవత ఉంటుంది. మంత్రము, గురువుయొక్క పూజ, జపధ్యానముల యొక్క ఫలితము ఒకే విధముగా వుంటుంది. అందువలన సాధకులకు దేవతను ధ్యానించుట, మంత్రమును జపించుట, గురువును పూజించుట అనుమూడు కర్మలు నిత్యము అనుష్ఠించవలసిన కర్మములు అవుతాయి. శివుడు దేవత, మంత్రము మరియు యోగము జ్ఞానము వీటిని ప్రసాదించే వాడే గురువు అవుతాడు. అందువలన శివుడు, మంత్రము మరియు యోగము, గురువు అందరూ ఒక్కటే. వీరిని ధ్యానించుటవలన, జపించుట పూజచేయుట వలన లభించు ఫలితము ఒకే విధముగా వుంటుంది.

గురువు ద్వారా మంత్రము లభిస్తుంది. మంత్రము ద్వారా దేవతా దర్శనము కలుగుతుంది. దేవతల దర్శనము ద్వారా తన అభీష్టములైన ధర్మ, అర్థ, కామములు సిద్ధిస్తాయి. ఆత్మ దర్శనమువలన సమాధి స్థితి లభిస్తుంది. సమాధి ద్వారా జ్ఞానము కలుగుతుంది. జ్ఞానము ద్వారా ముక్తి లభిస్తుంది. దీనివలన జీవుడు జనన మరణముల నుండి విడివడి పరమశాంతిని పొందుతాడు. అందువలన సాధకులు



గురువును పూజించుతూ, మంత్ర జపముచేస్తూ, దేవతను ధ్యానించవలసి ఉంటుంది. ఈ విధముగా మంత్రము, దేవత, గురువు అనుమూడింటికి భేదములేదని గ్రహించి శ్రద్ధాభక్తులతో, నియమ పూర్వకముగా సాధకులు నిత్యము గురువుని సేవించుతూ, పూజిస్తూ మంత్రజపముచేస్తూ, దేవతాధ్యానము, యోగసాధన చేస్తూ వుండాలి.

అజ్ఞానులైన సాధకులు మాత్రమే గురువును మానవమాత్రునిగా తలుస్తారు. వారు మంత్రములను అక్షరములుగా మాత్రమే భావిస్తారు. దేవప్రతిమను పాషాణ మూర్తిగా తలుస్తారు. మనస్సులో పైవిధముగా భావించిన వారు చేసే పూజా, పాఠములు మంత్ర, జప, తపముల అనుష్ఠానములు ఎటువంటి ఫలితములనివ్వవు. వారు మరణించిన తరువాత నరకానికి వెళతారు. అందువలన ఇంతకుముందు చెప్పిన విధముగా దేవత, గురువు, మంత్రము ఒక్కటే అని బుద్ధి పూర్వకముగా భావించి జపధ్యానములు అనుష్ఠించవలసి వుంటుంది. అప్పుడే మంత్ర సిద్ధి కలుగుతుంది. చాలామంది అవివేకులైన సాధకులు గురుప్రదత్తమైన మంత్రమును మరియు దీక్షాజనిత జ్ఞానము ద్వారా లభించిన అనుభవములను గుప్తముగా వుంచక బయట పెడతారు. దాని ఫలితముగా వారికి అపకారము కలుగుతుంది. అందువలన సాధకులు తమ గురువుని గురించి చెప్పినా, గురువుద్వారా అనుగ్రహించబడిన మంత్రమును బయటకు చెప్పకూడదు. ఏ విషయము తనకు కల్యాణకరముగా వుంటుందో దానిని బయటపెట్టకూడదు. దానిని బయట పెట్టుటవలన ఐశ్వర్యమును సంపదను నష్టపోతారు. ఆయుక్షీణత కలుగుతుంది. ఫలస్వరూపముగా సాధకులు సంపత్తును కోల్పోయి అకాల మరణమును పొందుతారు.

సాధారణముగా కామ్యకర్మలు అనుష్ఠించే జనులు తమ యొక్క కార్యసిద్ధి కొరకు తీర్థ క్షేత్రములు దర్శించి తమకు పరిచయములేని గురువు ద్వారా ఉపదేశమును గ్రహించి తమ ఇష్టదేవతా మంత్రానుష్ఠానము చేస్తూ జపధ్యానములు చేస్తూ వుంటారు. చాలామంది ఉపవాసములు, వ్రతములు, నియమములను పాటించుతూ శరీరమునకు కూడా మహాకష్టమును కలుగజేస్తారు. శీఘ్రమంత్ర సిద్ధిని కాంక్షిస్తారు. వారు మంత్రశాస్త్రముయొక్క వాస్తవికజ్ఞానమును ఎరుంగక ఎక్కడపడితే అక్కడ మంత్రజపము చేస్తూ వుంటారు. ఆ విధముగా నిత్యము ఒక నిర్ణీత సమయమును పాటింపక, నడుస్తున్నప్పుడూ, తిరుగుతున్నప్పుడూ, కూర్చొన్నప్పుడు, తింటున్నప్పుడూ, త్రాగుతున్నప్పుడు జపము చేసే వారిపై మంత్ర దేవత కుపితుడవుతాడు. ఆ విధముగా జపించేవారి ఆయువు క్షీణిస్తుంది. వారు

శీఘ్రముగా మరణిస్తారు. ఎందుకంటే అన్ని కర్మలను బాగుగా ఆలోచించి శాస్త్రములలో చెప్పిన విధముగా నియమిత సమయములలో చేయవలసి వుంటుంది. అప్పుడే శుభ ఫలితములను పొందగలము. వాటిని సమయముకాని సమయములో తమ ఇష్టము వచ్చినవిధముగా చేయుటచే నిశ్చయముగా మృత్యువు సంభవిస్తుంది.

దేవతలు మనుష్యులచే తయారు చేయబడిన లోహ, పాషాణ, కాష్ట, మృత్తికా ప్రతిమలందు ఉండరు. వారు సాధకునియొక్క శ్రద్ధాయుక్త తీవ్రమైన భావనలో వుంటారు. ఏకాగ్ర మనస్సుతో జపించిన మంత్రము ద్వారా ఆ మూర్తుల నుండి వారు ఆవిర్భవిస్తారు. వారు నిరంతరము జపము చేయుటద్వారా, హవనము వంటి క్రియాకర్మములు చేయుట ద్వారా శరీరమునకు నానా విధములైన కష్టములు కలిగించుట ద్వారా లభించరు. ఎప్పటివరకు సాధకుని హృదయములో సాత్విక భావములు ప్రబలముకావో అప్పటివరకు దేవీ - దేవతల యొక్క మంత్ర, యంత్రములు ఫలప్రదములు కావు. శ్రద్ధాయుక్తమైన హృదయము యొక్క తీవ్ర కాంక్ష మరియు మనస్సు యొక్క ప్రబల భావనద్వారా మాత్రమే అంతా లభిస్తుంది. మనస్సు యొక్క వైరాగ్యముతో కూడిన సాత్విక భావనవల్ల, తీవ్ర ఆకాంక్ష వలన దేవతల దర్శనము లభిస్తుంది. ఆ పరమసాత్విక భావనవల్లనే దివ్య బ్రహ్మజ్ఞానము కలుగుతుంది. అందువలన సాధకులు ఎల్లప్పుడూ సాత్విక భావమును ఆశ్రయించవలసి వుంటుంది.

గురువు, మంత్రము మరియు దేవతపైన శ్రద్ధ కలుగుట ద్వారా సాత్విక భావము ప్రబలమవుతుంది. అందువలన శ్రద్ధయే అన్ని ధర్మములకు మూలము. ధర్మము విషయములో కూడా శ్రద్ధయే సాధకులకు పరమ హితమును కలుగజేయును. శ్రద్ధా పూర్వకముగా మూర్ఖుడైన గురువును భక్తి పూర్వకముగా పూజించిననూ ఆ గురువు, మంత్రము, దేవతకూడా సిద్ధి దాయకమవుతాయి. మహాభారతములో ఏకలవ్యుని ఉదంతము దీనికి ఉదాహరణగా చెప్పవచ్చును. విద్యావిహీనుడైన ఏకలవ్యుడను భిల్లుడు ద్రోణాచార్యుని విగ్రహమును మట్టితోచేసి పూజించి సమస్త ధనుర్వేదము యొక్క జ్ఞానమును పొందాడు. అనగా శ్రద్ధయే సిద్ధికి కారణమవుతుంది. దేవత, తీర్థము, బ్రాహ్మణుడు, మంత్రము, జ్యోతిష్యుడు, ఔషధులు మరియు గురుజనులందు ఎవరు ఏవిధముగా శ్రద్ధాభక్తులను చూపితే వారికి తదనుసారముగా సిద్ధి లభిస్తుంది.



అజ్ఞాని అయినవాడు, శ్రద్ధావిహీనుడు, మనస్సులో జ్ఞానవిషయములో సంధిగ్దము, సంశయము కలవాడు నశిస్తాడు. అటువంటి అజ్ఞాని, శ్రద్ధలేని వాడు, సంశయాత్మునకు ఈ లోకములోనే కాకుండా పరలోకములో కూడా సుఖము లభించదు. అతడు సర్వనాశనమును పొందుతాడు. ఎవరు శ్రద్ధావంతుడో, జితేంద్రియుడో, ఎవరు మనః ప్రాణములను జయించాడో అటువంటి ఉత్తమ సాధకుడే అత్యంత శీఘ్రముగా జ్ఞాన లాభమును పొంది పరమశాంతిని పొందుతాడు. ఇందులో సందేహములేదు.

**మంత్రప్రదాత అయిన గురువు యొక్క లక్షణములు :** కలియుగములో మోసముయొక్క ఆధిక్యత ఎక్కువగా ఉంటుంది. అందువలన మోసగాళ్లయిన దుర్జనులు, సాధువులు, సన్యాసులు, తపస్విలు, త్యాగులు, బైరాగులు, మహాత్ములు, జ్ఞానులు, ధ్యానులు, యోగులు, యతులు, బ్రహ్మచారులు వంటి అనేకులు వివిధ వేషధారణలతో గురువులుగా మారతారు. వారు జ్ఞానహీనులయి వుండి లోభత్వముతో, దురాశతో తమ మలిన పాప సంస్కారములు తీర్చుకొనుటకు జాతి మరియు వర్ణా శ్రమ ధర్మములను త్యజించి స్వేచ్ఛగా ప్రవర్తిస్తారు. వారిలో కొందరు తమను తాము వైష్ణవ భక్తుడైన ఆచార్యుని పేరుతో గురువునని చెప్పి ప్రచారము చేసుకొంటారు. ఇంకొందరు మంత్ర, తంత్ర, శక్తి, దేవి సిద్ధుడైన శాక్తునిగా ప్రచారము చేసుకొంటారు. ఇంకొందరు తమను యోగిగా, యతిగా, జ్ఞానీ, ధ్యానిగా, శైవ గురువుగా ప్రచారము చేసుకొంటారు. మరికొందరు గణపతి ఆరాధనచేసే గాణపత్యులుగా చెప్పుకొంటారు. ఇంకొందరు సూర్యోపాసకులుగా గాయత్రీ సిద్ధిని పొందిన వారిగా ప్రసిద్ధిని పొందుతారు. శాస్త్రజ్ఞానములేని ఈ మోసగాళ్లయిన ధూర్తజనులు గురువుగా ప్రసిద్ధిని పొంది అన్నిచోట్లా కనిపిస్తారు. శిష్యులను తయారు చేసుకొనుటకు ఉత్సాహము చూపిస్తుంటారు. శిష్యుడు లభించవచ్చు అని తెలిసిన వెంటనే పిలవకుండానే అక్కడకు వెళ్ళిపోతారు. భారతదేశమున ఇటువంటి అధమ గురువులకు వారిని గ్రుడ్డిగా ఆరాధించే అజ్ఞానులైన శిష్యులకు కొదవలేదు. అటువంటి వారు అన్ని ప్రాంతములలో కనిపిస్తారు. అజ్ఞానులైన జనులు ప్రలోభములకు వశులవుతారు. అందువలన బోధ గురువులు, వారికి దేవతా దర్శనముల గురించి మంత్ర జపములతో దేవతా సిద్ధి లభించుట వంటి మరియు స్వర్గ సుఖములు, దానములు పుణ్యఫలముల గురించి చెప్పి చివరికి రోగనివారణకొరకు మంత్రములను ఔషధములను, ధన ప్రాప్తి, సంతాన ప్రాప్తివంటి విధములైన ప్రలోభనములు చూపి

వచన బద్ధునిగా చేస్తారు. ఇటువంటి అంధ విశ్వాసులైన అజ్ఞానులైన శిష్యుల ధనమును, నమ్మకమును హరించే గురువులచేత భగవానుని దివ్యదర్శనమును కలిగించే దివ్యమంత్రములు ఉచ్చరించుటవలన ఫలితమేమీ లభించదు. అతడివద్ద నుండి మంత్రమును తీసుకొన్న శిష్యులకు కూడా మేలు కలుగదు.

శ్రీ సదాశివునిద్వారా పరమ కల్యాణకారకమైన గురువు లక్షణము ఈ క్రింది విధముగా పేర్కొనబడినవి.

ఏ గురువు శాంత మనస్కుడై, ప్రబల విషయవాసనారహితుడుగా ఉంటాడో ఎవరు దానములు, తపస్సుల ద్వారా తన మనస్సు ప్రాణము, ఇంద్రియముల ఆవేశమును అదుపులో వుంచుకొని వుంటాడో, ఎవరు మంచి వంశమునందు జన్మించి, శుద్ధ అంతఃకరణమును కలిగి వుండి సదాచార సంపన్నుడై వుంటాడో, ఎవరిని అందరూ గౌరవిస్తూ వుంటారో, ఎవరు ఎల్లవేళలా పవిత్రులుగా, రాగద్వేషరహితులుగా ప్రసన్నులుగా వుంటారో, ఎవరు వ్యవహారిక పారమార్థిక కార్యములందు దక్షత కలిగి వుంటారో, ఎవరు నిర్దిష్ట స్థానములో సపరివారముగా నివాసముంటారో, ఎవరు మంత్ర, తంత్రశాస్త్ర పరిజ్ఞానముతో తత్వజ్ఞుడై వుంటాడో ఎవరు అనుగ్రహ, నిగ్రహ సామర్థ్యమును కలిగి వుంటారో, ఎవరు మంత్ర అర్థమును చక్కగా తెలుసుకొని ఉంటారో, ఎవరు తన యోగ లేక మంత్రశక్తి సామర్థ్యము చేత సిద్ధిని పొంది సిద్ధపురుషుని ప్రఖ్యాతిగా వుంటారో, ఎవరు దైవ బలమును ప్రాప్తించుకొని వుంటారో అటువంటి వారిని సద్గురువుగా చెపుతారు.

ఎవరి తల్లిదండ్రులు మంచి ఆలోచనలతో పవిత్రులుగా ఉండి వర్ణాంతరితులు కారో, ఎవరు స్వయముగా పరమ శుద్ధ ఆలోచనలు కలిగి జితేంద్రియులై వుంటారో, ఎవరు ఆగమ, మంత్ర, తంత్రాదిశాస్త్రముల యొక్క శ్రేష్ఠజ్ఞానమును తెలుసుకొని అన్నిశాస్త్రముల అర్థమును తత్వపరముగా తెలుసుకొని వుంటారో, ఎవరు పరోపకార పరాయణులుగా వుండి సర్వదా జపతపాదులలో నిమగ్నులై సదాశాంతి చిత్తులై వుంటారో, ఎవరిమాట వృథాగా పోదో, ఎవరు వేద వేదాంగ శాస్త్ర పారంగతులో, ఎవరు సర్వదా యోగమార్గమును క్రమశిక్షణ పాటించుతూ దేవతా సదృశులుగా ఉండి అందరిని ఆకట్టుకొనే దివ్యగుణ సంపన్నునిగా వుంటారో, వారిని ఆగమ శాస్త్రములలో ధర్మార్థ కామ మోక్షముల సిద్ధికొరకు గురువుగా స్వీకరించవలయునని చెప్పబడినది.



దీక్ష మరియు విధానములనుబట్టి గురువులు రెండు విధములుగా వుంటారు. ఒకరు దీక్షా గురువులు రెండవ వారు ఉపదేశ గురువులు. దీక్షా విధానముద్వారా ఏ గురువు యొక్క ముఖతః శిష్యుడు మహామంత్రములను వింటాడో మరియు గురువు ఆజ్ఞానుసారము గురు ప్రదత్తమంత్రమును ధ్యానించుతూ అభ్యసిస్తూ వుంటాడో, ఆ దీక్షా గురువునే సర్వశ్రేష్ఠ గురువుగా భావించాలి. వారి ఆజ్ఞలను పరమ సిద్ధిదాయకములుగా భావించాలి. ఉపదేశ గురువులు ఎంత చేసినప్పటికి సామర్థ్యముకల దీక్షాగురువు ఒక్కరే వుంటారు. వారిద్వారా పరమ మంగళకరమైన దివ్యబ్రహ్మ జ్ఞానము కలుగుతుంది.

ఇదివరలో చెప్పిన విధముగా సాధకుల ధర్మ కర్మముల సత్వర సిద్ధికొరకు ఉపాసనలో తన అభిరుచి ప్రకారము తన ఉపాస్య దేవతపై భక్తిగల గురువును ఆశ్రయించవలయును. అందువలన ఎవరు ఏ దేవతయొక్క ఉపాసనను చేస్తారో ఎవరికి ఏ దేవతపై భక్తి, ప్రేమ నిష్ఠ వుంటాయో వారు అటువంటి భక్తిని కలిగి ఉండి అదే దేవతను ఉపాసించే వారిని గురువుగా స్వీకరించవలయును. తన ఉపాస్యదేవతనుకాక ఇతర దేవతలను ఉపాసించే వారిని గురువుగా స్వీకరించినట్లయితే అనర్థము కలుగుతుంది. శివుని ఉపాసించే వారికి అష్టాంగయోగ పరాయణులైన శైవగురువులు మాత్రమే దీక్షా ప్రదానము చేయవలసి వుంటుంది. మహామాయ ఆద్యాశక్తి అయిన జగదంబను ఉపాసించే వారు పూజా, పాఠములు, హవనము, యంత్ర, మంత్ర, జప, తప, పరాయణులైన శక్తి గురువులను దీక్ష కొరకు ఆశ్రయించవలసి వుంటుంది. విష్ణు భగవానుని మరియు రామకృష్ణులపై భక్తివున్న వారు సేవా, పూజ, భోగ, రాగ, అర్చన, వందన, స్తుతి, కథా కీర్తనలు చేసే వైష్ణవ గురువులను ఆశ్రయించవలసి వుంటుంది. సిద్ధి ప్రదాత అయిన గణపతి దేవునిపై భక్తిగలవారు గాణాపత్య గురువు వద్ద దీక్షను పొందవలెను. బలమును, బుద్ధిని, తపమును, తేజమును సర్వప్రాణులకు ప్రదానము చేసే ప్రత్యక్ష నారాయణుడైన ఆదిత్యదేవుని ఉపాసన చేసేవారు జప, తప, నియమ, వ్రతధారి, గాయత్రీ ఉపాసకులైన సౌరగురువులను ఆశ్రయించవలసి వుంటుంది.

తనలోపల నున్న ఈశ్వరుని భేదబుద్ధితో చూసేవారు పైన చెప్పిన విధముగా గురువులను ఆశ్రయించవలసి వుంటుంది. కాని ఎవరు అభేద జ్ఞానముతో సర్వత్ర ఈశ్వరుని చూడవలెననుకుంటారో వారు మహాశైవ దివ్యాచారము కలిగిన మహాయోగి, బ్రహ్మజ్ఞాని, కులీనుడు అయిన గురువు నుండి దీక్షను గ్రహించ

వలయును. అందువలన బుద్ధి మంతులైన సాధకులు దివ్యాచారమును పాటించే సాత్విక గుణముగల కౌల గురువు వద్ద నుండి దీక్షను గ్రహించినట్లయితే వారి అనుగ్రహమువల్ల వెనువెంటనే కుండలినీశక్తి జాగృతమవుతుంది మరియు అన్ని దేవతామంత్రముల యొక్క సత్వర సిద్ధి కలుగుతుంది.

ధర్మార్థ, కామ, మోక్షములను కాంక్షించే గృహస్థులు తమకు విరుద్ధ ఆశ్రమ ధర్మములు పాటించే గురువులవద్ద దీక్షా గ్రహణము చేయకూడదు. ఎల్లవేళలా రోగ గ్రస్థుడిగానున్న వానినుండి, సంతాన హీనుడినుండి, భార్యలేకుండా వంటరిగా వున్న వాడినుండి, యోగసాధన ద్వారా లేక మంత్ర జపముచే మెదడు చెడిపోయిన వానివద్దనుండి, తన చిత్తము అదుపులో లేని గురువు నుండి ఎప్పటికి దీక్షను కాని, మంత్రమును కాని గ్రహించకూడదు. సహజముగా అందరూ పరిభ్రమణము చేసే సాధువులను సన్యాసులను గురువులుగా చేసుకొంటారు. వారికి అతడి జాతి, విద్యా, బుద్ధి, జ్ఞానము గురించి ఏమీ తెలియదు. వారు ఒక నిర్దిష్ఠ స్థానములో కూడా ఉండక దేశాటన చేస్తూ వుంటారు. వారు భవిష్యత్తులో తిరిగి కలుసుకొనే అవకాశము కూడాలేదు. వారు ఎంతటి త్యాగులైన, తపస్వులైనా, జ్ఞానులైనా, ధ్యానులైనా, మహాత్ములయినా వారివద్ద నుండి మంత్రోపదేశమును కాని దీక్షనుకాని తీసుకొనుట హితకరముకాదు. వారి యొక్క ఆశీర్వాదము వరకు బాగా వుంటుంది. అటువంటి మహాత్ముల నుండి జనులు యోగ సాధన నేర్చుకొంటారు. ప్రాణాయామము చేస్తారు. కాని దైవ యోగముతో వాటి పరిణామము వ్యతిరేకముగా వుంటే ఫలస్వరూపముగా అనేక రోగములను అనుభవించవలసి వస్తుంది. వాటికి ఉపశమనముకూడా అంత సులభముకాదు. ఈ విధముగా శారీరక, మానసిక స్థితులలో వైపరీత్యములు ఏర్పడిన వారు అనేకులు కనపడతారు. ఇందులో ఉపదేశమిచ్చే గురువులకు తమ స్వార్థమేమీ లేకుంటే బాగానే వుంటుంది. పాత్రా పాత్రతలను విచారించకుండా, దేశకాల పరిస్థితులను చూడకుండా సంసారా సక్తులుగా కుటుంబముతో కలసివుండే గృహస్థులకు, సర్వము త్యజించినవారు చేసే హఠయోగము, నేతి, ధౌతి, వస్తి, ప్రాణాయామాది క్లిష్ట కర్మలు అనర్ధ దాయకములు. అందువలన గృహస్థులు ఇటువంటి సాధనలు చేయకూడదు.

గురువు లేకుండా జ్ఞానము కలుగదు. జ్ఞానము కలుగకుండా ముక్తి లభించదు. గురువు తిరస్కరించితే సద్గతి కూడా కలుగదు. అందువలన బుద్ధిమంతుడైన సాధకుడు గురువుయొక్క కృపను పొందుటకు ప్రయత్న పూర్వకముగా గురువునకు అన్ని



విధములుగా సేవచేసి సంతోష పెట్టాలి. గురువు కూడా శ్రద్ధా భక్తియుక్తుడైన శిష్యుని సేవ పరిగ్రహించి సంతుష్టుడై శిష్యునికి బ్రహ్మజ్ఞాన ఉపదేశమును లేక జ్ఞానోపదేశమును ప్రదానము చేయవలయును లేక మంత్ర దీక్షను ఇచ్చి కృతార్థుని చేయవలెను. ఇది పరంపరాగతంగా పాటించబడే శివుని శాసనము.

శిష్యుడు గురువును సంతోష పరచుటకు ఆసనము, శయ్యా, వస్త్రములు, వాహనములవంటి సామాగ్రిని శ్రద్ధాభక్తులతో తన సామర్థ్యానుసారము సమర్పించ వలసివుంటుంది. ఎందుకంటే గురువు యొక్క సంతోష మాత్రముచేత శిష్యునికి మంత్ర, జప, తపయోగముల యొక్క శాశ్వత సిద్ధి కలుగుతుంది. దురదృష్టవశాత్తు సామర్థ్యమున్నప్పటికి శిష్యుడు గురువు నుండి దీక్షాగ్రహణముచేసి, సేవచేయక పోయినపుడు గురువు కృపచూపి ప్రదానముచేసిన మంత్రములు, దీక్షలు సిద్ధిని కలుగజేయవు. అవి నిష్ఫలమవుతాయి.

శక్తివంతుడైన గురువు యొక్క ఒక వాక్యమే ముక్తిని కలుగజేస్తుంది. మిగిలిన శాస్త్ర విద్య అంతా అనుకరణ మాత్రమే. అన్ని వ్యాధుల నివారణ కొరకు అనేక విధములైన వనౌషధుల కంటె ఒకే ఒక సంజీవని దివ్యౌషధము అత్యుత్తమము. అదే విధముగా గురువుకూడా చింతామణివలె, కల్పవృక్షము, కామధేనువువలె మనోవాంఛిత ఫలములు ప్రసాదించును. శ్రీమహేశ్వరులు చెప్పిన అద్వైత జ్ఞానము యొక్క యోగక్రియలు శ్రమ లేకుండా తమకు తాముగా కలుగుతాయి. మంత్రము కూడా అజపాజపముగా స్వతః సిద్ధముగా జరుగుతుంది. ఇవి అన్నీకూడా కోట్ల కొలది శాస్త్రములను పఠించుట వలన లభ్యము కావు, కాని శక్తివంతుడైన గురువు కృపాపూర్వకముగా పలికినంతనే ప్రాప్తిస్తాయి.

సద్గురువు విషయములో పైన చెప్పిన లక్షణములు నూటికి నూరుపాళ్ళు ఉన్న సాక్షాత్తు శివరూప సిద్ధ పురుషుడైన యోగి గురువుగా లభించుట దుర్లభము. ఎక్కడో ఒకచోట పరమ సౌభాగ్యవంతునికి దైవకృపతో అటువంటి సద్గురువు లభిస్తాడు. సగముకంటే ఎక్కువ శుభలక్షణములు కలిగిన, పరమార్ధ సాధన సంపన్నుడు, యోగసాధన, జ్ఞాన, ధ్యాన పరాయణుడు, మంత్రాదులు తెలిసిన జ్ఞాని అయిన గురువు లభించుట అంత కష్టముకాదు. అటువంటి శివుని ప్రభావముతో కూడిన రుద్రశక్తిని కలిగివుండే గురువును, శిష్యుడు గురువుగా స్వీకరించుటకు మునుపే ఆయన పేరును తలచగానే, వారి శక్తి సామర్థ్యముల గురించి చర్చించగానే, ఆయనను

స్మరించగానే, ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపగానే లేక వారు పిలువగానే దగ్గరకు వచ్చిన వెంటనే, ఆయనను దర్శించిన మాత్రమునే, ఆయనకు నమస్కరించినంతనే, ఆనందాశ్రువులు, కంపము, రోమాంచము, స్వరభంగము, నేత్రాది వికృతులు కలిగి మనః ప్రాణములు వారియందు ఆకర్షింపబడుతాయి. ఆయన చెప్పిన పని యందు నిమగ్నము కాగానే ఆనందము, ఆహ్లాదము ప్రసన్నత, ఉత్సాహము కలిగినట్లయి మనః ప్రాణ, శరీరములలో ఉద్వేగము కలిగినట్లయితే అతడు శివుని ప్రభావముతో కూడి వున్న గురువుగా భావించాలి.

శిష్యుడుపై లక్షణముల సహాయముతో గురువును పరీక్షించి అతడిలో సామర్థ్యము ఉన్నదో లేదో తెలుసు కొనవలెను. శిష్యుడు ధర్మార్థ కామమోక్షములు ఆశించి సాధారణ దీక్షను తీసుకొన్నప్పటికి గురువుకూడా శిష్యునికి సాంసారిక కామనలపూర్తి కొరకు జప, హవన, పూజా, పాఠములు, స్తోత్ర, దేవతార్చనలు వంటి అనుష్ఠానములను బోధించి శిష్యుడు వాటిని చేస్తున్నప్పుడు పైన చెప్పిన లక్షణములు, అనగా కంపము, రోమాంచము మొదలగునవి కలిగితే గురువును శక్తి సామర్థ్యములు కలవానిగా, జ్ఞానిగా, మంత్రసిద్ధునిగా భావించాలి. ఆయనయే మోక్షప్రదాయమైన షట్చక్ర వేధకూడా చేయగలడు. అతడి ద్వారా శిష్యునికి పరమకల్యాణము కలుగుతుంది. ఈ విధముగా జరిగినపుడే గురువు గురువుగా ఉంటాడు, శిష్యుడు శిష్యునిగా ఉంటాడు. బుద్ధి మంతుడైన శిష్యుడు అజ్ఞానిని గురువుగా స్వీకరింప కూడదు. ఒకవేళ స్వీకరించినట్లయితే అతడిని వెంటనే త్యజించి, జ్ఞానిని శరణువేడాలి. జ్ఞానవంతుడైన గురువును త్యజించుట, అజ్ఞానిని గురువుగా చేసుకొనుట మహాపాపము.

సామర్థ్యము గల గురువునకు కూడా గుణవంతుడైన శిష్యుడు లభించినపుడే శిష్యునికి యోగము మరియు మంత్రసిద్ధి కలుగుతుది. శిష్యుడు పవిత్రుడు, ఉత్తమ కులము మరియు జాతికి సంబంధించిన కులీనుడై వుండాలి. యమనియమములను పాటించుతూ పవిత్రునిగా వుండాలి. ఎల్లప్పుడు పురుషార్థ పరాయణుడిగా వుండాలి. వేదవేదాంగాలు, దర్శన శాస్త్రాలు చదివి వుండాలి, శాస్త్ర జ్ఞానము కలిగి వుండాలి. మనస్సులో దుర్భావనలన్ని వదిలిపోయి వుండాలి. నిత్యము ప్రాణులమేలు కోరుకొనే వాడుగా అనగా పరమ ఆస్తికుడుగా వుండాలి. నాస్తికుడుగా వుండకూడదు. స్వధర్మమును అనుసరించుతూ మాతాపితరులపై భక్తిని కలిగివుండి వారి హితముకొరకు, వారి సేవను చేస్తూ వుండాలి. తన మనస్సు శరీరము వాక్కు



ధనములతో గురువునకు సేవచేస్తూ వుండాలి. ఇటువంటి గుణములు కల సాధకుడు అటువంటి సిద్ధ గురువునకు శిష్యుడుకాగలడు. గురువుచే ప్రదానము చేయబడిన జప, తప, పూజా పాఠములు యోగసాధన మరియు మంత్రము యొక్క సిద్ధి అతడికి మాత్రమే లభించును. అందరికి మంత్రసిద్ధి లభిస్తుందని తలంచకూడదు.

శ్రీ మహేశ్వరులు నిశ్చయముగా తెల్పినదేమంటే వేదపురాణ, ఆగమాది శాస్త్రములలో భగవానునిచే చెప్పబడిన అన్ని మంత్రములు జీవమంత్రములు. జపము చేయుటచే అవి మనుష్యుని పవిత్రునిగా చేయును. ఎందుకంటే ఆ మంత్రములన్ని ప్రాణవంతమయినవి. అందువలన పైన చెప్పబడిన పాత్రత గల శిష్యుడు లభించిన తరువాత, శిష్యుని నామ, రాశిని అనుసరించి తిధి, వార, నక్షత్ర, యోగ, కరణ మరియు లగ్నమును చూచి నిర్ణయము చేసి వెనువెంటనే శిష్యునికి గురువు ఉపదేశమివ్వలసి ఉంటుంది.

**మంత్రము జపించుటకు అనువైన ప్రదేశము :** మంత్రజపము కొరకు అనుకూల స్థానము కావలెను. ఆస్థానము పుణ్యక్షేత్రము లేక నదీతీరము అయి వుండవచ్చు అనగా ఉత్తరాఖండ్, కనఖల్, హరిద్వార్, ఋషీకేశ్ నుండి బద్రీ, కేదార్, గంగోత్రి, యమునోత్రి వరకుగల అన్ని గంగా తీరములు పుణ్యక్షేత్రములుగా తీర్థస్థానములుగా చెప్పబడ్డాయి. అక్కడ గల పర్వతములపైన, గుహలలో, వృక్షముల క్రింద, శిలలపైన మరియు వాటి క్రింద మంత్రసిద్ధి కొరకు పునశ్చరణ చేయుట సర్వోత్తమము. తీర్థప్రదేశములలో గంగా మరియు నర్మద తీర ప్రాంతము, కాశీ – ప్రయాగ మొదలగు తీర్థస్థానములు సింధునదియొక్క సంగమ ప్రదేశము, నదులు ప్రవహించే కొండలోయలైన చిత్రకూటము, అమర్ కంటక్, త్రయంబకేశ్వరము, నాశిక్‌లకు సంబంధించిన తపోవనములలో, బిల్వవృక్షము క్రింద జపము చేయ వలెను. ఏకాంత ప్రదేశములుగా నున్న ఉద్యానవనము లందు, దేవతామందిరము లందు, సముద్ర తీరములందు ఎక్కడైనా జపమును చేయవచ్చును. చివరకు తన ఇంటివద్దకూడా చేయవచ్చును. మంత్రజపమునకు ఇవి అన్నీ ప్రశస్తములుగా చెప్పబడ్డాయి. వీటిలో ఏది తనకు అనుకూలముగా ఉంటుందో, ఎక్కడ చిత్తము ప్రసన్నముగా ఉంటుందో అక్కడనే నివసిస్తూ యోగసాధన, మంత్రజపము చేయవలయును. సత్వర మంత్ర సిద్ధికొరకు ఏకలింగ శివాలయముగా పిలవబడే శివాలయము నందు సాధన చేయవలెను. అనగా ఆ శివాలయము చుట్టు ప్రక్కల

చాలాదూరమువరకు ఎటువంటి శివాలయము లేకుండా వున్నప్పుడు ఏకలింగ శివాలయముగా పిలువబడుతుంది. శ్మశానములందు, ఎవ్వరు నివశించని నిర్జన ప్రదేశములందు, నదీతీరమునందు, స్వతః సిద్ధముగా ఏర్పడిన గుహలందు, పర్వత ప్రదేశములందు పెద్దదైన తటాక తీరమునందు, దేవీ మందిరములందు, శక్తిక్షేత్రములందు, సిద్ధమహాపీఠములలో, శివాలయములలో బిల్వవృక్షపు మూలములో, ఉసిరిక చెట్టుక్రింద, రావిచెట్టు క్రింద లేక ఇతర వృక్షముల క్రింద కూర్చొని మంత్రజపము చేయవచ్చును. విభిన్న స్థానములలో చేయబడిన జపముయొక్క ఫలితము వేర్వేరుగా ఉంటుంది.

ఇంటిలో వుండి చేసిన మంత్రజపముయొక్క ఫలితము సాధారణముగా ఉంటుంది. గోశాల యందు చేసిన జపము ఫలము నూరురెట్లు అధికముగా ఉంటుంది. ఉద్యానవనములందు ఏకాంతవనములందు చేసిన జపము వెయ్యిరెట్లు ఫలితమునిస్తుంది. పర్వత గుహలందు, పుణ్యక్షేత్రములందు, నదీతటము లందు చేయబడిన మంత్రజపము పదివేలరెట్లు ఫలదాయక మవుతుంది. దేవాలయములో చేసిన మంత్రజపము కోటిరెట్లు ఫలితమును ఇస్తుంది. కానీ ప్రాణాయామము చేసి తన అంతరములో నున్న శివుని సన్నిధిలో చేయబడిన అదే జపము అనంతమైన ఫలములను ఇస్తుంది.

**సిద్ధ పీఠములు :** ఈ క్రింది సిద్ధ పీఠములో మంత్రజపము చేయగానే సహజముగా సిద్ధి లభిస్తుంది. మాయావతీ, కనఖల్, హరిద్వార్, మధురా, కాశీక్షేత్రము, గోరఖ్‌పూర్ మరియు హింగుళ మహాసిద్ధ పీఠములు అయివున్నవి. జలంధర్ సమీపమునగల పర్వత ప్రాంతమందు జ్వాలాముఖీ మహాపీఠమున్నది. అది మంత్ర సిద్ధికొరకు ప్రసిద్ధి చెందిన స్థానము. అదే విధముగా హిమాలయములలో రామగిరి మహాపీఠమున్నది. గోదావరి తీరమందుగల త్రయంబకేశ్వరము కూడా మహాసిద్ధ పీఠము అయివున్నది. అక్కడ మంత్ర సిద్ధి సత్వరమే కలుగుతుంది.

నేపాలులోని ఖాట్మండులో పశుపతినాధ మహాసిద్ధ పీఠము కలదు. అదేవిధముగా అక్కడ కర్ణ సూత్రము, మహాకర్ణము కూడా కలవు. అయోధ్యా మరియు కురుక్షేత్రములు కూడా మహాసిద్ధ పీఠములు. మనోహర సింహనాద స్థానముకూడా మహాసిద్ధ క్షేత్రము. అస్సాము రాష్ట్రము ప్రక్కనగల మణిపూర్ ఋషికేశము ప్రయాగలేక తపోవనము మహాసిద్ధ పీఠములు. ఉత్తరాఖండ్‌లోని హిమాలయములలో బద్రికాశ్రమను మహాసిద్ధ



పీఠమున్నది. గుజరాత్‌లోని అంబాజీ మరియు ఇంకొకచోట అంబికా అర్ధనాలక్ మహాపీఠము, త్రివేణీ మరియు గంగానది సాగరములో సంగమించు ప్రదేశములు కూడా మహాసిద్ధ పీఠములు. విరజా ఉడ్డీయాన ప్రదేశము కూడా మహాపీఠమైవున్నది.

పూరీజగన్నాథములో కమల మరియు విమల అను పేరుగల మహాసిద్ధ పీఠములు గలవు. నర్మదానది తీరములో మహిష్మతీపురము, వారాహీ క్షేత్రము మరియు త్రిపురలో మహాత్రిపుర సుందరి దేవి ఉన్న ప్రదేశము మహాసిద్ధ పీఠములు అయివున్నవి. భగమతి నీలవాహినియొక్క వ్రజభూమిలో గోవర్ధనగిరి మరియు వింధ్యాచలములో వింధ్య వాసినీదేవి యొక్క స్థానములు సిద్ధమహా పీఠములు అయివున్నవి. క్షీరగ్రామ్ మరియు వైద్యనాథ ధామములలో కూడా ప్రసిద్ధ సిద్ధ పీఠములు వున్నవి. కలియుగములో అన్ని రకములైన మంత్రముల సిద్ధి కొరకు అస్సామ్ రాష్ట్రములో నున్న కామరూప కామాఖ్యా దేవివున్న మహాసిద్ధ పీఠము అన్నింటికంటే ముఖ్యమయినది. అక్కడ సాధకుని సమస్త కామనలు పూర్తి అవుతాయి. అందువలన కలియుగములో ప్రత్యక్ష మరియు శీఘ్రమంత్రసిద్ధి కొరకు కామరూప మహాసిద్ధ పీఠములో మంత్రజప అనుష్ఠానము చేయవలెనని చెప్పబడినది. ఈ 51 మరియు 101 సిద్ధ పీఠముల వివరణ **ప్రాణతోషిణీ తంత్రము** యొక్క ద్వితీయ పరిచ్ఛేదములో వివరించబడినది.

**మంత్రజపములో ఆహార ప్రాధాన్యత :** వరి, గోధుమలు, పాలు, పెరుగు, వెన్న, మజ్జిగ, పాయసము, పూరీ, హల్వా ఇత్యాది సాత్విక పుష్టికర భోజనములు మరియు అన్ని విధములైన తియ్యని ఫలములు, చిలకడదుంప, బంగాళదుంప, పెండలము, కంద వంటి కంద మూలములు ఆహారముగా తీసుకొనవచ్చును. హవిష్యాన్నము పప్పు, అన్నము, రొట్టె, దొండ, బీరకాయ మొదలగుగాల శాకములు మరియు బార్లీ జావ, బెల్లము, నెయ్యి, పాలతోపాటు తన శారీరక మానసిక పరిస్థితుల ననుసరించి ఆహార నిర్ణయము చేయవలెను. అనేకముగా దేవతలున్నారు. వారికి సంబంధించిన అనేక మంత్రములు కలవు. వారి భక్తులలో అనేక విధములైన కోర్కెలు కలవారు వున్నారు. అందువలన ప్రతి ఒక్కమంత్ర అనుష్ఠానము చేసేవారికి నియమ సమయములు, ఆహార విహారములు ఒకేవిధముగా వుండవు. శాకాహారులుగా నుండి సాత్విక భోజనమును, మాంసాహారులుగా రాజసిక మరియు తామసిక భోజనముచేస్తున్న వారందరు కూడా మంత్ర జపముచేస్తారు. అందరికి దేవత ఒక్కరే. కాని కామనల యొక్క ఫలము వేర్వేరుగా ఉంటుంది. అందువలన

ఎవరు ఏవిధముగా చేయదలచుకొంటే ఆ విధముగా చేయవచ్చును. సాత్విక భావ సంపన్నులైన సాధకులు మంత్రసిద్ధి పొందాలనుకొంటే ఇతరుల అన్నమును ఎప్పటికీ భుజింపరాదు.

ఇతరుల అన్నము తిని మంత్ర, జప, పునశ్చరణలు చేసి పుణ్య సంచయము చేయవలెననుకొనువారు, అన్నదాతకు తానుచేసిన జప, తప, పుణ్యకర్మలలో సగము ఫలము లభిస్తుంది అని తెలుసుకోవాలి. చేసే వారికి సగము ఫలము మాత్రమే లభిస్తుంది. దానిలోకూడా దైన్యము, దరిద్రతను ప్రదర్శించుట చేత లేక మిథ్యా వ్యవహారముతో మోసము చేయుటవల్ల సమస్తము ఫలము నశించి పుణ్యము బదులు పాపము కలుగుతుంది. అందువలన బుద్ధిమంతులైన సాధకులకు ప్రయత్న పూర్వకముగా ఇతరుల ఆహారమును భుజించకూడదు. విశేషించి కోర్కెలు సిద్ధించుటకు పునశ్చరణలు చేసేవారు ఎవరివద్ద నుండి అన్నమును గాని దానమునుకాని స్వీకరించకూడదు. తాను సత్క్రమ పద్ధతులలో సంపాదించుకున్న భోజనమును మాత్రమే చేయవలెను. అప్పుడే మంత్రసిద్ధి కలుగుతుంది. ఎవరి నాలుక ఇతరుల అన్నముతిని దగ్ధమయి వుంటుందో, ఎవరిచేతులు దానములు గ్రహించి దగ్ధమయి వుంటాయో, ఎవరి మనస్సు స్త్రీని భోగించవలెనని కోర్కెతో దహించబడి వుంటుందో అతడికి కార్య సిద్ధి ఎన్నటికీ కలుగదు.

కొందరు వాద వివాదములు కొరకు విద్యనభ్యసించుతారు. ఇతరుల కొరకు మంత్రజపములు చేస్తారు. తనపేరు ప్రఖ్యాతుల కొరకు దానములు చేస్తారు. వారికి మంత్ర సిద్ధి ఎన్నటికీ కలుగదు. ఆవిధముగానే కొందరు ధనప్రాప్తికి తీర్థములు దర్శించుతారు. అక్కడకు వెళ్ళి గర్వముతో ఇతరులకు తమ దర్పము చూపించుటకు లేక ధనమును ఆర్జించవలెనను కోరికతో తపస్సు చేస్తారు. అటువంటి పాపాత్ములైన మూఢజనులు తన మృతతుల్య దేహముతో అంగన్యాస, కరన్యాస, దేవతార్చన మరియు జప, తప, హోమ ఇత్యాదులెన్ని చేసిననూ అన్నీ నిష్ఫలమవుతాయి.

**మంత్ర జపము కొరకు ఆసనము :** కామ్య కర్మ సిద్ధి కొరకు మంత్రజపము పునశ్చరణల కొరకు ఎర్రని కంబళి ఆసనము శ్రేష్ఠమని చెప్పబడినది. దర్భాసనముపైన జపము చేయుటచే నిశ్చయముగా మంత్రసిద్ధి కలుగుతుంది. అందువలన దర్భాసనము దానిపై ఎర్రని కంబళి పరచి పద్మాసనము, స్వస్తికాసనము, వీరాసనమునందు కూర్చొని మంత్రజప, పూజ, అర్చనాది కార్యములు చేయవలెను.



లేకుంటే అవి నిష్ఫలమవుతాయి. నక్కతోలుతో చేయబడిన ఆసనముపై కూర్చొని జపముచేసినట్లయితే సర్వనాశనము కలుగుతుంది. ఎందుకంటే మంత్ర సాధనలో నక్కతోలును స్పర్శించిన మాత్రముననే సిద్ధికి హాని కలుగుతుంది.

**మంత్ర విధానములు :** ఏ సాధకునికి మంత్రార్థము మంత్ర చైతన్యము మరియు యోని ముద్రను గురించిన అవగాహన ఉండదో అతడు శతకోటి మంత్రజపము చేసినప్పటికి మంత్రసిద్ధి లభించదు. ఈ మంత్రములు మొదట సాధకుని హృదయములో గుప్తముగా వుండేవి. ఇప్పుడు అవి బయటకు చెప్పబడి, వ్రాయబడి ముద్రించబడుటవలన ప్రభావ రహితమైనాయి. వానివాస్తవిక బలముకూడా మరుగునపడినది. అందువలన వేదములు, పురాణములు, తంత్రములలో చెప్పబడిన మంత్రములు ఫలదాయకమగుటలేదు. ఈ మంత్రములనే మరల సంస్కరించి జపించుటవలన కుండలినీశక్తి జాగరణ జరిగి తద్వారా మంత్రము చైతన్యవంతమై సిద్ధిదాయకమవుతుంది. శాస్త్ర గ్రంథములలో చెప్పబడిన అన్ని మంత్రములు చైతన్యరహితములై కేవలము అక్షర మాత్రముగా వుంటాయి. అందువలన అనేక లక్షల కోట్ల జపముచేసినను ఆశించిన ఫలితము లభించదు.

మంత్ర సిద్ధి కలుగకపోవుటకు ప్రధాన కారణమేమంటే సాధకునికి మంత్రము యొక్క వాస్తవిక అర్థము, మంత్రచైతన్యము యొక్క ఉనికి, మంత్ర ప్రతిపాద్య కుండలినీ శక్తి జాగరణము గురించి తెలియదు. వారు కేవలము మంత్రమును జపిస్తూ వుంటారు. వారు కోటిసార్లు మంత్రమును జపించిననూ మంత్రసిద్ధి కలుగదు. ఎందుకంటే మంత్రసిద్ధి కొరకు మంత్రార్థము, మంత్ర చైతన్యము మరియు కుండలినీశక్తి యొక్క జాగరణ గురించి తెలుసుకొనుట మరియు అవి ఏర్పడుట ఆవశ్యకము. మంత్రము చైతన్యవంతమైనపుడు చైతన్య మంత్రమును ప్రథమముగా ఒక్కసారి జపించుటచే ఎటువంటి ఫలము కనపడుతుందో దానిని వంద, వేయి, లక్ష, కోటిసార్లు జపించిననూ అదే ఫలము లభించును. మంత్రము చైతన్యవంతమగుటచే కుండలినీశక్తి జాగృతమవుతుంది. అందువలన మరల మరల మంత్రజపము చేయవలసిన అవసరము ఉండదు. ఎందుకంటే మంత్రజపము ద్వారా కుండలినీశక్తి జాగృతమగుటయే పరమ ఫలప్రాప్తి అయివున్నది.

గురువు యొక్క కృపాఫలితముగా లేక విధివిహితముగా మంత్రపునశ్చరణలు చేసి పూజాపాఠములు, జపతపములు, హవనము చేయుటచే మంత్రము చైతన్యవంతమైనపుడు హృదయగ్రంధి భేదనము జరుగుతుంది. అప్పుడు సాధకుని

అంతరములో వివిధములైన జ్యోతీప్రకాశము మరియు తన ఉపాస్య దేవీదేవతల దర్శనము కలుగుతుంది. అప్పుడు సాధకునికి ఆనందాశ్రువులు ప్రవహిస్తాయి. రోమాంచము కలుగుతుంది. శరీరము ఉద్వేగ భరితమవుతుంది. గొంతు గద్గద మవుతుంది. అంతరశక్తి కుండలినీ జాగృతమగుటచే నిస్సందేహముగా పైన పేర్కొన్న అన్ని సాత్వికభక్తి భావములయొక్క లక్షణములు మంత్ర ఉచ్చారణ మాత్రముచేత కలుగుతాయి. ఈ విధమైన నిదర్శనములు, మంత్రచైతన్య లక్షణములు శివగురు పరంపరలో సర్వదా కనిపిస్తూ వచ్చాయి. అందువలన మంత్ర శాస్త్రములో దీనిని గురుపరంపరగా చెప్పారు.

ఈ మంత్రములు శాస్త్రోక్త, చైతన్య మరియు సిద్ధ మంత్రములను మూడు విధములుగా చెప్పబడ్డాయి. వేద, స్మృతి, పురాణ మరియు ఆగమ శాస్త్రములలో చెప్పబడ్డ అన్ని మంత్రములు శాస్త్రోక్త మంత్రములుగా చెప్పబడ్డాయి. మరియు వీటి దోషములను దిద్దుబాటు చేయుట, శుద్ధి చేయుట, పునశ్చరణలుచేసి వాచిక, ఉపాంశు, మానస మరియు ధ్యాయిక జపమును వైఖరీ, మధ్యమా, పశ్యంతి, పరావాణిలో జపించుట వలన చైతన్యవంతమవుతాయి. వాచిక జపము వైఖరీ ద్వారా, వాక్శక్తి యందు ఉపాంశు, మధ్యమాయందు మానస జపమైన పశ్యంతి చేయబడుతాయి. ధ్యాయిక జపము పరావాణిలో సహజ సిద్ధముగా జరుగుతుంది. వీటిని చైతన్యమంత్రములు అంటారు. మూడవ విధమైన సిద్ధమంత్రములు గురు పరంపరాద్వారా సిద్ధ గురువు నుండి లభిస్తూ వచ్చాయి. వాటిని సిద్ధ మంత్రములని అందురు. పరంపరానుగతముగా లభించెడి సిద్ధమంత్రములు జపించుటకు వాటిని శుద్ధి చేయవలసిన అవసరము లేదు. అవి నాలుగు వాణులందు, నాలుగు జపములందు మంత్ర గ్రహణముచేయగానే ఫలిస్తాయి. ఎవరివద్ద ఈ సిద్ధ మంత్రములు లభిస్తాయో ఆ గురువును సిద్ధ గురువుగా పరిగణించాలి.

**మంత్ర దోషములు వాటి పేర్లు :** శ్రీమహేశ్వరులచే చెప్పబడిన దోషయుక్త మంత్రముల పేర్లు ఈ విధముగా వున్నయి. బహుకూటాక్షర, ముగ్ధ, బద్ధ, కృద్ధ మరియు భేదిత, బాలకుమార, యువ, వృద్ధ, ప్రౌఢ మరియు గర్విత, స్తంభిత, మూర్ఛిత, కష్ట, సంపీత లేక ఖండిత మంత్రములు దోషయుక్త మయినవి. పరాజ్ఞ, ఛిన్న, బధిర, అంధ, అచేతన, కేకర, క్షుధిత, క్లుప్త, స్థాన, దుష్ట, పీడిత, నిస్నేహ, వికల, స్తబ్ధ నిర్జీవ మరియు ఖండితారిక ఇత్యాది మంత్రములు నిర్దోషములు కాకపోవుటచే సుఖదాయకముకాదు.



సుప్త, తిరస్కృత, లీఢ, మలిన, దురాసద, నిసత్వ, నిర్దయ, దగ్ధ, భయంకర, నిత్రింశక, వికృతాచార, ఫలహీన, విక్నంతన, నిర్జీవ, భూమిత, శప్త, రుక్ష, కృష్ట, అంగహీన, జడ, రిపు, ఉదాశీన, లజ్జిత, మోహిత ఇత్యాది అన్ని మంత్రములు దోషయుక్తమైనవిగా చెప్పబడ్డాయి.

వీటియొక్క దోషములను మరియు వాటి నివారణను తెలుసుకొని మంత్రములను జపించవలయును. లేకుంటే ఈ దోషయుక్త మంత్రములను లక్షసార్లు మరియు కోట్ల పర్యాయములు జపించిననూ సాధకులకు మంత్రసిద్ధి కలుగకపోగా అనర్థము కలుగును. వీటియొక్క విశేష వర్ణన **ప్రాణతోషణీ తంత్ర** గ్రంధముయొక్క దశమపరిచ్ఛేదములో చూడవచ్చును.

**మంత్రశుద్ధి విధానములు :** పైన చెప్పబడిన మంత్ర దోషములను నశింపజేసే దశవిధ సంస్కారములు కలవు. జనన, జీవన, తాడన, బోధన, అభిషేక, విమలీకరణ, ఆప్యాయన, తర్పణ, దీపన మరియు గుప్తి అను దశవిధములైన మంత్రశుద్ధి విధానములు కలవు. వీటిని చేయుటచే మంత్రము శుద్ధము, స్వచ్ఛము ప్రకాశవంతము, ప్రభావశాలి మరియు చైతన్యవంతమవుతుంది. త్రుప్పుపట్టిన అస్త్ర శస్త్రములను పదునుపెట్టుటచే పదును మార్చినట్లు మంత్రము దశవిధ సంస్కారములచే స్ఫూర్తివంతమై సిద్ధిదాయకమవుతుంది.

బుద్ధిమంతులైన సాధకులు ఏ మంత్రమును జపించవలెనుకొన్నారో ఆ మంత్రమును భోజపత్రము (మర్రిఆకు) పైన అష్టకోణములతో అష్టదళ కమల మాతృకా యంత్రములో గోరోచనముతో వ్రాసి పర్యాయక్రమములో మాతృకా యంత్రములో వ్రాయబడ్డ మంత్రమును గొంతెత్తి జపించుటను మొదటిగా చెప్పబడ్డ జనన శుద్ధిగా చెప్పవచ్చును. ఈ ప్రకారముగా శుద్ధి చేయబడిన మంత్రాక్షరములను ప్రతి ఒక్కటిని ప్రణవముతోపాటు వందసార్లు జపించుటను మంత్ర, తంత్ర విశారదులైన ఋషిమునులు జీవనశుద్ధిగా చెప్పారు. మంత్రముయొక్క ప్రతి ఒక్క అక్షరమును వేరువేరుగా వ్రాసి వాయుబీజమైన 'యం' ద్వారా చందన జలముతో ప్రతిఒక్క మంత్రాక్షరమును వంద పర్యాయములు ప్రోక్షణ చేయుటను తాడనశుద్ధి అంటారు. మరల ఆ మంత్రాక్షరములను పైన చెప్పిన విధముగా విడివిడిగా వ్రాసి ప్రతి ఒక్క అక్షరమును ఎర్రగన్నేరు పుష్పములతో అగ్నిబీజమైన 'రం' ద్వారా కొట్టుటను బోధన సంస్కారముగా చెపుతారు.

తరువాత తన ఉపాస్య దేవీ దేవతలు ఐన, శివుడు, శక్తి, విష్ణు ఇత్యాదులలో శివమంత్రము కొరకు శివతంత్రానుసారము, శక్తి మంత్రములో శక్తి తంత్రానుసారము, విష్ణుమంత్రములో వైష్ణవ తంత్రాననుసారము తమ ఇష్ట మంత్రమును పూర్వము చెప్పినట్లు భోజపత్రము (మర్రి ఆకు) వ్రాసి వాటి యొక్క ప్రత్యేక అక్షరమును సంఖ్యానుసారముగా రావి ఆకుతో జ్యోతిర్మంత్ర ప్రణవముద్వారా అభిశంసన చేసి వెనువెంటనే మనస్సుతో జపించి ఆధారశక్తి అయిన కుండలినీ మహాశక్తిని ఉత్థానము చేయవలెను. ఈ విధముగా చేయుటచే మంత్రము యొక్క ఆణవ, కార్మణ, మాయిక దోషములు (సహజ ఆగంతుక, కార్మణ) నివృత్తి అవుతాయి. మరియు మంత్రము నిర్మలమవుతుంది. దీనినే విమలీకరణమందురు. జ్యోతిర్మంత్రములైన తార, ప్రణవ, వ్యోమహకారము, అగ్నిరేఫ, మను, దండి మరియు అనుస్వార అను వీటినన్నింటియొక్క యోగ మంత్రము "ఓం హ్రీం" అయివున్నది. పైన చెప్పిన మంత్ర వర్ణములన్నింటిని స్వర్ణజలముతో, కుశోదకము (దర్భలతో చల్లెడి నీళ్ళు) పుష్పోదకముతో, జ్యోతిర్మంత్రమైన 'ఓం'తో తృప్తి పరచుటను ఆప్యాయన సంస్కారమందురు. మరల పైన చెప్పిన జ్యోతిర్మంత్రముల ద్వారా మంత్రాక్షరములను 108 పర్యాయములు జపించి జలముతో తర్పణ నొసగుటను. తర్పణ సంస్కారముగా చెప్పబడినది. శక్తి మంత్రములను తేనెచేత విష్ణు మంత్రములను కర్పూరమిశ్రిత జలము ద్వారా, శివమంత్రమును పెరుగు, పాలతో శతవార అభిషేకము చేయుటను అభిషేక సంస్కారమందురు.

ఇష్టమంత్రమును బ్రహ్మబీజమైన 'ఓం' మరియు మాయాశక్తి బీజము 'హ్రీం, శ్రీం'లతో సంపుటీకరణము చేసి ఆధారస్థానములో గల శక్తిని మేల్కొలిపి కుంభక ప్రాణాయామముద్వారా 108 సార్లు జపించుటచే మంత్రశక్తి ప్రదీప్త మవుతుంది. దీని దీప్తి సంస్కారము అనిపేరు. ఇష్టమంత్రమును జపించుతూ సుషుమ్నలో మనః ప్రాణములను లయము చేయుటను గుప్త సంస్కారమందురు. ఇది బయటకు వెల్లడి చేయబడదు. గురుమంత్రములన్నియు వెల్లడిచేయబడవు. అందువలన ఈ దశ సంస్కారములన్నియు కూడా తంత్ర గ్రంథములలో గుప్తముగా నుంచబడినవి. వీటి రహస్యమును సాధకుడు తమ గురువుద్వారా తెలుసుకొనవలయును. మహాబంధ ఆసనములో కూర్చొని, యోనిముద్రాస్థితిలో ఆధార చక్రమును సంకోచ పరచి, కుంభక ప్రాణాయామముతో కుండలినీశక్తిని జాగృతపరచి, శక్తితోపాటు మూలాధారము నుండి బ్రహ్మరంధ్ర పర్యంతము ఇష్ట మంత్రమునందు మనస్సును



నిలిపి వెయ్యి పర్యాయములు మంత్రము జపించుటవలన మంత్రదోషములన్నియు ఉపశమించును. మంత్రసిద్ధి కూడా సత్వరము కలుగుతుంది.

గౌతమ, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని, వసిష్ఠ, కశ్యప, అత్రి, వ్యాసుడు అను ఎనిమిదిమంది మంత్ర ఋషులు అయివున్నారు. గాయత్రి, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి, విరాట్ మరియు వసు అను ఎనిమిది మంది మంత్ర అధిష్ఠాన దేవతలు మంత్ర పునశ్చరణ కాలములో వీరిని గురించి తెలుసుకొనవలసివున్నది. సాధకుడు తన ఇష్టమంత్ర సిద్ధిని కోరుకున్నట్లయితే అనునిత్యము నియమబద్ధుడై పూజ, ధ్యానము, జపము, హవనము చేస్తూ వుండాలి. ఈ విధముగా అనేక పర్యాయములు జప, ధ్యానములు అనుష్ఠించుతూ ఉన్నప్పుడు సాధకునికి శీఘ్రముగా మంత్రసిద్ధి కలుగుతుంది.

**మంత్ర చైతన్యము మరియు కుండలినీ జాగరణము :** ప్రత్యక్ష ఫలములనిచ్చి, సర్వోత్తమ జ్ఞానమునిచ్చి పరమశ్రేష్ఠ జ్ఞానము పొందే విధానము శ్రీమహేశ్వరులచే చెప్పబడినది. దీనిని తెలుసుకొనుటవలన సాధకులకు తమ ఇష్ట మంత్రసిద్ధి సత్వరము కలుగుతుంది. మూలాధారములో సర్పాకార కుండలినీ శక్తిని ధ్యానముచేసి, కుంభక ప్రాణాయామముద్వారా ప్రాణమును నడపుటచే ప్రాణవాయువు సుషుమ్నతో తిరుగాడుతుంది. అప్పుడు ఆశక్తి ఝణ – ఝణ, చిణ– చిణ ఇత్యాది వివిధములైన అవ్యక్త, శ్రుతి మధురమైన శబ్దములు చేస్తూ సుషుమ్నలో పైకి ప్రయాణిస్తూ సహస్రారమును చేరుతుంది. అది తిరిగి తన నివాసస్థానమైన మూలాధారమునకు వస్తుంది. ఈ విధముగా కుండలినీశక్తి మూలాధారము నుండి బ్రహ్మరంధ్రము వెళ్ళుటకు మరియు బ్రహ్మ రంధ్రము నుండి క్రిందనున్న మూలాధారము చేరుటకు అనేక పర్యాయములు మనస్సును లగ్నముచేసి ఇష్టమంత్రమును జపించుటచే మంత్రశక్తి ప్రకాశవంతమవుతుంది. మంత్రశక్తి యొక్క ప్రకాశములో సాధకుని అంతరములో నానావిధ దృశ్యములు మరియు దేవీ, దేవతల దర్శనములు కలుగుతాయి. అప్పుడు సాధకుని యొక్క అన్ని మంత్రములు చైతన్యవంతమవుతాయి. అంధకారములో కూడి వున్న గృహములో వెలుతురు లేకుండా ఏమీ చూడలేము. అదేవిధముగా చైతన్య రహిత మంత్రము వలన కూడా అంతరములో ఏమియు కనపడదు. అటువంటి మంత్రముల ద్వారా ఎప్పటికి మంత్ర సిద్ధి కలుగదు.

ఏమంత్రము సంస్కారము చేయకుండా అనగా శుద్ధి చేయకుండా జపించ బడుతుందో దానిని పశుభావముగల అపరిశుద్ధ అక్షర సమూహములుగా

భావించవలయును. వాటిని చైతన్యవంతము చేయుటకు ఇదివరలో చెప్పిన విధముగా మనః ప్రాణములను నిరోధించి కుండలినీ శక్తితో కూడిన సుషుమ్న యందు ఉచ్చారణ చేయవలసివున్నది. అనగా మంత్రాక్షరములను చైతన్యరూపిణి అయిన శక్తితోపాటు తలంచవలెను. చిన్మయమైన శక్తి, పరమామృతమయమైన శివుని యొక్క భావన మూలాధారము నుండి సుషుమ్నలో గల బ్రహ్మరంధ్రము, అంతరాకాశము, పరవ్యోమము నందు చేయవలెను. ఈ విధముగా కుండలినీ శక్తితోపాటు సుషుమ్నలో ఊర్ధ్వ ముఖముగా మనస్సును లగ్నముచేసి జపించుట వలన మంత్ర చైతన్యశక్తి జాగృతమవుతుంది. తన సామర్థ్యమును దర్శింప జేస్తుంది. ఇది పూజా, హోమాదులు లేకుండా మంత్ర చైతన్యము వలన సిద్ధిస్తుంది. అందువలన ప్రాణాయామము ద్వారా ప్రాణ నిరోధముచేసి సుషుమ్నయందు గల మూలాధారమునందు ప్రాణశక్తి అయిన కుండలినీ దేవి ధ్యానముచేసి ప్రయత్న పూర్వకముగా స్థిరమనస్సుతో మంత్రమును అనేక పర్యాయములు జపించుటచే సాధకుని మంత్రము చైతన్యవంతమవుతుంది. ఫలస్వరూపముగా మంత్రార్థము అనగా మంత్ర ప్రతిపాద్య కుండలినీశక్తి యొక్క పరిజ్ఞానము కలిగి సాధకునికి పరమార్థ సిద్ధి కలుగుతుంది.

**మంత్రముతోపాటు యోగసాధన :** యోగశాస్త్రము మరియు మంత్రశాస్త్రము యొక్క సంపూర్ణ జ్ఞానము కుండలినీ శక్తిపైన ఆధారపడి వుంటుంది. ఎప్పటివరకు కుండలినీశక్తి జాగృతముకాదో అప్పటివరకు ఏ మంత్రము సిద్ధించదు. ఏ యోగము కూడా సిద్ధించదు. అందువలన శ్రీపరమేశ్వరుడు ఆ మహాశక్తి జాగృతమయ్యే విధానములోను తంత్ర, మంత్ర గ్రంథములలో, యోగశాస్త్రములో అనేక పర్యాయములు చెప్పియున్నాడు. అన్ని మంత్రములకు మూలము, మూలాధారములో నున్న కుండలినీ శక్తి అయి వున్నది. దీనినుండియే అన్ని మంత్రములు ఉద్భవిస్తాయి. ఇదియే సమస్త జ్ఞానమునకు మూలము. అందువలన దీనిని మూలమంత్రముగా చెప్పబడినది.

శాస్త్రములలో చెప్పబడిన మంత్రములు అదేపద్ధతిలో జపించుటవలన సిద్ధి నొసంగవు మరియు చైతన్యవంతముకావు. వీటినే జనులు సాధారణముగా జపిస్తూ వుంటారు. ఆ మంత్రముల యొక్క సత్వర సిద్ధియోగాభ్యాసమువల్ల కలుగుతుంది. అందువలన ఇష్టమంత్ర సిద్ధిని కోరుకొనే సాధకుడు నిత్యము యోగాభ్యాసము చేస్తూ వుండాలి. ఎందుకంటే నిత్యము చేసేయోగాభ్యాసము వలన కుండలినీ శక్తి జాగృతమవుతుంది. ఆ శక్తి జాగృతమగుటచే మంత్రము చైతన్యవంతమై సిద్ధిని కలుగజేయును. అప్పుడే సాధకునికి మంత్రజపము యొక్క వాస్తవిక ఫలితము



లభిస్తుంది. యోగసాధన లేకుండా మంత్రసిద్ధి లభించదు, మరియు మంత్రమును జపించకుండా సత్వరయోగ సిద్ధి కూడా కలుగదు. మంత్రజపము, యోగసాధన రెండింటిని ఒకేసారి అభ్యసించుట వలన పరమశాంతి దాయకమైన బ్రహ్మజ్ఞానము సిద్ధిస్తుంది.

**ప్రాణ యోగము :** మంత్రమును ప్రాణవంతము, క్రియాశీలము చేసే విధానమును శ్రీమహేశ్వరులచే చెప్పబడినది. ప్రాణములేకుండా శరీర కార్యకలాపములు చేయలేము. అదేవిధముగా మంత్రమును వందలసార్లు జపించిననూ ప్రాణము సహకారము లేకుండా కార్యశీలము కాదు. అందువలన ఈ మంత్రములను ముందు చెప్పిన విధముగా పురుష మంత్రమైన బ్రహ్మబీజముతోపాటు శక్తి మంత్రము మాయాబీజముయొక్క అనగా స్త్రీ మంత్ర శక్తి బీజముతోపాటు సంపుటము చేసి, సుషుమ్నలో మనః ప్రాణములను నిరోధించి వంద పర్యాయములు లేక ఏడు పర్యాయములు మరల మరల జపించుటచే అన్ని మంత్రములు ప్రాణవంతములై, చైతన్యవంతముల మగును. ఇదియే మంత్రమును చైతన్యవంతము, ప్రాణవంతము చేయుటకు ఏర్పరచబడిన విధివిధానము.

సర్వకర్త, నిర్గుణుడు, అచలుడైన శివుడు శక్తి లేకుండా ఎటువంటి క్రియలను చేయలేడు. ఎందుకంటే ఈశ్వరుడు తనశక్తి అయిన మాయ సహకారము లేకుండా కార్యక్రమములను స్వయముగా నిర్వహించలేడు. ఆ శివుడే మాయాశక్తితో కలిసి సృష్ట్యాది కర్మలను సర్వులకు స్వామి అయిన ఈశ్వరుడు అవుతాడు. శక్తి లేకుండా శివుడు నిష్క్రియుడు. శక్తితోకలిసిన శివుడు భోగములను మోక్షమును ప్రదానము చేయును. అనగా బ్రహ్మ బీజమంత్రము, శక్తిబీజము లేకుండా ఎటువంటి కార్యములు చేయలేడు. మాయలేకుండా బ్రహ్మము, బ్రహ్మము లేకుండా మాయ వలన ఎటువంటి ప్రయోజనములేదు. రెండింటి సంయోగముతోనే ఏమైనా జరుగుటకు ఆస్కారమున్నది. అందువలన బ్రహ్మ బీజమంత్రముతోపాటు మాయాబీజ మంత్రమును కలిపి మంత్రజపమును చేయవలెను. మయారహితుడైన నిరాకార, నిర్గుణ పరబ్రహ్మమైన శివుడు సాధకులకు మోక్షమును, భోగములను కలిగించలేడు. శక్తి సహకారము లేకుండా ఆయన ఏమీ చేయలేడు.

పురుషుడు మరియు ప్రకృతి సంయోగముతోనే సృష్టిలో అన్ని కార్యములు జరుగుతున్నాయి. సావిత్రితో కలిసి బ్రహ్మ సిద్ధత్వమును పొంది బ్రహ్మాండము సృష్టించే

సామర్థ్యమును పొందాడు. విష్ణువుకూడా మహాలక్ష్మితోకూడి జగత్తును పరిపాలించును. ద్వారకలోనున్న శ్రీకృష్ణుడుకూడా తన భార్యఅయిన సత్యభామతో కూడి సిద్ధిని పొందాడు. శ్రీరాముడుకూడా సీతయొక్క సహకారముతోనే ప్రసిద్ధిని పొందాడు. ఈ మర్త్యలోకములో కూడా భుక్తిని మరియు ముక్తిని స్త్రీ సహచర్యముతోనే పొందగలము. శివ, శక్తులు అభేదములు. చంద్రుడు మరియు చంద్రకాంతిని ఎలా వేరుచేయలేమో అట్లే శివశక్తులనుకూడ వేరుచేయలేము. అందువలన భేదబుద్ధిని త్యజించి శివశక్తులను, బ్రహ్మము మాయను ఒక్కటిగా తలంచి మంత్రసాధన చేయవలెను.

**మంత్రసిద్ధ యోగము :** విధివిధానముగా చేయబడిన మంత్రజపము యొక్క అభ్యాసము వలన అంతరములో శక్తి జాగరణ జరుగుతుంది. అప్పుడు సాధకునికి దివ్యభావము ప్రాప్తిస్తుంది. ఫలస్వరూపముగా మంత్రమును ఉచ్ఛరించగానే తనంతట తానుగా యోగసాధన జరుగుతుంది. మరియు తన ఆత్మయొక్క తేజమువల్ల సర్వత్ర ప్రకాశవంతమైన తీవ్ర దీప్తి కారణముగా అంతరములోని లోకముల జ్ఞానము కలుగుతుంది. ఈ విధముగా క్రియాశక్తి యొక్క వేగము 7 రోజులు నడిచినపుడు సాధకునిలో రుద్రశక్తి ప్రభావము కలిగి గొప్పతనము ప్రాప్తిస్తుంది.

రుద్రశక్తి ప్రభావములోనున్న సాధకుడు శక్తియొక్క ఆవేశములో అనేక విధములైన మాటలు, సంస్కృతము వంటి భాషలు మాట్లాడుతాడు. అనేక విధములుగా నవ్వుతాడు, పాడుతాడు, కటువైన శబ్దములను మాట్లాడుతాడు. ఈ క్రియలన్నియు మనస్సులో శక్తియొక్క ఆవేశము కారణముచే స్వతః సిద్ధముగా జరుగుతాయి. సాధకుడు తనంతట తాను ఏమీ చేయడు. క్రియాశక్తి వేగము తీవ్రముగా నున్నప్పుడు తాను సంకల్పించినను ఆ వేగమును ఆపలేడు. వేగము శాంతించిన తరువాత ఎక్కడ, ఎక్కడ సాధకుని దృష్టి పడుతుందో అక్కడ అక్కడ సర్వత్రా, అన్ని దిక్కులలో తన ఆత్మయొక్క వెలుగులతో వ్యాపించిన కిరణ ప్రకాశము చూచును. ఈ స్థితిని పొందిన సాధకునికి ఆరుమాసముల వరకు ఏ ఏ దిక్కులను చూస్తాడో ఆయా దిక్కులందు ఆత్మ జ్యోతుల రూపములో అతడికి కనిపించును. కాని ఆ రూపములలో అతడి చిత్తము లగ్నముకాదు. ఆ రూపములను సాధకుడు దర్శించటమే వదలివేస్తాడు. ఈ విధముగా క్రియాశక్తి ఆవేశము ప్రాప్తించిన సాధకుడు సంతోషముతో ఆనందోన్మత్తు డవుతాడు. ప్రమాదవశాత్తు ఈ స్థితిలో ఏదైనా ఆటంకము కలిగితే



సాధకునిలో మరలశక్తి వికాసము జరిగి సముచిత స్థితిలోనికి రాగలడు. ఈ విధముగా తీవ్ర సంవేగముతో ఒక సంవత్సరము యోగాభ్యాసము చేసినపుడు యధేచ్ఛగా యోగసిద్ధిని ప్రాప్తించుకోగలడు. ఆ యోగసిద్ధి కారణముచే యోగికి తన ఇచ్ఛానుసారము ఏ స్థితియందైనను నిలిచి వుండగల సమర్థత లభిస్తుంది.

ధర్మ, అర్థ, కామ, మోక్షములు ప్రాప్తి కొరకే ఈ లోకములో మానవజన్మ ప్రాప్తించినది. ఈ జన్మలోనే పైన చెప్పిన నాలిగింటిని సాధించుకొనుటకు ఏకైక ఉపాయము. యోగసాధన అనగా మంత్ర సాధన అయివున్నది. మంత్ర మరియు యోగసాధన ద్వారా మానవుడు భక్తి, ముక్తిలను శీఘ్రముగా పొందగలడు. పురుషార్థ ప్రాప్తికి శాస్త్రములలో బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసము అను 4 ఆశ్రమ విధానములున్నవి. బ్రహ్మచర్య ఆశ్రమమునందు విద్యనభ్యసించి ధర్మమును ఆర్జించవలెను. గృహస్థాశ్రమములో ధర్మయుక్తముగా ధనమును సంపాదించుకొని తన భోగవాసనలకు అనుగుణముగా తన కోర్కెలను తీర్చుకొనవలెను. వానప్రస్థాశ్రమములో అన్నిభోగ వాసనలను త్యజించి తపస్సుచేయాలి. చివరకు సన్యాసము స్వీకరించి మోక్షమును పొందాలి. మానవుని ఆయువు 100 సం॥ అనుకుంటే ఈ ఆశ్రమములు క్రమముగా 25 సం॥ బ్రహ్మచర్య ఆశ్రమము, 25 సం॥ గృహస్థ ఆశ్రమము, 25 సం॥ వాన ప్రస్థాశ్రమము, మిగిలిన 25 సం॥ సన్యాస ఆశ్రమములో నుండి దేహత్యాగము చేయవలెను. అప్పుడే ఈ ప్రపంచములో జన్మించినందుకు సార్థకత లభిస్తుంది.

బుద్ధి మంతుడు వివేకవంతుడైన సాధకునికి భోగసాధన కొరకు ఏకైక ఉపాయము గృహస్థాశ్రమమే అయివున్నది. మిగిలిన మూడు ఆశ్రమములు కేవలము తపస్సు చేయుట కొరకు, భోగములు త్యజించుటకు ఉద్దేశించబడినవి. దుర్భాగ్యవశమున బ్రహ్మచారి, వానప్రస్థుడు, సన్యాసి త్యాగభావనను వదలి భోగభావమును ఆశ్రయించినట్లయితే అతడు నరకమునకు వెళ్ళగలడు. ఒక్క గృహస్థాశ్రమములోనే భోగ, మోక్షముల కొరకు సాధన చేయబడుతుంది. అన్య ఆశ్రమములలో భోగములను అనుభవించేవాడు మహాపాపాత్ముడు. అతడి జీవితము వృధా అని ధర్మశాస్త్రములు చెపుతున్నాయి. అందువలన ధర్మశాస్త్రానుసారము మంత్ర, ఔషధ, యోగ, జ్ఞాన, ధ్యాన సిద్ధి కొరకు గృహస్థాశ్రమము ఉపయుక్తమైనది. మహాయోగీశ్వరుడైన శ్రీకృష్ణుడు మహాభోగములను అనుభవించి గృహస్థాశ్రమములో

నున్నప్పటికి పరమజ్ఞానిగా పిలువబడ్డాడు. అదేవిధముగా రాజులలో జనకుడు, భగవానుడైన శ్రీరామచంద్రుడు వంటివాడు గృహస్థాశ్రమములో భోగములను అనుభవించినప్పటికి శ్రేష్ఠజ్ఞానులుగా పిలువబడ్డారు. అదేవిధముగా మంత్ర, యోగ, జ్ఞాన, ధ్యాన పారంగతులైన పరమశ్రేష్ఠులైన వశిష్ఠముని అన్ని విధములైన క్రియా కర్మముల అనుష్ఠానము చేసినప్పటికి మహాజ్ఞానిగా కీర్తించబడ్డాడు. యాజ్ఞవల్క్యుడు, వ్యాసుడు, పరాశరుడు వంటి ఋషి, ముని, యోగి, జ్ఞాని, ధ్యాని, రాజర్షి, మహర్షి బ్రహ్మర్షులందరు గృహస్థాశ్రమములో నుండి సిద్ధత్వమును పొందారు. దీనికి విరుద్ధముగా శుకదేవుడు పరమత్యాగిగా చెప్పబడ్డాడు. త్యాగము చేయవలెననుకొంటే శుకదేవునే అనుసరించాలి. ఈ విధముగా శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, జనక మహారాజు, వశిష్ఠముని, సర్వత్యాగి అయిన శుకదేవుడు ఈ 5 గురు మహాపురుషులు మహాజ్ఞానులుగా, జీవన్ముక్తులుగా, విదేహముక్తులుగా ప్రసిద్ధులయినారు. అనగా గృహస్థాశ్రమమే పరమశ్రేష్ఠమైన ఆశ్రమము అయివున్నది.

# సిద్ధమహాయోగము

## పద్దెనిమిదవ ప్రకరణము

**తంత్ర శాస్త్రములో తత్వజ్ఞానము :** భారతదేశములో బౌద్ధ ధర్మ వ్యాప్తికి ముందు తంత్ర సాంప్రదాయము ప్రబలముగా ఉండేది. ఈ తంత్ర సాంప్రదాయమును పాటించేవారు అన్నిదేశములలో ఉన్నారు. ప్రత్యేకించి భారతదేశములోని బెంగాలు, అస్సాము, ఒరిస్సా, బీహారు, కాశ్మీరునందు మరియు నేపాలు నందు వీరు ఇప్పుడు కూడా కనపడతారు. బర్మా, సయాము, జపాన్, చైనా, జావా, సుమత్ర, బాలి మొదలగు ద్వీపములందు తంత్రములలో చెప్పబడిన శిల్పమూర్తులు ఇప్పటికీ కనిపిస్తాయి. ప్రాచీనకాలములో ఆయా దేశములలో తంత్ర ధర్మము ప్రచారములో ఉందని దీనివలన మనకు తెలుస్తుంది. భాగవతములోని ఏకాదశ స్కంధమునందు తంత్ర విధివిధానముల ననుసరించి పూజచేసే విధానము చెప్పబడినది. యుగ పురుషుడు రామచంద్రుడు రావణవధకొరకు దుర్గాదేవిని పూజించి దేవియొక్క వరదానమును పొందెను. అందువలన ఈ తంత్రశాస్త్రము యొక్క విధివిధానములు వేదవిధానముల మాదిరి అతిప్రాచీనమైనవి. తంత్ర శాస్త్రమును పంచమ వేదము అనికూడా అంటారు.



తంత్ర గ్రంథము విష్ణుక్రాంత, రథక్రాంత, అశ్వక్రాంత అనునామములతో 3 విధములుగా విభజింపబడినది. విష్ణుక్రాంతకు సంబంధించి 65 రథక్రాంతకు సంబంధించి 65, అశ్వక్రాంతకు సంబంధించి 65 తంత్ర గ్రంథములు కలవు. కాని 162 తంత్ర గ్రంథముల పేర్లు **ప్రాణతోషిణి** గ్రంథమునందు ఇవ్వబడ్డాయి. ఇవి అన్నియు శివునిచే చెప్పబడ్డాయి. ఈ 162 గ్రంథములే కాకుండా ఇతర తంత్రగ్రంథముల పేర్లు ప్రాణతోషిణి యందు ఇవ్వబడ్డాయి. అన్నీ కలిపి దరిదాపుగా 300 గ్రంథములు ఉంటాయి. కాని వర్తమాన కాలములో చాలా తక్కువ తంత్రగ్రంథాలు లభ్యమవుతున్నాయి. శ్రీనగర్ కాశ్మీర్ సీరీస్ పేరుతో కాశ్మీరు రాష్ట్రము నుండి 50 – 60 తంత్ర గ్రంథములు ముద్రింపబడ్డాయి.

ఈ తంత్ర గ్రంథాలు శైవ, వైష్ణవ, శాక్త మను పేర్లతో 3 రకములుగా వున్నాయి. తంత్ర శాస్త్రములలో ప్రకృతిలోని త్రిగుణములైన సాత్విక, రాజసిక, తామసిక గుణముల ఉపాసన చెప్పబడినది. ధర్మ, అర్థ, కామ, మోక్షములతోపాటు నరక ప్రాప్తికూడా వాటి ఫలముగా చెప్పబడినది. ప్రకృతిలోని సత్వగుణమునకు సంబంధించి సాత్విక ఉపాసన వల్ల ధర్మము మరియు మోక్షము ప్రాప్తిస్తుంది. ప్రకృతిలోని రజోగుణమునకు సంబంధించి రాజసిక ఉపాసనవల్ల ధనము లభించి కోరికలు సిద్ధిస్తాయి. ప్రకృతిలోని తమోగుణము యొక్క తామసిక ఉపాసనవల్ల నరకప్రాప్తి కూడా కలుగుతుంది. ఈ విధముగా ఉపాసకునియొక్క పాత్రతా భేదముతో తంత్రశాస్త్రములో సాత్విక, రాజసిక, తామసికమను మూడు మార్గములు చెప్పబడ్డాయి. దివ్యాచారము, వీరాచారము, పశువాచారము అను మూడు మార్గములుగా శివశక్తులయొక్క ఉపాసనలు చెప్పబడ్డాయి. కానీ తంత్ర శాస్త్రములో తమయొక్క కోర్కెలు సిద్ధించుటకు సాధకుల పాత్రతాభేదముతో ఉపాసన దేవతలు కూడా అనేక విధములుగా వున్నారు. వారియొక్క మంత్రములు మరియు క్రియాకర్మలు కూడా అనేక ప్రకారములుగా చెప్పబడ్డాయి.

ప్రకృతియొక్క తమోగుణమును ఉపాసించే తాంత్రికులు, వామ మార్గావలంబులు పశు ఆచార తామసికజనులు దేవతా ప్రీతికొరకు పంచ– మకారములైన మద్య, మాంస, మత్స్య, ముద్ర, మైథునములను పాటించుతూ వుంటారు. వీటిని సేవించుట వలన వారి ఆరాధ్య దేవతలు వారిపట్ల ప్రసన్నులై మనోవాంఛిత ఫలములనిస్తారని భావిస్తారు. వారు తమ మలినమైన సంస్కారములు, కోర్కెల సిద్ధికొరకు ఘోరకర్మలను చేస్తూ వుంటారు. సమ్మోహన, వశీకరణ, ఉచ్చాటన, స్తంభన, విద్వేషణ, మారణ

మొదలగు వానిని ప్రయోగించుట కొరకు మంత్ర జపములుచేసి వారు ఆరాధించే దేవతలను ప్రసన్నులుగా చేసుకొని తమ కోర్కెలు తీర్చుకొంటూ వుంటారు. ఎవరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా, ఇప్పటికి అక్కడక్కడ ఈ విధముగా జరుగుతూ వుండటము మనము వింటూ ఉంటాము. తంత్ర గ్రంథములలో ఈ విషయమును అనేక విధాలుగా వర్ణించబడి ఈ ఘోర పాపకర్మము యొక్క ఫలితము నరకము ప్రాప్తియని చెప్పబడినది.

రెండవది వీరాచారభావము. వీరాచార మార్గావలంబులు ప్రకృతియొక్క రజోగుణము మరియు సత్వగుణములను ఉపాసిస్తారు. వీరు పశు ఆచార మార్గావలంబులు మాదిరిగా పంచ మకారములు, బలుల వంటి హింసతో కూడిన కర్మలను ఉపాసించరు. ఉపాసనలో ఎక్కడ బలి, మద్యములను సమర్పించవలసి వుంటుందో అక్కడ వీరు కూష్మాండమును అనగా బూడిద గుమ్మడికాయను బలిగా సమర్పిస్తారు. మద్యమునకు బదులుగా పాలలో బెల్లము వేసి తామ్ర పాత్రలో నివేదనచేస్తారు. మంత్ర జపము, హవనము మరియు దేవీపూజా విధానములు రెండు సహజముగా ఒకే విధముగా వుంటాయి. జీవహింస, మద్యం నివేదన వంటి కర్మలను వీరాచార మార్గావలంబులు చేయరు. వీరు వామ మార్గావలంబులను తప్పు పడతారు. వాస్తవముగా వామమార్గావలంబులైన తాంత్రికులు నిందనీయులు.

తాంత్రిక ఉపాసనలో వామమార్గమును అవలంబించే తామసికుల ఉపాసనా ప్రక్రియలను జనులు గర్హించారు. వీటిని జనులు ద్వేషించారు. ఈ విధముగా చేయుటవలన తంత్ర శాస్త్రముయొక్క వాస్తవిక మహత్‌జ్ఞానమునకు హాని కలుగదు. ఎందుకంటే గుణముల ఆధారముతో చేసిన కర్మలకు తదనుగుణముగా ఫలితము లభించునని అన్ని శాస్త్రములలో చెప్పబడినది. వేదములలో కూడా, అవిద్యను ఉపాసించే జనులు అంధకారముతో నిండివున్న నరకమునకు పోవుదురని చెప్పబడినది. ఏ కర్మలవల్ల అనర్థము కలుగుతుందో అటువంటి కర్మలు చేయకూడదని అన్ని శాస్త్రములు ఉపదేశించుచున్నవి. శాస్త్రములలో అన్ని భౌతిక విషయముల గుణదోషములు చెప్పబడ్డాయి. వైద్యశాస్త్రములో మాంస, మల, మూత్ర మరియు విషము యొక్క గుణదోషములు చెప్పబడ్డాయి. మాంసము, మల మూత్రములు, విషము అనునవి ఏవీ తినేవస్తువులుకావు. అయినప్పటికి వాటి గుణదోషములు వైద్య శాస్త్రములలో వర్ణించబడ్డాయి. అదే విధముగా తంత్ర శాస్త్రములో కూడా పరమ శుభకరమైన ఉపదేశములు అనేక విధములుగా ఉన్నాయి. వాటిని మనము



వదిలివేయ లేముకదా! సద్విషయమును గ్రహించి అసద్విషయమును త్యజించ వలసినదిగా శాస్త్రములు నిర్దేశించాయి. ఈ విధముగా పాటించుటను వివేక జ్ఞానముగా చెప్పబడినది.

మనము చేసే ధర్మ, కర్మములు, పూజాపాఠములు, జపతపములు, హవనము, పునశ్చరణలు, ధ్యానములు, యోగసాధనలు తీర్థ దర్శనములు, ఉపవాసములు అన్నియు తాంత్రిక కర్మలే. తంత్ర గ్రంథములలో వీటియొక్క క్రియాకర్మములను విస్తారముగా వర్ణించారు. మనము ఆరాధించే సమస్త దేవీదేవతల గురించి, వారి మంత్రముల గురించి వర్ణన కూడా తంత్ర మంత్రములలో చెప్పబడినది. మనము స్వార్థముతో పరమార్థ సిద్ధికొరకు చేసిన క్రియా కర్మములన్నియు తాంత్రికములే. అందువలన మనము కూడా తాంత్రికులమే. కాని వామ మార్గావలంబులము కాము. పురాణములలో చెప్పబడిన ధర్మకర్మలు దేవీ, దేవతల విషయములన్నియు తంత్రగ్రంథములలో చెప్పబడ్డాయి. ఉపనిషత్తులలో చెప్పబడిన యోగసాధనా విషయములు తంత్రగ్రంథములలో చెప్పబడ్డాయి. వేదములయొక్క కర్మకాండలలో యజ్ఞకర్మలే ప్రధానమైనవి. కాని వర్తమానములో ఎక్కడో ఒకచోట ఈ యజ్ఞకర్మలు చేయబడుతున్నాయి. అందువలన వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ధర్మశాస్త్రములు, దర్శనశాస్త్రముల ద్వారా లభించు జ్ఞానము తంత్ర శాస్త్రముద్వారా లభించు జ్ఞానము వేర్వేరుగా ఉండవు. అన్నింటియందు ఒకే జ్ఞానము నిక్షిప్తమయినది.

**దివ్య కులాచారములు :** దివ్యాచార మార్గమును అవలంభించే యోగిజనులు ప్రకృతిలోని సాత్విక గుణమును ఉపాసనచేస్తారు. బాహ్య, స్థూల సాధనలైన పంచమకార సాధనలుచేసే వామమార్గావలంబులను వీరు నిరసిస్తారు. పంచమకార సాధనలను వీరు వ్యభిచారముగా, పాపకర్మలుగా పరిగణించి వాటికి ఆధ్యాత్మిక అర్థమును చెపుతారు. కుల అనుపేరు శక్తికి చెందినదిగా, అకుల మనుపేరు శివునికి సంబంధించినదిగా ఉదహరించి, శివశక్తుల సంయోగములో లీనమయ్యే దివ్యాచార యోగసాధకుని కులీనులంటారు. 'కుల' మరియు 'అకుల' సాధనలో నైపుణ్యము గలవారు కౌలికులుగా పిలువబడతారు. అజ్ఞానులై పశు ఆచారమును పాటించే మార్గవలంబులకు కుండలినీశక్తి జాగృతముకాదు. కాని దివ్యాచారమును పాటించే 'కౌల' సాధకునికి శక్తి జాగృతమవుతుంది. అందువలన జాగృతశక్తి, కులకుండలినీ ఆరాధన చేసే కౌలక యోగిని నిజమైన శక్తిమాత సేవకునిగా భావించాలి.

దివ్యాచార పరాయణులు, కుండలినీశక్తినే మధువుగాను, పరమశివుడినే మాంసముగాను, భైరవ శివుడినే భోక్తగా తలుస్తారు. శివశక్తుల కలయికవల్లనే ఆనందము కలుగుతుంది. దానినే మోక్షముగా చెపుతారు. ఆనందమే బ్రహ్మ స్వరూపము. అది సాధకుని శరీరములోనే ఉంటుంది. ఈ శరీరము ద్వారా లభించే అమృతమును యోగులు పానముచేస్తారు. వీటినే దివ్యపంచ మకారములు అని అంటారు.

ఏ యోగికి తన అంతరములో నున్న స్వయంభూలింగము, బాణలింగము, ఇతర లింగము అనగా అజ్ఞానచక్రము నందున్న మూడు లింగములను గురించి తెలిసి వుంటుందో అతడికి మాత్రమే షట్చక్ర భేదనము చేసే సామర్థ్యము ఉంటుంది. ఎవరు మూలాధారము నుండి సహస్రారములోనున్న పరమశివుని వరకు వెళ్ళగలుగుతారో మరియు ఎవరు మూలాధారమునుండి బ్రహ్మరంధ్ర పర్యంతము మరల మరల తిరుగాడుతూ చిన్మయుడైన పరమశివునితోపాటు, కుండలినీశక్తిని కలిపి సహస్రదళకమలము మధ్యలోనున్న చంద్రమండలము నుండి స్రవించుచున్న సుధారసమైన అమృతమును పానముచేస్తారో వారే మధుపానము చేసే యోగులుగా చెప్పబడ్డారు. అన్యులందరు మదిరను సేవించే అజ్ఞానులు మాత్రమే అయివున్నారు.

ఎప్పుడు కుండలినీ శక్తి సహస్రారములో నున్న పరమశివునితో కలుస్తుందో అప్పుడు సహస్రదళ కమలము అయిన సహస్రారము నుండి అమృతము స్రవిస్తుంది. దానిని యోగులు పానముచేస్తారు. ఈ విధముగా పానము చేయుటనే దివ్యకులాచార యోగములో మహాపానము, మధుపానము లేక మదిరాపానముగా చెప్పబడినది. యోగిజనులు నాలుకను పైకి త్రిప్పి ఖేచరీముద్రతో పైన సహస్రారము నుండి స్రవించే సుధారస అమృతపానము చేస్తారు. వారు బెల్లము బియ్యముతో తయారయిన మధువును త్రాగరు. వారుభంగువంటి బాహ్యముగా మత్తునిచ్చే మాదకవస్తువులను సేవింపరు. వారు కుండలినీశక్తి యొక్క కార్యశీలతవల్ల లభించిన ఆనందముతో కూడిన మత్తును అనుభవిస్తారు. అటువంటి యోగిజనులు బ్రహ్మ జ్ఞానులు అయి వుంటారు.

జీవుడి సూక్ష్మశరీరమును స్థూల మాంస శరీరముతో బంధించబడి వున్నది. అందువలన జీవుడు అజ్ఞానవశుడై శరీర బద్ధునిగా ఉంటాడు. ఏ యోగి ఈ అజ్ఞాన రూపమాంసమును భక్షణచేస్తాడో అతడే మాంసభక్షణ చేయువాడుగా చెప్పబడ్డాడు.



అందువలన యోగవిద్యాపారంగతులు జ్ఞానరూప ఖడ్గముతో పాప, పుణ్యములనెడి పశువును వధించి అనగా బలినిచ్చి పరబ్రహ్మములో చిత్తమును లయము చేసే సామర్థ్యమును కలిగియుంటారు. వారే వాస్తవికముగా మాంసభక్షణము చేయువారు. ఎవరు మనః ప్రాణములు మరియు ఇంద్రియముల శక్తిని నిగ్రహించి వాటిని ఆత్మయందు బలిదానము చేసి స్వయముగా ఆత్మసుఖమును అనుభవిస్తారో వారే మాంసభక్షకులుగా చెప్పబడ్డారు. ఆరకముగా చేయనివారు ప్రాణులను వధించే పాపాత్ములుగా చెప్పబడ్డారు. వారు తమ నాలుకను అదుపు చేసుకొనలేక దేవతల పేరుతో జంతువులను బలి ఇచ్చి వాటి మాంసమును తింటారు. ఇటువంటి పాపాత్ములు నరకానికి వెళతారు. ఇందులో ఎటువంటి సందేహములేదు.

మనస్సుద్వారా ఇంద్రియ సమూహములను ఆత్మయందు నిలిపి యుంచుటను యోగులయొక్క మత్స్య భక్షణముగా చెప్పబడినది. ఆత్మనుండి నిరంతరము ఆనంద ప్రకాశమును పొందుటను ముద్ర అందురు. ఈ ముద్ర ధారణ, ధ్యాన, సమాధి అను పేర్లతో ప్రసిద్ధిని పొందినది. వీటిని సాధన చేయుటచే మోక్షము సిద్ధిస్తుంది. బాహ్య విషయ సుఖములను అనుభవించుటచే ముక్తి లభించదు.

పరాశక్తి కుండలినీదేవిని పరమశివునితో కలుపుట ద్వారా మైథున సంయోగమును సాధించి ఆనందమును అనుభవించి ఆ పరమానందము కారణముగా జనన మరణ బంధనముల నుండి ముక్తులయిన యోగులు దివ్యమైథునము చేసే భోగులుగా పరిగణింపబడ్డారు. ఇతరులు స్త్రీలను భోగించే స్త్రీ లోలురు అయి వుంటారు. శివశక్తుల సమ్మిళితమగుటనే సంయోగమంటారు. సహస్రారములో బిందు రూపములోనున్న శివునితోపాటు కుండలినీశక్తిని కలుపుటను యోగులు దివ్యమైథునముగా చెప్పారు.

ఇడా మరియు పింగళ నాడులనుండి ప్రాణశక్తి సుషుమ్న నాడిలో ప్రవేశించ వలయును. సుషుమ్నను శక్తి అంటారు. ప్రాణరూప జీవుడిని శివునిగా చెపుతారు. అనగా సుషుమ్న మరియు ప్రాణములయొక్క సంయోగమును మైథున మంటారు. యోగులకు కలిగెడు దివ్యసుఖము, మనః ప్రాణములు సుషుమ్నలో ప్రవేశించుట వలన కలుగును. పతనము కలిగినపుడు ఏ సుఖము కలుగుతుందో ఆ సుఖముకంటే కోటిరెట్లు సుఖము సుషుమ్నలో ప్రాణవాయువు స్థిరమగుటచే లభిస్తుంది. సాధారణముగా మైథునము వలన తేజస్సు, బలము నష్టమవుతాయి. కాని దివ్య మైథునమువలన తేజస్సు, బలము, ఉత్సాహము పెరుగుతాయి.

మద్యపానము చేయుటచే మనుష్యునకు సిద్ధి లభించినట్లయితే అందరు మద్యమును సేవించేవారు. మద్యమును నిరంతరము సేవించే పామర జనులందరు ముక్తులయేవారు. అదేవిధముగా మాంస భక్షణముచేయుట ద్వారా పుణ్యప్రాప్తి, స్వర్గము లేక మోక్షము లభించినట్లయితే అందరూ మాంసభక్షణము చేసి పుణ్యమును సంపాదించేవారు. మాంసభక్షణము చేసే జంతువులన్నీ కూడా పుణ్యమును సంపాదించి మోక్షమును పొందేవి. స్త్రీ సంభోగమువలన మోక్షము ప్రాప్తించినట్లయితే ఈ లోకములో అన్నిప్రాణులు సంభోగము చేస్తాయి. అన్ని ప్రాణులు ముక్తిని పొందవలసి వుంటుంది. అనగా భగవానుడు చెప్పిన వాస్తవిక జ్ఞానమును అర్థము చేసుకొనక ఏజనులు అజ్ఞానముతో తమను తాము ధార్మికులుగా చెప్పుకుంటారో అటువంటి వారికి మరణించిన తరువాత నరకము ప్రాప్తిస్తుంది.

**అష్టాదశ విద్యలు :** ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణ వేదములను నాలుగు వేదములు, శిక్షా, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛంద, జ్యోతిషమను ఆరువేదాంగములు, మీమాంస, న్యాయము మొదలగు షట్‌దర్శనములు మరియు 108 ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, ధర్మశాస్త్రములు ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము అనునాలుగు ఉపవేదములు కలిసి అష్టాదశ విద్యలుగా చెప్పబడ్డాయి. ఋగ్వేదము యొక్క ఉపవేదము ఆయుర్వేదముగా (వైద్యవిద్య), యజుర్వేదము యొక్క ఉపవేదము ధనుర్వేదముగా (యుద్ధవిద్య) సామవేదము యొక్క ఉపవేదము గాంధర్వవేదముగా (సంగీతశాస్త్రము) అధర్వవేదము యొక్క ఉపవేదము అర్థశాస్త్రముగా (స్థాపత్య, శిల్పకళాకౌశలము మొదలగునవి) చెప్పబడినవి. పురాణములు 18. అవి వరుసగా బ్రహ్మ, పద్మ, విష్ణు, శైవ, భాగవత, నారదీయ మార్కండేయ, ఆగ్నేయ, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ స్కంధ, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ పురాణములు అయి వున్నవి. ఇవి కాకుండా అనేక ఉపపురాణములు కలవు. ధర్మశాస్త్రములో తంత్రగ్రంథ సమూహములు మరియు అష్టాదశ స్మృతులు వున్నాయి. వీటిలో పరాశర, యాజ్ఞవల్క్య, మనుస్మృతులను జనులు విశేషముగా పరిగణలోనికి తీసుకొంటారు. ఈ విధముగా మన యొక్క ధర్మకర్మముల యొక్క గ్రంథములు భౌతిక, ఆధ్యాత్మిక విషయ పరిజ్ఞానమును జనులకు కలిగిస్తాయి.

మన ధర్మ కర్మలకు సంబంధించిన అష్టాదశ విద్యాశాస్త్ర గ్రంథములన్నింటిని బాగా అనుభవము వున్న సర్వజ్ఞులైన జ్ఞానులు వ్రాసివున్నారా లేక భ్రాంత చిత్తులు,



అల్పజ్ఞులు, అజ్ఞానులచేత వ్రాయబడినవా అనువిషయము మనకు ఎట్లా తెలుస్తుంది? ఈ విషయమును ఎవ్వరూ నిర్ణయించలేరు. ఎందుకంటె పైన చెప్పిన శాస్త్రములన్నియు వంశ పారంపర్యముగా గురుశిష్య పరంపరగా విని లిపిబద్ధము చేయబడినవి. వాటి అన్నింటిలో రచయితల పేర్లుగాని వారి యొక్క విద్యాబుద్ధుల యోగ్యతల గురించి ఎటువంటి పరిచయము లభించదు. వాటిలో సమయ నిర్దేశనము కూడా ఉండదు. శాస్త్రములన్నియు కూడా ఒకే సిద్ధాంతమును ప్రతిపాదించవు. భిన్న, భిన్న కాలములలో విభిన్న విషయములను తీసుకొని అందరూ తమ తమ సిద్ధాంతములను గొప్పగా వర్ణించారు. ఇటువంటి స్థితిలో వాటి మీమాంస చేయుట చాలాకష్టము. విశేషముగా పురాణముల విషయము ఎంత వివాదాస్పదము అంటే వాటిని బాగుగా విచారణచేసి దిద్దుబాటు చేయవలసిన ఆవశ్యకత వున్నది. పురాణశాస్త్రములలో ఇంపైన విషయములు, భయానక విషయములు, యదార్థ విషయముల వర్ణన అధికముగా ఉన్నది. తత్వజ్ఞానము యొక్క విషయము కూడా విస్తారముగా ఉన్నది. అర్థములేని విషయములు కూడా అనేకము ఉన్నాయి. వర్తమానములో మనము చేసే మూర్తి పూజలు వ్రత, జప, దాన, పుణ్యతీర్థ యాత్రలు వంటివి పురాణములలో చెప్పబడిన విషయములు అయివున్నవి. ఈ పురాణములన్నింటిని కృష్ణ ద్వైపాయనులు అనగా భగవానులైన వేదవ్యాసులచే వ్రాయబడినవి అని జనుల అభిప్రాయము. కాని పురాణములలో కొన్ని విషయములు కాల్పనికమైనవి మరియు అజ్ఞాన జనితమైనవి కూడా వున్నాయి. కాని భగవానులైన త్రికాలదర్శి అయిన వేదవ్యాసులవారు అజ్ఞాన విషయములను వ్రాయలేరు కదా! వేద, ఉపనిషత్, షట్ దర్శనములు మరియు ధర్మశాస్త్రములు, స్మృతులు నిస్సందేహముగా సత్యము. అందులో ఎవరికి సందేహములేదు. కాని పురాణములలోని అన్ని విషయములు సత్యముగా కనిపించవు. వాటిపై జనులకు సందేహము కూడా గలదు. అయినప్పటికి జనులందరు అందులో నిర్దేశించిన ప్రకారము ధర్మ, కర్మలు నిర్వర్తిస్తున్నారు.

**జ్ఞానుల ద్వారా లిఖించబడిన శాస్త్రములు :** మొదట చెప్పిన శైవపాశుపత మహాదర్శన శాస్త్రములను సాధన చేయుటచే లభించిన జ్ఞాన లాభముతో శక్తి సంపన్నులై పరమేశ్వరుని దివ్యప్రభావముతో బ్రాహ్మణులు అన్యశాస్త్రములను రచించారు. మహర్షి కణాదుడు వైశేషిక దర్శన శాస్త్రమును, గౌతమ మహర్షి న్యాయదర్శన శాస్త్రమును, కపిలముని సాంఖ్య దర్శనశాస్త్రమును చెప్పారు. ధిష్ణ

ఋషి చార్వాక నాస్తిక దర్శన గ్రంథమును వ్రాసి యున్నాడు. ఇది అతి ఆక్షేపణీయ గ్రంథము. దీనిని అర్థము చేసుకోవాలన్నా, అర్థమును తెలియ చెప్పాలన్నా మనము చిక్కులలో పడతాము. భగవానుని శక్తి ప్రభావముతో మహావిష్ణువుయొక్క తొమ్మిదవ అవతారమైన మహాజ్ఞాని అయిన బుద్ధ దేవుడు, దైత్యుల బుద్ధి భ్రష్టత్వము చెందించుటకు నగ్న నీల పాటాది బౌద్ధశాస్త్రమును రచించాడు. వాటిలో వేదవాక్యముల ఖండన, బౌద్ధమతము యొక్క మండన వున్నది. వేదములకు విరుద్ధముగా వ్రాయబడిన ఆ శాస్త్రము జనబాహుళ్యము తిరస్కారమునకు గురి అయినది. ఎందుకంటే బుద్ధ దేవుడు భగవానుని యొక్క శక్తి సామర్థ్యముల గొప్పతనమును గురించి చెప్పక స్వకీయ జ్ఞానమునకు ప్రాధాన్యతనిచ్చి అన్ని విషయములందు సరళత్వమును చూపినందువలన జనులు సర్వకర్మలను వదలి శూన్య మరియు నిరీశ్వర వాదులుగా మారారు. కర్తవ్యకర్మలను వదిలివేసి వేదములను ఈశ్వరుని ఒప్పుకొనక పోవుట మహాపాపముగా ధర్మశాస్త్రములలో చెప్పబడినది. గౌతమునిచే చెప్పబడిన న్యాయశాస్త్రములోని తర్కయుక్త వితండవాదము చేసే తార్కిక జనులు అన్ని కర్మలపట్ల సంధిగ్ధ బుద్ధి కారణముగా నీచమైన జంతు యోనులను పొందుతారు. వీరందరు వ్రాసిన శాస్త్రములు భగవానుని శక్తి ప్రభావముతో వ్రాయబడినప్పటికి వీటిని అర్థము చేసుకొనుటకు భగవానుని నుండి లభించిన శక్తి అవసరము. శక్తి హీనులు వీటిని అర్థము చేసుకొనలేరు.

ఏ ధర్మములో ప్రాపంచిక కర్మలు చేయవలసిన పని వుండదో దానివైపు అజ్ఞానులు తేలికగా ఆకర్షింపబడుతారు. బౌద్ధ ధర్మములో అన్ని బాహ్య కర్మలను త్యజించి భిక్షకులుగా మారి భ్రమణముచేస్తూ బౌద్ధ ధర్మశాస్త్రము ప్రకారము జీవించాలి. ఫల స్వరూపముగా స్త్రీలు, పురుషులు, పిల్లలు వేల సంఖ్యలో భిక్షకులుగా మారి భారత దేశమంతటా వ్యాపించారు. అనేక రాజులు, మహారాజులు కూడా బౌద్ధ ధర్మావలంబులుగా మారారు. ఆసమయములో జగద్గురువులు ఆదిశంకరాచార్యులు బౌద్ధమతమును ఖండనచేసి వేదమతమైన సనాతన ధర్మమును స్థాపించారు. అందువలన బౌద్ధధర్మము భారతదేశములో నిశ్శేషమయినది. కాని అన్యదేశములలో బౌద్ధ ధర్మము వ్యాపించినది. 1921వ సం॥ నందు అన్ని దేశములందు చేయబడిన జనాభా లెక్కల ప్రకారము భూమిపైన 163 కోట్ల మనుష్యులు ఉన్నారు. వారిలో ప్రతివంద మందికిగాను 50 మంది బౌద్ధులు, 26 మంది క్రైస్తవులు, 13 మంది ముస్లిములు, 11 మంది సనాతన ధర్మమును



అవలంభించే హిందువులు వున్నారు. దీనినిబట్టి బౌద్ధధర్మ మెంత ప్రబలముగా వుందో మనకు అర్థమవుతుంది. భూమిపైనున్న జనులలో సగము మంది బౌద్ధ ధర్మమును అవలంబిస్తూ వున్నారు. సిలోన్, బర్మా, టిబెట్టు, సయాం, చైనా, జపాను, జావా, సుమత్ర, బాలి ద్వీపమునందుగల జనులందరు బౌద్ధ ధర్మావలంబులే. భారత దేశములో మాత్రము వీరి సంఖ్య నామమాత్రముగా వున్నది.

పురాణములలో భగవానుని యొక్క తొమ్మిదవ అవతారమును బుద్ధునిగా చెప్పబడినది. కలియుగములో ఈయన యొక్క జ్ఞాన, ధర్మములు సమస్త భూమండలమునందు వ్యాపిస్తాయి. అందువలననే ప్రస్తుతము జనులు బౌద్ధమతమును అనుకరణ చేస్తున్నారు. దీనివలన వైదిక ధర్మకర్మములను జనులు త్యజిస్తున్నారు. ఆశ్రమ ధర్మవ్యవస్థ చిన్నా భిన్నమయినది. జనులు స్వేచ్ఛావలంబులుగా, తార్కికులుగా మారి వైదిక ధర్మమును త్యజిస్తున్నారు. భారతదేశపు రాజ చిహ్నములుగా బౌద్ధ మతచిహ్నములు అయిన అశోకచక్రము, స్తంభము, సింహము ఇత్యాదులు ద్రవ్య వినిమయ వ్యవస్థనందు స్థానము సంపాదించి ప్రఖ్యాతిని పొందాయి. భారతదేశపు ప్రస్తుతపాలనా వ్యవస్థలో మతమునకు ఎటువంటి స్థానము కల్పించబడలేదు. భారతదేశము ధర్మ నిరపేక్ష రాజ్యముగా చెప్పబడినది. ఎవరు ఏమతమును కావలనుకొంటే అదే అతడి మతమవుతుంది. ఫలస్వరూపముగా జనులలో అనాచారము, అత్యాచారము, వ్యభిచారము ఎక్కువయి జనులు చరిత్ర హీనులుగా మారారు. ఎక్కడ నీతి, జాతి, సమాజధర్మములకు సంబంధించిన బంధనములు వుండవో అక్కడ సహజముగానే అన్ని దుర్గుణములు వచ్చి చేరుతాయి. అనగా మనుష్యులలో పాపబుద్ధులు కలుగుతాయి. దీనివలన అందరు నష్టపోతారు.

మన ధర్మకర్మలకు సంబంధించిన శాస్త్ర గ్రంథములన్నియు శివునియొక్క శక్తి ప్రభావముతో జ్ఞానులచే వ్రాయబడినవి. వాటిని శంకించుట లేక వాటిని పాటించకపోవుట మహాపాపము. కాని అజ్ఞానులచే వ్రాయబడిన శాస్త్రములను అనుసరించుట మహాపాపము. అజ్ఞానులకు సంబంధించిన వేరుగా శాస్త్రములు లేవు. ఈ జ్ఞానులు వ్రాసిన గ్రంథములందే అజ్ఞానులు తమస్వార్థము సిద్ధించుటకు అజ్ఞానమును, అధర్మమును చేర్చి వ్రాసారు. ఇది అత్యంత గర్హనీయము. ధర్మసమ్మతము గాని విషయములవల్ల ఇహలోకములో, పరలోకములో హాని కలుగుతుంది. ఇటువంటి విషయములను అజ్ఞానులు వ్రాసినవిగా భావించి త్యజించవలసి యున్నది. శాస్త్ర గ్రంథములలో పాత్రతాభేదముతో అన్ని విషయములు

చెప్పబడ్డాయి. వాటి గుణదోషములు కూడా చెప్పబడ్డాయి. ప్రతిఒక్కరి యొక్క ప్రకృతి మరియు ప్రవృత్తి ఒకే విధముగా ఉండవు. వివిధ ప్రయోజనముల కొరకు విధి, విధానములు కూడా వేర్వేరుగా ఉన్నాయి. ఎవరికి ఏవిధానమునందు పాత్రత గలదో ఆ విధానమును పాటించవచ్చును. మానవుడు తన స్వధర్మములో నిలిచి తన అభీష్ట ధర్మములైన ధర్మ, అర్థ, కామ, మోక్షములను సాధించాలి అని శాస్త్రముల ఉద్దేశ్యము. శాస్త్రముల వల్ల ఇంతకు మించి ప్రయోజనము లేవి లేవు. శాస్త్రముల వలన ప్రయోజనము మానవ జీవిత లక్ష్యమును సాధించుట అయివున్నది.

**దేవతల యొక్క దర్శనము :** పురాణములు, ఇతిహాసములు, మహాభారతము వంటి గ్రంథములవల్ల ఇప్పటికి ఐదువేల సంవత్సరములకు పూర్వము మానవులకు, దేవతలకు సంబంధ బాంధవ్యాలుండేవని తెలుస్తుంది. దేవతలు మానవులకు సహాయము చేసేవారు. మనుష్యులు దేవతలు ఉద్దేశించి యజ్ఞములు చేసేవారు. దేవతలనుండి వరములు పొందుటకు కఠోర తపస్సు కూడా చేసారు. ఈ విధముగా దేవతల నారాధించి ఆ సమయములో జనులు తమ అభీష్ట సిద్ధిని పొందారు. మహాభారతములో ఇటువంటి అనేక కథలు కలవు. పాండవుల పుట్టుక స్వయముగా కుంతీదేవి మంత్ర జపమువలన దేవతలయొక్క వరదానము వలన కలిగింది. అర్జునుడుకూడా తపస్సు చేసి శివుని నుండి వరములను పొందాడు. ఇంద్రుడు కూడా అర్జునునికి సహాయము చేసాడు. మహారాజు యుధిష్ఠిరుడు (ధర్మరాజు) కూడా సూర్యదేవుని ఉపాసించి అక్షయభోజన పాత్రను ప్రాప్తించుకొన్నాడు. ఈ విధముగా వందలకొద్దీ కథలు పురాణములలో ఉన్నాయి. భగవానుడైన శ్రీ కృష్ణుడు కూడా తపస్సుచేసి శివుని నుండి మరియు అమ్మవారి నుండి అనేక వరదానములు పొందాడు. ఇవన్నీకూడా ఐదువేల సంవత్సరాలకు పూర్వము జరిగిన విషయములు. అప్పుడు అన్నిజాతులవారుకూడా దేవతలను పూజించి వాంఛిత ఫలమును పొందారు. పరమ సుఖవంతమైన జీవితములను గడుపుతూ చరితార్థులయినారు.

కాని వర్తమాన యుగములో ఈ విషయములకు ఎటువంటి విలువలేదు. ఎవరికి వాటిపైన విశ్వాసములేదు. వాద వివాదములు చేసి ఈ విషయములను కాల్పనికమైనవిగా మిథ్యగా సిద్ధాంతీకరించారు. చాలామంది జనులు దేవతల ఉనికినే ఒప్పుకోరు. వారు పూర్వకాలములో మాదిరి తపస్సు చేయలేరు. అందువలన వారికి దేవతా దర్శనములు మరియు వారియొక్క వరదానములు లభించుటలేదు.



విధివిధానములతో, నియమబద్ధముగా తపస్సు చేసినట్లయితే దేవతల దర్శనము లభిస్తుంది. దేవతల నుండి వరములు కూడా ప్రాప్తిస్తాయి. వర్తమాన కాలములోని **భక్తమాల** గ్రంథమునందు గత మూడు వందల సంవత్సరములలో జీవించిన భక్తుల చరిత్రలు వ్రాయబడ్డాయి. ఇవి అంత పురాతనమైనవికాదు. మహారాణి మీరాబాయికి భగవంతుండి దర్శనము కలుగుతూ ఉండేది అని అందులో వ్రాయబడినది. సంత్ తులసీదాస్‌నకుకూడా భగవత్ దర్శనము కలిగిందని భక్తుడైన నర్సీమెహతాకు సంబంధించిన అనేక కార్యములను భగవంతుడు స్వయముగా చేసేవాడని అందులో వ్రాయబడినది. అదేవిధముగా భగవత్ దర్శనము పొందిన నామదేవుడు, తుకారామ్, హరిదాసుస్వామి వంటి వందలకొలది భక్తుల కథలు అందులో వున్నాయి. భగవంతుడి మరియు ఇష్టదేవతాదర్శనముతో వారు ఎల్లవేళలా భగవంతుని ధ్యాన, భజనలలో తన్మయులయి వుండేవారు. అన్ని ప్రదేశములందు వారికి భగవంతుడే కన్పించేవాడు. ప్రపంచము, ప్రాపంచిక విషయాలతో వారికి సంబంధము ఉండేదికాదు. వారు కేవలము తమ ఆరాధ్య దైవమును మాత్రమే కీర్తిస్తూ వుండేవారు.

300 సం॥ క్రితమే భక్తులకు భగవంతుడి దర్శనము కలిగినప్పుడు, ఇప్పుడు ఎందుకు కలుగదు? ఆ భక్తుల మాదిరిగా మనకు కూడా అనన్య భక్తిని కలిగినపుడు భగవంతుడి దర్శనము కలుగుతుంది. ఇదిశాస్త్రములలో మరియు మహాత్ములచే చెప్పబడిన విషయము. ఇదిసత్యము, శాస్త్రములలో చెప్పిన విధముగా దేహ, మనః ప్రాణములను ఇంద్రియములను సంయమనము చేసి తన్మయులై సర్వకాల సర్వావస్థలయందు భగవానుని స్మరణ చేసినపుడు పాప క్షయము కలిగి భగవానుని దర్శనము ప్రాప్తిస్తుంది. భగవానుని దర్శనము కొరకు గొప్పవైన సమర్పణాభావము, తపస్సు, యోగసాధన అవసరమవుతాయి. ఈ ప్రపంచముతో సంబంధము వదిలిపెట్టనంత వరకు యోగ, జ్ఞాన, ధ్యాన, భక్తి సాధనలవల్ల తన్మయ స్థితి లభించదు. పాపములు కూడా క్షీణించవు. ఆ స్థితిలోభగవంతుడి దర్శనము కూడా లభించదు. యోగసాధనచేసి జ్ఞానము ద్వారా భగవానుని దర్శనమును పొందినపుడు సాధకుడు రోగ, శోక, దుఃఖ, దైన్య, పాప, జనన మరణముల నుండి విడివడి జీవన్ముక్తుడవుతాడు అని యోగ శాస్త్రములో చెప్పబడినది. మొదట చెప్పబడిన విధముగా జప, తప, సేవ, పూజ, యోగ, జ్ఞాన, ధ్యాన, పరాయణులు, శ్రద్ధతో సత్కర్మలు చేసే సాత్విక సాధకులకు దేవతల దర్శనము లభిస్తుంది. సమయానుకూలముగా అంతరాత్మ ఆదేశముకూడా లభిస్తుంది. ఇందులో సందేహించవలసినది ఏమీలేదు.

వైరాగ్యముద్వారా తన సాధనలో ఉన్నత స్థితి లభించుటవలన సత్వగుణము పెరుగుతుంది. చిత్తము శుద్ధి అవుతుంది. అప్పుడు మనస్సు, ఇంద్రియములు, ప్రాణము పవిత్రతను పొంది ప్రసన్నతను శాంతిని పొందుతాయి. ఆ పెరుగుతుంది. వెనువెంటనే అంతరములో వివేక విజ్ఞానములు వృద్ధిని పొంది ధ్యానములో దేవతా దర్శనములు కలుగుతాయి. అంతరాత్మ నుండి ఆదేశము లభిస్తుంది. సాధనచేసే వారికి ఇటువంటి దివ్యదర్శనములు కలిగినపుడు ఎక్కువ ఒక సాధకునికి చిత్తభ్రమలు కలుగవచ్చును. అతడు మతిచెడి పిచ్చివాడుగా కూడా మారవచ్చును. ఆ స్థితిలో అతడికి తన మనస్సుపైన అదుపు ఏమీ వుండదు. అతడు ఉన్మత్తునిలా జ్ఞాన, ధ్యాన, దర్శన మరియు రాబోవు విషయముల గురించి ప్రలాపనలు చేస్తూ వుంటాడు. ఎవరో ఒకరు ఇతడు చెప్పిన భవిష్యత్ విషయములను నిజమని నమ్మి గ్రంథములు వ్రాసి వాటిని ప్రచారముచేస్తారు. అవి అన్నియు నిజముకాకపోయినప్పటికి అతడు దానినే నిజమనినమ్మి, జనులకుకూడా ఆమాటలు దేవతలు చెప్పిన విషయములుగా చెపుతారు.

చాలామంది మోసగాళ్ళు, ధూర్తులు తమ గొప్పదనము చూపి మెప్పును పొందుటకు తమకు భగవంతుని దర్శనము కలిగినదని చెపుతారు. దేవతలతో తాము మాట్లాడుతూ వుంటామని వారు జరుగబోయే మంచి చెడుల గురించి తెలియజేస్తుంటారని చెపుతారు. మూర్ఖులు, అజ్ఞానులు వీరిమాటలను నమ్మి వీరికి సేవచేస్తూ వుంటారు. గురువుగా భావించి దక్షిణలిస్తారు. తమకోర్కెలు తీరక, అనర్థములు కలిగి జనులు ఇటువంటి గురువులను నిందించినపుడు వీరు మహా దుఃఖమును పొందుతారు. తరువాత వారు ఈ జ్ఞాన, ధ్యానములన్నియు మోసగాళ్ళ, ధూర్తుల వృత్తిగా చెప్పటము మొదలుపెడతారు. కాని తమ మూర్ఖత్వము, అజ్ఞానత గురించి ఏమాత్రము ఆలోచించరు.

అందువలన బుద్ధిమంతులైన సాధకమిత్రులు భక్తి, యోగసాధనలద్వారా గురు కృపతో జ్ఞాన లాభమును పొంది జీవన్ముక్త స్థితిని ఈ జన్మము యందే పొందగలరని ఆశిస్తూ ఈ గ్రంథమును ముగించుచున్నాను.

